# అవధాన సరస్వతి

142 అవధానములు





బ్రాహ్మీవిభూషణ, అవధాని శిరోమణి

**అష్టకాల నరసింహరామ శర్మ**

అష్టావధాని

# అవధాన సరస్వతి

**(142 అవధానముల సంపుటి)**


బ్రాహ్మీవిభూషణ, అవధానకళాపూర్ణ

అవధాని విరించన, కవితాసుధాకర

అష్టకాల నరసింహరామ శర్మ

అష్టావధాని


(షష్టిపూర్తి సందర్భముగా ముద్రితము)


ప్రచురణ

శ్రీ సరస్వతీయజ్ఞ సేవాసమితి

శ్రీసరస్వతీక్షేత్రము - అనంతసాగర్

మెదకు జిల్లా - 502267

శ్రీ సరస్వతీయజ్ఞ సేవాసమితి ప్రచురణ
ప్రథమ ముద్రణ - 2003 అక్టోబర్
ప్రతులు - 1000






ప్రతులకు
1. శ్రీ సరస్వతీ క్షేత్రము
అనంతసాగర్ మెదక్ జిల్లా - 502267

2. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
బ్యాంకుస్ట్రీట్ - హైద్రాబాదు
అనంతపూర్, హనుమకొండ, విశాఖ, కరీంనగర్
విజయవాడ, గుంటూరు, తిరుపతి.

3. అవధాని
19-56/3సి, ప్రశాంతనగర్
Opp : బస్‌డిపో, సిద్దిపేట, మెదకుజిల్లా - 502103

మూల్యము: 200 రూ.లు

## మా బావమరిది
## కీ. శే. గౌరీభట్లరామ శర్మ గారికి అంకితము

తరగతిలో నొక తావున గూర్చుండి
చదివిన చదువుతో సాగె మొదలు
అనుకోని రీతిగా నయ్యె బంధుత్వంబు
చెల్లిలి నిచ్చుట చిరుతనాడు
ఒకవేదికను బెండ్లి యొప్పి భాగ్యంబయ్యె
నవిభాజ్యమై మైత్రి యవని నెగడె
దేవాలయమ్ముతో దివ్యానుబంధమై
యజ్ఞసేవకు దారి యయ్యె మనకు
నూటనల్వది తొమ్మిది యౌట నాటి
రాత్రిమృత్యువు కబళించి వ్రాత మార్చె
నలువదైదేండ్లు తోడు క్రన్నన హరించె
మెట్టురామ! ఒంటరినైతి మేలు చెదర

అవధానమ్ముల నెన్నిమారులు ప్రసంగాప్రస్తుతస్థాయి శ్రో
తృవిశేషప్రియ వృత్తి నిల్పితివి. బుద్ధిన్ దైవతేజ్యుండవై
ధృవ నక్షత్రముగా వెలింగితివి నీస్మృత్యర్థమై నేడు నా
యవధానాఖ్య సరస్వతీ ప్రచురణం బర్పింతు శ్రద్ధాళుతన్

భౌతికంబుగా వేరయ్యు ఖ్యాతిలోన
కలసి యుండగ నంకిత కావ్యరీతి
నాత్మ తోడ గ్రహించి నన్నాదరించ
భావి నీతలంపున సాగు జీవనమ్ము

అష్టకాల

# శ్రీసరస్వతీ యజ్ఞసేవా సమితి

శ్రీసరస్వతీ క్షేత్ర నిర్మాణము పూర్తియై 1990 జనవరిలో ప్రతిష్ఠ జరిగిన నాటినుండి శ్రీసరస్వతీ యజ్ఞమును ప్రతినెల నిర్వహించ వలయునను కోరిక బలీయమైనది. శ్రీసరస్వతీ క్షేత్రము అనంతసాగర్-మెదకు జిల్లా కేంద్రముగా 11 మంది సభ్యులతో 1992 ఫిబ్రవరిలో శ్రీసరస్వతీ యజ్ఞ సేవాసమితిని స్థాపించుట జరిగినది. ప్రస్తుతం 120 మంది సభ్యులు.

వైదిక మంత్రములతో నారంభించిన యజ్ఞమున చతుష్షష్టి పూజతో ఆరంభించి హవనాదికము నిర్వహించుట కొఱకు శ్రీదేవీపూజా కల్పము, నికార దేవీ సహస్రనామ స్తోత్రమును రచించి వలసినదిగా అమ్మవారి ఆదేశము లభించినది. సర్వదేవీ పరముగా రచించిన పూజతో ఆరంభమైన యజ్ఞము పూర్ణాహుతితో సమాప్తమగును.

ఇది ప్రతినెల ఒక ఆదివారము జరుపుచు ఇప్పటికి 158 యజ్ఞములు పూర్తియైనవి. 25 బాసరలో, 50విజయవాడలో, 75కొల్లాపుర్‌లో, 100 ఉజ్జయినిలో, 116 శ్రీసరస్వతీ క్షేత్రములో, 125శ్రీశైలములో, 150 వారణాసిలో నిర్వహించుట జరిగినది. స్వార్థ ప్రయోజనము నేమాత్రము ఆశించక నిర్వహింపబడు ఈయజ్ఞములకు యాజ్ఞికులుగా బ్ర॥శ్రీ గౌరీభట్ల మెట్టురామ శర్మ సిద్దిపేట గారు (మా బావమరిది), 149 యజ్ఞములు నిరాటంకముగా నిర్వహించి

150వ యజ్ఞమునకు ముందు తనువు చాలించినారు. వారికి స్మృతి చిహ్నముగా మా షష్ట్యబ్ధ పూర్తి మహోత్సవములో యజ్ఞ సేవా  సమితి సభ్యులు ఉదారముగా "అవధాన సరస్వతి" అను గ్రంధమును అచ్చువేయించిరి.

వారందరికి శ్రీసరస్వతీ దేవి అభీష్ట సిద్ధి కలిగించి రక్షించుగాక యని ప్రార్ధింతును. ఈ "అవధాన సరస్వతి" గ్రంథమును కీ. శే. గౌరీభట్ల మెట్టురామ శర్మ గారికి అంకితము చేసి, వారి సాహచర్యమునకు, సహృదయతకు చిరస్మరణీయత గూర్చుచున్నాను.

అష్టకాల నరసింహారామ శర్మ
సంయోజకులు

# మనోగతము

అవధానము అనగా ఏకాగ్రత. అనేక విషయములపై ఏక కాలమున దృష్టి యుంచి విభిన్న కథనాలతో చేయు కార్యక్రమము. పూర్వము వేదమున  అవధానులు అనబడేవారు వారు నేర్చిన వేదమంత్రములలో ఎక్కడ నుండి ఆరంభించినను, ఎక్కడ అడిగినను ఎక్కడ అవవలసినదిగా గోరినను తడుముకోకుండా చెప్పుట చేసెడువారు. అది ధారణ క్రిందికి వస్తుంది. సాహిత్యావధానాలలో కేవలము ధారణయేగాక స్వయం కపోల కల్పితచమత్కృతి వైశిష్ట్యమై ధార, ధారణ,  ధోరణి, ధీ, ధైర్యము అనే విషయాలపై ఏకాగ్రత కలుగుట అవధానముగా బిలువబడుచున్నది.

ఇది ఆంధ్రభాష యొక్క ఆస్తిగా, పిదప సంస్కృతమునకు పరకాయ ప్రవేశము చేసి అక్కడక్కడ కన్నడమునందును, ఒండొకచో హిందీ యందు కొందరు ప్రతిభావంతుల కృషి కారణముగా విస్తృతి గాంచినది.

అష్ట, శత, సహస్ర, ద్విసహస్ర, పంచ సహస్రాదిగా తెలుగు భాషకు అద్భుత కీర్తి ప్రతిష్ఠలు తెచ్చిపెట్టినదీ అవధానప్రక్రియ

ఛందోబంధాలు తెగ త్రెంచుకొని, భావాంబర వీధిలో స్వేచ్ఛా విహారమొనర్చి, ఆంధ్రాంగ్లాది అనేక భాషల కలగా పులగముగా కవిత మారి పద్యకవిత్వము మృతకవిత్వ మగుచున్నదని భావించవలసిన రోజులలో పద్యకవిత్వ ప్రాభవమును సుసంపన్న మొనర్చు చున్నది ఈ అవధాన విద్య ఒకటియే యని చెప్పవచ్చును. గ్రంథస్థమైన పద్య కవిత తదభిమానులచే మాత్రమే గౌరవింప బడుచుండగా అవధానము సర్వుల యాదరమును పొందు చుండుటకు అవధాని సద్యస్ఫురణ, చతురోక్తి, సమస్యాపూరణములు మొదలగు నాశ్చర్య కరాంశములు అవధానములపై అందరికి అభిమానమును కలిగించిన దనక తీరదు.

అయితే పండితులుఎందరో ఆశుకవిత్వ, ధారణాది విశేషముల నుగ్గడించ మనసావ్వక, వలు విఘ్నములతో

సంకటములతో సాగు నీమేధోప్రక్రియ యందు రసవత్కవిత కాలంబనము తక్కువ యని యనుటయు నాశ్చర్యము కలిగించక పోదు.

పృచ్ఛకుల భావ స్ఫూర్తి ననుసరించి అవధాని పద్యములు చెప్పును కాని రసవత్కవిత వచ్చుటకు తాను కృషి జేయక మానడు గదా!

ఈ విషయము పూర్వ కవులు, అవధానులు, అయా అవధానాలలో చెప్పిన పద్యములను పుస్తకరూపమునకు తెచ్చి భావిలో నవధానులకు, రసికులకు మంచిప్రేరణ కలిగించి, అవధానము రసవత్కవిత కెంతవరకు నాలంబనమో నిరూపించిరి. చిరకాలము నిల్చియుండు పూరణలు, నభూతో నభవిష్యతిగా చెప్పబడు నంశములు, అట్లు చెప్పుట వారి కొక్కరికే సాధ్యముగాని ఇతరులకు అసాధ్యములని చెప్పదగిన అనేక పద్యములు కవితాభిమానుల కంఠగతముగా నుండుటకు అవధానములు పుస్తకరూపమున వచ్చుట ఎంతయేని ఆవశ్యకము. ఈ అవసరమును గుర్తించియే అవధాని తన అవధాన పద్యములనుగ్రంధముగా మలచుటకు యత్నించును. ముద్రణవ్యయభారము భరించుటకు అశక్తి, కొందరి అవధానములు పుస్తక రూపములుగా వెలువడ కుండుటకు ఒక కారణముగ నూహించవచ్చును.

తిరుపతి కవుల నానారాజ సందర్శనము - శతావధాన సారము, అవధానకౌముది, అవధాన విద్య అను అనేక గ్రంధములు విలక్షణమైన ఈ కళను సజీవముగా నుంచి సంఖ్యలో నవధానులను పెంచుటకు సహకరించినవి అనుట అసత్యముకాదు. అట్లే నా యవధానములు కూడ పుస్తక రూపమున రావలయునను ఆత్మీయమిత్రుల ఆకాంక్ష పరిపక్వమై ఈ గ్రంథరూపము పొందుటకు కారణమైనది.

ఇందు అవధాన సరస్వతికి తదంశ రూపములగు విషయములను వేరువేరుగా కూర్చిన ముద్రణ శక్తి ననుసరించి విడివిడిగా చిన్న పుస్తకములుగా వెలువరుచు నవకాశమునూహించి, నిషిద్ధాక్షరులు, సమస్యలు, దత్తపదులు, వర్ణనలు అను అంశములుగా విడివిడిగా వ్రాసి పెట్టుట జరిగినది

నా షష్టిపూర్తి (అక్టోబర్ 2003) సందర్భముగా నా యవధానములన్నియు తప్పక నచ్చు గాదగినవిగా భావించిన మిత్రులు శ్రీసరస్వతీ యజ్ఞసేవా సమితి సభ్యులలో కొందరు ఉదారముగా ముందునకు వచ్చి ద్రవ్యసహాయము చేయుటకు నంగీకరించుటతో శ్రీసరస్వతీ కరుణతో ఈ 'అవధాన సరస్వతి'ని పాఠకుల కరకమలము లందుంచగలుగు చున్నాను.

శ్రీ సరస్వతీదేవిని ఆ యుదారు లందరిని ఆయురా రోగ్యైశ్వర్య ములిచ్చి కాపాడవలసినదిగా ప్రార్థించెదను. సమితి సభ్యుల ప్రేమతో ఈ సందర్భముననే కుర్తాళం శ్రీసిద్ధేశ్వరీ పీఠాధీశ్వరులు శ్రీశ్రీశ్రీ సిద్ధేశ్వరానంద స్వామి వారి చేతుల మీదుగా స్వర్ణ కంకణసన్మానము జరుగబోవుట నాయదృష్టము

ముద్రణలో సంపూర్ణ సహకారమందించి నిరంతరము శ్రమించిన ఆత్మీయులు శ్రీ బి. రాధాకిషన్ రావు గారికి, మాతృకరుణ శ్రేయోనిధి గావలెనని కోరుతూ, దీనిని, కొని, చదివి, భావితరాలకు క్రొత్త అవధానుల నందించిన ధన్యుడగా దలంతును.

ఈగ్రంథము కవర్ పేజిని అందంగా చిత్రీకరించిన చిత్రకారుడు శ్రీ టి. సరస్వతి రావు గారికి మరియు శ్రద్ధతో డి.టి.పి. చేసిన చి. కె. నాగేశ్వర రావు, స్టోక్స్ డిజైన్ అండ్ ప్రింటింగ్ (27605281) హైదరాబాద్ వారికి నాకృతజ్ఞతలు.

ఈగ్రంథమును నిరంతర సహచరుడు మా బావమరిది కీ.శే. గౌరీభట్ల మెట్టురామ శర్మ కంకిత మిచ్చుచున్నాను.

ఇట్లు
అష్టకాల నరసింహరామశర్మ

# ప్రశంసలు - బిరుదములు

శాక్తేయ పితామహ, అష్టావధాని

**<u>శ్రీ అయిలావజ్ఝల వేంకట రమణయ్యగారు</u>**

దేవదానవ మానవాతీత మైన
దివ్యతేజమ్ము తోడుత దేజరిల్లు
చండికా దేవి దీవించ సాగుమయ్య!
అష్టకాల నర్సింహ రామాఖ్య సుకవి
అవధాని మెడలోన నలరు పూదండ వ
ర్ణనగాగ మత్తేభమున వచించె
చలివేళ చెలిలేని జన్మవృథాయౌ న
టంచు సమస్య బూరించి మించె
బండ ముండలు మండ గుండయై సీతాస్వ
యంవరమ్మును జెప్పె నాట వెలది
కనదిందిరా చండికలకు సామ్యము నిషే
ధము వీడి కంద పద్యమున నొడివె
ఘంటికాగణనము స్వీయ కావ్యపఠన
వ్యస్త మధిక ప్రసంగ మింపార జేసె
పొలిచి యష్టావధానమ్ము భువనగిరిని
అష్టకాల నృసింహ రామా హ్వాయుండు
కచ్ఛపీ తంత్రీకా భోగ కలనదనరి
చిగురు వ్రేళుల రాగంపు జిన్నెలీన
వాసరేశ్వరి నీదు జిహ్వాను నటింప
ప్రతిభ గనుమోయి నరసింహరామ సుకవి!

(2వ అవధానం - భువనగిరి)

"అవధాని శిరోమణి" బిరుద ప్రదానము

బ్ర శ్రీ అయిలా పజ్జల వేంకటరమణయ్య గారు
పై బిరుదు ప్రదానము చేసి దీవించిరి

హరిహర హిరణ్య గర్భుల నట్టె మంత్ర
ముగ్ధులను జేసి యాడించు ముద్దరాలు
ధారణా శక్తి నొసగి నిన్దనుప మనుమ
అష్టకాల నృసింహరామావధాని!

కవికోకిల

శ్రీ వేముగంటి నరసింహాచార్యులు సభాధ్యక్షులు

నవ ధారణతో జక్కగ
నవధాన మొనర్చి మనకు నానందమ్మున్
అవధాని శిరోమణి బిరు
దు విశేషముగాగ వెలసి తోషము గూర్చున్

(3వ అవధానం - సిద్దిపేట)

ఉభయ భాషాప్రవీణ

శ్రీమాన్ కె. వి. రాఘవాచార్యులు

కవి కేసరి బిరుదమిస్తూ
"కవికేసరి" బిరుదమ్మి
కవికేసరి! సరుకు లేనికవి కే సరియా?
కవి పండితు లెల్లరుగన
నవనీతము పంచె శర్మ నవ్యకవితలో

(8వ అవధానం - సిద్దిపేట)

మధుర కవి

బ్ర॥ శ్రీ మామిడిపల్లి సాంబయ్య శాస్త్రి - సభాధ్యక్షులు

(25వ అవధానం - వేములవాడ)

సరసుల్ మీరలు మీకవిత్వము కడున్ సంతోషముంగూర్చు ఓ
నరసింహాద్యరఘూత్త మాఖ్య సుకవీ! నాకెన్నడుంగూడ ఈ
సరసంబైన తెనుంగు పోకడలు దృష్టంబవ్వగా లేదు పో.
చిరునక్కల్ గ్రహియింప గల్గునె మహాసింహంబు యానంబులన్

సుమధుర సాహితీ పటిమ, శోభన చిత్తము వాగ్విశుద్ధియున్
హిమకర శుక్ల తేజముల హీరమువోలె వెలుంగువాణిపై
విమల తదేక భక్తి గొని పేరిమి దేవళ మామె యున్కికై
క్రమముగ జేయు నీకగును గార్య జయమ్ము నృసింహ రాముడూ!

అష్టావధాని, బ్ర॥శ్రీ త్రిగుళ్ల శ్రీహరి శర్మ వేములవాడ

శర్మద కవనముతో నిట
నర్మోక్తుల బ్రస్తుతించె నవధానంబున్
భర్మాత్మక చిత్రోక్తుడు
శర్మను లలి బొందు శర్మ శర్వాని కరుణన్

బ్ర॥శ్రీ నల్ల గొండ పురుషోత్తమ శర్మ ఉపన్యాసకులు

శ్రీరాజరాజేశ్వర సంస్కృత కళాశాల వేములవాడ

బహ్వ్యాష్వత్ర విపత్తిషు ప్రవిలసత్ మేధా ప్రభావేన సత్
ప్రజ్ఞారీతి నిగుంభనేన నిరవద్యాష్టావధానం హి తత్

విష్ణుశస్యవరేణ చారు కరుణా భావేన చాభూభుషత్
మిత్ర శ్రీ నరసింహరామ సుకృతీ! తస్మైనమస్కుర్మహే
(28వ అవధానం - వేములవాడ)

బ్రా॥శ్రీ త్రిగుళ్ల శ్రీహరి శర్మ అష్టావధాని

సంస్కృత కళాశాల వేములవాడ

సరసోక్తుల్ వినిపించి కావ్య ఫణితిన్ స్వచ్ఛాకృతిన్ సభ్యులన్
బరమానంద సుధాబ్ధి ముంచితిరి. మీపాండిత్య శౌండీర్యమే
నరయం జాలను కైతనింపుట కిటన్ నావాణియే మీరలై
మెరయన్ దేవికి దేవళమ్ము నిలుపన్ మేలౌను మీకెప్పుడున్

బ్రా॥శ్రీ అయిలావజ్ఝల వేంకట రమణయ్య గారు

లీల దళుకొత్త నెల్ల లోకాలనేలు
విశ్వమయుడైన శ్రీవేంకటేశ్వరుండు
అష్టకాల నర్సింహ రామావధాని
నరయుగావుత సిరులిచ్చి యనవరతము
(63వ అవధానము - చేవెళ్ల)

కులపతి శ్రీ శ్రీ భాష్యం విజయ సారథి గారు

శ్రీ విశ్వేశ్వర సంస్కృ తాంధ్ర కళాశాల ఓరుగల్లు
సభాధ్యక్షులు (66వ అవధానము శనిగరం)
అవధానకళాపూర్ణః సారస్వత శిరోమణిః
నరసింహ రామ శర్మా-యం జీయాత్ బ్రాహ్మీ విభూషణః
ఈ బిరుదుము లిచ్చి ఘనముగా సత్కరించిరి

<u>బ్రా॥శ్రీ సి. పుండరీక శర్మ, ఉపన్యాసకులు</u>
ఆంధ్ర ప్రాచ్య సాయం కళాశాల, కామారెడ్డి

శ్రీనరసింహరామునకు శ్రీలలితాంబ అహర్నిశంబులున్
పూనిక తోడ సత్కవిత పూర్ణ యశంబు సుఖంబు నాయువున్
గానకళానిధిత్వమును గ్రన్నన గూర్చుచు వెంబడించుచున్
దీనత బొందకుండ వరధీవిభవంబు నొసంగు గావుతన్

నరసింహరామ శర్మకు
బరిపూర్ణ దయాబ్ధియైన పరదేవత స
త్కరుణను ననిశ మొసంగుత
సురుచిర కవితార్థ భావ శుభసంపదలన్

**(67వ అవధానము బోధన్)**

చిరంజీవి <u>మోహనవు ఆనందయ్య</u> (అవధానిగారి శిష్యుడు)
పద్యప్రసూన మాలిక నలంకరించెను.

శ్రీవాణీకరుణా కటాక్ష గరిమన్ శ్రీవాగ్విభూతిన్ ధృతి
శ్రీవాగ్వందిత సర్వ శాస్త్ర సుమనశ్శ్రీ శోభి భాస్వత్సుధీ
భావావిష్కృత సత్కవిత్వ గురునిన్ భక్తి న్నమో యంచుసం
భావింతు న్మహితావధాన సభలో భద్రంబు లర్థించుచున్

వర నరసింహరాము డనవద్యతరాశు కవిత్వ దీప్తి సం
భరితము గాగ బండిత సభన్ వెలు గొంది మనోజ్ఞవాక్సుధా
పరిమళ మెల్లెడం బరచి పంచుచు వీనుల విందు గూర్చెడున్
నిరతము నిండు ప్రేమము జనింప సుధీమణులార! వేడుకన్

అష్టవధాన సత్కవిత నంచిత భంగివిశుద్ధ వాగ్మివై
కష్టమొ కింత దోపకయె కమ్మని తేట తెనుంగు మాటలన్
బుష్టిని దుష్టి గూర్చెద వపూర్వ మనారతలీల మీకళా
సృష్టి విచిత్రమై తనరు సుందరి శారద సత్ప్రసాదమున్

అవధానం బని యన్న మాటలొకొ? విద్యాలంకృతు ప్రశ్నలన్
వ్యవధానం బిసుమంతనీయకయె సవ్యంబౌ సమాధానముల్
కవనం బంచిత భావబంధురముగా గల్పించి పూరింపగాన్
అవనిన్ మాగురు డష్టకాల సరియే అన్యుల్ విలోకింపగన్ ?

ఆచార్యా! భవదీయ భవ్య ధిషణం బాశ్చర్య మత్యంతమున్
క్వాచిత్కంబున దోషలేశ మరయం గాన్పింప కెవ్వేళలన్
వాచాశక్తి వెలుంగు చుండగ సుధీవర్గమ్ము మిమ్మెంత దో
బూచాడెన్ గవితావధానమున శంభుంగొల్తు మీగెల్పుకై
(68వ అవధానం - రాజగోపాలపేట)

శ్రీ ఐ. కిషన్ రావు అష్టావధాని

జనని కాదంబరీ సేవ సలుపబూని
కైత కాదంబరిని బంచ గడగి సభల
వలచి వలపింప జేయు మీవాక్కు భళిర!
తమరి వాణిని గని లక్ష్మి దయదలచుత
అష్ట కాల నృసింహ రామావధాని

రసబ్రహ్మ
శ్రీఅనుముల కృష్ణమూర్తి గారు ప్రిన్సిపాల్
ఎందర జూడలేదు జననీ. అవధాన విధాన చాతురీ
సుందర సిద్ధహస్తకళ జూపిన వారిని? కాని వీని నే
మందును? నీపదార్చకుల కందఱికిం జిరసేవ్యమానస్వ
చ్ఛందరసావతారమని చాటుదునా? కవిలోక మంతటన్
(73వ అవధానం - వరంగల్లు)

పౌరాణికవతంస, కవివతంస,
బ్రా॥శ్రీ గౌరీభట్ల రఘు రామశర్మగారు. రిమ్మనగోడు
పృచ్ఛకానా మభీష్టానాం దాతాయం కవిపుంగవః
అష్టకాల నృసింహాఖ్యో జీయాత్ మాతృ దయాదృశా
(78వ అవధానం - చుంచనకోట)

మధురకవి
బ్రా॥శ్రీ ఉమాపతి పద్మనాభశర్మ - సిద్దిపేట
నరసింహరామ సుకవీ।
కరమరుదగు రీతి మీదు కవితామధువే
సరసావధాన చతురత
అరరే! చందాయిపేట నాకర్షించెన్

శ్లేషయమక చక్రవర్తి, అవధాని పంచానన
బ్రా॥ శ్రీ గౌరీభట్ల రామకృష్ణ శాస్త్రి
అహో నరసింహ కవీ భవ త్కవితాష్టావధానవత్
నహిప్రతి రియం వేళా భాగ్యవ ద్విదితాఖిలైః

బ్ర ॥ శ్రీ చంద్రశేఖరశర్మ (నిషిద్ధాక్షరి)

అలమితి మీరె గాలమని యందరు కొందల మందువేళలో
సలలిత కల్పనోద్ధతి, ప్రశస్త చమత్కృతి, రమ్యశబ్ద సం
కలిత రసార్ద్ర పద్యగతి, కాలరధమ్మిట నాపుచేసినా
వలఘు యశోవిశాల! అభివందన పద్యసుమం బిదో సుధీ!

(84వ అవధానం - చందాయిపేట)

డా ॥ కులశేఖరరావు ఆంధ్రశాఖాధ్యక్షులు

నరసింహరామ సుకవీ!
కర మరుదగు రీతి నీవు కావించితివే
పరగగ నష్టవధానం
బిరవున గవితామతల్లి ఇల్లయెనీకున్

డా ॥ తిరుమల శ్రీనివాసాచార్యులు
సర్దార్ పటేల్ కాలేజి - సికింద్రాబాదు

భద్రమైనట్టి అవధాన పథము వెంట
ఛంద మనియెడు సుందర స్యందనమున
శబ్దములె అశ్వములుగాగ సత్కవీంద్ర!
చిత్రముగ నర్థ గమ్యమ్ము చేరినావు

చేసినా వష్టకాల నృసింహరామ
శర్మ, అష్టావధానము సభ్యులలర
భారతీదేవి పూర్ణ కృపాకటాక్ష
సిద్ధిపొందిన కవికి నిషిద్ధమున్నె?

శారదారాధనారత సత్కవులకు
ధారణాయత్త ధారావధానులకును
నేసమస్య నిచ్చిన నెన్ని దత్త
పదుల నొసగిన నేమిలే - భయములేదు
(86వ అవధానం - ఉస్మానియా విశ్వవిద్యాలయం)

మధుర కవి బ్రః॥ శ్రీ అగస్త్యరాజు సర్వేశ్వరరావు గారు
విశ్రాంత ప్రిన్సిపాల్, అద్దంకి

అష్టకాల నర్సింహరామావధాని
పలుకు పలుకున దేనియ లొలుకునట్లు
చేసె నవధాన మానంద భాసురముగ
వారి కిడుదును నే డభివందనములు

బ్రః॥శ్రీ, మంచికంటి సీతారామారావు (నిషిద్ధాక్షరి)
నేతినేతియంచు నిలువరించితి గాని
కవన సుధను ముంచె గవి వరుండు
మధుర మధుర శైలి మకరంద భావాల
ధన్యవాద శతపు తరగ లిత్తు

శ్రీ నరసింహరామ కవి చేసెను బండితులెల్ల మెచ్చగా
గానని మేలు భావములు కల్గగ వర్ణన లెన్ని యేనియున్
మానని పృచ్ఛకుల్ వరుసమారగ నందరు హర్షమందగా
బానము చేయ జేసెసుధ పంక్తులు తీరిన సభ్యమండలిన్

కృతజ్ఞతగా నేను జెప్పిన పద్యము
ఆఫీసర్స్ క్లబ్‌వారల
మానని పృచ్ఛకుల్ వరుస మారగ నందరు హర్షమందగా
ఆఫర్ మన్నించి వచ్చి అద్దంకిని నె
న్నోఫీట్ల తో వధానం
బేఫీలింగ్ లేక చేసి తిందరు మెచ్చన్

(92వ అవధానం - అద్దంకి)

డా॥ తిరుమల శ్రీనివాసాచార్యులు సర్దారు పటేలు కాలేజి
(సికింద్రాబాదు)

స్వాంతమందు భావ జలధులు తరగెత్త
నాల్కపైన గవిత నాట్యమాడ
దుష్టి కూర్చి నాడ వష్టకాల నృసింహ
రామ శర్మ! ప్రతిభ ప్రతి ఫలింప

అంతరంగమందు నార్ద్రతవాసించె
నుక్తులందు మెరిసె నుజ్జ్వలతయు
ధారలోనెకాదు. ధారణలో గూడ
ప్రౌఢి పరిఢవిల్లె రామ శర్మ!

అష్ట శబ్దము పేరులో నమర నిలిచె
కాలమును భారతీ సేవ గడుపుదీవు
ధైర్య సింహమ వష్టావధానమందు
ధర్మ సాక్షిగ నభిరామ శర్మదుడవు

వాణినుండియే పొందిన భాషనంత
వాణి కర్పించు విజ్ఞాని వరుడవీవు
సుందరోజ్జ్వల శారదా మందిరమును
గట్ట బూనిన ఏకైక కవివి నీవు

డా. గౌరీభట్ల మెట్టరామశర్మ అష్టావధాని

స్వాదుతరోక్తి చాతురియు జక్కగ నించుచు భావనా సుమా
మోదము మీదు కైతలవి మోదము గూర్చెను మోదకమ్ములన్
మాదిరి నీసదస్యులును మాదృశ పృచ్ఛక పంక్తి నెల్ల బ్ర
హ్లాదుల జేసి ఈసభ నలర్చితి వోనరసింహ సత్కవీ!

(94వ అవధానం - నిజాంకాలేజి, హైదరాబాదు)

డా॥ అక్కిరాజు సుందరరామకృష్ణ నల్లకుంట హైదరాబాదు

శారద నందనా! నిను బ్రశంసలు సేయుట యన్న నిక్కమా
శారద సన్నుతించుటగు సత్యమటంచును దోచె నామదిన్
భారతి ప్రేమ బ్రోవ ధర వర్ధిలుమయ్య! నృసింహరామ! నీ
పేరున సాటి లేరుగద బేర్మిని నీయవధాన ప్రక్రియన్

అష్టకాల నెన్ని యాతల్లిపై నల్లి
మురియ జేసినావా? ఎరుగమైతి
మందు కేమొ నీవు నాతల్లి కిట్టుల
అనుగు సుతుడ వనెడు ఖ్యాతి గొంటి

అష్టకా లెన్నొ అలవోక నంబపైన
వ్రాసిరో ఏమొ ముందు తరాలవారు
అష్టకాలను పేరది యందుకొఅకె
ఇంటిపేరున స్థిర మయ్యె నింపుగాను

## బ్రాః॥శ్రీ శాస్త్రుల చంద్రమౌళి శర్మ దేవుని అల్వాల్

అష్టావధానమ్ము కష్టమౌ ప్రక్రియ
నిష్టమ్ముగా జెప్పి స్పష్టపరచె
నాటి తిర్పతి వేంక నార్యుల రీతిగా
నేటి సభాస్థలి నిల్పిచూపె

పృచ్ఛకుల్ ప్రశ్నల పీడనల్ గురిపింప
స్వచ్ఛమౌపాండితిన్ వరుస నిలిపె
ఆంధ్రరాష్ట్రమ్మున నవధాను లందర
నష్టకాలన్నృసింహు డారితేరె

భళిర! నరసింహుడవు గావె భావపటిమ
కవిసుధాకర, కవి సింహ క్రాంతి వీవు
శారదా పాంగ దృక్కుల సాచి మిమ్ము
కవికులామోద హర్షముల్ గనుచు బ్రోత!

## శ్రీ నల్లిగ శ్రీనివాసాచార్యులు - హైదరాబాదు

శ్రీనవసాహితీ సుధల జిందు రిజర్వుడు బ్యాంకు సాహితీ
జ్ఞానమనోజ్ఞసంస్థ విలసత్సరసాష్టగుణావధానమున్
శ్రీనరసింహ రామ కవిశేఖరుచే నొనరింపజేసె నెం
తో నవముగ్ధమై తనరె తోటిరసజ్ఞులు మెచ్చి యౌనన్

కవిజనాప్తుడు శ్రీఅష్టకాల వంశ
జలధి చంద్రుడు నరసింహ శర్మగారు
తనియజేసిరి అష్టావధాన విధిని
ఇష్టదైవము వీరిని ఏలునెపుడు

డా॥ తిరుమల శ్రీనివాసాచార్యులు

బ్యాంకు అనగ లక్ష్మీదేవి భవనమగును
ప్రవిమలాష్టావధానమ్ము భారతియగు
రమ్యముగ జూపి నావులే రామ శర్మ!
అత్తవారింట గోడలియాట నేడు

కవులు లోకాన గల రసంఖ్యాకముగను
కోటి కెక్కిన పండితుల్ కోటిగలరు
నీవలె నెవరు వాణికై జీవితాన
ఆలయమ్ము నిర్మించిరీ యవని యందు

ప్రతిమాటను బుష్పముగా
ప్రతిసభకొక రత్నమాల భంగిని మీ అ
ప్రతిమానమైన ప్రతిభా
మతినారాధించి నారె మాటలదేవిన్
(105వ అవధానం -రిజర్వుబ్యాంకు అఫ్ ఇండియా - హైద్రాబాదు)

కోగంటి వేంకట రామనుజ దాసః ప్రధానార్చ కః
పట్టెం వేంకటేశ్వర దేవస్థానం మహబూబ్‌నగర్

మృదుమధుర రసోద్యద్భావ గంభీర శోభా
క్రమలలిత శుభోక్త్యష్టావధాన ప్రతిష్ఠా
విబుధ వినుత భాగ్యా వేంకటేశాద్ర్ర వీక్షా
జయతు జయతు దివ్యా శర్మణః శ్రీమనీషా

శ్రీవత్సవేంకటాచార్యః శ్రీభాగవత సేవకః
మోముదీతి నరీనర్తి బోభవీ త్యభినందతి

సిరిచిరు నవ్వు వెన్నెలల జేసి కరంగిన చిత్తవృత్తి య
చ్చెరువు ఘటింపగా దనివిచెందిన వేంకట శైల భర్త యై
పరగి పురాతనమ్మయి ప్రసన్నజనైక నిషేవ్యమానమౌ
తిరుమల శ్రీనివాసమగు తేజ మభీష్ట మొసంగు మీకిలన్
(108వ అవధానం - పాలెం, వేంకటేశ్వరాలయం)

డా॥ కసిరెడ్డి వేంకటరెడ్డి రీడర్ ఉస్మానియా విశ్వవిద్యాలయం

అవధానమ్ముల వంద దాటినవి. అయ్యా! ఇంత సారళ్యమున్
భువిలో నెన్నడు జూడలేదనుచు గచ్ భూవిజ్ఞులీ వేళలో
నవసాహిత్య ప్రబుద్ధ భావముల నానందించి యున్నారు. ఈ
యువ లోకమ్ము త్వదీయ సాహితిని ఓహో యంచు గీర్తించెడున్
(114వ అవధానం -కేంద్రీయ విశ్వ విద్యాలయం,
గచ్చిబౌలీ, హైదరాబాదు)

డా॥ జి. యం రామశర్మ, బాబూ జగజీవన్‌రాం కళాశాల,
హైదరాబాదు
లలితానంద తరంగ డోలికలలో లాలించి లాలించి ధీ
విలసత్ హాస రసప్రసంగములలో వేవేగ దేలించి స
భ్యుల నానందమరందమాధురులతో బొంగించి నారయ్యా! మీ
పలుకుం బూవులు మాకళాలయమునన్ వన్నె ల్గదా సత్కవీ!
(121వ అవధానం - హైదరాబాదు)

డా॥ కోవెల సంపత్కుమారాచార్య వరంగల్

ఆసరస్వతి బ్రహ్మవిద్యావధూటి
నూటి కొక్కని యందు సంతుష్టయగును
అయొకడు నేడు శ్రీశర్మ అద్భుతంబు
సాహితీ సుధ చిలికెను మోహనముగ
శ్రీవిద్యా దేవీ చర
ణావృత కింకిణుల సవ్వడై కవితాశ్రీ
ధీవైశద్య మ్మై మ్మే హే
లావిష్కారమున శర్మ నభినందింతున్
(123వ అవధానం - ఘనపూర్)

శ్రీ ఐతా చంద్రయ్య
అష్టకాల వారి యవధాన మేమందు
నక్షరాల గంగ యవతరించె
పద్యరసము పారి పరవళ్లు ద్రొక్కంగ
తెలుగు తల్లి మోము వెలిగె నేడు
(125వ అవధానం - బచ్చన్నపేట)

శ్లేషయమక చక్రవర్తి, బ్రా॥శ్రీ గౌరీభట్ల రామకృష్ణ శర్మ - అష్టవధాని
మా బ్రా హ్మీమయమూర్తి, ప్రౌఢకవి శుంభల్లీల మంథాద్రి య
ట్ల బ్రాశీకృత వాక్సుభాష్ఠలిని, హృద్యప్రక్రియన్నిల్పి స
భ్య బ్రహ్మణ్యబుధాళి కుక్షి సుధ నే దందించితే దిగ్జయ
మ్మా బ్రహ్మన్నయు నష్టకాల నరసింహా! ఇచ్చి పాలించుతన్

అవ్యాజ దివ్య కృపయా శ్రీదైవజ్ఞ శిఖామణేః
శ్రీ పీయార్ శర్మ ణోహ్యద్విద్యం చేయచ సభా బభౌ

మల్కాజిగిరి వాస్తవ్య విదుషాం
సముదార యుతో ధృతేః
అహో! విజయతే గోష్ఠీ
నరసింహ సుధీమణే

(126వ అవధానం - మల్కాజిగిరి)

బ్ర॥ శ్రీ డా॥ శివునూరి విశ్వనాథ శర్మా, సభాధ్యక్షః
అష్టావధాన మతికష్ట మిహాస్తి లోకే
తల్లీలయా కృత మహో! కవినా త్వయాద్య
కిం చిత్ర మాశ్రిత వతా మఖిలేష్ట సిద్ధ్యై
వాగ్దేవతా చరణ పంకజ యుగ్మమీడ్యమ్

శ్రీమానష్టక వంశ వార్ధ్యుడుపతిః శిష్టాగ్రణీ హ్యష్టధీ
ర్విద్వాన్ శ్రీనరసింహ రామ సుకవిస్త్వష్టావధానం ముదా
వాగ్దేవీ పద పద్మ యుగ్మ మధుపో వాచాంపచస్సంయమీ
కృత్వా నేత్ర మహోత్సవం హి కృతవాన్ నృణామహో! పశ్యతామ్

అష్టవిధేష్వ ప్యతులం ప్రాజ్ఞ మభిజ్ఞం విషయే ష్వతినిపుణం
ఇష్టానుగుణం పృచ్ఛక వర్యైః పృష్టంబహుధా విబుధేంద్రైః
అష్టవధానం కృతవంత మముం సుష్ఠు సుధీంద్ర మతంద్ర మహం
అష్టకాలనరసింహ రామ సుకవీంద్రం త్వా మభినందామి

(127వ అవధానం - చేగుంట)

డా॥ జి. యం. రామశర్మ
రోడ్డి స్ట బెన్స్ చేసిన
రెడ్డీ కాలేజి లోన లేడీసు వెరీ
గుడ్డని మెచ్చగ మీరలు
వడ్డించితి కైత విందు భళిరే సుకవీ!

శ్రీమరుమాముల దత్తాత్రేయ శర్మ

మాటలవిరి తోటలలో
దీటుట దిరుగాడి పద్యదీధితు లెసగన్
హాటక గర్భుని రాణి ని
రాటంకముగను విలాస లాస్యము సలిపెన్

శారద మీదు రూపమున జక్కగ నియ్యెడ గజ్జెకట్టి ప
ల్మారులు లాస్యమాడు గతి మాటలు పూవుల జల్లునట్లుగాన్
గోరిక దీరగా గురిసి కూర్మిని బంచితిరయ్య మీరు సం
స్కారులు మీకు మీరె సరి సార్థక మైనది పద్యవిద్యయే
(128వ అవధానం - రెడ్డిమహిళాకళాశాల, హైదరాబాదు)

శ్రీ బి. వి. రామారావు గారు కోదాడ
శ్రీని వాసుని దయా శ్రీచేత సద్వంశ
సంజాతుడై సరస్వతి దయార్ద్ర
దృష్టి సర్వంకష ధిషణా ధురంధరు
డై కవితా వధానైకసుడగు
శ్రీ అష్టకాల నృసింహాఖ్యు డవ్యాహ
తమ్ముగా జేయు వధాన కేళి

నూత్నవర్షాది మనోహరమై సాగ
ప్రమదభాసుర సభా రంజకముగ
కలుగు సాహిత్య సహితపు గల్మి విరియ
సరసహృదయాల నవ్యరసాలు గురియ
వారి జిహ్వాగ్ర సీమపై స్వారి సలుప
నలువరాణిని మది ప్రార్థన మ్మొనర్తు

డా॥ ఆనూరిమరింగంటి పురుషోత్తమా చార్యులు
సూర్యాపేట

అష్టావధాన విధమది
క్లిష్టమ్మైనను వడినవ లీలన్ హేలన్
స్పష్టమ్మైనట్టి సరణి
నిష్టాగతి నిర్వహించె నీయన ప్రతిభన్

తేనె సోనల దీయని తేట తెలుగు
సాంద్రధారారసోదార సంస్కృతంబు
మేల్మి కవితా చమత్కార మేళనమ్ము
అష్టకాల వారన్న మీ యిష్ట హేల

శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తి శ్రీనివాస అయ్యంగార్
నరసింహ రామశర్మకు
సరసత బద్యమ్ము జెప్ప సామర్థ్యంబున్
వరవీణా పాణియుబా
సరవాసిని వాణి యొసగె సాదరమొప్పెన్

(132వ అవధానం -కోదాడ)

<u>శ్రీమాన్ నత్యనారాయణాచార్యులు లెక్చరర్</u> కరీంనగర్

ఎనిమిది దిగ్గజంబులను నీనరసింహుడు కొల్వుదీరగా
మనమున దోచెనాకు నిట మానగ నియ్యది వారి సౌధమో
జనకునిమందిరబొ? మరిసత్యముభోజుని కొల్వు కూటమో?
కననగు గృష్ణరాయసభ గారవ మొప్పెడు గాక నిత్తరిన్

" అవధాన జ్ఞానభారతి" బిరుదు ప్రదానము
సభాధ్యక్షులు అవధాని, సంస్కృత కళాశాల
ప్రధానాచార్యులు <u>శ్రీడా॥ టి. శ్రీహరి శర్మగారు</u>
వారి ప్రశంస

నరసింహ శ్రీకరముఖ
సుర వాగాంధ్రోక్తి పూర్ణ సుకృతవధానే
సరసా విలసతి వాణీ
శ్రీశాలా దివ్యవేది చిన్మయ వినుతా!

అవధానమ్ము నరించువేళ గడు సౌమ్యమ్మైన వృత్తిన్ సభన్
వ్యవహారమ్ము పొనర్చు వారలె సుమీ! వహ్వా! ప్రశంసన్గానన్
చవు లూరింతురు దివ్య కావ్య పరనన్ సంస్కార మిద్దాననా
ప్పవధానీ. నరసింహ! నీకు నది యొప్పన్ మాకు మోదమ్ముగన్
(సిరిసిల్ల - 134వ అవధానం)

<u>ఆశావాది ప్రకాశరావు</u> - పెనుగొండ అష్టావధాని - సభాధ్యక్షులు

అవధానంబననేమిటో తెలిసె దివ్యంబౌ పురాకావ్యమై
భవముల్ పొంగులు వార బద్యముల నుత్పాదింపగా జేయుచున్
శ్రవణంబున్ హృదయంబు దన్పుటయేరికిన్నగా సామాన్యమే
నవులన్ గెల్చితి వష్టకాల నరసింహా రామశర్మాభిధా!

(136వ అవధానం - వరంగలు)

<u>శ్రీకొండపి మురళీకృష్ణ శతావధాని కందుకూరు</u>

ఇంటి పేరులోన హృద్యమౌ సాహిత్య
రూప మొండు దాగి రోచులీనె
గవిత లోన మధురకమీయతా మూర్తి
పరువులెవెత్తె రసము మురువు చూపి

అతిరమణీయ మౌ కవితలల్లి, వధానము చేసి, ఆసర
స్వతికి విశిష్టసేవలను సల్పి రహించుటె కాదు, కాదు, స
మ్మతి జననేత్ర పర్వముగ మందిర మొక్కటి కట్టి ఆసర
స్వతికి నొనర్చు చుండె వరివస్యల నీనరసింహ రాముడున్

<u>శ్రీ డివియమ్ సత్యనారాయణ</u> అద్దంకి

అష్టకష్ట సంయుతాష్టావధా నంబు
సరసఫణితితోన సలిపినారు
అందుకొనుడు మీర లభినందనంబులు
అష్టకాలవంశ్య!హంస మీరు

**డా॥ పి. నాగ మల్లీశ్వరరావు**

అష్టకాలవారి కిష్టకాలమె కాని
కష్టకాలమనగ గాన రాదు
స్పష్టమయ్యెనిపుడు తుష్టి కలిగెనేడు
అష్టకాల సుకవి హృష్టి హృష్టి

(ఒంగోలు - 137వ - అవధానం)

**శ్రీ గండ్లూరి దత్తాత్రేయశర్మ శతావధాని**

నీకంటెం గవితా మరంద సృజనా నిర్ణిద్ర వాగ్ధోరణీ
శ్రీ కల్యాణ పదార్థ సంచయ రసశ్రీలేదు మాకెన్న, అ
స్తోకానందము పొంగి పార్లినది తోడ్తో అష్టకాలాన్వవా
యాకూపార సుధాంశుమూర్తి నరసింహాఖ్యా! నమోవాకముల్

(138వ అవధానం - అనంతపురం)

మహాసహస్రావధాని

**డా॥ గరికపాటి నరసింహారావు**, సభాధ్యక్షులు

అద్భుతమైన ధార, తగినంతగ ధారణ, ప్రౌఢభావ సం
పద్భృత పద్యపూరణ స్వభావ మనోహరమైన శైలి, వి
ద్వ ద్విషగాత్మ తృప్తి బహుధా గయిసేయు సమాస ధాటితో
సద్భవనమ్ము గట్టితిరి. శారదకుం హృదయమ్ము సొమ్ముతో

వాసింగాంచెను మీ వధానము బ్రజావైశాఖమే సాక్షిగా
వీసీ సాక్షిగ బేతవోలు కవి నవ్వేసాక్షిగా, ఆంధ్ర వి
ద్యాసంస్థావిబుధాళి సాక్షిగ జలధ్వానంబు లే సాక్షిగా
ఆసల్ రేపె ప్రసన్న భారతియె కాదా సాక్షి వేయేటికిన్

డా॥ ఓలేటి బంగారేశ్వర శర్మ

మురువు న్గూర్చ వధానము
సరసంబుగ జేసి మా విశాఖను ఆనం
దరసాంభోధిని ముంచితి
నరసింహ సుధీ! సుకీర్తి నందుమ సభలన్

శ్రీమతి చాంగటి గౌరి దేవి

భళిరే పండితవర్య! గొప్పదగు మీ పాండిత్యము న్మెచ్చుగా
గళమున్ సాగదు. భాష చాలదు గదా! కావ్యంబు నందెన్నియో
తళుకుల్ సూపుచు సాహితీ పరుల చిత్తమ్ముందునానందమే
తళుకొత్తం దగ జేసితౌర జనమంతా మిమ్ము గీర్తింపగన్
(విశాఖ - 139వ అవధానం )

ఘంట్టికృష్ణమూర్తి, హైదరాబాదు

అష్టకాల వారి స్పష్టమౌ కవనమ్ము
నిష్టమైన రీతి నీ సభాంత
రంగ మెంతొ పొంది రంజిల్లె నిచ్చట
పలుకుదల్లి కొలువు కులికె నేడు
(14వ అవధానం - హైదరాబాదు)

# అవధాన సరస్వతి

అవధానములలో సామాన్యముగా ప్రతి సభలోను అవధాని ఇష్టదైవ ప్రార్థన చేసి కాని సభ నారంభింపడు. ఇందు ప్రతిసభ కొక వైవిధ్యమును జూపుచుస్తుతి నెరపును. వీనియందు భక్తితో బాటు కవితాత్మ ప్రస్ఫుట మగు చుండును. వాటి నన్నిటిని ముక్తకములుగాను, శతకములు గాను సమీకరించ వచ్చును.

ఈ స్తుతి పద్యములు ఇష్టదేవతా పరములు, స్థానిక దేవతా పరములు (సభా స్థలమునకు సంబంధించినవి) అనియు నుండును. అవధాని ప్రతిభ ఆరంభస్తుతి పద్యములందు శ్రోతలకు ఒక అభిప్రాయమును కలిగించును. కవితా ధార శ్రోతలను మైమరిపించును. వాటిలో సరస్వతి నాట్య మాడి నట్లుండును. నిజమునకు సరస్వతీ కృపలేనిచో పలుకు పలుకుట గగనమగును. ఆలోచించి, ఒక చోట కూర్చుని, మనఃప్రశాంతితో కవిత చెప్పుట వేరు. ప్రచ్ఛకుల ప్రశ్నలను నిముసములో వ్యంజించుకొని సముచిత సమాధానములతో కవిత యల్లుట వేరు. దానికి భాష, అనేక పదముల పరిచయము, ఏకార్థక పదములు, అనేకార్థక పదములు రమ్యార్థపారమ్యము నగు భావనలు, జటిల సమస్యల విడదీయు చాతుర్యము, సద్యః, స్ఫురణ, ధీ, ధార, ధారణ, ధోరణి, ధైర్యము ఒకచోట కలబోసి నట్లుండిననే అవధానము రుచికరమగును. అందుకు ఇష్టదేవతా స్తుతి అవధానిని పరి శుద్ధ మనస్కుని చేసి అంతులేని ధైర్యవంతుని చేయును.

కనుకనే ప్రతి సభలో అవధాని మొదటి కార్యము దేవతాస్తుతి, అట్లు స్తుతిప్రీత యైన యిష్టదైవము కొండంత అండయై నిండు మనస్సున దీవించును.

# స్తుతి ప్రీత

పద్దెము వ్రాయు కోర్కి బలవంతము గాగ రచించ బూనగా
బెద్దలు మెచ్చుగా వలయు బేర్మిని నీవిడు శక్తి చేతనే
బద్దెము లల్ల జాలుదును బాల్పడి పెద్దల మెచ్చుజేయు నా
పెద్దరికంబు నీదె, కన వేనను బేర్మిని వాసరేశ్వరీ !

పలుకుం బల్కున గబ్బముల్ వరుసగా బల్కించినావంట పూ
ర్వులచే, ముద్దుగ గండపెండియరముల్ పొందంగ జేయించి తా
యలసానాంధ్ర పితామహాదులకు నో యంబా! దయన్బల్కు తో
డలరారంగ నుతింతు నీ భువన గిర్యష్టావధానక్రియన్.

వాణి నారాణి యంచు సవాలు సేయ
వీరభద్రుడ గాను శ్రీ శారదాంబ!
వాణి రాణించు మని వేడువాడ నన్ను
పల్కుతోడయి నేడు కాపాడు మమ్మ !

(భువనగిరి - 2వ అవధానం)

వచియింపంగలనే సుశబ్దముల నెవ్వారైన మెచ్చంగ వే
రచియింపం గలనే సుపద్యముల కర్ణానంద దాయమ్ముగా
బ్రచురింపంగలనే సుకావ్యముల విద్వ ద్వర్యులున్మెచ్చుగా
బ్రచురంబైన త్వదీయ సత్కరుణ నాపై లేనిచో శారదా !

(హైదరాబాద్ 4వ అవధానం)

జిహ్వాయాం లిఖ యాంబికే మమ శుభా బీజా స్సమస్తార్థదాః
ఏకైకా ఘటికా శతాధిక మహా కావ్యాది సద్వర్ణనా
చాతుర్యాశుకవిత్వ నిర్మలవచో ధారా ప్రదా శ్శారదే !
పుణ్యా జాడ్య వినాశకా నమ ఇదం వాగీశ్వరీ భారతీ !

(సీతారామాశ్రమం - 5వ అవధానం)

రాదన లేక, వచ్చినది రమ్యమటంచు దలంచలేక యే
వాదన లేక చెప్పుటకు వంకొక టైనను లేక నేనిటన్
గాదన లేక వచ్చితిని గాని నిజంబుగ వాసరేశ్వరిన్
వేదన లేక పంపుమని వేడెద నష్టవధాన సిద్ధితో.

మాటల దేవి వంచు బలుమారు నుతింతురు పండితోత్తముల్
మాటల దేవివే యయిన మాకొక యించుక లాభమున్నదే ?
మాటల దేవిరించు గతి మా కిడకుండిన దుష్టి గల్గదే ?
మాట లదే వినూత్నముగ మాకు స్ఫురింప నుతింతు భారతీ !

**(సిద్ధిపేట - 6వ అవధానం)**

నాకృతి నాకృతింగను జన ప్రియ శారద, శారదాభ్రమా
నాకృతి వాసరేశ్వరి దయామయి, నిర్మల ధర్మ కర్మదీ
క్షా కలితాఖిలార్థద, ప్రసన్నత నష్టవధాన సంస్తుతి
ప్రాకట, ఈ సదస్యులను రక్తుల జేయగ సన్నుతించెదన్

సాధ్యంబంచు దలంచలేదు, మదినే శక్తుండ నంచెంచ, నీ
మధ్యన్ జేయుట గల్గె దప్పని యెడన్ మాతా ! వధానక్రియా
రాధ్యుల్ పెక్కురు గల్గ మంచి మది నన్రప్పించు నాంగీరసా
రాధ్యున్, దక్కు సదస్సుల న్దనుపుమూ రమ్యావధాన క్రియన్.

పలుకుం బల్కున గబ్బముల్ వరుసగా బల్కించినావంట, పూ
ర్వులచే, ముద్దుగ గండి పెండి యరముల్ పొందంగ జేయించి తా
యలసానాంధ్ర పితా మహాదులచె నోయంబా! దయన్బల్కుతో
దలరారంగ నుతింతు నీ మెదకులో నష్టావధాన క్రియన్

**(మెదకు - 7వ అవధానం)**

చేతులు రెంట వీణగొని చిక్కని గానమహత్వమేర్పడన్
జేతము పల్లవించు గతి జేయుదుగాని సరస్వతీ ! మరో
చేతను మూయు పుస్తకము చేయొకటన్ జపమాల, ఏమిట
మ్మా ? తుది సాహితీ విషయ మంచన నీకును జిత్త మొప్పదా ?

సంగీతమ్మది సాధనావశమగున్, సాహిత్య మాలోచనా
సాంగత్యమ్మన బూర్వ పుణ్య బల సంస్కారమ్మనన్ గల్గు నం
చంగీ కారము గల్గ జేయుటకు నై యట్లుంటివా ? రెంట న
ర్వాంగీణ ప్రతిభావిశేషము దయా ప్రాప్యంబు వాగీశ్వరీ !

(సిద్దిపేట - 8వ అవధానం)

కలదే నాకు సభాంతరాళ కవితా గాన ప్రమోదమ్ము? రా
గలదే నాకు నిరర్గళాశురచనా గాంభీర్యవాగ్జాలమున్?
గలదే విద్వదనూనమోదనవధానప్రక్రియాశక్తి? ముం
గల దేవీ ! ఇట నిల్వ కున్న, గరుణన్ గాపాడుమా శారదా !

నేనిట గలుగ వారల కనేక విధంబుల గుర్తు, వార లె
ద్దానను నన్ను గోరుదురు, తల్లి ! నుతంబగు పాలమాకులన్
మానక నీరు గారిన సుమా ! అవమానము నీకు - నాకు - స
న్మానము లేమికాని నను మానము నిల్పియు బంపు శారదా !

(పాలమాకుల - 9వ అవధానం)

నిను ముద్దాడ విరించి నాల్గు ముఖముల్ నిర్ఛిద్రభావమ్ములం
గన నొక్కంట నసాధ్య మౌట, వడిగా,"గాంతన్ జతుర్వక్త్రగా
నొనరించన్వలె, గాక నేనయిన మోమొండున్ వహించ న్నదిన్
జను" నా దల్పగ జేయు రూపము దలంచన్ముక్తి వాగీశ్వరీ !

(సీతారామాశ్రమము - 10వ అవధానం)

కలుగు కళావిధానము జగజ్జన మానస మోదనంబుగా
వెలిగిన సార్థకత్వమగు, వేడుక గూర్చును; గీర్తి దెచ్చు నం
చిల నవధానము న్సలుప నెంచిటు వచ్చితి గాన దేవి ! నా
పలుకుల కక్షరత్వమిడి భాసిల నెన్నెద వాసరేశ్వరీ !
(అక్షరత్వము · అక్షరరూపము, నశించని రూపము)
(కొండపాక - 11వ అవధానము)

జన్మంబించ్చుటతప్పు, జన్మ నిడినన్ జ్ఞానంబు నీ దప్పు, శ
శ్వన్మాంగల్య కవిత్వ శక్తి యిడుట జ్ఞానంబు పాండిత్య మీ
యన్మొప్పయ్యె, వధాన ధీపటిమ అన్యాయంబు; ప్రాంచత్సువి
ద్వన్మర్యాద, యశఃప్రశస్తి కరుణింపన్ లేక వాగీశ్వరీ !
(మాసాయిపేట - 12వ అవధానం)

కోవెల లోన బూజలను గొంచు మనోహర లీల బొల్చుటే
కావలెనా సరస్వతి ? జగంబున నిన్నతి భక్తి గొల్చు దీ
నావళి గాచు టొప్పు జగదంబిక ! మాదృశ భావనా మహః
శ్రీ విలసిల్ల నీ కృపను జిమ్ముమ నమ్మితి వాసరేశ్వరీ !
(సిద్ధిపేట - 13వ అవధానం)

వాసిని గన్న ప్రిన్సిపలువారి మనీషకు దోడుగా నుప
న్యాసకులోలి ధీయుతులు నండగనుండ రసజ్ఞ గ్రామ సం
వాసులు చేర ఛాత్రజన భాసితమౌజగదేవపూరులో
నీ సభ నా వధానమున నింపును నింపును వాసరేశ్వరీ !

తల గల క్రొవ్విరుల్ మృదులతాభరవాసన క్రుమ్మరించ, ను
త్తలగలదంబుపూర మరుదార కృపాధుని! వాణి ! శబ్దవే
త్తల గల సాహితీరుచిరతాప్రియతా మహితావధాన చిం
తల గలగంగ నీయఃక సదస్యుల దన్పుమ వాసరేశ్వరీ!
(జగదేవపురం - 14వ అవధానం)

స్నేహితుడైన డింగరి నృసింహ బుధుం డనురాగరాశి నా
సాహితి యం దనూన గుణసార సరస్వతి నాదరించగా
నీహ జనింప నీయెడల నేర్పరచె న్సభ, సిద్ధిపేటలో,
ఆ హితు బ్రోవ వేడెద సదభ్యుదయమ్ముల వాసరేశ్వరి)

ఎందతి కీవు శ్రీసముచితేందిరరూపము జూపి వాగ్విలా
సేందుకళావికాసము వహించవు ? వారల వోలె గాక న
న్నెందుల కింత కక్ష? పరమేశ్వరి ! అష్టవధానధీపరీ
క్షం దడ వుట్ట జేసి మరి సాకెద వెల్లెడ వాసరేశ్వరీ !

(సిద్ధిపేట - 15వ అవధానం )

ఎంతని వేడు కొందు నిను నీశ్వరి! ఎల్లెడ బ్రోవు మంచు, నా
కింతటి భారమైన పని యేటికి బూన్చితి వమ్మ! సత్కవి
త్వాంత రసానుభూతి హృదయంబున సర్కసుఫీట్లు నింపి ధీ
మంత సమక్షము న్నిలిపి మానక దోడగు వాసరేశ్వరీ !
(కవిత్వాంత రసాను భూతి - కవిత్వాంతర సానుభూతి.)

(మాసాయిపేట - 16వ అవధానం)

నాకు గలట్టి శక్తి పయి నమ్మక మూతగ గాదు, నిచ్చలున్
నీ కృప పైన సంశయఘనీభవిత స్థితి గాదు, పండిత
శ్రీ కమనీయ మీ సభ వరిష్ఠత నష్టవధానధీ పరీ
క్షా కృతకృత్యతా విషయ శంక మనోగతి వాసరేశ్వరీ !

నీవే నేనను ధీర చిత్త మను సంధింపంగ రాకుండె నీ
వీవే నేనను దంచు నాసపడ రావేలే ? సరోజాసనుం
దేవీ ! నాకిట కొండపాక గల శక్తిన్ జూపు సామర్థ్య మీ
వే వాగీశ్వరి! వాసరేశ్వరి! సభాప్రీతిన్ బ్రసాదించవే!

(కొండ పాకన్ కలశక్తిన్, కొండ పాక గల శక్తిన్)
(త్వమేవాహం త్వమేవాహం - త్వమేవాహం న సంశయః)

(కొండపాక - 17వ అవధానం)

ఏనీమూర్తిని నా మనంబుననె గా దెల్లప్పు డూహింతు, ని
ధ్యానావస్థితి నిర్మలాకృతి నమంద ప్రేమ నర్చించగా
నే నీ మూర్తిని నిల్ప నెంచితిని నా కీ విచ్చు చేయూతతో
జానౌ మందిర మందు మందులను బ్రోచన్ రావె వాగీశ్వరీ!

(నేను శ్రీసరస్వతీ క్షేత్ర శంఖుస్థాపన 2-5-1980 నాడు చేసి 4-5-1980 నాడు లింగారెడ్డి పల్లిలో చేసిన సభలో చెప్పిన పద్యము)

ఈడగు వారినెంచుకొని యెల్లెడ సౌఖ్యము పొందుగ నీమె, నే
నీడగు వారినెంచుకొని యెప్పుడు బాములు పొందువాడ. నీ
జోడు నిరంతరంబు మనసున్వయసున్ గమనించికూడు, నా
జోడు సమస్యలన్. గలుగ జూచును గావుమ వాసరేశ్వరీ !

స్తుతి పద్యంబుల లంచ మంచనకు, దిక్చుద్ధాంతకాంతానుమో
దిత భాగీరథి వేగ భోగ మగు చెంతేగాని వర్ధిల్లు ధా
ర తిరంబై యెసలార గోరి నిను నేశ్రద్ధన్ నుతించంగ ని
క్క తితీక్షన్ గనబోను వాగ్ఘనని లింగారెడ్డిపల్లీ సభన్
(లింగారెడ్డిపల్లి - 18వ అవధానం)

పలుకుల తల్లివై హృదయ భావములం బ్రతి శబ్దమూర్తివై
పలుకుల సన్మనీష నెడబాయగనీయక నేడు నా కిటుల్
పలుకు బడి న్బెరుంగదగు ప్రశ్నల కుత్తర దక్షిణంబులన్
బలుకుమ తల్లి ! లోకులు సెబాసన నష్టవధాన సంగతిన్
(ప్రశ్నల కుత్తరము - మరియు దక్షిణ. ప్రశ్నలకు పూర్వపరములు)
(సిద్ధిపేట - 19వ అవధానం)

మదిరా సన్నిభలోక సంగతి మదోన్మత్త ప్రజాపాళి నె
మ్మది రాగమ్ముల ముగ్గి, నిన్ను దలపన్ మందాత్ములైనార ల
మ్మదిరా ! సత్కృప వాక్కు గల్గుటకు నీమాంద్యంబు బోకార్చు నా
మది రాజిల్లు మటంచు వేడుకొను దంబా వాసరాధీశ్వరీ!

దేవీ. నీకొక దేవళమ్ము ధర నుద్దీపింపగా జేయగా
నీవే ప్రేరణ సేయ నా పనియు నాయిల్లు న్నుతు ల్బుట్టముల్
దేవేరిన్ భవ దుర్గతిన్ బడియు నంతేగాక నీదృగ్వధా
నావేగంబును నెట్టు తట్టు కొనుదంబా! చూపవే నీదయన్
(సిద్ధిపేట - 20వ అవధానం)

జననీతిప్రద సత్ప్రవర్తన సదా శ్లాఘ్యంబు, దుర్మోహ భం
జననీకాశము సద్దయాపరత విశ్వప్రేమ దుర్దోషమా
ర్జన నీరంధ్ర తపఃప్రభూత మహిమా సంపన్నతల్ గూర్చు నో
జననీ! అష్టవధాన శోధన ప్రశంసాపాత్రత న్గూర్చు మా !
(హైదరాబాద్ - 21వ అవధానం)

ముల్లోకంబుల నిన్ను బోలు కరుణామూర్తి న్గనం జాల ద
ర్పో ల్లాసంబుల నేవధాన సభలం దూర్జస్వ వాగ్వైఖరీ
వాల్లభ్యంబున సభ్యకోటి కతుల ప్రాగల్భ్యము న్జూపుచో
తల్లీ! యుల్లముతో, బదార్పణముతో ధన్యాత్ముగా జేయవే!

విమల అనంత సాగరపు పృథ్వియ సాధ్వి, సమస్త శైలమ
స్తములను గా దటంచు జలసంపదకుం బదమౌ దొనల్ వెలుం
గ మత మందిరమ్ము దగు గాయని యెంచితి వంచితాత్మవై
కొమరుని న న్నశక్తు నట గూర్చితి వేర్చగ వాసరేశ్వరీ!
(సిద్ధిపేట - 22వ అవధానం)

రౌద్రిన్ ఫాల్గున శుక్ల మంద నవమీ రాత్ర్యున్ముఖార్క ప్రభన్!
రౌద్రర్క్షేందుత, జీవసౌరి యుత కన్యాలగ్న వేళన్ విని
ర్నిద్ర బ్రాహ్మణ వార్షికోత్సవ సభానిష్ఠాతృ సాన్నిధ్యమున్
భద్రంబష్టవధాన సత్సభ దనర్పన్ దేవికాపాడెడున్.

నేర్చిన వాక్కు లెల్ల గణనీయముగా నుచితజ్ఞతాగతిన్
గూర్చి సదస్య మోదనమె కోరికగా నవధాన ధీ పరీ
క్షార్చుల జాతరూప మయి యంచిత రీతిని గోరువాడ, వా
గర్చన నాది, కైకొని కృతార్థుని జేయుమ వాసరేశ్వరీ !

నీకై యాలయమొండుకట్టుటకు నన్నే యెంచి దీవించి, చీ
కాకుల్ పొందక ధన్యు జేయు మను నా కైమోడ్పులంబొంది; ప్రే
మైక స్ఫూర్తిని నీ వధానము నిజామాబాదు సభ్యప్రియం
బై కామ్యార్థము లీయ జూడు జగదంబా! వాసరాధీశ్వరీ !

(నిజామాబాదు - 23వ అవధానం)

నీదయ యెంత? నీ మహిమ నీవ యెఱుంగుదు. నీ శ్రితావన
శ్రీద సమర్థతల్ చెలగులే మరి నీవె సరస్వతీ ! సభా
మోద నిరర్గళాశు రసపూర్ణ కవిత్వనిరూఢి నాకు నీ
వీ దలపోయకున్న గలవే యని శంకగు వాసరేశ్వరీ !

ప్రతిపదజాయమానపరిభావనిరుద్ధమదీయమానసో
ద్ధతతురగప్రవల్గనము దారుణ కంటక దుర్గమంబుగా
నితరములేదు నీవెయని యెంచి కృతార్థత బొందజూచు న
న్నితరము గోరకుండ కరుణించుమ యెల్లెడ వాసరేశ్వరీ!

చరితము గల్గు నీనగర సభ్యులు మత్కవితావధాన మా
ధురి గన బ్రీతి నన్పిలువ దోచిన రీతి నొనర్తు నీకు మం
దిరమును గట్టు లక్ష్యమున దెమ్ముగ వదాన్యుల ముందు కీ పటం
చెఱువున నర్థ సిద్ధియగు సేవలు గొమ్ము వచోవిధాయినీ !

తనుహృద్భాషల నీకు నాలయ మనంత వ్యక్త దీక్షా పటు
త్వనితాంత శ్రమబొంది కట్టుటకు నిద్రాభోజనాలోచనా
ది నిరూఢవ్యథ మాని పూనితిని వాగ్దేవీ కృతార్థుండుగా
నను దీవింపుమ కార్యసాధన కనంత శ్రీప్రసాదించుమా !

(పటంచెర్వు - 24వ అవధానం)

గొప్ప కవీశ్వరుం డనుచు గూఢతరార్థ నిరూఢ పద్యముల్
సెప్పెడినంచు బెద్ద నను జేసి సభాస్థలి నుక్కు పిండముల్
తిప్పలు పెట్టు దీక్షగొని తేకువ నిల్చిరి పండితోత్తముల్
గొప్పల కేమి కాని పడకుండ గృతార్థుని జేయు మంబికా!

(వేములవాడ - 25వ అవధానం)

పిలిచిన ఓ యటన్న దనివింగను నెంతగ దల్లి, అమ్మ నా
బలికిన గుండె విప్పెడిని, భవ్యవచఃప్రచురంబు గాగ దె
ప్పలగు ముదంబు, పద్యముల బ్రస్తుతి సేసిన నింక నేమి ? వే
పలుకగ వచ్చునే జనని వాణి ! కృతార్థుని జేయు మంబికా .

(బోధన్ - 26 వ అవధానం)

ఇల ధీమత్తకు బూర్వజన్మ సుకృతం బెట్లుండునో కాని, ని
ర్జల నిర్ణిద్ర తపోంగభూశయననిష్ఠాప్రక్రమానంద తుం
దిలమౌ నీకృప మూర్తిగా గల నెసంగెన్ దత్పరివ్యాప్తమై
పలు కొప్పారెడు వాసరేశ్వరి! సభా ప్రాశస్త్యము న్గూర్చుమా!

ధర బంగారము వన్నె జూచుటకు శ్రద్ధాయుక్తి గంసాలి తా
వరగల్లున్(వరగంటిన్) గొని రాచి గుర్తెఱుగు నా ప్రజ్ఞా విశేషంబులీ
వరగల్ గ్రామసభాంతరాళవిబుధవ్రాతంబు ల ట్లీవధా
నరమా భోగము నన్పరీక్ష సలుపంగా బ్రోవు వాగీశ్వరీ ।

కంటిని సత్కృపన్ జననికాయ రసజ్ఞత ప్రష్టలందు ము
క్కంటిని, సత్సభానియతి గ్రాలగ శబ్దమహాబ్ధి గాంచె వే
గంటినిగా, వధానముఖ కావ్యసుధారసధార దేల్చ వ
ర్గంటిని గల్గు మిత్రతతి రంజిల జేయుమ వాసరేశ్వరీ.

(27వ అవధానం - వరగల్, మెదక్ జిల్లా)

నీ గుడి గట్టు కోరిక ననేక విధంబుల దాతల న్గనన్
సాగెద జింతలేక, గుణసారు లుదారులు గుర్తెఱింగినన్
వేగమ కార్యసిద్ధి యగు వేదికగా నవధాన సత్సభన్
జోగిగ జోలె గట్టితి విశుద్ధ మనంబున వాసరేశ్వరీ !

నీకయి గాక బ్రాశ్నికు లనేక సమస్యల నీయ విప్పగా
నాకు దరంబె ? నా ప్రతిభ నా చదువెంతని వేదినిల్చి జ
ల్పాకుడ నైతి, బాణినికి బారము సెప్పగ నేర్చు పండితుల్
నాకయితన్ రసంబుగొని నన్మనుప న్నుతియింతు భారతీ!

అవధానం బొక పిచ్చి, అంటినది వాయంజాల దెప్పట్టునన్
నవధా మానసవృత్తి పర్వు లిడు చుంటన్ జెప్పుటల్ సేయుటల్
వివిధంబు ల్గని సభ్యులై సుజను లుర్విన్ సంతసంబందగా
నవధాని వ్యథ దీర్ప నీవె తగుదంబా! వాసరాధీశ్వరీ!

(వేములవాడ - 28వ అవధానం)

అవధాన మ్మన నాంజనేయమహితవ్యాయామ శాలా ధిపుల్!
చెవులన్ గోసుక విందు రందరకు వాసింగల్గ నా శారదా !
కవితామూర్తి,యనల్ప భక్తి విషమాంగ శ్రద్ధ కల్పించగా స్తవనంబున్
బొనరింతు నామెకృప న శ్రాంతంబు నాశించుచున్

(29వ అవధానం - సిద్దిపేట)

ఇది దయకాదు - సత్కవితయే పరమావధిగా మధువ్రతా
స్పద  పదవృత్తి పద్యముల సజ్జన మోదము గూర్చ గోరు నా
కెద తగులన్ సమస్యల గృశించగ నష్టవధాన ఖేలనా
పదపద గౌరవం బిడుట వాగ్రతి జాగ్రత నిమ్ము భారతీ !

నీ కారుణ్యము నాపయింగలుగ శంకించ న్సభామోదన
శ్రీ కామ్యం బవమాన మందునని, వారి న్మించి తేల్చంగ నీ
వేకా! నేర్చిన విద్దెలెల్ల సభలో విన్పింతునేకాని, అ
మ్మా! కైత న్యశ మొందు కూర్చుమిల కామారెడ్డి విద్వత్సభన్.

నీదయ యిట్టి దంచనగనేర నిరంతర సత్తపః క్రియా
మేదుర సత్వ శాలురగు మేటియతు ల్దలపెట్టు నాలయ
శ్రీ దరి లేని ఘోరభవ సింధు కబంధ కబంధితాత్మ న
న్నాదట దీక్ష నిల్పితి మదంబ! కృతార్థుని జేయు మిత్తరిన్

నిధి లేదం చనుమాన మంద గవితా నీరాజనారాధనా
విధి నేతాదృశ వేదిక న్నిలిచి మద్విద్యా ప్రతి స్పందనో
త్కధియుల్ మెచ్చి బహూకరించినది శ్రద్ధాయుక్తి నే గూర్చి పె
న్నిధిగా గట్టెద నీ గుడిన్ జనని వాణీ! వాసరాధీశ్వరీ!

ఏమైన న్పరమేశ్వరీకరుణ సుమ్మీ! యంచు భావించి ని
ష్కామం బైన తలంపుతో జటుల దీక్షన్ శారదాదేవి తా
నామోదించిన చోట నాలయము సేయంబూని భిక్షార్థినై
కామారెడ్డిని దాతలన్ గలియగా గాంక్షించి విచ్చేసితిన్.

(30వ అవధానము - కామారెడ్డి)

తల్లీ! నీకృప నావగా సభలలో దర్పించి యష్టావ
నోల్లోలాంబుధి దాటగా దలచు నాకుత్సాహము స్ఫూర్చి సం
పల్లీలన్ గడముట్ట జేయము, తిమి వ్యాఘాతముల్ పెన్దుపా
నుల్లేకుండగ సభ్యులెల్ల చెవివిందు న్బొంద వాగీశ్వరీ!

గనిలో గార్మికు డోర్మితో గునపముల్ కండల్గరంగన్ శ్రమం
బనక ద్త్రవ్విన పాతర న్నిధులు చెల్వారున్, గవిత్వంబు వే
రనరా దక్షర రత్నముల్ ప్రవిమలార్థా లంబముల్ సాహితీ
ఘన నిక్షేపము ద్రవ్వి పోయవలె నీకారుణ్యమున్ శారదా!

(గోదావరిఖని - 31వ అవధానము)

దయ మానె న్మము గన్న తల్లి యని శ్రద్ధా యుక్తి నీ గూర్చి నిం
దయ మాలక్ష్యముగా దలంతుమె? జగత్కల్యాణకార్యంబునం
దయ మా గూర్చిన శ్రద్ధ తగ్గె నను సత్యంబున్ గ్రహింపంగ రా
ద - యమాద్యష్టనిరూఢ సాధనల నాధారంబు గైకొందుమా !

(భెల్ - హైదరాబాద్ - 33వ అవధానం)

అమ్మా ! ఇమ్మహి బాల బాలికలలో నష్టావధాన క్రియా
సమ్మోహమ్మును గూర్చ సత్కవిత నాశ్చర్యమ్ముగా జెప్ప శ
క్యమ్మా! దేవి కృపామహిమ్న ఫలభాగ్యం బంచు భావించగా
నిమ్మా ! వారికి రమ్య పద్యరచనా హేల న్ప్రసాదింపుమా!

అనుకొనలేదు నేను గవినై యెసలార గలాడ నంచు ని
ట్లనుపమ రీతి మద్గురుల యట్టి మహామహు లాత్మమెచ్చగా
జను నవధానమున్ జలుపు చక్కని యీయవకాశ మబ్బునం
చును జదు వీబడి న్జదువు చో నది గూర్చిన అంబ నెన్నెదన్

(సిద్ధిపేట - 35వ అవధానము)

(సరిగా 5 సం॥ల తరువాత మొదటి అవధానము చేసిన వేదిక పైననే (నారాయణఖేడ్‌లో) 36వ అవధానము చేసే అవకాశము కలిగినది : ఆనాటి ఆనందము అవధులు లేనిది.)

కోరిన కోరకుండిన నకుంఠిత దాసజనావన స్వభా
వోరుకళావిలాసము సముజ్జ్వలమై యలరారు చుండ దై
వారడె యీవధాన సభఁబండిత మండనుడై వధాని, చె
ల్వారెడు శ్రోతృలోక హృదయంబుల వెన్నెల వాసరేశ్వరీ !

నాయవధానలక్ష్మి జననం బిటనే, పలు చోట్ల బండితా
మేయ శుభాశిషంబుల సమీకృతసజ్జన సౌమనస్యసం
ధాయక మయ్యె, జవ్వనిగ దార్ఢ్యత జూపగ వచ్చె నేడు నా
రాయణఖేడులో శుభపరంపర గోరుచు వాసరేశ్వరీ !

అతివేంకృష్ణుడు గూర్చు నీసభలు నాకత్యంత సంతోషము
ప్పతిలన్‌జేయును. నన్వధానిగ నొనర్చన్ మండనంబుల్ పుర
స్కృతి పద్యప్రసవమ్ముల న్దగును, నిశ్శ్రేయ స్సదాభోగ భా
స్వతుడై వెల్గ ననుగ్రహించు మని యంబ న్వాణి నర్థించెదన్

(36వ అవధానము- నారాయణఖేడు)

ఓ తల్లీ! మన ముల్లసిల్ల రచనావ్యూహోల్లసల్లీల వి
ద్యాతీర్థాంబునిమజ్జితాఖిలబుధవ్యాహార సమ్మేళనల్
ద్యోతిల్ల న్గవితావధానసభ సద్యోవాగ్విలాసావహ
శ్రీతృప్తుం బొనరింపు మియ్యెడల బేర్మి న్జిన్నకోడూరిలోన్.

(37 వ అవధానం - చిన్న కోడూరు)

హృదయాహ్లాదము గోరి భారతి! రసజ్ఞేశాను లాశాపరా
స్పదసత్కావ్యకృదబ్జభూసమకవీశప్రేమ పిల్పించి రిం
పొదవంగా నవధాన సత్సభకు దా రుత్సాహ మందంగ నీ
పెద చీకోడున సాహితీ సుమలతావృద్ధిన్ బ్రసాదించవే.

పదముల నిచ్చినావు రసభావముల న్సమకూర్చి వాక్యసం
పద నొదగించు శక్తి నిడి పాలన జేసితి, భావనా వశం
వదుల వదాన్య శేఖరుల భాగ్యముగా దయ చేసి తీ సభా
సదుల, మరేటికీ  హృదయ శంకను గూర్చితివమ్మ! భారతీ!
(పెదచీకోడు - 38వ అవధానం)

శ్రీ మయమైన నీదయ వరిష్ఠముగాగ మహాప్రసాదమై
కామిత మిచ్చు సత్కవిత కల్పతరూపమమై యొసంగ నీ
భూమి కృతార్థు జేయు, పరిపూర్ణ సుఖమ్ము లొసంగు, శారదాం
బా! మహితావధానసభ వాక్కిడు దిక్కయి కావ వేడెదన్.
(జగిత్యాల - 40వ అవధానము)

భాగ్యనగరావధాన సభాసదులకు
మోదమును గూర్చి నాకు నామోదముద్ర
నేర్చినంతలో గలిగించి నిండుమదిని
పాలనము సేయు కల్పకవల్లి తల్లి !
(హైదరాబాదు - 41వ అవధానము)

ఓ యమ్మా ! నిను నమ్మి వేదికను సద్యోభావ సంపత్తి సు
జ్ఞేయమ్మొగతి చెప్ప గల్గుటకు నాశింతున్ గవిత్వాశ్రిత
శ్రేయ మ్మష్టవధాన కార్యమున భీష్మించంగ సిద్ధంబుగాన్
న్యాయమ్మా? కరుణార్ద్ర దృష్టిగని న న్నజ్ఞున్ గటాక్షింపవే !

కాసట బీసటే చదివి గాథలు చెప్పెడు వార లంచు జి
జ్ఞాసులు వల్కినన్ బ్రతుకు సంబ్రమము నీదుట భారమౌను, పే
రాస కడింది వచ్చితి మదంబ ! వధాన విధాన మాధురీ
ధ్యాస మరల్చకుండగ సదస్సుల దన్పుమ వాసరేశ్వరీ !

(సిద్ధిపేట - 42వ అవధానము)

శ్రీ రూపమ్మున నీవు కన్నులకు లక్షింపంగ రాకున్న వి
ద్యారూఢి న్గను వార లెవ్వరు? జగద్భద్రంబు దానెందు దై
వారున్, బుద్ధి విధా విధాయిని సరస్వత్యంబ! ఏతద్వధా
నారంభస్తుతి సమ్ముదాత్మవయి దిక్కై నిల్వవే యీసభన్.

నీవు శరించినన్ జనని! నిల్తునె నేను సభాతలంబునన్
భావము పుష్టిగా బలుకు భాగ్యము వే దయసేయు మమ్మ! భా
షావిదు లందరిందొకట చక్కగ నన్ను బరీక్ష సేయర
మ్మా! విధి వోలె నేను జతురాస్యుడ నౌదునె వాసరేశ్వరీ!

గుండె రాయి చేసికొని కొండ లందున
గుడిని గట్ట బూను కొనిన వాడ
దండి ధనము గూర్చు తడి గుండె దాతల
యండ నిమ్ము శారదాంబ! నాకు.

పని నీది జనని! నేనా
పనికైయే ఈ వధాన బలవద్రతి బూ
నినవాడ నీదు గుడికై
ధనార్జనమె లక్ష్యమమ్మ! దయజూడ దగున్

పనివడి దాత లెవ్వరిని బాధల బెట్టగ బోను, వ్రాసి యా
యని మహనీయు లందు హృదయంబు వికారము గల్గనీను, నీ
పనిముగియించు కొందువా? అపప్రధ నాకు ననుగ్రహింతువో?
జనని సరస్వతీ ! సకల శక్తి వశక్తుడ రిక్త భక్తుడన్

(సిద్ధిపేట - 43వ అవధానము)

పలుకుల తల్లి ! నా మదిని బాగుగ నమ్మితి, నీవధానమున్
బలుకుల గొంక కుండ, రసభావము లావహిలన్ దయన్ సద
స్యుల బులకింప జేయుమ. బుధోత్తము లుత్తమ చిత్తవృత్తి బ్ర
శ్నల నడుగంగ దృష్టుల నొనర్చుమ వారల వాసరేశ్వరీ!

నీ గుడిగట్టు దీక్ష గణనీయము - నాకది లేక యున్న వి
ద్యాగమ మూర్తులైన బుధు లందురు మెచ్చ వధాన వేదనా
వేగము పొందబోను, ప్రతి పేటకు దాతల గోర బోవు ను
ద్యోగము బూన బోను, ధనదుల్ గన నన్ను గృతార్థుజేయవే!

(44 వ అవధానము - కాజీపురం)

ఏదీ వీ డెటు చేయు చూతమని భీష్మించంగ నా తల్లి! నా
కే దోషంబులు గల్గినన్ దలప దాలించంగ బాలించగా
మోదంబౌ నవధాన వేదిక సభామోదంబు చేకూర్చగా
రాదే? దోషము లెన్న భావ్యమె ? విధిప్రాణేశి! వాగీశ్వరీ!

ఈ కోహీరను గ్రామమందు భవదీయేచ్ఛా పురస్కారల
బ్ధై కోహీరగిల న్వధాన సభ సంప్రాప్తించ గెంగేలనన్
గైకో! హీర సమానుగా జలుపగా గల్యాణదాత్రీ! వధా
నైకోహారచనా ప్రకారము చిదానందమ్ము గల్గింపగా

(45వ అవధానం - కోహీర్)

కవిగా బేర్గను టేమి గొప్ప? కవితాకళ్యాణి పాణిగ్రహ
ప్రవిలాస ప్రమదప్రకర్ష పృథుకావ్యశ్రేణి కల్పించి య
ష్టవధానాదిక చిత్రపద్యరచనా చాతుర్య మేపార ని
ల్చి విపశ్చిద్గణ గౌరవంబు గనుటే శ్రేయంబు వాగీశ్వరీ!

(46వ అవధానం - భెల్ - హైదరాబాద్)

పలికిన పల్కు పల్కుననపారరసారభటిప్రసార ధా
రల బులకింత లింతలయి రాగము లుప్పతిలన్ గవిత్వలీ
లల నవధాని యాదగిరి లక్ష్మినృసింహ మహోత్సవమ్ము లో
పల బలుమారు శారద కృపన్గన సర్వము పొందు నియ్యెడన్ !

(47 వ అవధానం- యాదగిరి లక్ష్మీనరసింహ దేవస్థానము)

నీ గుడికై వధానముల నేనొనరింతును గాని నాకు ధీ
వాగురువైభవంబు తగు పాళులు కద్దని కాదు తల్లి ! బా
గోగులు చూచు శారద. మృదూక్తుల సూక్తుల బల్కనిమ్ము, నే
భోగము గోరబోను, తలపు న్నిలు పన్వలె వాసరేశ్వరీ !

(48వ అవధానము - సిద్ధిపేట)

"అక్కర లేనిచో దలప వైతివి, నీవవధాన సత్సభన్
దక్క" యటంచు గిన్కగన దాసుడు నిల్వగలాడె తల్లి ! నా
దిక్కని నిన్ను నమ్మితిని, దీనుని జేయకుమో సరస్వతీ!
బిక్కనవోలు నీ హృదయ పీఠిగదే మును రెడ్డిరాజులన్

మల్లారెడ్డి ధరాధినాథుడుగ సమ్మానంబులన్ సల్పడే
తల్లీ! తానును సత్కవీశ్వరుడుగా ధన్యాత్ముడౌగాదె ? సం
పల్లీలా మహితాతిశాయిత, కవిత్వ శ్రీ విరాజిల్లదే
ఉల్లాసమ్ము వహించు మమ్మ! అవధానోత్సాహమున్ గూర్చగా,

(బిక్కనూరు - 49వ అవధానం)

నాకై యెవ్వరి నేమి గోర సకలాంతర్యామవై నీవె చీ
కాకుల్ డుల్చి, ధనార్జనమ్మునకు సౌకర్యమ్ము కల్పించియున్
సాకల్యంబుగ జూచుకోగలవు, నిశ్శంకన్ భవత్సూచితా
ద్వైకాలోచన దక్క దక్కెద సమస్తం బీవె గా నెంచుచున్

(వికారాబాదు - 50వ అవధానము)

నీకు న్భక్తులు లేకకాదు జననీ! నీయాలయా లెక్కడై
లేకుండంగ దరిద్రు నన్ను గరుణాలీలాత్మ బ్రేరేచి, ని
ర్భీకు న్జేసి అనంతసాగరపురోర్వీభృన్మహాక్షేత్రమున్
సాకారార్చన గోరి నిల్పి తిది యాశ్చర్యంబు వాగీశ్వరీ!

(53వ అవధానము - శనిగరం)

సత్కవితా సరస్వతికి సత్కృతి పూజన సేయగోరు వి
ద్వత్కమనీయ మూర్తులగు పండితవర్యుల సమ్ముఖమ్మునన్
హృత్కమలంబు విప్పునటు లేర్పడ నష్టవధాన ఖేలనో
ద్యత్కవనాశుధారణల బ్రాణ యొసంగుమ వాసరేశ్వరీ !

అక్షర సంపద ల్గలిగి యాలయ మేర్పడ జేయ బోను, బ్ర
త్యక్షరసాను భావసహితాత్ముడ, ద్వత్కరుణాకటాక్షల
బ్ధాక్షర సంపదన్ హృదయ మద్ది సమర్పణ సేయనుంటి నీ
యక్షరవేత్త లక్షయ సహాయ మొనర్చగ జూడు మంబికా!

(54వ అవధానము - హైదరాబాదు)

శ్రీమంతంబయి యొప్పునాచగిరి లక్ష్మీ నారసింహస్థలిన్
బ్రేమ న్మంజుల రాఘవేంద్ర యతిరాడ్బృందావనస్థాపన
శ్రీమంత్రాలయ సుప్రతిష్ఠ యెసగెన్ జెల్వారు నష్టావధా
నామోదంబును గూర్పవే జనని! విద్యాభారతీ! నాకిలన్.

మడిమాన్యంబుల గోరలేదు. చదువేమాత్రమ్ము నాకబ్బినన్
మిడిమేలంబు వహించబోవ, గవనమ్మే వృత్తిగా నీకిలన్
గుడికట్టంగ వధానమందు నడుగన్ గొంక న్వదాన్యవలిన్
నుడు లీయంగ నుతింతు నన్ను నసమాను న్జేయ వాగీశ్వరీ !

నీవు దయారసంబు మెయి నిండు మనంబున నిచ్చు సత్కవి
త్వావసరంబు దీరక బదార్పణ చేసిన జాలునంచు నా
భావమునం దలంచి పరిభావము లెంచక ధీర చిత్తమం
దావహిలన్ రచింతు జగదంబ! సహాయము గావె నా కిలన్
(56వ అవధానం - భిక్కనూరు)

శ్రీవై నాకు నయాచకత్వ మిడి రక్షించంగ నీవేకదా !
ధీవై యష్టవధాన ధీపటిమ నుత్తీర్ణంబు గావించగా
నీవే కాదె? సరస్వతీ జనని! మన్నించంగ దన్నించగా
నీవే కా యని నమ్మి కొల్తు సభ దీవించంగదే భారతీ!
(57వ అవధానం - దిగ్వాల్)

గుడికయి యావధానముల గొంకక జేయుచు నుంటిగాని, యా
గడముగ జేయ జాలి యనగా దగ దంబ! సమర్థభావనల్
తడబడకుండ గౌరవము తప్పని రీతిగ గావుమమ్మ! యీ
జడమతి కెందు నీకరుణ చాలదె? భాగ్యము వాసరేశ్వరీ!

నిద్రాహారము లెంచకుండ జననీ! నీ యాలయం బేర్పడన్
భద్రం బెల్ల జనాళి కౌనను నభిప్రాయంబు దార్ఢ్యంబుగా
క్షుద్రంబౌ పరయాచనావిధి ననుస్యూతంబుగా గొంటి నా
ఛిద్రం బెంచక కార్యసిద్ధికయి యాశీర్వాదముల్ చల్లవే)
(58వ అవధానం - నంగునూరు)

పలుకుల తల్లి ! నామదిని బ్రస్తుతి చేసెద నీవధానమున్
బలుకుల బల్కునప్డు దడ బాటొక యించుక లేక భావనం
బుల బులకింత లేర్పడగ మోదము గూర్చవె నేటి యీ సభా
స్థలమున వాగ్విదగ్ధుల విదగ్ధత కుద్దిగ వాసరేశ్వరీ !
(59వ అవధానం - రామంచ)

అవధానంబుల షష్టిపూర్తి యగునట్లాశీర్వదించంగ నే
టివిపశ్చిద్గణ మంచితాదరమునన్ డీకొన్న దేవీ కృపా
ర్ణవ సుస్నాతుడనై శుచి ప్రతిభ గణ్యంబైన నీదుండిగల్
భువి కీర్తి ప్రచురున్ బొనర్పుము సతంబున్ వాసరాధీశ్వరీ!

నా పడు నీ పరిశ్రమ మనారత మీదృశ సత్కృతార్థముల్
సాపద గాదు, నీకు నొక చక్కని యాలయ మేర్పరించగా
బాపడ సర్వశక్తుల నవారిగ వెచ్చ మొనర్చు చుంటి నా
యే పడగించ భావ్యమగునే? వెనుదట్టక వాసరేశ్వరీ!

(60వ అవధానం - దుందిగల్ )

అడిగిన చిక్కుప్రశ్నలకు నర్థము దప్పని వాక్కునిచ్చి జం
కుడుగగ పెద్ద గుండవెలి నొప్పెడు వీరయ శ్రేష్ఠి షష్టి నిం
డెడు తరుణమ్ము నందు ప్రకటించు వధానము దిగ్విజేతృతన్
పొడగన జేయు మమ్మ! పరిపూర్ణ కృప న్దగ వాసరేశ్వరీ!

(61వ అవధానం - పెద్దగుండవల్లి)

నిండిన గుండె నీవిడగ నేరనిచో మనజాల వేడు భూ
మండలమందు, సర్వజనమాన్యత ధన్యత బొందు సావధా
నుండయి యేవధాని, యదనుంబదునుం గనిక్రుచ్చు పృచ్ఛకుల్
చండులు గాగ గుమ్మడిదలన్ గెలిపింపుము వాసరేశ్వరీ !

వేడు : ఎవడు (62వ అవధానం - గుమ్మడిదల)

శ్రీవిద్యామహనీయధీబల యశ స్ఫీలింపు పెంపార, బ్ర
జ్ఞావిష్కారము చెన్ను మీఱ నవధానాంత స్సదస్యాభి మా
నావేశమ్మున, ధార, ధారణ పటుత్వారంభ సంరంభమై
చేవెళ్లన్ గడవెళ్ల వాణి! మహ దాశీస్సుల్ ప్రసాదించవే

ధారణ నిల్వదన్న బెడదంగలిగింపక, వాక్సుధాశుమత్
ధారకు లోటులేక జనతాతతి కాతత చేతనాతిగ
స్ఫార సుభావవీచికల సంతస మొప్పగ గూర్చుమమ్మ! వా
ణీ! రుచిరాకృతి న్గనుల నిల్చి యనుగ్రహ మిమ్మ ఇమ్మహిన్
**(63వ అవధానం - చేవెళ్ల)**

నీగుడిగట్టు కార్యమున నిండిన భక్తి వధానరూప వి
ద్యాగరిమ న్వెలార్చి యిల దాతల గోరగ వచ్చినాడ, గ
ల్పాగము వంటి నీవు కయి నండగ నుంచ నసాధ్యముండునే?
వాగధిదైవతంబ! తగుభావము గల్గగ జేసి సాకవే?
**(64వ అవధానం - అందోలు)**

నాగురు సమ్ముఖంబున జనప్రియ సత్కవితావధానవి
ద్యాగరిమాప్రదర్శనము నంచితరీతి నొనర్చు నాశయం
బీగతి దీరె నేడు, జగదీశ్వరి! నాకు సభాపతి ప్రతి
ష్ఠాగణనీయుడౌ విజయ సారధి సద్గురుడీ సభాస్థలిన్

ఎన్నోనాళుల నుండి వేచిన గురుప్రేమంతు నస్మాదృశున్
విన్నాణంబుగ దీర్చి దిద్దిన ఘనున్ విజ్ఞాన పాథోనిధిన్
బ్రన్న న్నేడు సభాపతిన్ విజయ సారధ్యాహ్వాయున్ మద్గురున్
గన్నాడన్ బరిషద్వధానవిధి సాకన్రావె వాగీశ్వరీ!

నినుమది నేమికోరితిని, నిండిన ప్రేమను నీవొసంగి తే
మని కలలో సరస్వతి ! సదాశయమే సరి ! కాని నేను దా
నిని బరి పూర్తి సేయగల నిష్ఠగలట్టిడనేని యూత నీ
వనయము శారదాంబ ! చరితార్థుడ నయ్యెద నేగృతార్థతన్

ఎందరు దాతల హృదయ
స్పందనతో బూర్తియౌనొ పలుకుల తల్లీ !
మందిరము నీకు, నీవే
ముందరగా సాగు చుండి బ్రోవుము వాణీ!

**(66వ అవధానము - శనిగరం )**

బోధన గ్రామ మందు మునుపు న్ధరణీసుర సంఘకామిత
శ్రీధృతి మించజేసితిని, శిష్టవధానము, పండితాష్టక
స్వాధికృతిన్ మనోజ్ఞమయి వర్తిలుచుండ విశిష్టగౌరవ
త్వాధిగతిన్ రహించితి జయంబు నొసంగవె వాసరేశ్వరీ !

**(67వ అవధానము - బోధన్ )**

అమలిన భావసంపదల నందము చిందు పద స్వరూప వి
భ్రమముల సత్కృతాభరణ రూఢి దనర్చు వధాన కార్యభా
రము రమణీయ మౌనటుల బ్రాక్తన పుణ్య విశేషరూపమై
సమకొన నీసభాస్థలి బ్రసన్నత గాంచుమ వాసరేశ్వరీ !

వినుతింపందగు పండితాష్టకము మద్విద్యా ప్రతిస్పందనం
బును గావ్యాంకితముం బొనర్ప గవితాపూర్ణా వధానక్రియా
గ్రణిగా దిద్దగ నుద్యమించ దమి మీరన్ రాజగోపాలపే
టను మిత్రావళి కూర్చె వారల యభీష్టం బీయవే భారతీ !

ఎక్కడబుట్టినాడ? మరియెక్కడ నిల్చితి నెందుజీవికన్
దక్కుచు నుంటి ? నెక్కడబుధ స్తవనీయ మనోజ్ఞమందిరం
బొక్కడ బూనుకొంటి? గవితోద్యమ వృత్తి యశస్సు పొందలే
దెక్కడ? నీదయా మహిమయే జగదీశ్వరి ! వాసరేశ్వరీ !

నాకే మిచ్చితివో నే
నీకే మియ్యంగలాడ నిత్యముగాగన్
నీకై గుడి గట్టగ నే
నూకొన నూకొనక నుండ నూతవు తల్లీ !

అరువది యేడౌసభలం
దురవడిగా జేయు సత్కృతోద్యర్ధనమున్
బరువడి నీగుడి కిచ్చితి
సరస్వతీ ! యేమి చేయ జాలుదు నింకన్
**(68వ అవధానం - అవధాని స్వగ్రామము - రాజగోపాలపేట)**

నీగుడి గట్టు దీక్ష గణనీయముగా విలసిల్లి కార్యమౌ
చీగతి సాగు చుండ గవివృద్ధులు పండిత పాళి మెచ్చు ను
ద్యోగముతో వధానముల నూకొని చేయుచు శ్రీజగద్గురు
స్వాగమనం బొనర్చుతరి నౌనని యెంచను వాసరేశ్వరీ !

తల్లీ ! నీకృప వెల్లిగా సుకవితా ధారాప్రవాహాతి సం
పల్లీలన్ విబుధావలి న్గనుపు మద్భాగ్యంబు, భాగ్యంబు - స
చ్ఛిల్లిప్సా మహనీయమై తనర గాశీకాశ్యపిన్ యోగమౌ
టుల్లం బందు దలంచ నన్నిచట ధన్యున్ జేయవే శారదా !

ఎవ రే మనుకొన నేమిటి ?
కవిరళ తనుధన మనస్సు లందించితి నీ
శివతోడు నీకు నాలయ
మవుదాకను విశ్రమించ నని వాగ్దేవీ !
**(70 వ అవధానం - 29.4.1986. వారణాసి )**

శ్రీ వాగ్విభవ ప్రదాయిని! జగత్ క్షేమంకరీ . శారదా
దేవీ ! నీకరుణా కటాక్షముల నుద్దేశించి వాగ్వైఖరి
శ్రీవిద్వద్వర తృప్తికై సలిపెదన్ శిష్టావధాన క్రియన్
బ్రావీణ్యంబు రహించ బ్రోవుమి మదంబా ! నాచగిర్యుర్వరన్

(71వ అవధానం - నాచగిరి - లక్ష్మీ నరసింహదేవస్థానం )

శ్రీ విద్యా మహనీయ వైభవ ఫలశ్రీ లబ్ధి దైవారగా
దైవానేక వివేక మేల ? కవితాదైనందినీయ శ్రమన్
భావ స్ఫూర్తి సుగమ్యమై సభల సంభావింపగా జేయదే?
దేవీ శారద ! ఓరుగంటి సభ నుత్తీర్ణంబు గావింపవే !

జయము న్గీర్తిని సత్కృతార్థముల నిచ్చుంగోరి యేతద్వధా
న యమార్తి న్గనబోను, పండితజనానందంబు జేకూర్చి యా
లయ ముద్యద్గతి నీకు గట్టుటకు నుల్లాసార్థయుక్తి స్థిరా
శయము న్గూర్చ సదాశిషంబు గొను నాశాదృష్టివాగీశ్వరీ !

( 73వ అవధానం - వరంగల్ )

శ్రీకారంబున నుండి నీపద సరస్తీరంబు నందాక నే
సాకల్యంబగు భక్తి జేరుటకునై శ్రద్ధాళుత న్నిల్చితిన్
రాకేందర్వర్బుద శుద్ధకాంతివి, సికింద్రాబాదు శ్రీమద్గణే
శై కైకాలయము న్వధాన సభ రక్షించంగదే శారదా !

సన్మానంబుల కేమి కాని కవితాసత్కారమే యౌను, భా
స్వన్మా ధుర్యరసానుభూతి మహితాశ్చర్యప్రభావాతి భా
వోన్మాదంబున నీపదార్చనమె సద్యోగంబుగా గల్గ బ్రా
గ్జన్మోపార్జిత పుణ్యసంపదగ నాకాంక్షింతు వాగీశ్వరీ .

( 74వ అవధానం - గణపతిదేవాలయం. సికింద్రాబాదు )

నాకు సరస్వతీజనని దానము, దాననిదాన మూర్తు తే
కైకమనోవినిశ్చయనికాయముగా మదినెంతు, బ్రాశ్నికా
నేక వినోదరూప కవనీయ సమస్యల విప్ప గల్గినన్
జేకురు గార్యసిద్ధి, వరసిద్ధి వినాయకు నుత్సవంబులన్

( 75వ అవధానం - చేర్యాల )

ఇంతనరాని నీకృప మహీస్థలి నవ్వవితావధాన ని
శ్చింతను నిల్పు, బృచ్ఛకుల చిక్కుల కీవె జవాబు గావె, కా
కింత శఠించినన్ జననివే యనకుందునె? శారదాంబ ! ఈ
దొంతి సభా సమక్షమున దొంతరగా నుడు లీయ వేడెదన్

ఈశ్రమ నీకై యే కా!
ఆశ్రయ మౌనీవె ఆశ్రయాశిగ మారన్
విశ్రుతి గల్గనె వాణీ !
అశ్రమమున దేల్చుమమ్మ ! అవధానంబున్
(ఆశ్రయ + ఆశి = అగ్ని)

( 76వ అవధానం - దొంతి )

దయనీయుండ ననంత దోషి నను నుద్ధారంబు సేయన్ దయా
మయి నీవుండ, ననల్ప సౌహృద సుధీమాన్యుల్ సభాస్తారులై
దయసేయ న్గవితావధాన సభ ఛాత్రప్రీతి దైవార నా
జి యనంగా విజయంబు గల్గదొకొ కాజీపూరులో భారతీ !

ఇందరు మిత్రు లుండ గరువేమిటి? శారద! భక్తితోడ నీ
మందిర మేర్పరింప శ్రమమా? అనపాయినివై రహించి నీ
వెందున ముందుగా నడువ నే వెనుకంజ యటన్న వైతునే
కొందల మేల ? గెల్పు నొనగూర్చుమ అష్టవధాన పర్వమున్

( 77వ అవధానం - కాజీపురం. )

స్తవనీయంబగు సమ్యగాశు కవితాచాతుర్యధుర్య ప్రధా
భ్యవహారంబున బండిత ప్రవరు లబ్బా! యంచు నుబ్బంగ న
ష్టవధానంబున దృష్టి గూర్చుమ యవష్టంభంబులన్ ద్రోసి, ప్రా
గ్భవ పుణ్యంబున వాసరేశ్వరి ! సభాకంపంబు బోకార్చవే !

అంచిత భక్తిమై కొలుచునట్టి జనంబుల ప్రేమనేలి, నే
త్రాంచల సత్కటాక్షము లనంతముగా బ్రసరింపజేసి, ని
ర్వంచితుల న్వినర్చి పరిపాలన సేయు మదంబ! నేటి ఈ
చుంచనకోటలోన శివ సుందరి సన్నిధి బ్రోవు మండగా
(78వ అవధానం - చుంచన కోట )

ఇచ్చిన ప్రజ్ఞతక్కువ, మహీయవధానవిధానధీసమ
స్వేచ్ఛల దాత్మ గౌరవము నూకొననీయక, సభ్యులెన్న, వి
ద్వచ్చయ సన్నిధిన్ నిలిపి పల్కుమటందు విదేమి తల్లి ! నే
నెచ్చట వెన్నుదట్టక రహింతు దయన్గను వాసరేశ్వరీ !

అడిగిన వారి నాలుకల నాడిన జాలదు పల్కుతల్లి ! ఏ
దడిగిన జెప్పు నారసన యందు వసించక లాభమేమి? నీ
కొడు కవమాన మందక నకుంఠగతిన్ నెలకొన్న కీర్తి మ
ర్పడగ సభాస్థలంబునకు రాదా? సరస్వతి ! వాసరేశ్వరీ !
( 79వ అవధానము - మర్పడగ)

పలికిన పల్కు పల్కున గృపామహిమంబు విరాజిలన్ మహో
జ్జ్వలమతి భక్తలోకమును బాలనసేయు మదంబ! అల్పబు
ద్ధుల మమునేల నేలశ్రమ దోచును? నీకవధానవాగ్విధా
విలసితరీతి సేవ నడిపించెద బ్రోవుమ వాసరేశ్వరీ !
( 80వ అవధానము - సిద్దిపేట)

నీరాహారము మాని నిశ్చలత మందీభూత చేతమ్ము వి
ద్యారాగమ్మును బొంది కీర్తిగను నత్యాశన్ భవత్సన్నిధిన్
శ్రీరంజిల్ల వధాన? వేదిక సదా శీర్వాదముల్ భారతీ !
ధారాధారణ ధోరణుల్ గలుగ నుద్ధారంబు గావించవే !

(81వ అవధానము - కుకునూరుపల్లి)

అవధానమ్ముల గీర్తి గోర నొకనాడైనన్ జగద్భద్రకృత్
సవిధమ్మై తగు దేవళ మ్మొకటి యుత్సాహమ్ముతోగూడి య
ష్టవధానమ్ముల సత్కృతార్థము సమస్తం బప్పనంబై తగం
గ వచోదైవతమా ! కృతార్థత గనంగా జూడు వాగీశ్వరీ!

( 82వ అవధానం - కరీంనగర్)

ప్రతిపదవిఘ్నమున్ గెడపి, భావ విరోధ నిరూఢి ద్రోసి, దు
ర్గతిబెడబాపి, దత్తపదరమ్యతగూర్చి సువర్ణనాశుధా
రతిరముగా నదృష్ట దినరక్తి వహించి, ఛలోక్తినైపుణీ
గతి నవధానధారణల గష్టము దీర్చుమ వాసరేశ్వరీ !

కరుణాసాగర మూర్తివై జనుల సాకల్యంబుగా గాచి యు
ర్వర సర్వోన్నతికై పదాతిగమహాభాగ్యంబు చేకూర్చి వి
ద్వరసమ్మాన్యత కూర్చుశారద ! కవిత్వస్ఫూర్తి నేతత్పద
స్వరతిన్ మించగ జేయుమో జనని ! సూర్యాపేట కాలేజిలోన్

(83వ అవధానం - సూర్యాపేట)

నమ్మితి నా మనంబున ననారత మవ్యయ సత్కృపాకుటీ
రమ్మున గుమ్మగా బ్రతుకు ప్రజ్ఞ నొసంగెద వంచు, వాగ్విలా
సమ్మున సభ్యకోటికి పసందగు నష్టవధాన వేదనా
సమ్ముద మేర్పరించ గొన సాగగ జూడుమ వాసరేశ్వరీ !

చందాయిపేటలో జెవి
విందగు నష్టావధాన విధ మెరిగింపన్
గొందును పని వాగ్దేవీ !
కొందల పడకుండ గాచుకోవలె నీవే !

ఏను నృసింహరాముడ ననేక సభాస్థలులన్ భవత్కృపా
నూనతరాత్మ నిర్భరత నూల్కొన మందిర మొందునీకు, ని
ర్మాణమొనర్చు పూనిక నిరంతరమున్ శ్రమియింతు నిట్టులో,
జ్ఞాన సరస్వతీ ! సుజనసంగతితో ధనసంగతిన్గనన్

**(84వ అవధానం - చందాయి పేట )**

శ్రీ విద్యామయమూర్తి, కావ్యరచనాశ్రీశోభి హస్తాంబుజా !
భావాతీతమనోభివాంఛితసుఖప్రాకామ్యసంధాయినీ !
సౌవీరాంజని ! కచ్ఛపీ ధృతకరా ! శాంత స్వరూపా ! పరా !
కావన్ ర మ్మవధాన వేదిక నిరాఘాటంబుగా శారదా .

ధాటీ పాటిత వాటికా గిరి తటిద్ధారా కుటీచార్భటీ
చేటీజాహ్నవి కెందు సాటియన, సంశ్లిష్టాష్ట శిష్టావధా
నాటోపస్ఫుట ఛోటికా పరిమిత వ్యక్తాశు పద్యక్రియో
ద్ఘాట ప్రజ్ఞ బయల్పడన్ ననుగృపన్ గాపాడు వాగీశ్వరీ .

**(85వ అవధానం - నాచారం)**

అందము లందగించు భవదచ్ఛ విలాస మనోజ్ఞవైభవ
స్పందన సర్వభక్త సదుపాసన సద్విధి నాత్మనెంచి, నీ
మందిర మద్రిముద్రిత సమంచిత రీతి ననంత సాగర
మ్మందు శ్రమించి కట్టుటకు నాజ్ఞనొసంగితి వాసరేశ్వరీ .

అర్ధంకి నిలిచి యవధా
నోద్దండ విబుధ సమక్ష మొప్పగ సభలో
నిద్ధపుయశ మీ వమ్మా !
ఒద్దిక నర్ధంకు లెడపి యోవాగ్దేవీ !

మును రెడ్డిరాజులేలిన
ఘనసీమయు, నెల్లనాది కవిపోషక మీ
యనువున నష్టవధాన
జ్ఞుని నను మన్నించునట్లు చూడుమవాణీ !

(92వ అవధానం - అర్ధంకి)

కావలసిన దంతయు నీ
కావల కావలసినంతగా నాకీయం
గా వలవదేని నేడీ
కావలి నవధానసభను గావు మదంబా !

జయము గల్గిన నాకపజయము గల్గ
వంత యొక్కింత లేదు. కాపాడు బరువు
నీది యైనప్పు డింక జింతిల్ల నేల ?
అభయ హస్తంబు జూప నా కదియ చాలు

(కావలి - 93వ అవధానం)

సత్కవితాభిమానమున జాలినయంత సరస్వతీకృపన్
సత్కృతి సప్త సంతతుల జాలితి, జాలితి మిమ్ముబోలి వి
ద్వత్కవి వర్య పృచ్ఛకవితాన నితాంత రతాంతరంగ రం
గత్కమనీయ భావనల కమ్రవధాన విధాన సాధనన్.

యాచనసేయ మానసమునందు విభీతి యొకందు మాత్రమే
నీచ మటన్న భావన గణింపను గాని, సభాముఖమ్మ్ముగా
దోచిన యంతయుండని బుధుల్ గనగోరెద వాణి ! నీకు భ
క్త్యాచరణంబుగా గుడికి నంచిత రీతిని గూర్పుమంబరో!

పనియా నీది? ధనార్జనమ్మునకు నిర్వాహమ్ము సర్వమ్ము నీ
పని, యాచింపగజేసెదో? హృదయ సంస్పందమ్ము కల్గించి బా
పని యార్తిం దొలగించెదో? సకలము న్భారమ్మునీదే, చలిం
పని యాన మ్మిడుమంబ ! చాలు విబుధవ్రాతమ్ము దీవింపగాన్
**(నిజాంకాలేజ శతజయంతి, హైదరాబాద్, 94వ అవధానం)**

సకలమ్మిచ్చెద వస్మదీయులకు, నిష్ఠా శిష్టభక్తాలికిన్
శకల మ్మిచ్చెద వార్తలోకమునకున్, సంపూర్ణ విజ్ఞాని కా
త్మకళావైభవమిత్తువంట, మరియాదంగొల్చు మా బోంట్లకున్
వికల మ్మిచ్చెద వేమి కారణము దేవీ! వాసరాధీశ్వరీ !
**( 96వ అవధానం - కోహీరు)**

గుడి నీకొక్కటి గట్టు కోర్కె మది సంకోచింపక న్నీవు వెం
బడి రా దాతల మానసంబులు గరంప న్నీదు భారంబుగా
నడుగే వైచుచు వచ్చుచుంటి నవధానాయాసలబ్ధార్థ మి
బ్బడిగా నెంచుచు వెచ్చ బెట్టుదు సభాప్రాశస్త్యము న్గార్చవే
**(97వ అవధానము - వెల్దుర్తి )**

ఏలీలన్దరియింతు బండిత సమూహేచ్ఛా విహారాపగన్
గాలింపంగ బదాలు చిక్కని యెడన్ గష్టంబుతో నాపగన్
బాలింపంగ నన్నార్ద్రచిత్త వయినన్ భావ్యంబె? ఈ పెద్దచె
ప్యాలన్ మూకుట బేల గింజనయినన్ బాగుండునే భారతీ !
**(98వ అవధానం - పెద్దచెప్యాల)**

నాయందెంతటి ప్రేమ యొక్కో? గతజన్మంబందు పుణ్యంబు నే
జేయం జాలిన దెంతయో? బుధులు మున్నేయంగలే కస్మదీ
యాయోగంబొ? వదల్చినారు గుడి నీకైకట్టు కార్యంబు, నా
పై యజ్ఞక్రియ నిర్వహింతు జననీ, ప్రజ్ఞంబ్రదర్శించుచున్

నీయాయంబడి నట్టిదెల్ల విధిరాణీ ! నీకు నర్పింతు, నా
కాయాసం బది యెంత గల్గిన బుధాహ్లాదంబు చేకూర్చు వాం
ఛాయోగంబు నవావధాన గరిమన్ స్పందించు ఛాత్రాళి రా
మాయంపేట సభా స్థలంబున దగన్ మర్యాద కాపాడవే !

(99వ అవధానం - రామాయంపేట)

శ్రీకారమ్మెట్టు చుట్టినానొ? కవితాశ్రీచెల్వు మీరంగ, దే
వీ! కారుణ్య మదెంత మేరయొ యొనర్పింతే శతాష్టావధా
నైక ప్రజ్ఞ బయల్పడన్ సుకృతిగా నీరీతి సారస్వత
స్వీకారమ్ము సరస్వతీ నిలయదీప్తిన్ మించ భావించితే ?

అవధానమ్ముల బారితోషిక మదెంతైనన్ స్వకార్యమ్మునం
దు విచారించక దేవి కాలయముకై తుష్టిన్ సమర్పించి మ
ద్భవ సార్థక్యము నెంచి చిత్తవికల స్థాయిన్ జయించంగ నే
లెవచోదేవి నిరంతరాయముగ, దల్లీలన్ బ్రశంసించెదన్

(100వ అవధానము - నార్సింగి)

నీవే సర్వ మటన్న నమ్మకముతో నిండారు భక్తిన్నినున్
భావింపన్ గరుణామృతామల పదాపాంగప్రసాదమ్మునన్
గావన్ రా బ్రతిశబ్ద సమ్యగతులాకారార్థసంపత్తియై
నైవేద్యం బవధాన కావ్యకలనా నందమ్ము వాగీశ్వరీ !

(101వ అవధానము - సిద్దిపేట)

ఎంతటి శక్తిహీనునిపయిన్ గృపయుంచి సమస్తశక్తిధీ
మంతుని జేయు శక్తి ! కలమాత్రము దోచు దయార్ద్ర బుద్ధి, ను
న్నంత భవన్మనోజ్ఞనిలయంబును బూర్తి యొనర్చితిన్ బ్రతి
ష్ఠాంత సమస్త కార్యమున కంజలి చేసెద వాసరేశ్వరీ !

**(103వ అవధానము - తడకవల్లి)**

శక్తియొసంగినంత ధనసంచయమున్వొనరించి స్వాప్నిక
వ్యక్త గిరి ప్రదేశమున నంచిత రీతి భవ న్నివాస మా
సక్తిని గట్ట జాలితిని. సర్వమనోజ్ఞముగా బ్రతిష్ఠ శా
స్త్రోక్తవిధిన్ వెలార్చ గృపనుంచుమ నాపయివాసరేశ్వరీ !

**(104వ అవధానం - సిద్ధిపేట )**

నీవు నదీమ తల్లివయి, నిండిన ప్రేమను దల్లివై వచో
దేవిగ నప్రశస్తులను దేకువ జేసెదుగా బ్రశస్తులన్
భావమునందు నిండిన కృపామయి! యెయ్యది సేయ మంచి సం
భావితమౌ తెరంగు నను బాలనసేయుము వాసరేశ్వరీ !

**(105వ అవధానము - అర్. బి. ఐ)**

గుడి సంపూర్తియొనర్చగోరి, సభలన్ గొల్చి, వధానంబు లం
దొడి చాపంగ, రసజ్ఞు లిచ్చు కతనన్ యుక్తంబు గావించితిన్
గుడి సంపూర్తి యొనర్చి నేడు తొలుతన్ గొల్చి వధానంబుసే
యుడు నన్ధన్యునొనర్చు మంబ ! కరుణాయోగంబు దప్పింపకన్

గెలుపు నోటమి నాదిగా దలుపు సొలుపు
లేక యుండంగ నీగుడి లేచె జాలు
బలుకుపలుకున దోడయివరలు చుండి
చూచుకృపనీది ! నిశ్చింతచొప్పునాది

**(106వ అవధానము - సిద్ధిపేట )**

శ్రీరామరామ జపయ
జ్ఞారామము జోగిపేట సభ నవధాన
శ్రీరక్షించుముతల్లీ !
సారతరాశుప్రబంధచతురోక్తిమెయిన్

దేశమ్మున మూడవ విని
వేశమ్మన బుస్తకాక్ష వీణాధరివై
ఈశిత్వవశిత్వమ్ముల
కాశయఫల సిద్ధి గూర్చు మష్టవధానిన్
(107వ అవధానం - జోగిపేట)

అవధానంబులతో సరస్వతికి నై యాచించి దేవాలయ
ప్రవిధాన మ్మొనరించు నాశిషము నాపై నిండి సంపూర్ణవై
భవమున్ గూర్చు గురుత్రయమ్ము కరుణాపాంగమ్ము లంజూడగా
నవధానం బొనరింతు పాలెము సదస్య శ్రేణి మోదించగాన్
(108వ అష్టావధానము - మహబూబ్‌నగర్ పాలెం )

ఏమహిమా విశేషమున నింగిత మేర్పడి పండితుండగున్
బామరు, డెట్టిమూగ భువి వాగ్మిగ మారు, ననంతధీబల
క్షేమము బొందు, మందు డవధి గ్ననబోని కృపారసంబు నా
పై మునురై వధానమున వాగ్భవబీజము నాన్చు మంబికా !
(109వ అవధానం - రిమ్మనగోడు)

ఈనరసింహరాముని గవీశునిగా నవధాన వాక్కళా
నూనతరాశు సత్కవన యోగమునిచ్చు సరస్వతీ ! పరా
ధీనవచో వినిర్గత సుధీప్రకటాద్భుతధారనిచ్చి, స
న్మానము గూర్చి, ఖమ్మము జనస్థలిబ్రోవుమ రాముపెండిలిన్
(110వ అవధానము - ఖమ్మం)

ఏ తంత్రి నెపుడు మీటెదొ?
స్వాతంత్ర్యము నీది తల్లి ! పరమునొనర్చన్
చేతం బెపుడొప్పునొ? న
న్నీతరి నవధానమందు నేలిన జాలున్
(111వ అవధానము - కొల్లాపురం)

నీమధురాధరామృతము నిండుగ గ్రోల దలంచి ధాతయే
మోమును జిన్న బుచ్చుటకు బోలక నంతము లేని చింతతో
దా ముఖ మొండుగా సలుప దప్పదొ? నిన్జతురాస్యచేయుటో?
ఏమియు దోచకుండ దపియించగ జేసెడు నిన్ను గొల్చెదన్
(112వ అవధానమ - సిద్దిపేట)

పదముల్పట్టిన యర్థ మిచ్చెదవు, భావంబెల్ల గూఢంబుగా
నెద లో లోపల దాచి యుంచెదవు. వాణీ ! వాని భాగ్యమ్ముగాన్
బదవుల్ గూర్చెద వంతరాంతర సుషుమ్నామార్గ సంచారవై
హృదయాధిష్ఠిత వయ్యె దూర్జిత యశశ్శ్రీ లక్షితా లక్ష్యవై
(113వ అవధానము - రవీంద్రభారతి - హైదరాబాద్)
(మొక్కినచో ధనమిచ్చెదవు - పదములు పట్టినచో అర్థమిచ్చెదవు)

వాక్సిద్ధి గోరి నే స
మ్యక్సంయమినై తపో నిమగ్నుడ నైనన్
వాక్పతి ! నీగుడి గట్టగ
ప్రాక్సత్ఫలమీయ-నీవు భావించితివే
(114వ అవధానము - కేంద్రవిశ్వవిద్యాలయం-హైదరాబాద్)

అడుగడుగున నడయుడుగుట
కడుగడు నిడుములనుగెడపి గడకొను చడలన్
మిడిమిడి తెలివిని నిలిచిన
బుడుతడి! అడగెడు నెడలను బుద్ధి నిలుపుమా !

(115వ అవధానము - సిద్ధిపేట)

జపమాలన్ధరియించి మౌనమున నైశ్చల్యాను సంధాన స
త్తపమున్ జేసెడు పోల్కి నిల్చితివి మాతా. మామకీనార్తి నీ
కృపలేకుండ శమించునే ? సదమునన్ బృచ్ఛించు నీపండితా
తపమున్ నీడగ నిల్వ నిన్ను గొలుతున్ దాత్పర్యసంసిద్ధికై

పలికిన పలుకు పలుకులో
బలుకు గలుగు పలుకుబడిని పాలింపుమ, నా
పలుకున దలపున, బనిలో
నిలిపెద నిను సతము మాననీయత వాణీ

నూట పదా రవధానము
లౌట ముదంబయ్యె నేటి కంబ కరుణచే
వాటివలననే దేవళ
మౌట జగమ్మెరుగు సత్యమౌట ముదమ్మౌ

(116వ అవధానము - సిద్ధిపేట)

ప్రచురంబౌగతి నాంధ్రదేశమున భారత్యాలయశ్రీని ని
ల్పుచు బెక్కష్టవధానముల్ సలిపి సంపూర్ణంబు గావించితిన్
వచసాందేవి కృపామహత్త్వమున సభ్యశ్రేణి మోదించగా
మచిలీపట్నమునం గృతార్థునిగ నన్మన్నించు భాషేశ్వరీ !

(120వ అవధానము - మచిలీపట్నం)

మది నిశ్చింతగనుందు నీసదము నమ్మా . భార మీవంచు స
త్పద సంపత్పరిపూర్తి సత్కవనవిద్యా కల్పనా చాతురీ
హృదయావిష్కరణమ్ముల్తో, సభికమోదేచ్ఛన్ వచోభామినీ .
తుదిమెప్పించెదొ? నోవు గూర్చెదవొ? పుత్రున్పాత్రుగావింతువో?
(121వ అవధానం - జగజీవన్‌రాం కళాశాల. హైదరాబాదు)

అక్షరవైన వాణి ! పరమాస్తికబుద్ధిని భూర్భువస్సువ
స్త్ర్యక్షర వైన నిన్గొలుతు, నగ్ని మఘోన రవి ప్రకాశసం
ధ్యక్షర మూర్తివై హృదయమం దధివాసమొనర్చి వాగ్విలా
సాక్షర సంపదభ్యుదయ మష్టవధానము బ్రోవవేడెదన్.

పదముల పట్టులేక రసభావనిరూఢి పొసంగనీక, వి
ద్వదమల మోదమీయక పదంపడి సాగు కవిత్వ రీతులన్
వదలిరసజ్ఞసమ్మతి, సభాసద తృప్తివిధావధాన సం
పద వెలయించి ప్రోవుమ కృపన్ బరమేశ్వరి ! వాసరేశ్వరీ !

అవధానమ్ముల లక్ష్యసిద్ధియయి భవ్యక్షేత్రమేర్పాటు సం
స్తవనీయమ్ముగ నీకృపా మహిమచే సాగెన్గదా! ఇంకనే
నవధానంబుల మానివేయదగు నంచాలోచనన్జేయగా
నవునంచొప్పెడు దాక బట్టు విడడమ్మా ! నేడు శ్రీవేంకటే
శవిశుం డీతనికిన్ శతాయు విడుచున్ స్వాస్థ్యంబుగా జూడుమా !
(122వ అవధానము - సిద్ధిపేట)

ఈంకార ప్రణవాతి గుహ్యతమ వాగీశీ! అనుస్వారిత
త్వోంకారాకృతి . భూర్భువస్సువలు గా నొప్పారు త్రివ్యాహృతుల్
హ్రీంకారానల తేజమందు సతతశ్రీంయుక్తి చెన్నారగా
నైంకారప్రధమానశక్తి ! అవధానాంతః కృపన్ మించుమా !
(123వ అవధానము - స్టేషన్ ఘనపుర్)

అవధానవ్యవధాన హీనకవన వ్యాసంగ నిస్సంగిగా
నవు నంచెంచని దేవళంబును నిరాయాసంబుగా బూర్తిగా
స్తవనీయంబుగ గూర్చు కొన్నజననీ ! సభ్యానుమోదక్రియా
ప్తవధానంబున నన్గృతార్థు బొనరించన్ జూడగా గష్టమా?
(124వ అవధానము - చేర్యాల)

నూటా యిరువది యైదీ
నాటికి, విరమించ దలచినాడను కవితా
పాటవమున నీయాలయ
మౌట గృతార్థుడను దేవి! అనుమతి నిడవే !

పలికిన పల్కు పల్కున నపార రసప్రచురాభిరామ ని
స్తులమహనీయ భావ పరిశుద్ధి, రసజ్ఞ మనోజ్ఞ వాక్య సం
తులన చమత్కృతుల్ కవనధూర్వహమై వెలుగొందు నమ్మరో
కొలతల కందబోని కృప గూడగ బచ్చనపేట సత్సభన్

నలువకు ముద్దుటాలివయి నాల్కపయి న్నివసించి యుండి, ప్రా
బలుకుల తల్లివై, దుడుకు వారికి మించిన యాతతాయికిన్
బలువల కిత్తు వాక్పటుల వాదన శీలత, నిన్ను నెమ్మదిన్
గొలిచిన వారి మౌనులుగ గూర్చెద వెంచగ వాసరేశ్వరీ !
(125వ అవధానము - బచ్చన్న పేట)

ఇసుమంతైన భవత్కృపారసము నాకీయంగ, నీ యంగరా
గసుమాభ్యంజన తైలమర్దనకళా కార్యాంగ సద్వాసనా
ప్రసిత భ్రామరికా ప్రమోదమున సాఫల్యంబు నాజన్మకున్
కుసుమాసీన సరస్వతీ ! సభను లోకుల్ మెచ్చుగా జేయుమా !

అడిగిన దెల్ల జెప్పుటకు నాచిన పగ్గె నొసంగినంత బో
లెడు సిరు లిచ్చినట్లగునె? లెస్సయశం బొనగూర్చు వాక్కులం
దొడబడు నర్థ మాధురి మహోన్నత భావనిగూఢ గాఢ ధీ
నిడ గయికొన్న గాని పరమేశ్వరి ! ఈ సభ నన్ను దేల్చుమా !
(126వ అవధానం - సికింద్రాబాదు - వాణీనగర్)

శ్రీ సారస్వతబీజ మూలనిలయా ! శ్రేయఃఫలామోద వి
ద్యాసాంగత్యవివేక యోగబల మేధా ధారణోద్ధారణా
భ్యాస శ్రద్ధల నిచ్చి మాదృశుల బ్రోవ న్మాతృవాత్సల్య వి
న్యాసంబుం గయిసేసి నన్ఋషిగ జేయన్గోల్తు వాగీశ్వరీ !

నేగుడికొరకైయేతగ
సాగుదునవధానసభల సత్కృతిగననీ !
చేగుంట మదభిమానము
సాగుత చిరకాలమంబ ! సత్కరుణమెయిన్

అమ్మా!నెమ్మది నిన్ను నమ్మ సకలంబందించు దీవంచు ధై
ర్యమ్ముస్ వమ్మొనరించబోని తప మశ్రాంతమ్ము విశ్రాంతి లే
కిమ్మాడ్కిన్ దగ జీవితమ్ము నిఖిల మ్మిడ్చంగ సేమమ్ము నా
కిమ్మా ! తమ్మి కొసంగు పాదతల మందిమ్మా! ఋషిత్వమ్ముతో

నీరూపమ్ములు ఛందముల్, సకల వాణివ్యక్త భావస్ఫురత్
ధీరాగ ప్రవణమ్ముగా, హృదయ వాగ్విన్యాను సంధాన గా
నారూఢిన్ గొలువంగ నిమ్ము, దయ బ్రహ్మ భేదమౌ త్వత్ప్రధ
శ్రీరంజిల్లగ నీవధాన సభ నాశీర్వాదముల్ గుప్పుచున్
(127వ అవధానము - చేగుంట )

ప్రతిపదభాసమాన రసభావ నిరూఢి రసజ్ఞమోదనా
శ్రితహిత సాహితీ సమర రీత్యవధాన విధాన మొప్పగా
చతురవచః ప్రసంగవిలసద్బుధమండన సాధువాదనా
ప్రతిమముగా జెలంగునటు ప్రార్థన సేసెద వాసరేశ్వరీ !

మహిళలలో వధాను లోక మాదిరిగా గనిపించకుంట నీ
మహి నొక లోపమంచు పలుమారు విచార మొనర్చు చుండు, ద
ద్విహృత విలాసపూరిత కవిత్వ వికాసరసప్రపంచ ధీ
మహిత వధాన మెల్లెడల మండన మౌనటు లంబ గొల్చెదన్

**(128వ అవధానం ఆర్.బి.వి.ఆర్ మహిళాకళాశాల,**
**హైద్రాబాదు)**

విషమ సమస్యలన్ బ్రతుకువేదన, నీదగరాని సంసృతి
త్రిషవణలీల బంధుర పరీక్షల దత్పరమార్థ తత్వ త
ద్విషధి దురంత చింతన గతిం బరమాత్మను గాంచలేని నన్
బుషిగ నిరంతరాయముగ నేలుమ వాక్సతి ! సాధనమ్ములన్

పరహిత యోగజీవన విపాకముతో బర తత్వసాధనా
పరపరమార్థసంగతి విపన్నతలేక రహించురీతిగా
కరుణ యొనర్చు మమ్మ ! పడిగాపులు సర్వము నీతపస్సుగా
నిరతనృసింహ రామజననీ ! వచసాంజననీ ! సరస్వతీ !

నీగుడికట్టు లక్ష్యము గణించగ బూర్ణముగాగ, దృప్తితో
సాగుపదార్చనా విధిని శక్యము గా దవధానమంచు గ
ల్పాగము వంటి దాని విడనాడితి, నంబిక! నే డుగాదిగా
నీగతిజేయ జేసితి వభీష్టము నీయది వాసరేశ్వరీ !

అవధానమ్ములు చేసి జ్యోతిషముతో నర్థంబు సాధించి, య
వ్యవధానమ్ముగ వృత్తిచేసి భవదీయారాధనాదీక్షతో
స్తవనీయంబుగ దేవళం బొకటి యుద్యద్రీతి నిర్మింపగా
నవశక్తుల్వికసింప జేయు జననీ ! నన్నేడు పాలింపవే

ఏదీ?నీదయ శారదాంబ ! కవితాహేలా విలాసస్థిరా
మోదంబొప్పగ మద్వధానకళ నామోదింపగా జేయుమా !
కోదాడంగల సద్రసజ్ఞులను సూక్తుల్గూర్చి భావాబ్ధిలో
నీదాడం గల సన్మనోహర గతిన్ హృష్టాంతరంగమ్మునన్
(132వ అవధానము - కోదాడ - 18.3.1999)

కరుణా పరురాలవుగా
కరమరుదగు వాక్కులిచ్చి కాపాడగదే !
సురసేవ్య సదాచరణా !
చరణాంభోజాత విజిత సర్వాభరణా!

ఈ రాజేశము సభ్యవర్తనుడు, లక్ష్మీశానుకంపామయుం
డై రాజిల్ల గనిష్ఠుడై (నిష్ఠుడై) సుకవితావ్యాసంగితాష్టావధా
నారూఢి న్జరిపించ గోరిన నవాక్కై, దాని మన్నించి, నీ
కారుణ్యమ్మును నమ్మి వచ్చితి సభన్ గాపాడు వాగీశ్వరీ !

నీకైయే యవధానముల్ సలిపి వాణీ ! నిన్ను నిల్పంగ నే
నాకామ్యంబుల దేరెనంచు నవధాన త్రాసము న్మానితిన్
సాకల్యంబుగ నిన్ను నమ్మిన ననున్ జాలంచు నీవన్న నే
గాకన్మానగలానె? తప్పదిటులన్ గాంక్షించు వారుండినన్
(133వ అవధానం - సిద్ధిపేట)

ఈ సిరిసిల్లపట్టణమహీస్థలి నష్టవధాన సత్సభన్
వాసిగ దొల్తగా సలుప వచ్చితి బండితులెల్ల మెచ్చగా
గాసి తొలంగజేసి ననుగావుమ శారద! నేటి ఈ సభన్
వాసవ దేవ ముఖ్య గణవందిత పాద సరోజ!మ్రొక్కెదన్

(134వ అవధానము - సిరిసిల్ల)

మానిన మాననీయ వసమానదయాగుణ భాసమాన స
న్మానస మాననీయ ! జన మాన్యత గూర్చుమ సిద్దిపేట, నా
కూనిక సర్వవిద్యలకు నూహయెతింగిన నాటినుండి, మ
న్మానసమందు నిల్చిన సుమా ! యికనేమిటి నాకు? భారతీ !

అవధానంబులు చాలు నంచు మదిలో నాశించియున్నాను, స
ర్వవిధానంబుల వృత్తి జూను నెలతో బర్యాప్త మౌచుండె, మీ
రవధానం బొనరించ దప్పదను మిత్రాపేక్ష నిర్వక్రమై
అవధానంబును జేయు చుంటి జగదంబా ! కావవే నన్నిటన్

అవధానసభను గూర్చుట
నవధా వివిధావధాన నవ్యవిధాన
వ్యవధానహీన జీవన
మవధారణ జేయ జేసి తంబా! నాకున్

(135వ అవధానం - సిద్ధిపేట - 5-4-2000 )

నీపనియే ముఖ్యముగా
దాపము సంతోష మొకటి దయగా బ్రతుకన్
జూపిన తల్లీ ! శారద !
ప్రాపయి యవధాన మందు బాలించగదే !

సవ్యముగా సమస్తమును సాగెడు నట్టుల జూడు మంబ! నా
కవ్యయ భావనా బలవిహారమొనర్చెడు శక్తినిచ్చి సా
చివ్యము నీదిగా సభను సిద్ధమొనర్చుము, మత్కవిత్వమున్
శ్రావ్యముగా వరంగలు రసజ్ఞులు మెచ్చగ వాసరేశ్వరీ !

**(136వ అవధానం - వరంగల్లు )**

పలికిన పల్కుపల్కున నపార ముదంబొనగూర్చి సభ్యవ
ర్యుల హృదయంబులం దనుపు నూర్జిత సత్కవితావధాన మి
మ్ముల బరమేశ్వరీ కృప విమోహితులం బొనరించునట్లు న
ప్పలుకుల దేవి చూచుత, సుపర్వ సుధూర్వహభావసంగతిన్

శివ చిదానంద భారతీ శ్రీచరణుల
చరణతీర్థము త్రిపథగావరణ మగుచు
కవిత జాల్వాఱ ఒంగోలు కవులు బుధులు
సరసులానంద సరసుల స్నానమాడ
పలుకవే తల్లి ! పలుకుల కులుకులెల్ల

**( 137వ అవధానం - ఒంగోలు)**

శృంగేరీపుర దక్షిణాగమ లస చ్ఛ్రీ పీఠ సత్పాలితా
భంగ ప్రాంగణ మీ యనంతపుర భవ్యస్థాన మందీ వధా
నాంగ శ్రీకవితా ప్రఖేలనము సభ్యామోదమై యొప్ప స
ర్వాంగీణమ్ముగ శారదాంబ కనగా బ్రార్థింతు నశ్రాంతమున్

నీకై క్షేత్రము నిల్ప నీకరుణతో నిర్ఛిద్ర సద్దీక్షతో
సాకల్యంబు ననంత సాగరనగ స్థానంబును ద్దీర్చి, భ
క్తాకూతి ప్రచురమ్ముగా శ్రమను నీ యష్టావధానవ్యథన్
బ్రాకామ్యంబుగ గొంటి ధన్యునిగ నన్పాలింపవే శారదా !

మును నాచాద్రిని శంకరార్యమతమున్ బొల్పారగా జేయవ
చ్చిన శృంగేరి జగద్గురు ప్రభువర శ్రీభారతీతీర్థ స్వా
మిని మెప్పించితి, బందరున్ సదమలామేయాశిషవ్రాతమున్
గొని ధన్యాత్ముడ నైతి, సన్నిధిగ నేగొందు న్సభ న్నేడిటన్

గండ్లూరి వారు కవితల
జెండ్లాడెడు వార లధివసించిరి సదమున్
ముండ్లాట యీవధానము
తండ్లాడుట లేక దేవి దయజూచు దమిన్

**(138వ అవధానం - అనంతపురం)**

కవితల కాణయాచియయి గ్రాలిన పట్టణ మీ విశాఖలో
నవకవితావధానము ననంతవిధమ్ముల శ్రోతృమోద ము
త్సవము దలిర్చు నట్లుగను, ధారయు, ధోరణి, ధైర్యధారణల్
సవదరియించవే జనని శారద! శారద పర్వ మొప్పగన్

పలికిన పల్కు పల్కు రసవత్తరమై శ్రుతిపేయమై, మహో
జ్జ్వల కవితామనోహర సుసంగతమై, గతకాల సత్సభా
కలిత కళావిలాసమయ గౌరవ భాసురమై యెసంగగా
లలితవచః ప్రఫుల్లగతి లాలన చేయ మదంబ! మ్రొక్కెదన్

**(139వ అవధానం - విశాఖ)**

ఎంతటి విద్వదగ్రణుల కేని భవత్కృప యింతలేనిచో
చింతదురంతమై కవన సిద్ధి లభించుట వింత వాక్సతీ !
స్వాంత మనంత చింతన విభాంతనిరంతర మెంతకాక, మో
దాంతనిరంతరాయ కకుబంత యశం బిసుమంత సొంతమౌ

కాకితమున్గలంబు గొని కాని కవిత్వము రాక యెట్టిటో
గీకి, రసప్రసృష్టికయి కేవల మావలివారి భావనల్
సేకొని, రంగులద్ది కయిసేయుట మాత్రము సేయువారలన్
గాక, జగద్ధితంబు కవి కామ్యముగా దయసేయు మంబికా !

**(వరంగలు - 140వ అవధానము)**

పలికిన పల్కు పల్కు రసభావ పరంపర సొంపు నింపు, నిం
పుల బులకింతలింతలుగ బోషణ సేయగ, సభ్య మోదనం
బుల గలిగించు తృప్తి మనము స్తనువు న్క్రియ నిండ జూడుమో
పలుకుల తల్లి ! మా తెలుగు బాసయు హేలన పొందకుండగన్

**(తె. వి. వి. హైదరాబాదు - 141వ అవధానం)**

అవధానమ్ముల నెన్ని చేసితినొ? మాయమ్మా! త్వదీయాలయ
ప్రవిధానమ్మునకే సమర్పణముగా రాజిల్లగా జేసితిన్
కవిగా వానికి ముద్రణం జరుపు యోగం బబ్బె నీనాటికీ
యవధానంబున నన్ గృతార్థునిగ జేయన్వేడదన్ భక్తితో

**(142వ అవధానం - చిన్నకోడూరు)**



# నుతపరదేవతా

కరుణాకల్పక వల్లి ! భక్తజనసంఘప్రీతికృద్దీక్షితా!
కరవిభ్రాజిత తీవ్రశక్తి విలసత్ కౌక్షేయకా! మాధురీ
భరవాచారమణీయ దివ్యవరదా! భద్రాత్మికా! రేణుకా!
పరిపాలించుమి సిద్ధిపేట నను విద్వత్సత్సభా స్థానమున్

రేణుక! మామకీనకృతిరీతిని బాయక నీవధానమన్
శాణము నందు నన్ను గయిసాచి యనుగ్రహముంచి వన్నెరా
శ్రీణితుల న్వొనర్చుమి పరీక్ష యొనర్చు సదస్యవర్యులన్
ధ్రాణ యొసంగు మో జనని! త్రాసము దీర్చుమి వత్సలత్వమున్

నీకరుణాకటాక్షనవనీత మొసంగి, సదా నతప్రేమో
ద్రైకగుణామృతాత్మవయి తల్లి! వసించితి సిద్ధిపేట, నే
కైక శరణ్యమీవు భయ మెల్లెడ దీర్చి కృతార్థు జేయుమీ
నీకు నమస్కరింతు సభ నిండుదనంబు మనంబునిండగా

**(3వ అవధానం - సిద్ధిపేట, రేణుకా దేవస్థానము)**

పాదాంగుష్ఠనఖ ప్రభాళి ప్రతిబింబ స్ఫూర్తి దర్శించి, ఆ
మోదోన్మేదురచిత్తయై యవనతాంభోజమ్ముపో ల్జానకీ
శ్రీదేవిస్వగళమ్ము సూత్రమున వర్తిల్లంగ విభ్రాంతితో
గోదండోద్భిద రాజదర్ప నృపముఖ్యుం గాంచి నన్నోముతన్

నతసీతా వదనాంబుజాత జనితానంత ప్రభా దర్శన
స్థితి కల్యాణ సమాగతాఖిల నృపా సీనత్వ వైస్తృత్యభా
స్వత తేజోధి శిరస్స్రవద్విమల రాజన్మౌక్తికవ్యక్తతా
న్వితి కౌతుహలి రామచంద్ర. అవధాని న్నన్ను గాపాడుమా !

శ్రీమహితంపు గోసల వసించుటకన్న, బ్రియాత్మమాతృ సు
శ్రీమది గాంచుకన్న, దన జీవన మేయగు పత్నికన్న, శ్రీ
రాముడు సర్వమంచు వెనురాగ ననుజ్ఞను గోరు లక్ష్మణ
స్వామికి నంజలింతు నవిషణ్ణత నష్టవధాన సిద్ధికై

**(11వ అవధానం - కొండపాక - కోదండరామాలయం)**

నిలిచిన తావు సౌఖ్యముల నింపుచు నుండు యథేష్టకాలమున్
పిలిచిన పిల్పు జీవన నవీనపథాశయ దృష్టకాలమున్
గొలిచిన కొల్పు కోరికల గుంపవధాన విశిష్టకాలమున్
దలచిన విఠలేశ్వరు పదంబులు బ్రోచెడు అష్టకాల మున్
(నష్టకాలమున్)

శ్రీరహి మించు విఠలువసించు మనోజ్ఞతలంబు సాహితీ
శ్రీరతి నీపురమ్మున వరిష్ఠత గాపురమైన కాసుల
శ్రీరఘురామశర్మ నను బ్రీతిని బిల్చెను గార్తి కోత్సవ
శ్రీరమణీయ వేళ విరచింపుమ! నీ యవధానమం చిలన్

అవధానం బిది క్రొత్తగాదు, సఫలం దామోదమా రాక పో
దు, విరించి ప్రియ యండ నుండ, బుధులందుం హార్దికం బొప్పద
న్న విచారం బిసుమంతలేదు. మరి శంకాపంకిలోద్విగ్నమౌ
చవురా! మానస మెంతచంచల, ముకుందా! మోదమున్నింపరా

**(12వ అవధానం - మాసాయిపేట)**

నగజామానస పంకజాత మకరందా! దాస సంపూజ్యమా
న గజాస్యా! గణనీయ విద్వదనుసంధాన క్రియాశీల! ఈ
జగదేవ్‌పూరున జూనియర్వరకళాశాలామహోదర్కు లా
నగ జారు ప్రతిభావధానసభ విఘ్నుఘ్నుంబుగా జేయుమా .

**(14వ అవధానం - జగదేవపురం)**

గురుకరుణావిశేషమును గోరి రచించెద నేర్పుమీర, నీ
కురు గతి నీవధాన సభ నొప్పగు చంపక మాల నామన
స్సరసిజమందు తేటివయి సన్నిధి సేయగ వేంకటేశ్వరా !
తిరుమలవాస! నీలఘనతేజ! నుతింతు నమస్సుమాలతోన్
**(15వ అవధానము - వేంకటేశ్వరాలయం - సిద్దిపేట)**

సతితోడన్ బ్రణయానుమోద సమయ శ్రద్ధానుకంపాశ్రిత
శ్రిత సంప్రార్థనగా, మదీయ కవితా రీతుల్, వివాహాదర
స్థితి కన్యావదనాంబు జామృత రస స్విన్నాత్మ భృంగమ్ము నే
గతి నావైపున ద్రిప్పనేర్చు ధనురంకా! రామచంద్ర ప్రభూ!

ఎట నీకీర్తన సొగు నచ్చట మురారీ? వాయుపుత్రుండు ని
ల్చుట సత్యంబగునేని, పెండ్లియగు నిచ్చో నీకు నేజేయు ము
చ్చట నందించగ మద్గురూత్తముని నిచ్చ న్నావధానుం బొన
ర్చుట నాభాగ్యము ధన్యమయ్యె గవితాశుప్రక్రియాలక్ష్యమున్

ఆనందంబున బొంగు లెత్తెడిని రామా! మామకానంద సం
ధానంబౌ యవధానమున్ గనుటకే నాసద్గురుండౌ అఖం
డానందు న్నిజదృష్టి యుక్తునిగ జేయన్ గుండె విప్పార్చితీ
వీ నాడందుల కంజలించెదను దండ్రీ! ధన్యవాదమ్ములన్
**(కనులు లేని గురువు గారు కంటి ఆపరేషన్ తర్వాతచూచిన**
**తొలి యవధానము. మాసాయిపేట-16వఅవధానము)**

జీవనదీనిరుద్ధగతి, చెల్వగు సద్వన శోభ, జానకీ
దేవి సమస్య, శైలపద తీక్ష్ణత, శ్రావ్యరవేషుటంకృతుల్
తావి పసల్ పురాణమునిదర్శనముల్ క్రమ రుంద్రసత్పద
శ్రీవనవాసమయ్యెను హరీ! అవధానము దేల్చుమీ యెడన్
**రామాయణగాథతో అవధానానికి శ్లేష -**
**(కొండపాక రామాలయం - 17వ అవధానము)**

తొలుత నవిఘ్న మస్తనుచు దొంగలిపాట్లిడి హైందవేయులున్
దలుపులపైన నిల్పి నిను దల్చియు గార్యనిమగ్ను లౌదు రెం
దుల దులకించు భోగములతో దులదూగదలంచి, వారి, మం
దుల దయ జూడగా గొలుతు ధూర్జటినందన, నందితాగజా!

సిద్ధికిబుద్ధికిన్ బతి వశీకరణైక విధాయకప్రదా
నోద్ధతి మోదకాది పుషితోదరవృత్తి సమస్తజాపనం
సిద్ధిని బుద్ధి సిద్ధిపురి సిద్ధివినాయక! నీమహోత్సవం
బిద్ధర నిద్ధమై యెసగ నిం దవధానము నందు వేడెదన్

**(19వ అవధానం - సిద్ధిపేట-గణేశోత్సవములు)**

మము రక్షింపగ బర్వులెత్తుటకు నీమాంద్యంబు లంబోదరం
బమర న్మూషిక వాహనంబు తగుగా నాటంకముల్మార్ప నీ
శ్రమ గుర్తించితి విఘ్ననాశమున కశ్రాంతమ్ము నీదృష్టి పా
తము మాకండ యగున్ గృపన్ బ్రమథనాథా! చూపవేనీదయన్

మీకున్నంటయి నాకు దంట యయి సుమ్మీ? ఈనిషిద్ధాక్షరుం
డేకాకి న్నొనరించి చిక్కు లిడు, విఘ్నేశుం డితండే యనన్
నాకీ యష్టవధాన శోధనము గంగా నిరరి ణ్యార్మికా
సాకల్యోత్తరణంబుగా నెసగు దీక్షన్ గూర్చు మో శాంకరా!

**(20వ అవధానం - సిద్ధిపేట గణేశోత్సవాలు)**

ఏయమ్మన్ జగదేక మూలముగ భావింపంగ ధీసంపదల్
శ్రేయమ్ముల్ యశమున్ సుఖామలబలశ్రీగల్గు, జెల్వారు దీ
ర్ఘాయు ర్బ్రాహ్మ్యము లన్వహార్చనల సంధ్యావందనామోదనా
గాయత్రిన్ త్రితయీమయిన్ భగవతిన్ గైమోడ్చి ప్రార్థించెదన్

**(23వఅవధానము - బ్రాహ్మణసంఘసభలు-నిజామాబాదు)**





కాలగతిన్ సుఖాకమయ కాలము బుచ్చుచు జీవితంబులో
గాలగతాంతకత్వమున గాతర బుద్ధి మృకండు సూతి లో
కాల గణేయుడైన గతి గాంచి నినున్ శరణంబు వేడితిన్
గాలగళా. కృతార్థునిగ గావుమ వేములవాడ సత్సభన్
**(25వ అవధానము - వేములవాడ)**

కనవైదర్భిని సత్యనాగ్నజితులన్ గాళిందినిన్ జాంబవ
త్తనయన్ లక్షణమిత్రవిందలను భద్రన్ నీవు మెప్పించుచో
గను నీమోహన శక్తి లేశమ నను గ్రాహ్యంబు నాకీ వధా
న నిరూఢిన్ గృతకృత్యతా ఫలము నందన్వేణు గోపాలకా
**(వేణుగోపాలస్వామి దేవాలయం - 27వ అవధానం - వర్గల్ )**

మారారి ప్రియ పుత్రకా  సకల కామ్యశ్రీఫలామోదకా .
తారాధీశ వినిందనాశువచనా ! దంతీశ్వరాస్యా ! ప్రభూ !
హేరంబా ! విమలావధాన కవితా హేలా విలాసక్రమం
బారన్ వేములవాడ సత్సభ సభాహ్లాదంబు చేకూర్చుమా !

కుత్తుక నిండుగా విషము, ఘోరవిషోరగముల్ నగల్, సతీ
సత్తమ చూడమున్ ఘనవిషప్రభవుల్ దలపైవిషంబు ను
వ్వెత్తుగ బారు నేత్రముల నెంచినచో విషమత్వ మీశ్వరా
యత్తము సర్వమంత్రు, విషయాంతర నిగ్రహమిమ్ము శంకరా
(విషము = నీరు) **(28వ అవధానము - వేముల వాడ)**

నీబొజ్జలేకున్న నాబుద్ధి కాసంత
నడచినచో మరి నడువ నీదు
నీవికారపు రూపు నేబొందకున్నను,
వెకిలిలోకము నన్ను వెక్కిరించు

చప్పిడియుండ్రాళ్ల చవిచూడకున్నను
మనసుసాత్విక వృత్తి మరువనీదు
ఏకదంతా ! నే ననేక దంతుడనయ్యు
కరువులో తిండి కాకాంక్ష పడితి
ఎలుకనెట్టులనెక్కెదో ? యేఙ్జినెక్కి
కూలిపోయెద నే గొండ గూలినట్లు
నిన్ను నన్నిట బుట్టించి యున్న నజుని
నిందసేయుట తక్క నేమందు నతని

**(29వ అవధానము - సిద్ధిపేట)**

మనమున జానకీరమణి మాటతలంపునరాగ గుందు రా
మునకు సువార్త దెల్పుటకు భూజకు రాముని గూర్చి తెల్పి, యో
హనుమ కృతార్థతం గనితి వట్టులె అష్టవధాన రమ్యభా
వనలను చూపి పూజ్యతకు ప్రాజ్యతగూర్చుమ నేడు మారుతీ !

**(31వ అవధానం - గోదావరిఖని)**

వనమాలీ! దయామాలి గుండె శిలగా భక్తాళి నిర్వేదనా
వనమాలిన్యము రూపుమాపుటకునై ప్రాల్మాలియున్నావు పా
వన మా లిబ్బివటంచు నమ్మితిమి, సద్భక్త్యాఖ్యభృత్యా! జనా
వనమా ! లీలకు మారు రూపమగు నాభారంబు నీదోహరీ .

**(37వ అవధానం - చిన్నకోడూరు)**

పలుకన్‌లేని యశక్తివేళ గరి గాపాడంగ రాలేదె? చీ
రలు వో మానము గాచుకో నబల యార్తస్వాన మాలించి కొ
ల్లలుగా నేలవె ? నిండు నోలగము వెల్గన్నేడు దుశ్శాసనుల్
పలుకెత్తంగ ననున్ నిరోధము బొనర్చన్ గావవే మాధవా.

ధారావాహిక యైన మత్కవన సద్వ్యోవాహినీవేగ రో
ధారూఢిన్ మునిజహ్నులై నిలిచిరుద్యద్రీతి నీపృచ్ఛకుల్
సారంగా శ్రాంకధరా ! భగీరథ పరి మ్యంబున న్నిల్చితిన్
బారీణున్ బొనరించి ప్రోవు మవధానంబున్ జగిత్యాలలోన్

(40వ అవధానం - జగిత్యాల)

హృదయం బందలి దుర్బలత్వ మపకీర్తిన్దెచ్చు, నార్యత్వసం
పద నాశంబగు, నాక దూరమగు దోపార్థా! విచారించకన్
కదనంబున్ బొనరింప లెమ్మనిన గృష్ణస్వామి ఏతద్వ్యథా
న దిశన్ నన్ను బురోగమింపదగు విన్నాణంబుతో బ్రోచుతన్

(43వ అవధానము - గీతాభవనమౌక్తికోత్సవం - సిద్దిపేట)

నేనరసింహరాముడ ననేక సభాస్థలులందు వాక్సతీ
ధ్యానముతో వధానముల నవ్యవధానత జేసితిన్ సమీ
చీనత గల్గు రామ నరసింహతనీకు, వ్యతి క్రమంబు లో
నూనకనూన గౌరవ బహూకృతి గూర్చు మయా! నృకేసరీ !

ఈ బ్రహ్మోత్సవ వేళలన్ సుకవితాహేలా విలాస క్రమం
బబ్రమ్మె యవధానధీపటిమ దివ్యంబైన లక్ష్మీనృసిం
హబ్రహ్మం బనుకంప జూడదగు లక్ష్యాతీతమై పూర్తిగా
దే బ్రాహ్మీపరదేవతాలయము సందేహమ్ము నాకేటికిన్

తిరుగన లేని నీకృప అదీనుని జేయు నదేమి కర్మమో
తిరుగుమొగంబువెట్టినది తేకువ గ్రిందటియేడు, నేడు నీ
కరుణ కృతార్థుని న్జలిపి కాచితి యాదగిరీశ ! శ్రీనృకే
సరి ! సరిలేని లీలల లసద్గతి బ్రోచెదు భక్త కోటులన్

(47వ అవధానము)

శ్రీ లక్ష్మీనరసింహదేవస్థానము - యాదగిరిగుట్ట)

శ్రీరాజిల్లు మహామహిమ్ను పద నీరేజద్వయారాధనా
పారీణ ప్రణుతి ప్రియా ! గిరిసుతా ప్రాణేశ్వరా ! ఈ వధా
నారంభస్తుతి సమ్ముదాత్ముడవుగా నన్నింట బాలింపుమా !
పూరింపన్వలె లోపమున్నను స్వయంభూ సిద్ధరామేశ్వరా !

పౌరాతన్యము నేచికొన్న దిలలో స్వామీ! భవన్మంగళా
గారం బిచ్చటి భిక్కనూరి తలమున్ గామ్యార్థ సిద్ధిప్రద
శ్రీరామేశ్వర భక్తలోక కరుణా శ్రేయఃపదం బౌ చిలన్
బూరించన్వలె లోపమున్నను స్వయంభూ సిద్ధరామేశ్వరా !

శివమెత్తం దగినట్లు తాండవము నాశించన్ గృపాళూ ! పున
ర్భవ కష్టంబును బాపగోర, సహియింపన్ స్థాణువైయున్న దు
ర్భవ జంజాటము బాపు జంగముగ నిన్బ్రార్థింతు నశ్రాంతమున్
భువనైకాధిపతీ! మహేశ్వర స్వయంభూ ! సిద్ధరామేశ్వరా !

**(49వ అవధానం - భిక్కనూరు)**

ఆనందంబున బొంగు లెత్తెదనురామా! మామకానంద సం
ధానంబౌగతి కోటికుంకుమ విధాన శ్రీపదారాధనా
ధీనం బౌనెడ, నీవధాన సభ సందీపించు నంచెంచియున్
రా నే నీవిటు పూజ గొందువు గదా ! రామాజిపేటన్ బ్రభూ!

ఈ విధుమౌళి పండితున కెన్నిక మన్నిక గల్గునట్టి యీ
తావు సుపర్వ పర్వము, సుదర్శన మర్శనమై యెసంగ సం
భావితు జేసి భావుకుల భావము రావముగా వెలుంగ నీ
వీవిధి నీవిధానము గ్రహింపగ శక్తియొసంగు మోప్రభూ !

**(51వ అవధానం - రామాజిపేట)**

జగతిన్ స్థావర జంగమాత్మకముగా సంకల్పమున్జేసి, ము
క్తిగతిన్ సాగు ముముక్షు లోకముల భక్తిశ్రద్ధలన్మెచ్చి, పు
ణ్యగరీయామల సత్ఫలంబు దయసేయన్ బూజనీయాకృతిన్
బొగడొందందగు భిక్కనూరున స్వయంభూ! సిద్ధరామేశ్వరా !

భక్తిన్ శ్రీనమకంబునున్ జమక సత్పార క్రమారూఢి సు
వ్యక్త శ్రీగిరి మల్లికార్జున గిరీశారాధనాబోధనా
సక్తిన్ వే శతరుద్రయాగ పరులై సాగించు నవ్వారికిన్
ముక్తి శ్రీపద మిచ్చి కాచెదు స్వయంభూ సిద్ధరామేశ్వరా !

సుకృతిన్ గావున యుష్మదాలయమునన్ శోభిల్ల నష్టావధా
నకృతిన్ నేగృతకృత్యు డైతి, మనుధన్యత్వంబు చేకూర్చుమీ
వికృతిన్ బొందగ నీక నేడు మహితావిష్కార సద్భక్తిప
ద్యకృతుల్ స్వీకృతి జేసి ప్రోవ గదవయ్యా ! సిద్ధరామేశ్వరా !

అదిభజింతు భక్తిని గణాధిప! విద్యల బుద్ధి నిచ్చి స
మ్మోదముతోడ సర్వులను బ్రోచుచు నుండెడు గుజ్జువేల్పు! ఈ
మోదకముల్ నివేదనము ముందొనరింతు వధానమందు నా
కీ దిగువాలు పైనము సహింపగ జేయుము సామజాననా !

అతిలోకమ్మగు రీతినీకు నవరాత్రా నందపర్వమ్ము నన్
మతిలేనట్టుల సల్పుచుందురు జనుల్, మేలాస పేరాసగా
గతిలేనమ్మకు గంజిభాగ్యమను లెక్కన్ నన్ను నష్టావధా
న తిరోగామిగ జేయ బోకుమని విఘ్నధ్వంసి నిన్నెన్నెదన్

(57వ అవధానం - దిగ్వాల్)

గుమ్మడిదలలో నవధా
నమ్మిమ్మెయి జరుపుకొనుచు నాకీ యెడలన్
గుమ్మడి దలపై బడునటు
లుమ్మలికము వాపి యేలు మో రఘువీరా .

**(62వ అవధానం - గుమ్మడిదల)**

ఈ యాందోలున విఘ్ననాధ నవరాత్రేష్టిన్ జతుషష్టియౌ
నాయీయష్టవధాన దీక్ష బుధు లందం బొప్ప దీవించగా
నాయు శ్రీ విలసిల్లగా శతముగా నాశింతు; విఘ్నేశ్వరుం
డీయుంగాత అభీష్టసిద్ధి నతిచే నెంతే బ్రసన్నుండునై

మందు డటంచు నీముఖము మాత్రము జూచిన దోచు, బొజ్జ నే
మందు? సదాశివత్వము, గణాధిపతిత్వ మనాగరత్వమౌ
చందము, కాని విద్యలను జాణతనంబును గూర్చు వాడవం
చందరు గొల్తు చిత్రమిది, ఆఖు తురంగ! నమస్కరించెదన్

**(ఆందోలు - 64వ అవధానము)**

నీ నవరాత్రముల్ హృదయ నీరజముల్ వికసింప భక్తి పెం
పైన తెరంగు నుత్సవము నంచిత రీతి నొనర్చు భక్తులన్
బూనిక నీ వధానమును బూన్చిరి, సేవగ నీకు శ్రద్ధతో
నా నుడు లక్షరార్చన లనన్ గ్రహియింపుము విఘ్ననాయకా!

**(65వ అవధానం - జోగిపేట)**

ఎన్నో చిక్కులువెట్టు పండితుల ముందేరీతి నేనెగ్గగా
నున్నానో? ఎనమంద్రు భార్యలతొ నీ వొక్కండ వేరీతిగా
నున్నావో ? ఇసుమంత నాపయిన దృగ్యోగంబు గల్పింపవా ?
కన్నయ్యా కడముట్ట జేయవలదా కావ్యావధానంబులన్ ?

**(68వ అవధానం - రాజగోపాలపేట. వేణుగోపాలస్తుతి)**

శశ్వత్కీర్తి విధావిధాయన కళా సంస్కార సంపద్వృధా
న శ్వ శ్రేయసమందు సప్తతిని ధన్యత్వంబు చేకూర్చగా
విశ్వామోదము గూర్చ భక్తిమెయి సేవింతు న్సదా కాశికా
విశ్వేశున్ దివిజాపగాతట సమావిష్టాత్మ భక్తేశ్వరున్
(70వ అవధానం - కాశి - విశ్వేశ్వరస్తుతి)

తొలుత నవిఘ్నమస్తనుటతో నినుగొల్తు గణాధినాధ! నా
పలుకుల నీవధాన సభ పండిత వర్యులు మెచ్చజేయు చి
క్కులు విడదీసి భావ వినిగూఢ రసాభ్యు చిత ప్రబంధరీ
తుల దనివార జేయును విధుంతుద వాగ్విసర ప్రసారణా !

దండము వక్రతుండ! సముదారతరాభ్యుదయ ప్రపంచితో
ద్దండముముక్షులోకవినుతా ! ప్రమథాధిప ! ఏకదంత . వే
దండముఖా! సతంబు నిను దల్చు జనాళి ననేకదంతులన్
దండము నీవ యై నిలువ దత్పర వృత్తి వహింతు నెప్పుడున్
(74వ అవధానము - గణపతి దేవాలయము, సికింద్రాబాదు)

అడవిలో గోపకుల జేరియాల నేలు
గోపకుల బాల! నాపైన గోపమేల ?
ఆల నేలుటయే గాక నాంధ్రనేలు
లీల చేర్యాల నవధాన మేలు మయ్య !
(75వ అవధానం - చేర్యాల)

రాజరాజేశ్వరీ ! జగద్రాజితముగ
శతవధాని విరాల శ్రీ చంద్రమౌళి
బుధుని కైపూజలంది సద్విధిదనర్చు
దేవి కాపాడు మవధాన ధీవిధాన
(78వ అవధానం - రాజరాజేశ్వరీ దేవ స్థానం - చుంచన కోట)

యాగము గావ బోయి, మునియాలినిబ్రోచి, విదేహపుత్రికై
భోగి విభూషు విల్విరిచి, పొంగి కరగ్రహణం బొనర్చుచో
నాగమ వేత్త లక్షర మహాశిషముల్ గురియ న్గురు ల్గనన్
సాగు మహోత్సవమ్ము విలసన్మ హనీయము రాఘవేశ్వరా !
(79వ అవధానం - శ్రీరామ కల్యాణోత్సవం - మర్పడగ)

తినవలసి విషము దిని కా
దనవలసియు భక్తుకొరకు నతివనొసగి, లే
దనవలసి యాత్మ నిచ్చియు
మనవలసి సతికి సగంబు మై యిడి తభవా !
(80వ అవధానం - కోటిలింగేశ్వరాలయము - సిద్ధిపేట)

నేలం జాపగ జుట్టి పెంగసిని, మున్నీటన్ దగ న్ముంచి లో
కాల న్గాసిల జేయు రాక్షసుని యజ్ఞశ్రీవరాహప్రభు
శ్రీలక్షింపగ కోలమై ధరణి నాశిం ద్రోసి రక్షించు దే
వా! లీలామయ ! మద్వధాన కవితా వాల్లభ్యమున్బ్రోనుమా !
(82వ అవధానం - యజ్ఞవరాహక్షేత్రం - కరీంనగర్)

నా చారిత్రము నింద్య మూర్జిత కళాన్యాసంబు శూన్యంబు, వి
ద్యా చాతుర్య ముళక్కి, పండిత వరోదార క్రియా శీలమౌ
వాచోవైభవ భావనాబల యశః ప్రాప్తిన్దయన్ జూడుమో
నాచాద్రీశ ! రమానృసింహభగవన్ ! నర్సింహరామాఖ్యునిన్

ఇదివర కెన్నిమారులొ మహిమ్ను నిరూఢిని నీసమక్షమం
దుదితరసజ్ఞ మోహనసముద్ధతి నష్టవధాన సేవనా
స్పదు ననుప్రేమ బ్రోచితి వపార కృపాకర నారసింహ ! సౌ
హృద పరిపూర్ణమౌ తెలుగు నేలుమ నేడును అల్పబుద్ధి నన్
(85వ అవధానం - శ్రీ లక్ష్మీనరసింహదేవస్థానం - నాచగిరి)

అన్నిట నిన్ను గొల్తురు మహాశయ ! విఘ్ననివారకా యటం
చెన్నుచు, గుజ్జురూపమున నెప్పుడు కోరిన కోర్కెలెల్ల సం
పన్నత దీర్చి, భక్తజనపాళికి గొంగున బంగరైన యా
పన్న శరణ్య! పండితుల పంచను నన్నవధాని నేలుమా ।

ప్రతిపద విఘ్నంబు ప్రబలించు నొక్కడు
బొజ్జ నిండ సమస్య పొలుచు నొకడు
అవ్యవస్థిత పద వ్యక్త గామి యొకండు
వర్ణ నామోదక వర్తి యొకడు
దినవారములలెక్క దేజరిల్లు నొకండు
తనరనస్తవ్యస్తతను నొకండు
చెవులు శూర్పములుగా జవి నింపు నొక్కడు
గణగణ నాదుడై కడగువాడు

నీప్రతీకలు గా రసానీక ధార
కడ్డు తగులుచు సుకవిత్వ మంది యీయ
గోరు నీమూర్తులకు నమస్కారములతో
చేయ బూనెద నవధాన సిద్ధి గోరి

**(106వ అవధానం - గణేశనవరాత్రములు - సిద్ధిపేట)**

శతకోటి రామ నామ
స్మృతియజ్ఞ సమాప్తి నఖిలసేవల గొను శ్రీ
పతి జనుల కొసగు సతతము
వితతయశోలబ్ధి జోగిపేట నగరికిన్

**(107వ అవధానం - రామకోటి యజ్ఞం - జోగిపేట)**

ఏకల్యాణము లోకమోహనపరం బేశోభనం బర్థి స
ర్వాక చ్ఛేదక మెట్టిపర్వము జన ప్రాకామ్యదంబౌనొకో ?
సాకేతేశుడు జానకీరమణి నిచ్చ న్గేలు గైకొన్న వే
ళాకప్రోత్సవ మేలు గావుత మహోల్లాసంబుతో భక్తులన్

తలవంచె న్మెడవంచు నంచు దలబ్రాల్ దా ముందుగా జల్లగా
బులకించు న్దమకించు నందమును ద్రావు న్గంటిదోసిళ్లతో
బులిపించు న్గళనించు సిగ్గుతెరలో బూర్ణేందు బింబాననం
బిల సీతాసతి రాముగైకొనుచు మమ్మేలున్ సభాస్తారులన్
(110వ అవధానం - శ్రీ రామ కళ్యాణమహోత్సవం - ఖమ్మం)

అరువదియేటి పండువు మహాశయవృత్తి నొనర్చు వారలీ
పురమున బెక్కురుండుట అపూర్వము - వారలలోన భక్తి త
త్పరత నొనర్చు లింగనకు బండితపాళి శుభాశిషంబులన్
జిరమగు జీవనంబు దయసేయ నుమారమణున్ భజించెదన్
(116వ అవధానం - సిద్ధిపేట)

సుమధుర భక్తితో త్రిపుర సుందరి ! నీదగు యాగ మూర్తి వి
భ్రమముగ జేయు నాతడు; విరాజిత సంపదుదార శీలుడ
బ్రముగను షష్టిపూర్తి దనర న్గవి పండిత పోషకత్వ మ
శ్రమమున మాడిశెట్టి కుల చంద్రు డొనర్చెను వేంకటేశుడై
(122వ అవధానం - సిద్ధిపేట)

హితమతి బ్రశ్నలిచ్చి, గడియించెడు కీర్తికి నుద్దిగా సమ
ర్పితమతి నుత్తరంబు లిడురీతి యశఃప్రదమైన జాలు నీ
సతు లెనమంత్ర సంస్కృతి ప్రసన్నత ముఖ్యముగాదె? నాకు ద
ద్గతి వలవంత కేమి? యవధానము గూర్చుమ చెన్నకేశవా !
(125 వ అవధానం - బచ్చన్నపేట )

విదిత కళావధాన రుచివేదిక మోద సమీహితాంచితా
భ్యుదయ కళావికాస పరియోజన శ్రీముఖ సాహితీ సమి
త్యుదిత విలాస ముజ్జ్వలత నొప్పగ భావము పుష్ట మౌనటుల్
సదయ రహించు శ్రీవిజయ సామజ శీర్ష ! కృతార్థుజేయుమా ?
(126వ అవధానము - హైదరాబాదు విజయవినాయకదేవాలయం)

నీ స్థానమ్మున గవితా
ప్రస్థానము జరుగుచుండ బండితమోదా
వస్త్రారూపముతో నను
స్వస్థునిగా వేంకటేశ ! పాలింపుమయా !

**(కల్యాణవేంకటేశ్వరాలయం - చేగుంట-127వ అవధానము)**

అవధానికి బృచ్ఛకులకు
నవినాభావానుభావ హార్దిక శక్తిన్
శివ మెత్తించుమ సాయీ !
నవరసముల నొలుకునట్లు నాలుక యాడన్

**(137 వ అవధానం - ఒంగోలు)**



## గురురూప

మీరెడు కవితాధారా
పారత కిరవైన గతుల బరగి తనర్చన్
ధీరత జూపు గురు విజయ
సారథి ధీవరుని గొలుతు సద్భక్తిమెయిన్

(1వ అవధానం - నారాయణఖేడ్)

శ్రీమ దఖండానంద
స్వామికి, దారకమనుప్రసాదికి, గరుణా
ప్రేమ స్విన్నమనస్వికి
నామది సాష్టాంగ వందనము లొనరింతున్

గీర్వాణాంధ్ర మహత్కృతి
ధూర్వహు, గరుణార్ద్ర చిత్త తుందిలు, ఛాత్రా
ఖర్వ ప్రేమార్ణవు హరి
శర్వప్రియు గురుని విజయ సారథి గొలుతున్

అయిలా వజ్ఝలవేంకటాద్య రమణుం డార్యుండు నన్బూచి యే
మయినన్నీ వవధానము న్సలుపగా యత్నించుమీ! వాణి చి
న్మయి నీకండయటంచు గుండె దడపో మాన్యుండు దీవించ ని
శ్చయమై చెల్లు నటంచు నమ్మితి నిదే సాగిల్లెదన్ వారికిన్

(2వ అవధానము - భువనగిరి)

ఐలావజ్ఝల వేంకటాద్యరమణుండార్యుండు కై సాచి నీ
వేలా జంకెదు, వాసరేశ్వరి కృపా హేలావిలాసంబు నీ
లోలో గైతల జాలు వార్చ సభ సుశ్లోకింప నష్టావధా
నాలి న్మించు మటంచు దీవనల నీయ న్భక్తి గేల్మోడ్చెదన్

సంసార తారక మనూ
త్తంసం బుపదేశ మిచ్చు దక్షు నఖండున్
శంసింతు నతుల సద్గురు
హంసను రామాఖ్య సరసి హంసను భక్తిన్

శ్రీమచ్ఛ్రీభాష్యవంశప్రథితజలనిధౌ దివ్యపీయూషపాదః
గీర్వాణాంధ్రాదిభాషావిమల వననిధౌ లోడనే మందరాద్రిః
ఛాత్రాణా మాశ్రితాణామఖిలవర పయోవృష్టికృత్కామధేనుః
వాత్సల్యేన ప్రియం మా మవతు విజయసార ధ్యభిఖ్యో ద్యువృక్షః

(3వ అవధానం - సిద్ధిపేట)

వేంకట రమణార్యు ననా
తంకమతి న్గొలుతు మధురతాలాపగతిన్
సంకటము లెల్ల దీర్చగ
నుంకువగా నాశిషంబు లొసగెడు కొఱకై

(4వఅవధానము - హైదరాబాదు)

ఏనాడేమి తలంచి పల్కితిరొ? మీ రేమెంచి దీవించినా
రీనాడిట్లు యథార్థమై నెగడగా నిష్టమ్మె యౌకాని నా
మాన మ్మిందుల దీయగా బడుట సమ్మాన్యంబె మీకీ యెడన్
గానన్ శ్రీగురుదేవ! అండనిలువంగా మ్రొక్కెద న్భక్తితో

(6వ అవధానం - సిద్ధిపేట)

అవధానమ్మొక కొండ, ఎక్కుటకు నాకత్యంత కష్టంబు, మా
ర్గవిశేషంబది దుర్గమంబగును; ధైర్యం బెన్నగా సున్న, నీ
కవునంచు న్వెను దట్టి ముందు జనగా నాశీస్సులందించు నా
జ్ఞవుగా శ్రీరమణాంగ వేంకటబుధా. సాగిల్లెద న్నీకిటన్

(8వ అవధానం - సిద్ధిపేట)

నిండు మనంబున నను గూ
ర్చుండు మనుచు, దేవి గొలుచు చుండుమటనుచున్
మండితముగ దీవించు న
ఖండానందముని రూఢ గతి భజియింతున్

సంకటములెల్ల గొలువై
యుంకువగా నున్నవేళ నొప్పుగ నవధా
నాంకు డవై వెలుగు మనిన
వేంకట రమణార్యు గురుని వేడ్క నుతింతున్

**(12వ అవధానం - మాసాయిపేట)**

విదితంబైన విశాలసీమ కనుల న్వింబొ పసందౌ జయ
ప్రద కోటీశ్వర లింగమూర్తులను సత్ప్రఖ్యాతిగా నిల్పుచున్
హృదయానందము గూర్చి యాస్తికమనోభీష్టంబు కల్పించు నీ
మదనానంద యతీంద్రు డియ్యెడల నమ్మాన్యుండు సానందుడై

తలచెద మానసౌకసపదం బధిరోహణ సేయు దైవత
మ్ముల, శుభరామతారక ముముక్షుత, సత్కృతిమద్వధానధీ
కలన ననుగ్రహించెడు నఖండయతి ప్రముఖాత్మదేశికో
జ్వల పదపారి జాతముల సత్వ గుణాస్పదవృత్తి నీయగన్

**(13వ అవధానము - కోటిలింగేశ్వరాలయం - సిద్ధిపేట)**

మనుమార్గ మ్ముపదేశ మిచ్చిన యతిన్, మాధుర్య వత్కావ్యశీ
లన నభ్యున్నతిజూపు శ్రీవిజయ సారధ్యాఖ్యు, నష్టావధా
న నితాంతాభ్యసనంబు దెల్పు రమణాన్వర్థాభిధానున్ మనం
బున నోజఃకవనాశుధారణల మెప్పుంగూర్చగా వేడెదన్

**(14వ అవధానము - జగదేవపురం)**

ధ్యానావస్థితి మోక్షమార్గమగు, విద్యాపారగత్వమ్ము సౌ
ఖ్యానందప్రద మీ వధానకళ, విఖ్యాతమ్ము నా దె ల్పఖం
డానందున్ విజయాత్త సారథిగురున్, హార్దిక్యు శ్రీవేంకటా
ద్యానూనున్ రమణార్యు నెన్నెద నభీష్టార్థమ్ము లీడేర్చగన్

(15వ అవధానము - సిద్దివట)

ఎటుల దలంచినారు నను ని ట్లవధానిగ గాగలానిగా
బటుతరమయ్యు! మీ హృదయభావన, మామకశక్తియుక్తి ప్ర
స్ఫుటముగ నండగా నిలిచి చూడుమి నిన్దయ వేడు చుంటి వేం
కటరమణార్యసద్గురు!వికల్పము లొక్కెడ రాకయుండగన్

అమలశ్రీమనురాజబోధకు నఖండానంద యోగీంద్రు, భా
వమరందాద్భుత శబ్దచిత్ర మహిమ వ్యంగ్యార్థశయ్యాప్రచా
రమహాకావ్యవివేకదున్ విజయ సారథ్యాఖ్యు, అష్టావధా
నమహత్కార్యమునన్ గృతార్థత నెసంగంజేయగా వేడెదన్

(17వ అవధానము - కొండపాక)

గురుమూర్తీ! నిను నమ్మితి
గరుణారస ముప్పతిల్లగా నవధాన
స్థిర చిత్త మీయ మ్రొక్కెద
వరలగ నీ లింగారెడ్డి పల్లిన్ దేవా!

(18వ అవధానము లింగారెడ్డిపల్లి)

పటుతర శబ్దచిత్రకృతి పార మిత ప్రతిభాత్మ సుమ్ము నా
దిటుల వధానదృష్టిపయి నింపెసగంగ నొనర్చి సత్కవీ
ఢ్ఘటన యశఃప్రశస్తి గలుగందగు మార్గము జూపునట్టి వేం
కటరమణార్యసత్పదయుగంబుల నెమ్మది నమ్మి కొల్చెదన్

(19వ అవధానము - సిద్దిపేట)

నా కే మున్నది మీపదార్చనకు గంగాజీవనం బీయెడన్
లేకేమీ? ప్రతిభా కవిత్వ మహితశ్రీ లేదె? తద్రూపయై
ఓకారుణ్యనిధానులార! గురుదేవు లీర్మర లష్టావధా
నైకాత్మీయ నుతిప్రమోదముల గె ల్పందించరే నాకిలన్

(20వ అవధానము - సిద్ధిపేట)

అవధానంబును జ్యౌతిషంబు వసుమత్యంతర్జలాభిజ్ఞతల్
కవితా వాస్తు కళాకృషి స్థైరిపి లేకన్ నిల్చు నాకింకవై
భవ మొప్పార సరస్వతీ జనని నిల్పన్ దేవళం బొక్కటా?
నవదీక్షాయతికై గురూత్తమ పదాంతర్భక్తి కేల్మోడ్చెదన్

(22వ అవధానం - సిద్ధిపేట)

అన్నెము పున్నెముం దెలియ కర్థము శబ్దము మీరె తెల్పగా
వన్నెలు చిన్నెలుం గలుగ వర్ధిలు నట్లవధాన చిత్రకా
వ్యోన్నయ మందు మందగతి కూకొను నన్నెనుదట్టి యుత్సుక
త్వోన్నతి నిల్పు సద్గురు మహోదయులం బ్రణుతింతు నెప్పుడున్

(23వ అవధానం నిజామాబాదు)

మీయుపదేశమే బలము, మీ కరుణా పరిపూర్ణ బోధనా
మేయత తెప్ప, ప్రేరణసుమీ మరి నాకిట ఊతకఱ్ఱ, దు
ర్జ్ఞేయ గభీర వాఙ్మయ సరిత్ప్రియ నాయక తారానుకం
పాయత బుద్ధికై గురుల నాత్మ దలంచెద మిమ్ము నర్థినై

(24వ అవధానం - పటంచెరువు)

పరిపూర్ణదయా మూర్తుల
గురు గౌరవ లబ్ధ కీర్తి కోవిదుల న్మ
ద్గురు దేవుల నుతియించెద
పరమం బవధానమందు బ్రథ కలిగించన్

(25వ అవధానం - వేములవాడ)

పరిపూర్ణకృపాకరులను
సరసవచోరచన చణుల సాత్త్విక గుణులన్
స్థిరచిత్త మీయ సభలో
గురుమూర్తుల గొలుతు గొలువు కూటము గెలువన్

(26వ అవధానం. బోధన్)

మీ యాశీస్సులుపొంది నిండుసభలన్ మేల్గా యశోలక్ష్మి కే
లీయ న్సంబరమందు చుంటి, నిది గర్వించంగ గాదెప్పుడున్
ధ్యేయంబౌ పదయుగ్మము న్విడువ సుమ్మీనాడు మున్నిల్చి ని
శ్శ్రేయం బీయ నఖండ సద్గురువు లీరే మ్రొక్కెదన్ భక్తితో

(27వ అవధానం - వర్గల్)

గురుకారుణ్యము గల్గ దేవతలు చిక్కుల్ వెట్టకన్ సిద్ధితో
పరమాభీష్టము లిచ్చి ప్రోచెదరుగా, వక్రించినన్ వారె సె
బ్బరల న్గూర్తురు. కావునన్ సభను వాగ్వైదుష్య మేపారగా
గురులన్ మి మ్మనుకంప గోరెదను సంకోచంబు పోకార్చగాన్

(28వ అవధానం - వేములవాడ)

పటుయోగాభ్యసనంబు సత్కవన భావప్రస్ఫుటానంద ము
త్కట వాగ్వైఖరి యీ వధాన సుమనః కాండప్రమోదావహో
ద్భట పాండిత్య నిధానమై సభిక సంతాన ప్రియంబైన యి
చ్చటు ఆశీర్ముఖ వాక్కులైన గురుసంస్థానంబుగా నెన్నెదన్

(30వ అవధానం - కామారెడ్డి)

నాగురు దేవతల్ ముగురు నమ్రత క్రమత సమ్మతాస్పదుల్
యోగి, కళానుభోగి, నృపయోగి యొసంగ గతిన్మతిస్ఫుతిన్
సాగెద సత్కవిత్వ గుణసార మపారరసారతిన్ సభా
భోగము గల్గ వెల్గుటకు మ్రొక్కెద నిక్కపుటక్కరమ్ములన్

(31వ అవధానం - గోదావరి ఖని)

యతివర్యా ! కవివర్య ! సిద్ధవర నాయం దీరు నిర్వ్యాజ సం
గతి కారుణ్యము జూపగా సుకవితా క్రమావధానక్రియా
మతి నేతత్సభలందు నిల్వగల సామర్థ్యంబు నా కబ్బెనే
మొ?తిరంబౌగతి దీవనల్ గురియుడీ పుష్పాంజలుల్ కొండిటన్

**(36వ అవధానం - నారాయణఖేడ్)**

ఇరువది రెండేడుల ము
న్నిరవుగ నవధాన శక్తి నిచ్చెదనని నే
డరలేక గాంచు సత్కవి
గురుడౌ శ్రీరామకృష్ణ కోవిదు గొలుతున్

**(37వ అవధానం - చిన్న కోడూరు)**

గురు శబ్దంబు తమంబు వోనడచు సంకోచమ్ములన్ బాపు, స
ద్గురు బోధం బవధాన మార్గఘన వాతూలమ్ము విప్పార్చు, ధీ
స్థిరత న్గూర్చి సభాజయంబు గలుగ న్జేయున్ గురుప్రేమ నో
గురు దేవా. కరుణించ వేడెద గవీశాన ప్రియంబొప్పగా

**(40వ అవధానం - జగిత్యాల)**

అటు నిటు నూగు మానస మయత్నముగా, నవధానమన్న ధీ
పటిమకు నుద్దియంచు నను బాయని మీ యనుకంప గంపమున్
త్రుటి తొలగించు, సభ్యజన తుష్టిని బుష్టిగ బెంచు మిందు వేం
కట రమణార్య! మిమ్మిట నకల్మషవృత్తి దలంతు దోడుగాన్

**(41వ అవధానం - హైదరాబాదు)**

అన్నిట మమ్మువేడ మరియాదయె? నీవవధాన భావ సం
పన్నతకై రవంతయును బాటు సహించవటంచు గిన్క పూ
న్కి న్నిరసించకుండుడు, సుఖింతును మీకరుణన్ బ్రతిశ్రయో
ద్భిన్నమనోబ్జవృత్తి, గురుదేవతలార అనుగ్రహించుడీ

అతిలోకమ్ముగ సాగు సిద్ధిపురి గీతాచార్య సన్మౌక్తికా
ప్రతిమానోత్సవ బోధనీయ మహితార్థ వ్యాఖ్యలన్ దిట్టలౌ
యతిలోకంబు కృపావలోకనముతో నాశీర్వదించంగ బం
డిత లోకాశయ పూర్తి చేసెద, వితండించంగ గేల్మోడ్చెదన్

(43వ అవధానం - సిద్దిపేట)

హృదయము విప్పిచెప్పు గురు డెంతటి భాగ్యఫలానురూపుడై
చదురుని శిష్యు జేయగ బ్రసన్నుడుగా లభియించు, నట్లు నా
కొదవితి రీరు, పెక్కులు మహోత్సుకత న్వచియించినారు. నా
కదలిక లన్ని మీవె, దయ గావుము నన్నిట సద్గురూత్తమా.

(44వ అవధానం - కాజీపుర్)

గురుదేవా! గురిచూసి పృచ్ఛకులు నాకున్ శూలముల్ గ్రుచ్చ, న
ల్గురుశ్రోతల్ చెవి నిక్క వెట్టి వినగా, గ్రుక్క న్మరల్చంగ వా
గురు వైభోగము జూపు శక్తి నిడి నన్నోమంగ రాకున్న, నీ
గురు శిష్యప్రియ బంధ సార్థకత కీ కోహీరె సాక్ష్యంబగున్

(45వ అవధానం - కోహీరు)

అటునిటు లూగకుండ హృదయంబును నిల్పు గురూత్తమా! యతీ!
చటుల వధానమున్ విజయ సారధి! సారధిగమ్ము నాకు, వేం
కటరమ ణార్య ! కై విడువక న్దయజూడుమ మీకృపాధునీ
తటమున నిల్చి ధీర పరతత్త్వము చాటెద నెల్లవేళలన్

(47వ అవధానం - యాదగిరిలక్ష్మీనరసింహదేవస్థానం)

గురుదేవా! సత్కవితా
పరమౌ నష్టావధాన భావ స్ఫురణ
స్థిర చిత్త మీయ వేడెద
కరుణించుమ వాగ్విభూతి కలిగెడు నటులన్

(49వ అవధానం - సిద్ధరామేశ్వరాలయం. భిక్కనూరు)

గురునెదలోన నిల్పుకొని కూర్చిన గల్గితి గాని పాండితీ
గరిమ యటంచునెంచను, సుఖమ్ముగ నష్టవధాననౌక దు
స్తరణ సభా సముద్ర సముదగ్ర జలగ్రహరూపపృచ్ఛక
స్థిరధృతి గట్టు దేల్చ గురుదేవుని పాదము లాశ్రయించెదన్
(53వ అవధానం - శనిగరం)

గురుకరుణాకటాక్షమున గూఢతరార్థ నిరూఢ వాక్య భా
సుర కవితావధానసభ శోభిలు, దివ్యమనుప్రసాద కా
వ్యరసవిచారధారల నయాచిత దాతల మద్గురు త్రయ
స్ఫుర దురు పాద పద్మముల మ్రొక్కెద దిగ్విజయమ్ము గూర్చగాన్
(54వ అవధానం - హైదరాబాద్)

మోక్షాపేక్ష వహించి యొక్కని, సభామోద ప్రదా నావ్యయా
శిక్షా దక్షత కోరి యొక్కని, గళా శీలావధాన క్రియా
దీక్షోపేక్ష తొలంగ నొక్కని సదంతేవాసిగా గొల్చుచున్
సాక్షాద్దైవతముల్ గురుత్రయము నిష్ఠన్ నిల్పగా వేడెదన్
(58వ అవధానము - నంగునూరు)

బాలురకు నర్థమయ్యెడు
లీల వధానంబు సలుపలేనిచొ వృధయౌ
తేలిక పదములు దొరుకగ
బాలించు డటంచు గురుల బ్రార్థింతు మదిన్
(59వ అవధానము - రామంచ)

ఎటులయినన్ వధానముల నేర్పడ జేయుట తప్పదంచు ధీ
పటిమ ప్రదర్శితంబగుట పాడియటంచు నిరంతరంబు చె
ప్పుట పనిగాగ దీవనల పుణ్యము గానయె షష్టిపూర్తి వేం
కటరమణార్య దేశిక! వికల్పముల న్దొలగించ వేడెదన్
(60వ అవధానము - దుండిగల్)

అవధాన షష్టిపూర్తిని
సవరించితి నేడు షష్టి సమపూర్తి సభా
హవనమున కాజ్యముంబలె
నవధానము సాగ గురుల నాశింతుమదిన్

(61వఅవధానము-పెదగుండవల్లి, రాIIశ్రీ చీకోటివీరయ్య షష్టిపూర్తిలో)

వేంకటరమణార్యా ! ని
శ్శంకత నవధాన గోష్ఠి సాగునటు గనన్
సంకటములెల్ల దీరిచి
రాంకవ సత్కృతిని గూర్చ రాదొకొ కరుణన్?

(62వ అవధానము - గుమ్మడిదల)

అయిలావజ్ఝలవేంకటాద్యరమణుం డస్మద్గురుం డూర్జితం
బయి చెల్వారెడుచో నవగ్రహగణం బల్మేలు మంగేశ్వరా
లయమున్ స్థాపన సేయు శోభనదినోల్లాసంబునం దీవధా
నయుతిన్ దీవనలీయ వేడెద నితాంతప్రజ్ఞ దీపింపగా

(63వ అవధానము - చేవెళ్ల)

గురుల మనంబున న్నిలిపి గూఢ తరార్థనిరూఢపద్యమా
ధురుల సదస్యపాళి పరితుష్టి వహించు వధాన మియ్యెడన్
జరిపెద నంతెకాని పరిషత్స్తవనీయ కళావిదగ్ధతన్
బరగుట చేత గాదు. దయ పండగ జూడుడి మీరు నాయెడన్

(64వ అవధానము - అందోలు)

గురుదేవా! మదివిప్పి చెప్పిన మహాగూఢార్థబీజంబులన్
ధరణిన్ నల్సెరగుల్ రసప్రసవబోధన్ సాహితీక్షేత్ర ము
ద్ధురమౌ నట్టుల విత్తుచుంటి నను సంతోషింపగా జేయుమా
వరణీయాష్టవధాన వేదిక ఫలప్రాప్తిన్ బ్రసాదించుచున్

(68వ అవధానము - రాజగోపాలపేట)

తీర్థక్షేత్ర సుసేవనంబున జగత్ క్షేమంక రేష్ట్యాదులన్
స్వార్థ త్యాగము చేత, దైవిక జపోపాస్తిన్ సమస్తాస్తికుల్
సార్థక్యంబును గాంత్రు, యోగి యొకడే సర్మమ్ము శ్రీ భారతీ
తీర్థస్వామి సుబోధనావగతి ముక్తిం గూర్చు నెవ్వారికిన్

పదవాక్య ప్రతిపాద్య నిశ్చయ జగద్భద్రాదివాంఛన్ నిరా
ప దవిచ్ఛిన్నపదంబు నందుటకు నధ్వంబొప్ప జూపించు శ
ర్మదనిధ్యానము స్వామి సేవనము, ధర్మప్రస్ఫుటామోదమై
హృదయస్వచ్ఛత గూర్చు భక్తి నతిచే నెంతేని నిత్యోన్నతిన్

అతి సౌలభ్య పదప్రయోగరచనా వ్యాసంగమున్నేర్పి వా
గ్గతి నన్నోము జయాశయున్ విజయసారథ్యాహ్వయున్, ధ్యానసం
యత చిత్తంబున వాఙ్మనుప్రదు నఖండానందయోగీంద్రు, వై
ద్యుతధీశక్తి నొసంగు శ్రీరమణయార్యుం గొల్తు వాక్సిద్ధికై

**( 69వ అవధానము - లక్ష్మీనరసింహక్షేత్రము, నాచగిరి)**

పరిపూర్ణంబగు భక్తి శంకరుని నిల్పంబూని, లక్షించి, దీ
క్ష రహించ న్దగె రామచంద్రు డెద మెచ్చన్ భారతీతీర్థస
ద్గురుహస్తాంబుజసుప్రతిష్ఠితము గాగూర్చెన్నవధానంబు మున్
గురుమూర్తి న్దలతున్ సభావిజయ శక్తుల్ నింప నేతత్సభన్

**(71వ అవధానము - నాచగిరి)**

తనవాడన్న యపేక్షతోడ నను విద్యావేత్తల న్నిల్పు ధీ
రనయాదుల్ గలుగన్ గృపన్ విజయసారథ్యాఖ్యు డేలెన్, వచో
మనురాజంబు నఖండయోగి యొసగెన్, మాత్రాలయశ్రీని గూ
ర్చును శ్రీవేంకటపూర్వ వర్తి రమణార్యుం డెన్నెద న్వారలన్

**(73వ అవధానము - వరంగలు)**

నమ్మిన మద్గురూత్తములు నాయెడదందగు ధీరబుద్ధి యై
రమ్మదమై వెలుంగగ సరస్వతి కంచిత మందిరమ్ము పూ
ర్ణమ్ముగ నిల్ప గావ్యకళ రాజిల సత్కవితావధాన కా
ర్యమ్మున సేవ సేయుమని యాజ్ఞయొసంగిరి వారి గొల్చెదన్
ఇరమ్మదము = మెరుపువంటిది (76వ అవధానము - దొంతి)

గురుమూర్తుల్ కరుణాకరుల్ ముగురు మ్రొక్కుల్ గొంద్రు, దైవీబల
స్థిర చిత్తం బిడు స్వామివారు, సుపదార్థీ భూత భాషాసుధా
ర్థరతిన్ భాష్యము సెప్పు శ్రీవిజయ సారథ్యార్యు దేతద్వధా
న రహఃప్రజ్ఞను వేంకటాద్యరమణాన్వర్థాభిదుండిచ్చుతన్
(78వ అవధానము - చుంచనకోట)

మరుపడగలోన గురులార! మరుపుడుగక
నేర్పడగ నాపడగ మహిం బడగ య
శంబె? పడగవిరియు ప్రష్టు సమితి యబ్బు
రంపడగ నేరు పడగకం బ్రాపు మీరె
(నేరువు +అడగక, పడగ =తల)(79వ అవధానము - మర్పడగ)

ముగ్గురు గురులై కవిగా
బగ్గెను జూపించనిలుచు బాలుని నను స
మ్యగ్గతి సభ్యులు మెచ్చగ
గగ్గో లెడ బాపి బ్రోవగావలె మీరల్
(80వ అవధానము - సిద్దిపేట)

అక్షర విజ్ఞానం బిడి
శిక్షణ జరిపించి మీదు సేవకు ఫలమై
ఏక్షణము నన్ను బాయక
రక్షించెడు గురుల మిమ్ము బ్రార్థింతు నెదన్
(81వ అవధానము - కుకునూరుపల్లి)

గురు నెద నమ్మి కొల్చి యొనగూడిన వాగ్విసరప్రసారణ
స్థిరమతి సద్వధానమున సిద్ధుడనైతి, మహానుభావ!భా
స్వర సుమనో  వధిన్ విజయసారధి సద్గురుమూర్తి ! నాపయిన్
గరుణ రవంత దగ్గకను గావుమయా సభలో దయామయా.

(82వ అవధానము- కరీంనగర్)

ఏమేమాశయమో? వధానమును నీవేనాటి కైనన్ గురు
ప్రేమన్ జేయగలాడవంచు గృప జూపింపంగ నీరూపమై
సామాన్యం బొనరించలేని గుడి నిష్ఠన్ జేయగా నిల్పు తం
డ్రీ! మీరేగతి వేంకటాద్యరమణా. డింగిళ్ల మీకీ యెడన్

(84వ అవధానము - చందాయిపేట)

ఎందు నసాధ్య మొందుకనుపింపగ నీయక మద్వధాన కా
వ్యేందిర సర్వపండిత కవీంద్ర రసజ్ఞమనో నుమోదన
స్పందనగా గురుత్రితయ పాద సరోరూహపాళిభక్తితో
వందన మాచరించెద సభాసదు లుత్సవ మందు చుండగాన్

(85వ  అవధానము  నాచగిరి బ్రహ్మోత్సవాలు)

పలికిన పల్కుపల్కున నపార రసారభటీప్రసారధా
రల బులకింతలన్ శ్రిత పరంపర కింపగు భావనామహో
విలసన చాతురీమహిత విద్వరవర్యుడు మద్గురూత్తముం
డలఘుతరానుకంప విజయానుగసారధి ప్రోచుమమ్ములన్

(87వ అవధానము - వరంగలు-పోతన పంచశతజయంత్యుత్సవాలు)

గురుదేవులు మీకరుణా
పరతం గాకున్న నాకు బండితతతిలో
నరయు గతి తెలియ దరమా?
సరసం బష్టావధానసభ మెచ్చంగన్

(88వ  అవధానము - సిద్దిపేట)

విజయ సారధి భాషావివేక మిచ్చె
తారకం బఖండానంద తాపసుండు
నిచ్చె వేంకటరమణార్యు డీవధాన
కళనొసంగె వారిని భక్తి గ్రాల గొలుతు

(89వ అవధానము - దేవరయాంజాల)

వాఙ్మనురాజము దయనిడి
వాఙ్మయధీ విజయసారవద్వీధిలో స
మ్యఙ్మధుర కవనరుచి రస
దృఙ్మహితు బొనర్చు గురుల దేకువ గొల్తున్

(92వ అవధానము - అర్ధంకి)

గురులారా మత్కవితా
యురు లారగనీక సర్వసభ్యులుమెచ్చన్
గురుకరుణ జూడు డియ్యెడ
పరువడి కోహీరులో సభా ప్రాంగణమున్

(96వ అవధానము - కోహీరు)

గురులారా! సత్కవితా
ఝురులారగనీక ధార జాల్వారంగా
గరుణాదృష్టిని జూడగ
బరువడి బ్రార్థింతు మిమ్ము బాలించుటకై

(98వ అవధానము - పెద్దచెప్యాల)

గురులారా! సభలోపల
నరుదారగ ముందునిల్చి యవధానకళన్
గురితప్పనీక బ్రోవుడి
పరిభావము గలుగకుండ బాలించుడయా!

(99వ అవధానము - రామాయంపేట)

రామమంత్రంబు మాన్పి సారస్వతం బొ
సంగిన యఖండ యోగీంద్ర. శతమునిండె
లలితలలితావధాన విలాసగతి నృ
సింహ రాముని కీ నారసింగి లోన

ప్రతిపదశంక దొలంగగ
జతురత జూపించు విజయ సారధి! అవధా
నతిరోగమన మెడపి నీ
శత సంఖ్యా ష్టావధాన సభ జూడుమయా।

గురువేంకటరమణార్యా!
పరివేదన మీదునాన బాలించుచు ను
ర్వర నూర వధానంబుల
బరిపూర్తి యొనర్చినాడ బ్రముదం పడుమా!

**(100వ అవధానము - నారసింగి)**

నూరయ్యె నింక జాలని
కోరితి, మీయాశిషమునకు న్మేరయె? వి
ద్యారసికు లాత్మ మెచ్చగ
గోరిన గాదనగలేను గురువరులారా!

**(103వ అవధానము - తడ్కపల్లి విద్యారణ్యావానవిద్యాలయం)**

పదముల బట్టులేక, రసభావవినూత్నసమంచితోహ లిం
పొదవగ లేక, బృచ్ఛకుల యుక్తులకున్ బ్రతి సభ్యతుష్టికై
పదిల మొనర్చలేని కవివాచ్యులలో గలుపంగ బోకుడీ
కుదురుగ మద్గురూత్తములు! గొల్చెద మిమ్మవధాన వేదికన్

**(104వ అవధానము - సిద్దిపేట)**

ఏది సమస్యకాదు, మరియేది నిషిద్ధము, వర్ణనాంశముల్
ప్రోదిగ జిక్కినన్ గణన పోలునె? ఏది వృథాప్రసంగమో
అదట మీరు దత్తపదులై యొసలారిన మద్గురూత్తముల్
కాదె వధాన మూర్జితముగా గరుణించగ గొల్తు మిమ్ములన్

(111వ అవధానము - కొల్లాపురం మహబూబ్ నగర్)

మీయుపదేశయోగమున మీకరుణావరణీయదృష్టితో
మీ యభిమానసంపద సుమీ. ఇటు నిల్చితి, బండితాళి వి
ద్యాయశమంద, ఝుందధియతాపరిమార్జన సద్గురుత్రయీ
ధ్యేయత సత్పద స్థితికి దీవన లిచ్చిన లోటు గల్గునే ?

(117వ అవధానము - అచ్చంపేట)

స్వార్థత్యాగము ధీవిశాలత సదా సత్యప్రచారమ్ము ధ
ర్మార్థవ్యగ్ర మనోవిచారము, జగద్వ్యామోహనాశంబు శ్రు
త్యర్థాచార పరాయణంబుల నుదాత్తవ్యక్తి శ్రీ భారతీ
తీర్థస్వామి జగద్గురు ప్రభుని నర్థిన్ గొల్తు వాక్సిద్ధికై

ననుదీవించి యనంతసాగర తలానం దేవి నిల్పంగ, స
జ్జనసాంగత్యముతో గృతార్థు నొనరించన్ దత్ప్రతిష్ఠామహా
దినమున్ గట్టగ బట్టుచీర వడి నందించెన్ గృపామూర్తి మ
జ్జని సాఫల్యముగాగ వారలను వాచాందేవిగా గొల్చెదన్

(120వ అవధానము - మచిలీపట్టణము)

కవన హేలా విలాస ముత్కంఠ గూర్చ
బాలబాలికల వధాన పటిమ దెలియ
జిక్కు ముడులను విప్ప నాశీర్వదించ
సుముఖు లగుదురు గురుమూర్తు లమల మతుల

(121వ అవధానము - హైదరాబాదు)

అమలు నఖండయోగిని దయాపరుదారకమంత్రపూతు, బ్రా
జ్ఞమహితు వశ్యవాగ్విజయసారథి, సిద్ధపదాను యాయు వా
గ్విమలరహస్యవేది జిరకీర్తిని శ్రీరమణార్యు గొల్చెదన్
క్రమత గురు త్రయంబు సుముఖ స్థితి నీ యవధాని బ్రోవగన్
**(124వ అవధానము - చేర్యాల)**

అటునిటు లూగు నెమ్మదిని నష్టవధానపు భీతి మాన్చి వేం
కటరమణార్యు డేలెను వికల్పములన్ బెడబాపి, భాష ము
చ్చట కలిగించె శ్రీవిజయసారథి, తత్కరుణన్ జరింతు సం
కటముల వెన్నియేని యణగన్ నుతియింతును వారి భక్తితో
**(125వ అవధానము - బచ్చన్నపేట)**

తారకమంత్ర మిచ్చు సముదారు నఖండ సరస్వతీమునిన్
ఘోర తపస్వి శాక్తగురు కోవిదు శ్రీరమణార్యు, శబ్దకా
సారమరాళమౌ విజయ సారథి, విద్వదనూన గౌరవున్
సారెకుగొల్తు నీసదము సారతరంబుగ సాగునట్లుగాన్
**(128వ అవధానము - హైదరాబాదు)**

హేమలతాపురంధ్రి తమి నేచియు నోచిన నోము లెల్ల ద
న్నోమ, వరప్రసాదతనయోజ్జ్వలసత్ఫల మంది లోక భ
ద్రామల దీక్ష వైదిక సుధర్మనిరంతర రక్షణార్థమై
శ్రామికులైన శ్రీ విజయసారథి సద్గురువర్యు నెంచెదన్

పరమాయుఃప్రథమార్ధపూర్తిసవనప్రాశస్త్య మంగీకరిం
చిరతుండై విజయాద్యసారథి సుధీశ్రేష్ఠుండు దివ్యద్రమా
వరకారుణ్యకటాక్షలబ్ధవిభవ ప్రాగల్భ్యుడై దార్ఢ్య సు
స్థిర దీర్ఘాయు రనంత భోగముల భాసించున్ మహోదారుడై
**(129వ అవధానము - గురువుగారి షష్టి పూర్తిలో, కరీంనగర్)**

మీరొసంగిన యుపదేశ సార మెలమి
సరస సాహిత్యధార్మిక చరిత నిలుప
బుణ్యకార్యాచరణము సుబుద్ధి బెంచ
గురుల నాపూన్కి కూతగా వరల గొలుతు

తరగతి నాలుగులోనే
పరువడి గవితా మహత్వభావస్ఫూర్తిన్
ధరనెరుకపరచు గురువరు
నరుదగు శ్రీ సోమసుందరాఖ్యుని దలతున్
(132వ అవధానము - కోదాడ)

గురుడొక డాగ్రహించిన నకుంఠితధార యొకింత యాగినన్
గరువు ఘటించు శబ్దముల గావ్యరసంబు నిరూఢి దప్పుచున్
బరువు నశించు గాన గురువర్యులు ముప్వురు నన్నృతార్థగా
బరువడి దీవన ల్గురిసి పాలనజేయగ బ్రస్తుతించెదన్
(133వ అవధానము - సిద్ధిపేట)

గురుపూజా మహితోత్సవ
పరమున నీసద్వధాన భాగ్యముకలిగెన్
గురుచరణ సరోజమ్ముల
కెరగియొనర్చెదను శ్రోతలెల్లరుమెచ్చన్
(142వ అవధానము - చిన్నకోడూరు)



# నివేదితాత్మ

సారాచారవిశారద
శారద నా మ్రోల నిలిచి సంతుష్టిగ నా
భారము తీర్చెను నేడీ
నారాయణ ఖేడు జనులు నవరసభరితుల్

**(1వ అవధానం - నారాయణఖేడ్)**

అవునన జేయు నీరమణయార్యుడు యాగము లూనుదీక్ష నీ
భువన గిరీల నూటపదుమూడవదైదగు చండికామహా
హవనపు టాజ్యధూమముల అష్టవధానము పెంపు మీరి చె
న్నవు చలరారు నంబిక కృపార్ద్రత రమ్యత కిమ్ము నౌనటుల్

అవునన జేయగావలతు నష్టవధానము అంబ సత్ప్రద
చ్ఛవి నవలంబనమ్ముగ బ్రసన్నత, దత్కరుణా కటాక్షము
త్సవ మొనగూర్చు బండిత సదస్సున దస్సన గుండె, దిట్టగా
భువనగిరిన్ గురుండు పెను పొందగ గీచు గిరిన్ నిబద్ధతన్

**(2వ అవధానం - భువనగిరి)**

నాలోన న్గవితావధానరచనానందామలావేశ ము
ల్లోలం బౌగతి గూర్చు భారతి కృతి శ్లోకప్రభూతాకృతి
వ్యాలంబమ్మున నండగా నిలువ దీవ్యద్రీతి నాచేతనౌ
లీలం బ్రోద్బలమిచ్చు మిత్రులకు గీలింతున్ నమోవాకముల్

**(3వ అవధానం - సిద్దిపేట)**

అవధానమ్ముల లబ్ధకీర్తుడనుగా నాశింపగాలేదు, వే
నవధానమ్మున జేయు కర్మలను బ్రత్యగ్రప్రజాత్రాభుడన్
అవధానాంతమునం దొనర్చు బహుమానాసక్తుడన్గాను, నే
టి విపశ్చిద్గణ మెల్ల మెచ్చ నిలుచుంటి న్డీవనల్ గోరుచున్

చేయుట గల్గునంచు, మరి చేసెడు శక్తి గలాడనంచు నే
జేయగలేదు జంకితిని చేయగ, నాశువు ధారణం బని
శ్చేయము నాకు నెమ్మది వసించిన శారద చేయజేసె నా
రాయణఖేడులో దొలుత, రక్తిని గూర్చెద నేడు మీకిటన్

(5వ అవధానం - మాసాయిపేట)

ఇది సాహిత్య పరీషదత్యమల సభ్యేహాసముల్లాస సం
పదనూనాప్రతిమాన సద్హృదయ సంభావ్యంబు, సచ్ఛ్రోతృస
మ్మద విద్వన్నికర ప్రపంచిత సుధాముగ్వాగ్విలాసమ్ము మా
యెదకున్ బందువు చెల్వుమీరు మెదకున్ హేరాళమౌ నీసభల్

(7వ అవధానము - మెదకు)

కవితావృత్తికి నంకురార్పణము మేల్గా నీబడిన్ జేసితిన్
గవి సమ్మేళన మందు దొల్తన యిదే గద్దెన్ గృతార్థుండనై
గవిగా బేర్గనినాడ, గావ్యరచనాంగ ప్రీతితో నుండి నే
నవధానం బొనరింతు నేడు బుధు లత్యంతంబు దీవించగా

అనుకొనలేదు నేను గవినై యెసలార గలాడనంచు ని
ట్లనుపమ రీతి మద్గురుల యట్టి మహామహులాత్మమెచ్చగా
జను నవధానము న్సలుపు చక్కని యీయవకాశ మబ్బునం
చును జదు వీబడిన్ జదువుచో నిది గూర్చిన అంబ నెన్నెదన్

కవులుబుధుల్ గురుల్ వెలుగ గ్రమ కవిత్వవధాననైపుణీ
చ్ఛవి నవలంబనంబుగ రసజ్ఞులు మెచ్చు వచస్సుధాంశుమ
త్ప్రవిమలరీతి నిల్చితిని. పాల్పడి పెద్దల యిచ్చు నాశిషో
త్సవవియదుత్తమస్థలి సదాగతి నౌ నరసింహరాముడన్

**(8వ అవధానము - కవి జదివిన ఉన్నతపాఠశాల సిద్దిపేట)**

ఏనేమి?యవధాన మేమియన్నను మాన
కను బ్రోద్బలము సేయు కవిసఖులకు
ఏనేమిటో సభకెరిగించు దృష్టితో
ఆత్రముతో బిల్చు మిత్రులకును
ఏనేమి చెప్పిన నిదికాదు కూడదం
చనక మెచ్చిన విద్వ దగ్రణులకు
ఏనేమి చేసిన నింతగా మదికెక్క
సొంపుగా విన్నట్టి శ్రోతలకును
ఇచట వీడేమి చేయునో యెంచి చూత
మనుచు భీష్మించకున్న కృపాబ్ధి వాణి
కతుల భక్తితో బహుకృతజ్ఞతల జెప్పి
పాలమాకుల నభినుతి వరలు చుందు

**(92వ అవధానము - పాలమాకుల)**

సరసులు పండితోత్తములు చాతురిమన్మహనీయ మూర్తు లి
ర్ధరసపిపాసు లూర్జితవదాన్యులు ధన్యులు కొండపాకలో
మెరుగగు రాఘవేంద్రనవమీ సుమహోత్సవపంక్తిలో గళాం
తరగురుకార్యమధ్య నవధానము సేయు మటంచు బిల్చినన్

**(11వ అవధానము - కొండపాక)**

అందరు మిత్రులే, మనము నందనురాగము గల్గువారలే
యెందును నైన నభ్యుదయమే సుమనోగతి తీవ్రపాదని
ష్పందనపీడనంబె ద్విజవాక్పరితోషణ,లోకరంజనం
బిం దవధానము న్ఘన విజృంభణ దాటిన తేజ మొప్పెడిన్
(17వ అవధానము - కొండపాక)

కవితాప్రక్రియ నిర్నిబద్ధమగు నిక్కాలంబునన్ ఛాందసుల్
కవి తా జీవిక వెళ్లబుచ్చగలడే, కావ్యంబు లింకేల? నిం
కవితా పద్యములేల యంచనుట, ప్రేంఖద్రీతి నష్టావధా
న విధానమ్ముల ప్రోద్బలంబుగ నెసంగన్ దబ్బరల్ గావొకో?
(19వ అవధానము - సిద్దిపేట)

నగరం బవధానము న్సలుపుదే నాడింధమప్రాజ్ఞు లా
నగ రంజిల్లు సువర్ణ సంచయమవై నైపుణ్య మేపార మి
న్నగ రంహోగతి శారదేయ కరుణా నాందివ్యళీకమ్ముగా
నగరం చుబ్బకు మానసంబ! అవధాన స్వాస్థ్యము న్బూనుమా!

పరమామోద సభాంతరాళ కవితాప్రాగల్భ్య మింపార, భా
గ్యరమా భోగము నేటి భాగ్య నగరం బష్టావధానప్రియో
ర్వర మాదృక్కవి లోకమందు దగు సుబ్బారాయ ధీమద్వరున్
బరమాయుః ప్రథమార్థ పూర్తిసవనప్రాశస్త్య మెంతోయనన్
(21వ అవధానము - హైద్రాబాదు)

పరమాత్మీయు డనూన ధీరుడు గురుత్వవ్యక్తి దొంత్రెడ్డి వం
శరమాభోగి, కవిత్వ విత్తముడు, లక్ష్మారెడ్డి నన్గొరె సం
బర మొప్పారగ నీవధానమున శ్రీ బాలాజి సేవింగ్సు డ్రా
పరమారంభము సాగు గాత యని యొప్పన్ దప్పునే నాకికన్

ఎవ్వడు మామకాదరసమీహితవృత్తి జరించు, గైతకై
యెవ్వడు గోరు, నాకృషికి నెందున దోహదమియ్య నియ్యకొం
చెవ్వడు సాగు, వాణి గుడి కెవ్వడు సాయమొనర్చు వాడు న
న్నెవ్విధి నేపని న్గానిన నెంతయు సిద్ధము చిత్త శుద్ధిగా

(22వ అవధానము - వేములవాడ)

న్యాయాన్వేషణతత్పరుండు, కవితా నందుండు వాగ్దేవతా
ధ్యేయుం డుర్వి బ్రకాశరాయమహితుండీపూట నిందూర నా
మ్నాయోపాసక విప్రసంఘము నిజామాబాదు వర్షోత్సవ
శ్రీయోగంబును గూర్చె శారద కృపాదృష్టిన్ సతం బేలుతన్

(23వ అవధానము - నిజామాబాదు)

తెలుగన, మేటివేంకటసుధీమణి సత్కవితావధూటు లీ
యిలను నమీనుఖా నిబరహీము మహీపతు లాత్మ మెచ్చగా
బలుకుల పోకడల్ కురిసి భాగ్యవతీ తిలకమ్ములైన ని
మ్ముల నవధాన మత్కవిత ముగ్ధగ వెల్గదె తెల్గు వారిలోన్

(24వ అవధానము - పటంచెరు)

నాకవితా సరస్వతి కనంత విధంబుల సేవజేసితిన్
నాకొకలక్ష్యమున్నయది, నాజననిన్ రమణీయ మందిర
శ్రీకృతి సుప్రతిష్ఠితగ సేవ నొనర్చగ శారదా కృపా
ర్ద్రీకృత చిత్తు లార్థిక పరిస్థితి పెంచుడి లక్ష్యసిద్ధికై

(25వ అవధానము - వేములవాడ)

ఆ లయకాలమూర్తి కరుణాలయు డంబిక కర్థమిచ్చె, బెన్
లీలల గోలకాడు నవలీలగ జంచల బంచజేర్చె, వే
నాలుక జేర్చెవాగ్జనని నల్వయు, శారద నిల్పెబూను నా
కాలయ కాలమందున సహాయముగా మది మీకు గూర్చుతన్

పనివడి నన్ను బిల్చిన సభాసదు లందఱికిం దిరంబుగా
మనమున హర్ష ముప్పతిలు మార్గమ అష్టవధాన మంచు నా
జనని యొసంగు సత్కళకు సత్కృతి కల్గిన జాలు నంచు శ్ర
ద్ధను జగమందు గ్రుమ్మరుట దప్పక స్వార్థము లేదు నామదిన్

బోధనమన్న నాయెడద పొంగును, వృత్తి గురుండ గాన, సం
బోధన గౌరవంబు పరిపూర్ణ ముదం బొనగూర్చు కాని య
బ్బో! ధన తృష్ణ నాకొరకు బొందదు. దేవళ మొండు కోర్కెయై
బోధన పట్టణంబున సుబుద్ధుల ముం దవధాన మేర్చెదన్

పూర్వజన్మము లోని పుణ్యమో పాపమో?
మానవరూప జన్మంబుకలిగె
మానవీయ తపఃప్రమాణమో? ఋణమో! క
విత్వంబు సెప్పు ధీమత్వ మబ్బె
కవితా కళాశిల్ప గరిమయో? లఘిమయో?
అవధాన శక్తి సంభవము గూడె
అవధానధీ దేవి కారాధన యొ? కాదొ?
దైవీప్రతిష్ఠ కుద్యమము జరిగె
కాకి సంద్రమ్ము దాటెడు కార్యమయిన
మామకీనయత్నంబు సమాజ శక్తి
నిర్విరోధ సహాయ మందించెనేని
కష్టసాధ్యమ్ము కానిమ్ము కాక పోదు

(26వ అవధానం - బోధన్)

గుణవంతుండగు లక్ష్మికాంతు నెదలో గొండాడు దీ యెన్నికన్
గణనీయంబుగ గెల్చి వెల్గె బదవిన్ గజ్వేల్ సమిత్యుర్వరన్
రణదీక్షన్గొని చిత్రకావ్య రచనా ప్రాగల్భ్యము న్నేను వీ
రణు వంతైన సమానమైతి మిటులీ యష్టావధాన క్రియన్

ఎవ్వనికీర్తికాంత కవులెన్నక శాశ్వత జీవితంబుతో
నెవ్వగ లేక వెల్గదు, మహీప్రజ కెంటి సేవ సేసినన్
నెవ్వగ లేక సత్కవుల నిండు సభాస్థలి నాదరించునో
నవ్విభు డర్థవత్కవిత యందు జిర స్థితినందు నిద్ధరన్

రారమ్మోయి కవీంద్ర! నాకొక కృతిన్ రమ్యంబుగా నిచ్చి చె
ల్వారం జేయు మటంచు వేడిన నృపుల్ వర్ధిల్లి నా రంచిత
శ్రీరంజిల్లు యశో విలాసముల నిస్సీ!యేటి కంచు న్గలిన్
జేరందీయని భూపతుల్ సనిరి వాసింబాసి నిర్నాములై

జననీశారద కెన్న దేవళము నా శక్యంబు గాదంచు సం
జనితావేదన దాతల న్వేదికి నిచ్చ న్వేడగా లేవు ని
ల్చె నిరూఢాష్టవధాన వేదికను లక్ష్మీ కాంతు డధ్యక్షుడై
మనమా! వంతదొలంగు మింక ధనమా? మాటొక్కటే కోటియౌ

గుడికట్టన్ దొరకొంటి నే దొరను నే గోరంగ బోలేదు. ప్రే
ముడి మీరంగను మీర లీయగల డబ్బున్ గూర్చ నీవేదికన్
బడిపంతుల్ల కసాధ్య మేదియని దల్పంజేయ నష్టావధాన
నడుగంగా వలెనా? యటంచు దయసేయ న్మెత్తు మిమ్మెప్పుడున్

**(27వ అవధానం - వర్గల్)**

నాకవితా సరస్వతి జనప్రియయై యొసలారు టెంత లో
కైక సుధీ ప్రసాదిని జగజ్జననీమణి శారదాంబ క
స్తోకతపఃఫలంబుగ విశుల్ తరియించగ నాలయంబు నూ
రీకృతమౌనటుల్ నిలుపురీతిని నిల్వక యున్న నుర్విలో
(29వ అవధానం - సిద్ధిపేట)

నాకు గవుల్ కవిత్వ మనినన్ జిననాడెటు నాటెనో? తను
శ్రీకడు పుల్కరించును, గృషిన్ సభలోపల నెప్డు నిల్తునా?
ప్రాకట సత్కవిత్వకళ బారము ముట్టుదునా? యిదే వ్యధన్
మీకు గళా పిపాస గడిమించగ జేయ దలంచి వచ్చితిన్
(31వ అవధానము - గోదావరిఖని)

చోద్యంబయ్యెడు బాలబాలికలలో శుద్ధావధానక్రియన్
బద్యం బొక్కటినేర్వగా వలసినన్ బంద్రెండు సార్లైననున్
మాద్యచ్ఛ్రద్ధ బఠింపగా వలయు నంబా సత్ప్రసాదమ్మునన్
సద్యస్స్ఫూర్తిని ధారణం బొనరుతున్ జాతుర్య మేపారగన్

పిల్లలలోన సత్కవిత ప్రేరణజేయగ నీవధాన వి
ద్వల్లలితాంగి మంజుల పదక్రమనర్తన హావభావ సం
పల్ల సితాది చేష్టల సభాముఖహాస్యవిలాస లాస్యముల్
పల్లవిగా రహించునని పాటున కోర్చి యొనర్చ వచ్చితిన్
(33వ అవధానము - భెల్)

ఈనారాయణఖేడులో జనులు నన్నేనాడొ అష్టావధా
నానూనావ్యవధానకార్యమున దీవ్యద్రీతి నిల్పెన్, సద
స్యానందమ్ము ఫలమ్ముగా జరిగె బంచాబ్దమ్ము లీనాటితో
గానం ధన్యవచస్సుమాంజలుల శ్లాఘాపాత్ర మీనేలయున్

ఈయవధాన సత్కృతుల నెన్నడు స్వార్థము గోరి వాడ, వి
జ్ఞేయముగా సరస్వతికి జెల్వగు నిల్వెలయింప దానరా
ధేయులు మీరలై ధన మదే పనిగా దయసేయనౌను, నా
రాయణ ఖేడు వేదిక పరంపరగా సిరి రాసి వోయుడీ!

**(36వ అవధానము - నారాయణ ఖేడు)**

మీరినప్రేమలింగయకు మిత్రుడ నౌట సరస్వతీ మహా
గారము గట్టబూనుట, యకల్మష వృత్తిగ నాత డెంచుటన్
గౌరవభావముం గలుగు కారణ మీ విధిగోరె జిన్నకో
డూర వధానము న్జలుప నూకొన, వారిని దేవి కాచుతన్

ఇరువది యారేడుల ము
న్నిరవుగ నేడవది చదివి తీబడిలోనన్
బరువడి నష్టవధానిగ
బరగితి మద్గురుల యట్టి వారలుమెచ్చన్

పుట్టితి నీయారనె చే
పట్టితి నిట గవిత వ్రాయుపని సత్కవి స
మ్రాట్టులు మెచ్చువధానం
బిట్టె యొనర్చెదను జూడుడీ కోడూరన్

చక్కెర గోలీల్దినుచున్
జక్కగ జదివితిని చదువు సత్కవితా స
మ్యక్కృషి వాఙ్మాధురి మీ
కిక్కడ బంచెద వధాన మింపగురీతిన్

**(37వ అవధానం - చిన్నకోడూరు)**

రంగాచర్యులు నాకు శిష్యు డొకటన్ రంగస్థలం బందు వృ
త్తింగూడన్ సహచారి, తత్త్వమున వృద్ధింబొందె నాత్మీయతా
సంగుం డన్నిట నిర్మలాప్తుడగు నిచ్చన్ బాలపోచయ్య నా
సంగాతమ్మును గోరు వారగుట నాశాసింతు శ్రేయంబులన్

నాయవధాన కర్మమున నాణ్యత జూచిన మీరు మెచ్చి వి
జ్ఞేయముగాగ సత్కృతిని జేయుధనంబును శారదాలయ
శ్రీయగుదాక నిచ్చుటకు జేసితిబాస నిరాశచెందకన్
సాయమువచ్చి చేయుటకు సత్వరమే దయసేయు డిందరున్

నాగురుమూర్తి సత్కరుణ నమ్మి వధాన సభాతలంబునన్
సాగెద సత్కవిత్వఫల సారము సాయము గాగ దేవికై
జోగిగ జోలి గట్టితి విశుద్ధమనంబున డబ్బు గూర్చుడీ
దాగక దాన మిచ్చిన వృధాయగునే ఫలమీదె మీ కిలన్
**(38వ అవధానము - పెద్దచీకోడు)**

అవధానం బొనరించు దక్షతయు నా కావంతయున్ లేదు. నా
కవధానంబుల గీర్తి గన్డలపు స్వప్నావస్థలో లేదు. మ
ద్భవమున్ సార్థకముం బొనర్చెడు సరస్వత్యాలయ స్థాపనో
త్సవపుణ్యంబున భాగమున్ గొనెడు దాతల్ చిక్కుటన్ గోరెదన్

వింతగు నీవధాన జయవేదికనెక్కి కవిత్వతత్వ ది
గ్దంతుల బోని పండిత వతంసుల కెంతయు దృప్తిగూర్ప ధీ
మంతుడగాను. శారదకు మందిరము న్వెలయింపగల్గు శ్రీ
మంతుడగాను, శ్రోతల సమస్యల దీర్చగగల్గు సత్క్రియా
వంతుడగాను, దాతలగు వారి యుదారత లెక్క గట్ట హ్రీ
మంతుడ గాను భారతి సమస్తముగా మది నమ్మి సాగెదన్

అవధానమ్ముల నాకు జేయబడు నర్ధాలంబసత్కార ము
త్సవమొప్పంగ సరస్వతీ జనని కుద్యద్దైవతాగారవై
భవమం దప్పన సేసెదన్, రసిక సభ్యశ్రేణి వర్షాంబుధా
రవలెన్ రాసిగ బోయుడీ సిరిని గోరన్ గోర కున్న న్నదిన్

న్యాయమూర్తి కోదండ రామాభిధాను
డలరె ముఖ్యాతిధిగ, సభాధ్యక్షపీఠ
మందు వేంకట సత్యనారాయణుండు
నిండుమది దీవనల నీయ నిలుతు నేడు

**(41వ అవధానము - హైదరాబాదు)**

విద్యాపూర్తి యొనర్చి యుత్తమముగా బేరెన్నికం గాంచి నే
నుద్యోగమ్మును గోరుకొన్నదిన మం దూహించ లేదెట్టి కిం
చిద్యోగమ్మొకొ? చూచి చూచి తగ గాజీపూరులో నుంచెనో
సద్యఃకీర్తిని నిల్పె శాశ్వతముగా సద్భాగ్యయోగంబునన్

చదువేఁజెప్పితి గొంత కొంత బెరుకౌ సల్లాపముల్ గూర్చి, యిం
పొందవంగా దగు శాస్త్రవేత్త యను పే రూహించకం బొందితిన్
బ్రదుకన్నేర్చితి, నేర్పితిన్, మరువ నెప్పాటైన గాజీపురం
బిదియౌ శాశ్వత మీవధానమున నాకేనాటి కంచెంచెదన్

తెనుగు పండితు డిట్లుండు ననుచు దెలుపు
నట్టి యవకాశ మీ యూర నబ్బె నాకు
చదువు జెప్పుట నోనమాల్ సదివి తిచట
గావుననే కాజిపుర మన్న గడు దపింతు

**(44వ అవధానము - కాజీపుర్)**

అష్టవధాన కార్యము ధనార్జనకై వినియోగపర్చ నే
నిష్టపడన్, సరస్వతికి నింపగు దేవళ మేర్పరింపగా
గష్టము నోర్చి,చేసి బుధకాండము లిచ్చను మెచ్చియిచ్చు వి
స్పష్టశుభాశిషంబుల బ్రసన్నుడగా మది నమ్మియుండెదన్

**(45వ అవధానము - కోహీర్)**

గుండెల నిండుగా దెగువ గూడిన దాతలు చేతి నిండుగా
మెండుగ నీయగా సుకరమేగద! శారదయిచ్చు సత్కళా
పాండితి నీవధాన సభ భాసిల యాచన జేయ వచ్చితిన్
దండిగ బంప యాదగిరి ధర్మము జాటెద దిగ్విదిక్కులన్

**(47వ అవధానము - యాదగిరి లక్ష్మీనృసింహ దేవస్థానం)**

అవధానాదిక చిత్రపద్యరచనా వ్యగ్రాంతరంగమ్మునం
దవిచారమ్ముగ సాగివచ్చితి వికారాబాదు సభ్యప్రియం
బవు గా కం చవధానమున్ సలుపుచో నాశీర్వదించంగ భా
రవి బోల్పండిత వర్యులన్ మనమునన్ బ్రార్థింతు నశ్రాంతమున్

**(50వ అవధానము - వికారాబాదు)**

మనమున నున్న భావనలు మాటలు వెల్వడజేయు, మాటలున్
జనుల కమేయమోద మిడ జాలిన జాలదు. శాశ్వతంబుగా
ఘనతర పుణ్యభాగులకె గాక యితఃపర మేరి కబ్బు నీ
శనినగరంబులో జరుగు సత్కవితాసభ నెన్నగా దగున్

కవినయి కొన్నిపద్యములు గాని రచించిన జాలునంటి స
త్కవినయి కావ్యరాజముల ఖ్యాతి వహించుట పెద్దలెంచి రు
త్సవముగ బండితాళి అవధానముతో గృతకృత్యుడౌనటుల్
దివిజులు దీవన ల్గురిసి తేకువ నిల్చిరి వెన్ను దట్టుచున్

**(53వ అవధానము - శనిగరం)**

ఒక్కడనేను బల్వురిని నొక్కొక సారిగ జేరలేక యీ
చక్కని ప్రక్రియ న్గొని రసజ్ఞుల యాచన చేయవచ్చి నా
నక్కర గుర్తెఱింగి హృదయంబుల విప్పి తెగింపు చూపినన్
వాక్కుల తల్లి మిమ్ముల గృపామహిమం గన నర్థిగోరుదున్

రక్తి వహించ భాగ్యనగరమ్మున మూడవధాన కార్యముల్
శక్తి కొలంది చేసితిని సద్బుధులాత్మను మెచ్చు నాలయా
సక్తి జతుర్థ మియ్యెడల సల్పెద గల్పకభూజ కల్పసు
వ్యక్త వదాన్యశేఖర సహాయము గైకొనిపోవు కోర్కితో

(54వ అవధానము - హైద్రాబాదు)

అవధానంబేబది యే
డవదియ దిగ్వాలునందు నభ్యుదయముగా
నవధానులైన శ్రోతల!
చెవులకు విందైనరీతి చేసెద శ్రద్ధన్

(57వ అవధానము - దిగ్వాలు)

మిత్రులు గోరినంత మిడి మేలము లెంచక భావి పౌరులౌ
ఛాత్రుల భావబీజముల జల్లుల జల్లుచు నంకురింపగా
బాత్రుడ నైన జాలునను భావన నీయవధాన కార్య మా
ముత్రిక దృష్టి చేసెదను మోదము గూర్చెద నంగునూరిలో

నరుడు పది గల్ల దాను బెనంగు నూరు
గడనసేయంగ నవధానకళను గెలిచి
తనివి సెందక నంగునూ ర్తడివి చూడ
దలచి వచ్చితి విజయేచ్ఛ తలపు నిండ

(58వ అవధానము - నంగునూరు)

గుడిగట్టంగ వధానవేదిక వచఃకోదండ నిర్ముక్త నై
బిడభావాశుగపీడన ప్రతిముఖోర్వి న్నిల్చి కావ్యామృతం
బడుగంటన్ జవిచూచు శ్రోతలకు దివ్యానందముం బంచు ద
క్షుడు నా గీర్తి వహించ వచ్చితిని విజ్ఞుల్ మెచ్చ రామంచకున్

రామం చారు పయోద నీలవపుషం రక్షోనిహంతం గుణా
రామం చాంద్రమ సాచ్ఛకీర్తి విసరం రాజీవనేత్రంభజే
రా మం చేకపదప్రణామ మననార్థప్రాప్తి దీవించగా
రామంచన్ మహితావధానసభ పారమ్యంబు గావించెదన్

**(59వ అవధానము - రామంచ)**

ఒక యాందోలున దక్క నీ మెతుకులో నొప్పారు తాలూక ల
న్ని కలెందిర్గితి. నీవధానసభలన్ నిండార, నీనాడు దా
నికి సంపూర్తి యొసంగె నేడు విబుధానీకంబు దీవించ వా
ణికి దేవాలయ మొందు గట్టు పనియే నిశ్చప్రచంబౌనటుల్

అందోలున నవధానం
బాందోలన కలుగకుండ నలరెడు నటుగా
నాందోళికాది గౌరవ
మందిన యటు లెంతు నే గృతార్థుడ నైనన్

**(64వ అవధానము - ఆందోలు)**

అర్థిమెయిన్ సరస్వతికి నాలయ మొండిట మీ సమీప మం
దార్థిక శక్తిలేని హృదయ ప్రబలత్వము పూని, పూని వి
ద్యార్థులకు న్నవధాన మిటులంచు నెఱుంగగ జేయ వచ్చి ప్ర
త్యర్థులు మెచ్చ నిల్చితి సదస్సులు ప్రస్తుతి సేయుచుండగా

అటు గోదావరిఖ న్నిటన్ శనిగరం బష్టావధానక్రియల్
పటుకీర్తి న్గానగా గరింనగరు జిల్లా చుట్టి యేవచ్చి తి
చ్చటు నధ్యాపకపాళి శ్రద్ధమెయి నిచ్చన్గూర్చి రవ్వారి ధీ
పటిమ న్జూపి ప్రహృష్టులన్ సలిపెదన్ వాగీశ్వరీ సత్కృపన్

(66వ అవధానము - శనిగరం)

నాయూర న్నభయన్న బొంగితిని, విన్నాణంబు సూపింప నె
న్నోయూళ్లన్ బలు మండలమ్ముల జయోద్యోగంబుచేదిర్గి శ్ర
ద్ధాయుక్తిన్ రసికాగ్రణుల్ సలుపు సన్మానంబులం గొంటి దీ
ర్ఘాయు శ్రీ విలసిల్ల బండితుల శంసాశీస్సుల న్మంటినే

(68వ అవధానము - రాజగోపాలపేట)

ఆహారమ్మును మాని దీక్షమెయి విద్యాలబ్ధి కేతత్పురిన్
దేహమ్మున్ దపియింప జేసి యటు లుత్తీర్ణుండనై యేగి, నే
డీహాత్యాగమొనర్చి భారతికినై యిల్నిల్ప నష్టావధా
నాహావంబున నిర్వదేడులకు శక్యంబయ్యె నేనిల్వగాన్

రంగద్వైభవ మొప్పు దేవళము నిర్మాణంబు చేయించు దీ
క్షం గ్రమాష్టవధాన వేదిక మదాకాంక్ష న్నివేదించి య
ర్థిం గామ్యార్థము లిచ్చు దాతృతతి నర్థించంగ నేర్పాటు శ్రీ
రంగస్వామి ముఖుల్ బొనర్చి రిటు లోర్గంటన్ గృతార్థుండగాన్

(73వ అవధానము - వరంగల్)

పండితమండనం బయిన భవ్య సభాస్థలి నిల్చి, భావనా
ఖండవచోనిరూఢి కవికర్మమొనర్చి యథామతిన్ సుధీ
మండలిమెచ్చ సత్కృత సమస్త పదార్థము శారదాలయం
బొందు ననంతసాగర పురోర్విని గట్టుట కిత్తు నెప్పుడున్

తేపకు వెన్ను దట్ట గల ధీనిధి, నాకు గురుత్వ మిచ్చి సం
తాపముగూర్చి నాకొఱకు తల్లి సరస్వతి కైన శ్రీకిషన్
ప్రాపకమెందు బోయె, గనుపాపనుగా నను గాచుచున్న త
ద్వ్యాపృతి, వాయజాల నవధానమటన్నయెదన్ గలంచెడున్

**(80వ అవధానము - సిద్దిపేట)**

ఒకపద్యంబును గంరపార మగున ట్లుంచంగవిద్యార్థి పా
యక బల్మాఱు వఠించగా వలయు, బద్యశ్రేణి జెప్పంగ నా
శుకవిత్వంబున నప్పజెప్ప టనినన్ జోద్యంబుగాకున్నె? బా
లకు లబ్రంపడగా వధానము జనశ్లాఘ్యంబుగా జేసెదన్

బెజుగామ చంద్రయార్యుడు
విజయంబును బొందె నేటి విజయవధాన
ప్రజనిత పరమామోదం
బు జరుపగ దలంచుదాని బొందుటవలనన్

**(81వ అవధానము - కుకునూరుపల్లి)**

అవధానమును జేయు నవకాశమన్నచో
వాణి సత్కృపగల్గ వలయు నెలమి
సభగూర్చు నట్టిచో నభిమానులేకాదు
పరిచితుం డొకడైన వరల వలయు
అతత కవితామహాశక్తి బ్రేరేచు
పృచ్ఛకప్రతతి లభించ వలయు
జెప్పిన దానిలో జిప్పిలు రసమును
గ్రోలురసికులు చేకూరవలయు

చేరువారలకే చీకు చింతలేక
గంటకాలము కూర్చుండ గలుగవలయు
నిన్ని యొనగూడ సభయొప్పు, నెన్నిచెప్పు
కొనినను నదృష్టమే యొన గూడ వలయు

(83వ అవధానము - సూర్యాపేట)

కవితా శిల్పవిలాస
వ్యవధాన విహీన సభ్య భవ్యవధాన
ప్రవిధాన మాధురీ ధురీ
ణవిధి విధాయకముగా గనందగు బుధులున్

(85వ అవధానము - వాచగిరి)

కవితకు గాణయాచియయి, క్రమసుచిత్ర మనోజ్ఞ శిల్పవై
భవమున సాటి లేనిదయి వర్తిలు నేకశిలాపురిన్ బున
ర్భవ రహితంపు గార్యమగు భాగవతాగమధాత, పోత స
త్కవి విభవంబు జాటెద వధానము నన్బుధు లెల్ల మెచ్చగాన్

లలితస్కంధము కృష్ణమూలము శుకాలాపాభి రామంబునై
ఇలలో భాగవతాఖ్య కల్ప తరు వుర్వీశాశ లీడేర్చకన్
వెలయించె న్మన పోతరాజు, కవితా వీధిన్ సమస్తాస్తికో
జ్వల సాయుజ్యఫలంబుగా, నతని కే సాగిల్లెదన్ భక్తితో

(87వ అవధానము - వరంగల్లు)

బాలురకు బద సంపద, భావరూఢి
భాషలోని చమత్కృతుల్, పరమధార
ణాశుకవితా విలాస సదాశయములు
తెలియనవధాన కళనిట్లు దేటపరుతు

పద్యం బొక్కటి నేర్వగా వలసినన్ బల్మారు పారక్రమం
బుద్యద్రీతి బరింప జిక్కదుగదా! ఓహోయనం జేయనే
బద్యం బప్పుడె చెప్పి, ధారణ యొనర్పన్ వింతగా దోచదే?
విద్యార్థుల్ గమనించ గోరెద, సభావిజ్ఞుల్ ప్రశంసించగాన్

(89వ అవధానము - దేవరయాంజాల)

అంజనేయులు నా మిత్రు డగుట నతని
తోడి గురువుల రససిద్ధి గూడుకతన
భవ్యకవితాభిమానులు వరలు చుంట
పొసగె నవధాన సభయు గుత్బుల్లపురిని

(90వ అవధానము - కుత్బుల్లాపుర్)

కంగా రెందుకు మానసంబ! కవితాకల్యాణ సద్భావనా
సంగత్సత్కవిపుంగవప్రతిభ యాశ్చర్యంబు గల్గించగా
రంగద్వైభవమూర్తి శారద సుతారంబై యొనర్పించెడున్
లింగంపల్లి వధానవేది రసికాలిం దన్పు నిశ్చింతగాన్

(91వ అవధానము - శేరిలింగం పల్లి)

కోహీరులోన గవితా
వ్యాహారము లొలుకునట్టి యవధానకళా
శ్రీహేలగా నొనర్తు సు
ధీహృదయాహ్లాద జనక ధీయుక్తిమెయిన్

(96వ అవధానము - కోహీర్)

వచనంబున నడిగిన ని
ర్వచనంబున జెప్పి కంఠపారముగ నని
ర్వచనీయగతిని జెప్పిన
వచనీయ యశఃప్రశస్తి వశమౌ కాదా!

(98వ అవధానము - పెద్దచెప్యాల)

ఒక్కడు గా దెనమంద్రును
జిక్కులు వెట్టుటకు వచ్చి చేరిరి కవితా
ఫక్కిని చక్కగ జూపిన
నిక్కడ వాగ్దేవి కరుణ నృత్తం బాడున్

(99వ అవధానము - రామాయంపేట)

శ్రీకార మ్మెటు చుట్టినానొ? కవితా శ్రీచెల్వు మీరంగ, దే
వీ కారుణ్య మదెంత మేరయొ? యొనర్పించెన్ శతాష్టావధా
నైక ప్రజ్ఞ బయల్పడన్ సుకృతిగా నీరీతి సారస్వత
స్వీకారమ్ము సరస్వతీనిలయ దీప్తిన్ మించ భావించెనో?

అనా డెట్టిముహూర్తమో? బ్రతుకులో నాశించ, నష్టావధా
నానూనవ్యవధాన హీన కవితా వ్యాసంగ మీరీతి, నా
కానారాయణ ఖేదు సత్సభ బుధా హ్లాదా శిషామోద స
న్మానశ్రీమహితంబుగా శతము నీ నార్సింగితో నిండెడిన్

తెలుగున మాత్రమే కలిగి దివ్యయశంబును గన్న యీకళన్
బలుకులతల్లి సేవకయి పాటుగ నెంచక బూని నాడ, నూ
రులు మరివేలు సత్కృతిగ రూఢి నొసంగు నుదారులెందరో
కలుగుట చేసి నూరవదిగా నవధానము నారసింగిలోన్

అవధానమ్ముల దీక్షగా గొనుచు నీ యాంధ్రప్రదేశమ్ము మ
త్కవనామోద రసప్రసారణ విధోదార క్రియా రూఢి మిం
చవిశేషంబుగ జుట్టి వచ్చితిని, భాస్వత్కీర్తులౌ పండిత
ప్రవరుల్దీవెన లీయ వాణిగుడినిల్పన్ స్వల్పకాలమ్మునన్

(100వ అవధానము - నారసింగి)





పద్దెములు సెప్పి బాలల
కొద్దికగా నేర్పు గూర్చు నూహల నవధా
నోద్దేశ్యము తీరుటకై
ముద్దగు నిద్దంపు భావముల గుది గూర్తున్

అలర నాదిత్య విద్యాల యమ్మునందు
జదువు వారల కుత్సాహ సరళి బెంపు
గూర్చు నవధాన కవితానిగూఢభావ
రచన, శ్రోతల కెల్ల నబ్రంబు గూర్చు

**(104వ అవధానము - సిద్ధిపేట)**

ప్రాంతీయ వ్యవసాయ శోధనక కేంద్ర శ్రీయు, చైతన్యనా
మాంతస్సాంస్కృతికాభివృద్ధి సద ముద్యద్రీతి శ్రీవేంకటే
శాంతర్మండప మందు సభ్య జనమోదాష్టావధానక్రియా
చింతన్ బాలెము జూచు యోగము ఘటించెన్, భాగ్య మంచెంచెదన్

అష్టోత్తర శత సంఖ్యా
కేష్టిగ బాలెం వధాన మెంతేని తగెన్
స్వేష్టాపూర్తిగ బండితు
లిష్టాశీర్వచన సమితి నీయగ గొలుతున్

**(108వ అవధానము - పాలెం, మహబూబ్‌నగర్ జిల్లా)**

కొల్లాపురమున నవధా
నోల్లసనము న్యాయవాదులొప్పెడునటులన్
దల్లిదయ సలిపెదను వి
ద్వల్లీలకు నుద్దిగాగ, దనియ సదస్యుల్

**(111వ అవధానము - కొల్లాపురం)**

సాంద్రీభవరసవీచీ
మంద్రరవోజ్జ్వల మహస్సు మాకంబ యిడన్
కేంద్రీయ విశ్వవిద్యా
కేంద్రాలయము స్వధాన కీర్తి వెలుంగున్

సరసావధాన హేలా
పరులౌ శ్రోతలు, రసజ్ఞ పండిత వరులున్
బురణించు సర్వ విద్యా
సరస్వతీ విభవ మట్లు సాగుత సభయున్
(114వ అవధానము-కేంద్రీయ విశ్వవిద్యాలయం-హైద్రారాబాదు)

లింగన మది కెనయగు నా
లిం గనకాంబరసుతావలిం గన జేయన్
లింగనతి ప్రాచు గవిపా
లింగన షష్ట్యబ్దపూర్ణ లీల యొసంగెన్
(116వ అవధానము - సిద్ధిపేట)

అవధానంబుల షోడశోత్తరశతం బాపూర్ణమయ్యెన్, సద
స్యవిశిష్ట ప్రమదంబు గూర్చి బహుళాశాస్యంబులం బొందితిన్
వివిధాత్మీయకళావికాసముల సంవిద్దేవత న్నిల్పితిన్
భువి ధన్యుండ నృసింహరామ శుభనామ్ము న్నన్ను దీవింపరే!

సరసంబై యొసలారుగాక సభ, అచ్చంపేట నంబాలయో
ర్వర ధన్యత్వము పాలమూరు జనతా రమ్యావధానక్రియా
స్వరసాస్వాదమహత్త మేమెరుగగా, భావామృతాసేచన
స్థిర చిత్తంబున నీ సదస్యులకు వైశిష్ట్యంబు చేకూర్చుచున్

మెతుకు ననంతసాగరపు మేదిని, దేశమునం దృతీయవా
క్షతి నిలయంబు సుందరముగా నెలకొల్పగ నీవధానమే
గతిగ దలంచి ధన్యతమకాముడనైతి, రసజ్ఞులీ పుర
స్కృతులను గాక దర్శనము చేసిన దృష్టి యెసంగు నెంతయున్

నచ్చిన దడిగిన విబుధుల్
మెచ్చెడు గతిజెప్పగలుగ మేలని తలతున్
వచ్చిన యంతన్ బలికెద
నొచ్చక రసహృదయ వృత్తి నుడువం గనుడీ!

**(117వ అవధానము - అచ్చంపేట)**

అడిగిన దొక డడుగడు గడు
గడుసుదనము బుడికి పుచ్చగా నిడుమ లిడన్
నుడులిడు పడతిదయ కడిమి
నుడివెద జడిమను విడంగ నూతన శక్తిన్

**(121వ అవధానము - హైద్రాబాదు)**

మర్యాదాపురుషోత్తముండయిన రామస్ఫూర్తి శ్రీమన్నృసి
హార్యమ్ణార్భుదరోచి తోచునటు లాఖ్యన్నిల్పు నాతండ్రి యాం
తర్యం బెంచి సరస్వతీ జనని కై దాపుండగా జేసెదన్
జేర్యాల న్మహితావధానసభ నాశింతు న్సభామోదమున్

**(124వ అవధానము - చేర్యాల)**

ఇక్కడివాడనై బ్రతుక నెక్కడి కేగితి, నెట్లు వాక్సతీ
ప్రాక్కృప యందగా వెలుగ వాసరలో దప మిచ్చజేసితిన్
జక్కని శారదాలయ మెసంగగ జేయ ననుజ్ఞపొందినా
నొక్కడ దత్కృతార్థత మహోద్యమ మయ్యె నిరంతరమ్ముగా

ఇమ్మని యమ్మనడుగ, గా
నిమ్మని పనివారి గదుర, నీయని దాతన్
దెమ్మని పీడించను, ది
వ్యమ్ముగ దేవళము వెలసె వాణీకృపతో

సన్మానంబుల కాసపెందను, మహాసంకల్పవైకల్యముల్
జన్మార్జిత పుణ్యపాపములుగా సంధింతు, దేవీ కృపా
వన్మాంగల్యము సర్వసాధకముగా భావింతు నష్టావధా
నోన్మానోజ్జ్వల కీర్తి నాలయమునం దొప్పార నర్పించితిన్

అమ్మను గోలుపోయితిని, యారయిదేట, త్రయోదశాన గ్రా
మమ్మును వీడిపోయితిని, మానక భూమి సమస్త మేదితిన్
దమ్ముని గోత్రఖండనము తప్పక, బచ్చనపేట తోడ బం
ధమ్ము సుమారుగా నయి, వధానము గూర్చెను నేటితో నిటుల్

(125వ అవధానము - బచ్చన్నపేట)

శ్రీముఖసాహితీ సమితి శ్రీమహితంబుగ మద్వధాన వి
ద్యామహితాద్భుత ప్రవచనాంతరుదీర్ణమనోజ్ఞ భావనా
స్తోమ సమంచితాదర విశుద్ధ మనంబున బిల్వ వచ్చితిన్
మీమది మెచ్చినన్ యశము మించెద భావనమీహితమ్ముగన్

(126వ అవధానము - సికింద్రాబాదు)

అవధానమ్ముల లక్ష్య సిద్ధియయి విద్యాదేవి కుద్యద్గతిన్
నవదేవాలయ మొండు పూర్తియయి మానన్జేసె నష్టావధా
న విధంబున్ గురుషష్టిపూర్తి మరలన్ నన్నిట్లు జేయించు న
వ్యవధానవ్యసనక్రియా విచరిత వ్యాసంగ నిస్సంగునిన్

(129వ అవధానము - కరీంనగర్)

ప్రతిపదలభ్యమాన బహుభావ సమంచిత సంచితార్థ రూ
పితగతి నీసభాసదులు విత్తము లుత్తమ చిత్తవృత్తులున్
హిత కవితావధానరస హేల బ్రమాది సమాది సౌహృద
స్థితినను బిల్వ బంచిరి, నుతించెద వారల కర్థసిద్ధికై

మరచిన మద్వధానరసమాధురిమన్మహనీయధార కు
ర్వర నిది ప్రేరణంబగు, నిరంతర మీభరతాఖ్యధీవరుం
డెరుగని నన్ను బట్టుదల యేర్పడగా బిలిచెన్, నిరాకరిం
చురహి నెఱుంగకన్ గుములుచున్ బయనించితి దల్లిసేవకై

(132వ అవధానము - కోదాడ)

శ్రీసత్యరంగ విబుధుడు
ధీసముచితు డీవధాన ధీప్రకటన నా
శాసించె నీ యనంతపు
రీసదమున ధన్యవాద రీతినుతింతున్

(138వ అవధానము - అనంతపురం)

తూరుపు కోస్తావెంబడి
శారద కరుణాప్తి నీవిశాఖను దొలుతన్
గూరిచెనాయవధానము
కోరిక తీరినది ముదము గూడెను నాకున్

పరిచయమైన నుండి దయివారెడు సత్కృప సుబ్బరాయధీ
వరుడు ప్రసన్న భారతి నెపంబున సంగత సంగశీలుడై
వరలుచు మద్వధానసభ పండిత మండనమున్నొనర్చెనే
కరము కృతజ్ఞతాంజలుల క్రమవినీతి సమర్పచేసెదన్

గరికపాటి నృసింహ రాధ్యనకవీశు
డమలు డధ్యక్షుడౌటయే యశమునాకు
వారిపరిచయ మతిభాగ్యవశము నాకు
చిరతరం బీవధానము మరపురాదు

(139వ అవధానము - విశాఖ)

ఒకయవధాన మేర్పరచు టొప్పుగ గష్టము. శ్రోత లెక్కు డుం
డక సభాసేలవంబు నగుటం గనుచుందుము, పద్యవిద్యలో
బ్రకటయశంబు గైకొని ప్రక్రియ, అష్టవధానసప్తకం
బొకట సమీక్ష సేయు రసికోత్తములుండుట దీక్షయేకదా!

కవితాక్రీడగ నొక్కడన్ సలిపితిన్ గాదే పటంచెర్వులో
నవధానత్రయ మొక్క రోజు మును, నాకాశ్చర్యమయ్యెన్ సభా
వ్యవహారంబు గుదుర్చు టేడుదినముల్ ప్రాశస్త్యమున్గూర్చె సం
భవమై శ్రోతల గూడ మెచ్చవలె నిర్వాహంబున న్దోడుగాన్

ఇది శ్రీలేఖ సుసాహితీ సమితికిన్ హేలా విలాసంబుగా
నొదవించెన్ యశ మోరుగంటి రసికోద్యోగంబు యోగంబుగా
హృదయాకర్షకమైన తీరు గన సౌహృద్యంబు వాగ్దేవి నిం
డుదయన్మ్రోచుట చేత సాధ్యము పటాటోపంబు లెట్లుండినన్

(140వ అవధానము - వరంగల్)

రంజిలునట్టి భాగ్యనగరం బవధానసరస్వతీ కృపా
భ్యంజన పద్య విద్యకు సహస్ర సమంబును నిర్వహించుచో
మంజుల మాతృభాష కవమానము సాగెడులోకరీతులన్
భంజనము న్పొనర్చు సభ భాగ్యము లక్ష్యము సిద్ధియైనచో

నాయవధానవాణి జననందనమై జనయిత్రి పల్కులన్
బాయనిదై స్థిరంబయిన వాచికమున్ బహుళ ప్రచారమై
శ్రేయము గూర్చుగాక, కవిసిద్ధులు పండితులైన వారితో
ధ్యేయము తప్పకుండ సముదీర్ణము గావుత ఎల్లవేళలన్

జ్ఞాన పీఠ సన్మానితు లైన సుకవి
రాజ్యసభ సభ్యులైన నారాయణుండు
సభను ముఖ్యాతిథిగ వచ్చి ప్రభను బెంచ
నీవధానము చరితార్థమై వెలింగె

తెలుగు విశ్వ విద్యాలయ దివ్యసీమ
శ్రమ సువర్ణాంధ్ర సాహితీ సమితిసలుపు
ప్రవిమలాష్టావధాన సప్తక ఫలంబు
సలలితానంద జలధి నిచ్చలును దేల్చు.

తెలుగునకు బట్టినట్టి ఈ తెగులుచూడ
నెట్టి శస్త్ర చికిత్సల నింతబోదు
మానసిక భావ బోధంబు మలుపు ద్రిప్పు
చెప్పువారెల్ల నిజముగా జేసిచూప

పరులకు జెప్పువేళ బ్రతివాడునువ్యాసుడు, నెంగిలీసులో
నరికిన గొప్పవాడనెడు నానుడి నానుడి, వాడు తెల్గులో
నిరికిన నవ్యభాష మది నిల్లుగ నాగరకాభిమానమై
పరగ మృతత్వ మందదె స్వభాష సుభాషణ నోచుకోనిచో

ఆరంభించిన వేయై
భారం బనిపించి చివర పదుగురు శ్రోతల్
మీరనిచో నవధానము
మీరిన నది దైవకృపయ మించుయశంబున్)
(141 వ అవధానము,తెలుగు విశ్వవిద్యాలయం హైద్రాబాదు)

చినకోడూరున బుట్టితి
చిననా డేడవ తరగతి చేరి చదివితిన్
మును పొక సారి వధానము
నొనరించితి, నేడు మరల నొప్పగ జేతున్
(142వ అవధానము - చిన్నకోడూరు)



# పృచ్ఛకాకృతీ

పదపదమ్మున నడ్డపడు నిషిద్ధాక్షర
పరుడు వర్ణన సేయ వలచువాడు
విషమ సమస్యల విధి దల్లడిల జేయు
సత్రభుం, డప్రస్తుతప్రసంగి
దత్తపదమ్ము లుదాత్తమ్ము గా గోరు
ఘనుడు, ఘంటానాద కరణపరుడు
అక్షరా లంకెలు వ్యత్యస్తముగ నిచ్చు
దక్షుడు, కావ్యసందర్భశీలి
ఒకట నిట్లు మానసిక శక్తి బీడింప
బలుకు వెలది నమ్మి పలుకునాకు
నండ నిలిచి దేవి యవలీల నవధాన
గరిమ బ్రోవ గొలుతు బరమ భక్తి

(3వ అవధానం - సిద్దిపేట)

అడిగెడు వారలందరును హార్దికు లష్టవధాన ధారణం
బిడుమ యటంచు గుర్తెరుగు నింగిత వేద్యు లుదారతానిధుల్
బుడతని కీపరీక్షలు సుబుద్ధ్యభివృద్ధికరంబులంచు జం
కుడుగ గృతార్థు జేయు సుగుణోత్తరు లబ్బుట భాగ్యమౌగదా!

కష్ట మటం చెరింగియును గైపున బూనితి దీనిజేయ, నీ
యష్టవధానమందు బుధులందరు మెచ్చిన జాలు, మానసం
బిష్టపడున్, మహాశయుల నెందరినో కనగల్గునంచు, ఈ
ప్రష్టల కంజలింతు నిరపాయత నన్ను గృతార్థు జేయగాన్

(4వ అవధానము - హైదరాబాదు)

ఆరంభించుడి మీరు మీరలును మీరష్టావధాన క్రియా
సారాసార వివేచనాదర కళాసంపన్ను లేతత్సభా
ప్రారంభస్తుతి పూర్తి యైన యది, యోగ్యం బైన ప్రశ్నాళి నా
కూ రుం బేరను బేరు నిల్పు కొనున ట్లూహించి ప్రశ్నించరే

**(6వ అవధానము - సిద్ధిపేట)**

సూరివరేణ్యులార! అనసూయ వికస్వర మానసాంబుజా
సారమనోజ్ఞులార! వర సౌహృద దీవ్య దనూన మాధురీ
పూరవచస్కులార! గుణపూజిత భవ్య చరిత్రులార. చె
ల్వారగ నేడు మీరు తని వారగ బ్రశ్నల ధన్యుజేయరే!

**(8వ అవధానము - సిద్ధిపేట)**

కవులారా! సత్పాండితి
రవులా రాష్టావధాన ప్రాశ్నికులారా!
చవులూరు ప్రశ్నలిడిన
న్నవురా! యన జేయరయ్య! అమలమనీషన్

**(12వ అవధానము - మాసాయిపేట)**

మీ రనుగాములై సభను మేదురరీతి రహించుచుండగా
మీ రనుకొన్న రీతి గడిమించు కుతూహలవృత్తిబ్రశ్నలన్
మీర నుతింతు, సభ్యతను, మీ రనుమానములేక గోరగా
మీరను మీ నిబంధనల, మించుడి ప్రాశ్నిక పండితోత్తముల్

(పృచ్ఛక) **(13వ అవధానము - సిద్ధిపేట)**

అవధానం బొక చేయు వారలకె కా దత్యంతమౌ శ్రద్ధ న
వ్యవధానంబుగ బ్రశ్నలిచ్చు రసిక వ్రాతమ్ముననన్, శ్రోతలన్
నవధా నర్తిలగా వలెన్ సుకవితానందమ్ము పంచిచ్చు ది
వ్యవధానంబని మెచ్చ బ్రశ్న లిడుడీ పాండిత్యతేజోనిధుల్

**(14వ అవధానము - జగదేవపురం)**

కాకలు దీరినట్టిభట కాండము మీ, రవధాన యుద్ధమం
దాకలి దీరు నట్టుల విహార మొనర్చుడు, ప్రశ్నఖడ్గ భ
గ్నాకృతిగా వధానిగజ మయ్యెడు దాక శ్రమించుడయ్య! దే
వీకృప గల్గ నగ్గజము వెల్గును దిగ్గజమై పదోద్ధతిన్

(15వ అవధానము - సిద్దిపేట)

కవియొక డేగుదెంచియు వికల్పము లేక జవాబులిచ్చి, రాం
కవములు పెక్కుదోచు, వెలుగన్దొడగున్ దగురీతి, మీరు, చి
క్కువడగ జేయు డంచు మిము గోర వకీళ్లగు పృచ్ఛకాళి! శ్రో
తృ వివిధ వాంఛలున్ దనియ దేకువ జూపగ మిమ్ము వేడెదన్

(19వ అవధానము - సిద్దిపేట)

పాండితీధనులైన ఓప్రష్టలార !
శ్రోతలకు దృప్తి గల్గు ప్రశ్నోత్తరముల
తనివి దీరంగ జేయుడో ధన్యులార!
సిద్ధిపురి శ్రీవినాయక సిద్ధిగోరి

(20వ అవధానము - సిద్దిపేట)

ఆరాధనీయ కవితా
శారదలగు పృచ్ఛకాళి సరసప్రశ్న
స్ఫారగతి సభిక జన మం
దారములగు మిమ్ము గొలుతు దత్పరమతినై

(21వ అవధానము హైదరాబాదు)

పృచ్ఛకులందరున్ హృదయవేదులు, సత్కవితాభగీరధుల్
స్వచ్ఛమనస్కులయ్యును విషణ్ణత గూర్తురు వారిదారి వే
గచ్ఛట మీ వధానసభ క్రమకవిత్వ కళావిలాస సం
పచ్ఛరదాగమం బగుట భాగ్యము, ప్రశ్నలనీయ వేడెదన్

(22వ అవధానము - సిద్దిపేట)

చిక్కులు వెట్టు మీమది రుచింప రచింతు నచింతనీయ స
ద్వాక్కుల, నేను నమ్ముకొను వాసర శారద పారదర్శక
ప్రాక్కృప దిక్కుగా, నడుగవచ్చును నచ్చిన మెచ్చుప్రశ్నలన్
దక్కిన శ్రోతృలోక మెడదం ముద మందగ బ్రాశ్నికోత్తముల్

**(23వ అవధానము - నిజామాబాదు)**

వాగ్యములైన మీరలు సభాస్థలి బ్రశ్నల పంజరమ్ములో
యోగ్యవధాని కీరమును నుంచి నిషిద్ధవచోనిరుద్ధ స
మ్య గ్యశమందు వాగ్విసరమందు గృతార్థత జూపువారలై
భాగ్యము నాకు గల్గుట, సెబాసన గోరుడు ప్రాశ్నికోత్తముల్

**(24వ అవధానము - పటంచెరువు)**

పాండితీ మండితులు నేటి ప్రాశ్నికతతి
వీగు నవధాని ప్రేగులు పిప్పి జేయ
దగుదు రష్టవధాన విద్వ త్సభాను
మోదనము గూర్చ నేడు మీ ముందు నుంటి

**(27వ అవధానము - వరగల్)**

చిక్కులు వెట్టునేరుపున సిద్ధులు, కావ్య కళానుభావ స
మ్యక్కలనన్ బృహస్పతులు, మాటల దేవి కనుంగు బిడ్డలున్
చిక్కులు విప్పజాలిన విచిత్రముగా దయ సేయుడయ్య నా
దిక్కున దోసము ల్విడిచి తేకువ మంచి గ్రహించి మించుడీ!

**(36వ అవధానము - నారాయణ ఖేడు)**

పండితులు వింత వింతల బ్రశ్నలీయ
శ్రోతృలోకము ముదమున సోలియున్న
నాడు నవధాని ధన్యుడైనాడు గాని
మొక్కుబడి గాగ దృప్తి గల్గునె జగాన?

**(38వ అవధానము - చీకోడు)**

అడుగుడు పండితులారా!
సుడివడ జేయంగ దగిన చొప్పున బ్రశ్నల్
నుడులిచ్చు దేవి యండగు
బుడుతడ నాశీర్వదించి పొందు యథేచ్ఛన్

సద్యశ్శ్రేయఃప్రద స
త్పద్య కవిత్వావధాన వల్లభులై శ్రీ
విద్యా సేవాసమితి క
భేద్యయశం బిందు శ్రోతృవిజ్ఞులు మీరల్
(54వ అవధానము - హైదరాబాదు)

గట్టితనంబు జూపుటకు గల్గెను వీలు, జవాబు లిచ్చుచో
బుట్టియె నేర్చెనో? తుదకు బుట్టక నేర్చెనొ నాగ బండితుల్
దిట్టలు మీరు నన్నిట బదింబది ప్రశ్నల గ్రుచ్చిగ్రుచ్చి సం
ఘట్టన రేపి శ్రోతలకు కమ్ర వినోదము గూర్చి మించుడీ!
(58వ అవధానము - నంగునూరు)

అడ్డుగనిల్చు నొక్కడు, మహాశయ మెంచు వలంతి, మాటలన్
గడ్డు సమస్యనొక్కడును, గమ్రపువర్ణన గోరునొక్కడున్
అడ్డము దిడ్డమై నుడుగు లడ్గునొకండు తిథిన్ దినంబులన్
దొడ్డ వివిక్త మొక్కరుడు ధూర్వహ సత్కృతి నీవధానమున్
(59వ అవధానము - రామంచ)

తనివార శ్లమనీయ ప్రశ్నముల నుత్కంఠ స్సభామోదమే
పనిగా బృచ్ఛకులార! వేయుడు, కవిత్వశ్రీవిలాసాచ్ఛభా
వనిగూఢార్థవిరాజమానపదసంపత్తిన్ వెలార్చంగ జె
ప్పను యత్నించెద, నేర్చినంత, సభలో బాలావబోధంబుగన్
(60వ అవధానము - దుందిగల్)

తనివి న్దీరెడు ప్రశ్నల
జనువున నడుగంగ దగును సత్పృచ్ఛకులా
ర! నిజప్రజ్ఞ యెలర్పగ
వినిపించెద నర్థరూఢి విస్ఫుట ఫణితిన్

**(61వ అవధానము - పెద్దగుండవల్లి)**

అవధాన సంప్రదాయ
ప్రవరముగా బ్రశ్నలిచ్చు భావజ్ఞులు మీ
రవధానిపైన దయ జూ
పవలదు. శ్రోతలును మెచ్చ బ్రశ్నించుడయా!

**(64వ అవధానము - ఆందోలు)**

ఒక్కడ నేను, బండిత మహోదయు లీరు, పరీక్ష సేయగా
నిక్కడ చేరినారు పరమేశ్వరి వాక్కున నిల్చియున్న నే
చిక్కుల నైన విప్పెదను, జెప్పెద దేనెలవాక పద్యముల్
చక్కని భావనా బలవిశారదు డంచని ప్రస్తుతించగాన్

నాకంటెన్ దెలివైన మీకు హృదయానందమ్ము చేకూర్చగా
సాకన్ రమ్మని వాణి గొల్చి కవితాశక్తిన్ బ్రదర్శింతు మీ
రేకోర్కుల్ నను గోరవచ్చితిరొ? మీరెంతేని చింతించకన్
వీక న్గోరుడు, తోచినంత సభ దైవీశక్తితో జెప్పెదన్

**(68వ అవధానము - రాజగోపాలపేట)**

సవినయమగు మనవిని విని
కవితామృత రస పిపాస గడదేరగ బ్ర
శ్న విశేషంబుల నడుగుడు
వివిధ శ్రోతలకు దృప్తి వెలిగెడు నటులన్

**(71 వ అవధానము - నాచగిరి శంకరమఠము)**

తెలిసిన వాడ గానెపుడు, ధీవర వర్గము నర్థిగోరి నే
గలిసిన వాడ గాను, గుడిగట్ట వదాన్యుల బాధపెట్టగా
మలసిన వాడ గాను, గవిమాన్యులు చిక్కులు వెట్టకుండ గా
వలసినవాడ గాను దగు ప్రశ్నల శ్రోతల దన్ను డియ్యెడన్

**(73వ అవధానము - వరంగల్)**

అడుగుటలో దయ జూపుట
నుడుగుడు, శ్రీశారదాంబ యూతగ మీతో
చెడుగుడు లాడెడు నెడలన్
బుడుతడ మన్నించగొలుతు బుధులార! సభన్

**(74వ అవధానము - గణపతి దేవాలయం-సికిందరాబాదు)**

పండితు లారా! మీరు వి
తండ ముడిగి యడుగు డూర్జితమ్ముగ బ్రశ్నల్
నిండిన దేవీకృప ను
ద్దండముగా నుడువ లేమి దండము సేతున్

**(77వ అవధానము - కాజీపుర్)**

పృచ్ఛక పండిత వరులు య
థేచ్ఛగ నష్టావధాన హితకర సమ్యక్
పృచ్ఛల సభికులు మెచ్చగ
స్వచ్ఛాత్మల నడుగు డుడుగు డనుకంప ననిన్

**(78వ అవధానము - చుంచనకోట)**

అవధాన విద్య తెలిసిన
కవిముఖ్యులు ప్రష్టలై కకావిక సేయన్
రవళించు వాఙ్నినాద
ప్రవరులు మీ ప్రజ్ఞకెరగి ప్రస్తుతిసేతున్

**(79వ అవధానము - మరువడగ)**

అవధానమ్మన దేలికౌనె? ప్రసవాయాసంబు, కావ్యాశుభా
వ విరోధాధ్యవసాయ మూర్జిత పదవ్యక్తిప్రతిస్పంద మా
ర్జవ వాక్య స్ఫురణ ప్రభావ రతితో సమ్యక్సమస్యావగా
హ వరిష్ఠత్వము గుర్తెరుంగు బుధులారా! ప్రశ్న లీయందగున్
**(82వ అవధానము - కరీంనగర్)**

శ్రమ కోర్చి వచ్చు పండిత
సమూహము నుతింతు వేది సభికులుమెచ్చన్
సుమహితప్రశ్న శరంబుల
సమర సహిత దృష్టి నన్ను స్వస్థు నొనర్చన్
సమర సహిత, సమరస హిత అని రెండు విధములుగా జెప్పవచ్చును
**(84వ అవధానము - చందాయిపేట)**

మీరేయే విహిత ప్రచారముల సోమించంగ, మించంగ నన్
గోరన్ భావితు లైతిరో బుధులు! శంకోపాంతనిస్సంగులై
గోర న్నిమ్ము నుతింతు, మజ్జనని వాకోవాకు చీకాకు లే
కూరన్ జేయును భావనాసుధ, సదస్యుల్ స్నాతులై మెచ్చగా
**(85వ అవధానము - నాచగిరి బ్రహ్మోత్సవాలు)**

కసిరెడి వేంకటరెడ్డియె
యసదృశ పృచ్ఛకుడుగాన నప్రస్తుత వా
గ్విసరముల విసురు విసురుల
కొసరి కొసరి కొసరుచులను గుతుకము కనుడీ
**(86వ అవధానము - ఉస్మానియావిశ్వవిద్యాలయం)**

అడుగుట తప్ప జెప్పుటల యందలిబాధ్యతలేక శ్రోత లె
ప్పుడు ముద మంద గోరి యిట పూని పరీక్ష యొనర్చు మీకు మా
యుడుగర లట్లు పద్యముల నొప్పుగ నిచ్చెద, బ్రేమవీడి మీ
రడుగుడు పూరణంబులను నన్ని సరస్వతి చూచు కొన్నుడీ!
**(87వ అవధానము పోతన పంచశతజయంతి ఉత్సవాలు, వరంగల్లు)**

కవులారా. సద్గౌరవ
రవులారా! ప్రాశ్నికాఖ్యరసభావుక భా
రవులారా! ప్రశ్నించుడు
చవులూరగ జెప్పి కృషిని సభ కర్పింతున్

(88వ అవధానము - సిద్ధిపేట)

చిక్కులు పెట్టుట పనిగా
నిక్కడ కేతెంచినట్టి హిత విద్వరులే
అక్కరవడి యడిగిన నా
దిక్కగు శారదను నమ్మి తెలుప శ్రమింతున్

(90వ అవధానము - కుత్బుల్లాపుర్)

ఆఫీసర్స్‌క్లబ్ వారల
ఆఫర్మన్నించి వచ్చి అద్దంకిని నె
న్నో ఫీట్ల తో వధానం
బేఫీలింగ్లేక చేసి తిందరు మెచ్చన్

(92వ అవధానము - అద్దంకి ప్రకాశంజిల్లా)

అడుగుటయందు దిట్టలయి యష్టవధాన సభాతలంబునన్
బుడుతల కర్థమౌ నటుల బూనిక జెప్పెదు నట్టి భావనం
బుడుగర గాగ బ్రశ్నముల నూకొని వేయుడు, తోచినంతలో
నుడివెద - గ్లిష్ట శబ్దములు నూకొన వారికి గష్టమౌగదా।

(103వ అవధానము - తడకవల్లి, విద్యారణ్యఆవాసవిద్యాలయం)

వినెడు వారలు బాలలు, వింత లెరుగ
బోనివారలు, వార లబ్బురము నెంద
దగిన ప్రశ్నల నిడి సమాధానములను
వచ్చునట్టుల బ్రశ్నించ వలతు బుధుల

(104వ అవధానము - ఆదిత్యవిద్యాలయం - సిద్ధిపేట)

సుతిమెత్తంగల ప్రశ్నలన్ సభిక సంస్తూ యంబుగా బ్రాశ్నికుల్
కుతుకంబొప్పగ వేయ మేధ జిగి పోకుండన్ సమాధానవా
గ్రతి యోచించెద, మీకు మోద మిదు నాకాంక్షన్ సభాస్తారు లా
ర! తమి న్దప్పుల మాని యొప్పుల నను గ్రాహ్యంబులం చెంచుడీ

**(111 వ అవధానము - కొల్లాపురం)**

నచ్చిన దడిగిన విబుధుల్
మెచ్చెడుగతి జెప్పగలుగ మేలని తలతున్
వచ్చిన యంతం బలికెద
నొచ్చక రసహృదయవృత్తి నుడువం గనుడీ!

**(117వ అవధానము - అచ్చంపేట)**

మిత్రులు కోరినంత మిడి మేలము లెంచక బాలబాలికల్
శ్రోత్రధి కారులై నెగడ, రూఢ బుధోత్తము లొప్పుచుండ దా
పత్రయ మెందు లెక్కిడక భాగ్యముగా దలపోసి వచ్చితిన్
శాత్రవులై సుహృద్వరులు చయ్యన నన్ను బరీక్ష సేయగా

**(119వ అవధానము - దొంగల ధర్మారం)**

బహువిధ కష్టరతుల ధూ
ర్వహులౌ రసికాగ్రగణ్య పండితులారా!
విహిత ప్రశ్నల గవితా
మహమును బ్రకటించు డయ్య! మాన్యత కలుగన్

**(122వ అవధానము - సిద్దిపేట)**

పృధుల కవిత్వధోరణుల బృథ్వి పృధక్పృధగధ్వగామినీ
ప్రధ దులకించు కాలమిది, పద్యమునం దభిమాన ముంచి మ
చ్ఛి ధిల హృదంతరాళమున శ్రీవికసించగ బ్రశ్నసేయుడీ!
ప్రధితవధాన మౌ నటుల ప్రాశ్నిక వర్యులు! మీకు మ్రొక్కెదన్

**(123 వ అవధానము - స్టేషన్ ఘనపూర్ - వరంగలు)**

శ్రోతలు మెచ్చుగా గలుగు చొప్పున నుత్తర మిచ్చు నట్లుగా
బ్రీతికి దావలంబుగ బరీక్షకు నుద్దిగ నిద్ధకీర్తి సం
ధాతృతగోరి ప్రశ్న లవధానికి వేయుడు, పృచ్ఛకోత్తముల్
వాతులకించు నైపుణి సభాసురభాసుర భారతీ స్థితిన్

**(124వ అవధానము - చేర్యాల)**

ఇక్కడ జేరినట్టి జనులెల్లరు మెచ్చగ మంచి ప్రశ్నలన్
జిక్కదనంబు లీయగ రచించెడు నట్టుల బృచ్ఛసేసి నా
కక్కరగల్గు కీర్తి, హృదయంబున దృప్తిని గూర్చి మించుడీ!
వాక్కుల తల్లి దీవనల బండిత వర్యులు పొందు డిమ్మహిన్

**(133వ అవధానము - సిద్ధిపేట)**

సభలో మర్యాదోచిత
విభవమ్ము బయ ల్పడంగ బృచ్ఛించుడి మీ
రుభయుల వా క్చాతుర్యము
సభనెప్పుడు గొప్ప జేసి సాగించు సుడీ!

**(136వ అవధానము - వరంగల్)**

అయ్యా! మీరు రసజ్ఞపండిత కవీశానుల్, పధానక్రియా
శయ్యాభోగము మీరు భావగరిమన్ సాధించు ప్రశ్నావలిన్
దియ్యంబున్ రుచి చూప పృచ్ఛక పదాధీశుల్ సదస్యవ్రజం
బయ్యారే! అనిపించు మా జనని యీ యష్టావధానంబునన్

**(137వ అవధానము - ఒంగోలు)**

అయ్యా! పృచ్ఛకవర్యా!
తియ్యంబుగ బ్రశ్నలిచ్చి ధృతిపెంచగ మీ
రయ్యారే! అనిపించగ
నియ్యం గొను డంబతోడు నింపగు సభకున్

**(140 వ అవధానము - హనుమకొండ)**

# చ్యుతనిషిద్ధాక్షర

కుటుంబనియంత్రణ గూర్చి కందము (ద్వి పాదనిషేధము)
శ్రమతో బెక్కురు పట్టుల్
సమకొల్పుట నేల గండ సంధినిదేల్చన్
గమలాపతిని నుతించగ
గొమరుల నిద్దఱను గాంచ గుతుకమ గాదా!
పట్టి = సంతానము

**(1వ అవధానము - నారాయణఖేడు)**

**ఇందిరకు చాముండేశ్వరికి-సామ్యము-కందము-**(ద్విపాదనిషేధం)
గండెనుముల గా జెన్నొ
చుండుటతో బుణ్యనరు బరుక్కడుగంటన్
జెండిన యిందిర గనజా
ముండేశ్వరి యనగ భరత భూమిని నెగడున్
గండు+ఎనుములు = పుణ్యనరుడు,రాక్షసుడు=ఉక్కు,పరాక్రమము
పరుడు = శత్రువు = ప్రతిపక్షము

**(2వ అవధానము - భువనగిరి)**

**రేణుక జనుల గాచుట : కందము**
ఎన్న మనకిచ్చు నమ్మగ
మున్నబ్రము దోప గడగు భూతి దనర్చన్
బన్నుగ జూచుత రేణుక
సన్నుతితో సిద్ధిపేట జనతతి నెల్లన్
భూతి = ఐశ్వర్యము **(3వ అవధానము - సిద్ధిపేట)**

<u>కృష్ణజననము - కందము</u>

కన్నయ్యకెట్లు తనగతి
నున్నట్లుగ బల్కి మేలు నోమగ బట్టిన్
బన్నుగ గోరెను దేవకి
నన్నుగ జెఱసాల యందు హరి జనియించెన్

(4వ అవధానము - హైదరాబాదు)

<u>నదీతట గత సీతారామాశ్రమ వర్ణన గీతము</u>

ఆపగారాని కూటము నై తనర్చ
నాపగా యుక్తి దేవతా స్థాపకుండు
యతివరుం డఖండానందు డాశ్రమమ్ము
నిలిపె భక్తుల ముక్తుల సలుపు కొఱకు. (ఆపగ = నది)

(5వ అవధానము - మాసాయిపేట)

<u>సంఘములో ఉపాధ్యాయుడు - కందము</u>

ఒజ్జలు పూర్ణత బొల్చుట
పజ్జగలుగు చట్ల కెల్ల బాధలుదీర్చున్
వెజ్జు గలండెవడు వ్యథో
న్మజ్జనమును సంఘమందు మాపుట కొఱకై
ఒజ్జ = గురువు, చట్లు = శిష్యులు, వెజ్జు = వైద్యుడు

(6వ అవధానము - సిద్ధిపేట)

<u>అహల్య స్త్రీగా మారుట : గీతము</u>

ఇన్నిదుమ లెట్లు నోపితి నిట్లు రాజ!
రామ! గుప్తనై గుండె బర్వె మఱిగితి
జనని యొసగిన జని పునర్జన్మ మిద్ది
తనువు పులకించె నను సహల్యను నుతింతు

(7వ అవధానము - మెదకు)

**తామరపూవు గూర్చి - కందము**

నవ్వగుమి యెల్ల యెన్నన్
దివ్వెగ భావించ నొప్పు తేరన్ రవిరాన్
బువ్వై నాదానివినై
నవ్వగ సుతిమిన్న దమ్మి! నామతిమెచ్చున్(పూర్ణ నిషేధం,)

(8వ అవధానము - సిద్ధిపేట)

**సమాజము - కవి - కందము**

ఇది యేల నిచ్చినా వజ!
మది కష్టం బెట్లు సంఘమా! గతియేమో
తుది కవికేది మహారాట్
పదవికి దగు సేలువొకటె పరమంబౌనా?

(9వది - పాలమాకుల)

**సీత మాయ లేడిని గోరుట - కందము**

ఇఙ్టి యదెట్టి మహిమ్నయొ?
మఙ్టివెడలు నర్కువోని మంజుప్రభతో
తుఙ్టుమని వచ్చె నిన! నా
వెఙ్టికి నగవియ్యవయ్య! వెలదిని రామా! (పూర్ణనిషేధం:
ఇట్టి = లేడి, జింక, (10వది - మాసాయిపేట)

(11వ అవధానము ధారణ లోలేదు)

**శ్రీవితలేశ్వరుని వార్షికోత్సవము - గీతము**

ఓయి వరణాభ! మాప! మహోన్నయద!ర
తార్క్ష్య! మహిజయాతసిలసితా! భయఘ్న!
నిండుకోవెల నెలకొని యుండినీవు
కార్తికోత్సవ సంతుష్టి గాంచుమయ్య (ద్విపాద నిషేధం)
అతసి : తులసి, మాప . లక్ష్మీపతీ.

(12వ అవధానము - మాసాయిపేట)

**గణపతిస్తుతి తేటగీతి**

శ్రీలకై యేమి? యేమి కోరిన మహాత్మ!
నిండుగా గల్గు భద్రత నిల్పు మగజ
జా! సుఖంబుగ మమ్ము సాగనిమ్ము
విఘ్ననాయక! పూజింతు వేయిగతుల
అగజజా = పార్వతీతనయా!

(13వ అవధానము - మాసాయిపేట)

**అశోకవనమున సీత నుంచుట - కందము**

భూతపనిత్యార్చాత్ముడు
భీతి స్థితితోడ లంక బేడిగ దుఃఖా
న్సీతను నాభూజ నడవి
నాతత గతి నుంచె దైత్యు డతి నిర్దయుడై (త్రిపాదనిషేధం)

(14వది - జగదేవపురం)

**వేంకటేశ్వరుడు "వంశి" ని దీవించుట**

శ్రీశ! నగవార సుఖ సద్మ! ప్రేమ జూడ
వేదవిత్తరతాఢ్య! సద్వాద గమ్య.
భూరి గుణ! నిన్ను బత్తితో బూలనింపి
నమ్మి కొల్చెద బాలుని (వంశిని) నెమ్మిగావ! (పూర్ణనిషేధం)

(15వ అవధానము - సిద్దిపేట)

**అఖండానంద యతిని వర్ణించుట కందము**

మనురాణ్మధుదాత సుజల
ఘన శీతదయా విధిని నఖండాద్యానం
దుని రూపున యతియై గతి
వినిచెన్ జట్టులు దరించు విధిదత్పరతన్ (పూర్ణనిషేధం)

(16వ అవధానము - మాసాయిపేట)

**వాలివధ కందము**

కన గపి దన దురితపుగని
గనిన నినజు నమ్ము దాకి కరివోనిపడెన్
ఘన సుగ్రీవుని వైపౌ
జనపతి నావాలి పిదప జనపతి చేసెన్

(17వ అవధానము - కొండపాక)

**పెండ్లిలో పనికి రాని విషయాలు - కందము**

మొగడిక, తుమ్ముట, మడియును,
మొగరంబును మొండియౌ విమూఢము ముండల్
తగవు మొగమోట మసలే
తగవు వివాహంబునందు ధరలో నెప్పున్

(18వ అవధానము - లింగారెడ్డి పల్లి)

**చవితినాటి చంద్రునకు అదర్శన శాపము. తేటగీతి**

శశి యఘంబేమి? రేయికి జందన సదృ
గమలతాప్తిని సొంపు నింపు మహితు నిటు
నిందగూడ దెచ్చు ధవుడి కెందు దగిలి
నాడు నిజదృష్టి వర్జన గూడ నందె (పూర్ణనిషేధం)

(19వ అవధానము సిద్దిపేట)

"అగజానన పద్మార్కం" శ్లోకానికి కందానువాదం

నగజా ముద్దాయకుడై
తగదా గణగతి పతిగ ప్రధల్ రా విభుతన్
సొగసగు వానిన్ గొల్తున్
బగలున్ రే నేక దంతు బ్రజలన్ బ్రోవన్

(20వ అవధానము-సిద్దిపేట)

శ్రీకృష్ణుని బాల్య శృంగారము - కందము

ఏమే నిన్నేనా? పల్
బాముల్రాగా దనువున బల్గాట్లిచ్చెన్
ఏమే మాట్లాడవు? ని
న్నేమనె గృష్ణుండు సెప్ప విక సి గ్గలే?
మాట్లు +అడవు = రహస్యములు చెప్పలేదూ ?

(21వ అవధానము - హైదరాబాదు)

సమాజము - ఉపాధ్యాయుడు తేటగీతిలో

శ్రీని నాదిగా శ్రీదాక జెందుటకయి
తను గృషించును జట్టుల మనుచు నొజ్జ
సంఘదుస్థితి జూడ దుస్తంత్రశక్తి
జాతి ధీవ్యోమ తాప్తి విషణ్ణమయ్యె
ధీవ్యోమతా = బుద్ధిహీనత. వ్యోమము=ఆకాశం, శూన్యం

(22వ అవధానము - సిద్దిపేట)

త్రిమతాచార్యస్తుతి - కందము

శ్రీమద్గుహ్యమనురుగతి
ధామదమే గురిగ జీర్ణతాప్తజగమ్ముల్
కోమపమాపాదిసమ
ప్రేమన్ జట్లకును నిచ్చు విజ్ఞుల్ వంద్యుల్ (పూర్ణనిషేధం)
గుహ్య = రహస్యమైన, మనురుక్ = మంత్రకాంతితో, అతిధామదము= మోక్షము నిచ్చుదానిపై, గురిగ = లక్ష్యముగా, జీర్ణతా+అప్త జగంబున్= జీర్ణత్వము చెందు లోకమును, క+ఉమప+మాప+ఆది = బ్రహ్మ, శివ, విష్ణు మొదలగువారి యందు, సమప్రేమన్ = సమానభక్తిని, చట్లకును = శిష్యులకు ఇచ్చు = ఉపదేశించు, విజ్ఞుల్ = త్రిమతాచార్యులయిన విజ్ఞులు వంద్యుల్ = వందనీయులు

(23వ అవధానము - నిజామాబాదు)

వచ్చే దుర్మతి నం॥ రముపై మన ఆశలు . కందములో

ఏమిడె నేసమ? శ్రద్ధయె
గా మతి బెంచున్ భవిత జగం బటవియ గా
సేమము గలదే? దుర్మతి
ఏమిచ్చిన నేమి? బ్రతుక నిచ్చిన జాలున్

**(24వ అవధానము - పటంచెరువు)**

బాల గురించి కావ్యపు గుర్తులతో - కందము

శయ్యకు దార్చిన రావే?
కయ్యంబే నీదు బత్తిగా గన్పట్టున్
నెయ్యంబున గాదే నీ
వియ్యంగొందు టకటొంకు లేమేతగతుల్
టకటొంకులు = మోసాలు

**(25వ అవధానము - వేములవాడ)**

చక్రేశ్వరస్తుతి (బోధన్) - కందములో

గిరిజాప! నందితామర!
వరదా! శుచినేత్ర! భవ్యభావమహిమ్నా!
హర! సుందర. శ్రీచక్రే
శ్వర! మ మ్మిట పెరుగుధరల బాలించు మయా!

**(26వ అవధానము - బోధన్)**

వర్గల్ శంభుని గూర్చి - కందము

బిచ్చగ శంభూ! నీకై
యచ్చముగా గవి గమిన్ మహాధామతగా
మెచ్చుట కీవే! మాకే
మిచ్చెదు భూతియ గద. యదియే యిడుమయ్యా? (పూర్ణనిషేధం)

**(27వ అవధానము - వర్గల్ )**

<u>వినాయక వర్ణన (నాయకుల వర్ణన) శ్లేష కందమున</u>

అందినది మెసగు నెప్పున్
మందుడుగా కార్యనాశ మాద్యర్ధితో
నెందున్ దానికి రేడై
బొందిన విఘ్నేన రూఢి బొల్పొ నిల దాన్ (పూర్ణనిషేధం)

**(28వ అవధానము - వేములవాడ)**

29వ అవధానము ఉత్పలమాల ధారణలేదు

<u>**శ్రీవాణీ లక్ష్ముల వైమనస్యము మాకెట్లు సహకారియో తెలిపి,వారి ముఖ కమలములను వర్ణించండి - కందము**</u>

ప్రథకేమి గాక? శ్రీకై
పృధుభక్తిని గొల్చినంత బెంపునుగల్గున్
వ్యథయేల మూర్తిమంతము
నిధికై దేవీముఖమ్ము నిండుదన మగున్

**( 30వ అవధానము - కామారెడ్డి - పూర్ణనిషేధం)**

<u>**సరస్వతీస్తుతి - కందములో**</u>

శ్రీల గోరిన మాయె పూర్తిగను నేత్రి
శ్రీవి కామ్యదవై భక్తి రీణతాత్మ
బ్రాతి బ్రాహ్మివి, వాగ్మిగా రాణగల్గు
నిన్నునుతియింతు శారదా! వన్నెకెక్క

**(త్రిపాదనిషేధం - 31వ అవధానము - గోదావరిఖని)**

<u>**మంత్రిగారి దినచర్య - కందములో**</u>

లేదెప్పనినుని జన్మన్
మోదంబుంజూడ డెందు ముప్పానకయే
పో దడవం డెట కేనియు
గాదన డెవ డేది గోర ఘనసచివుండున్

**(32వ అవధానము - రామచంద్రాపురం)**

**రాముడు - కందములో**

ఇనజాతసఖ ! మనోహృత్
ఘనసుస్తేయ ధనదాగ్ర గర్భృహ రాజా!
ఇనకులజా! రఘురామా!
ఘనసుఖముల నిచ్చి మమ్ము గాపాడుమయా!

**(33వ అవధానము -భెల్, హైదరాబాదు)**

**చలి వృద్ధులనేడ్పించుట కందము**

ఇల నీ మదంబు వృష్టుల్
వెలియై గాదెప్పసాగు వెలదిని చెన్నై
బలమెంత చూపుదోగద!
చలి! వృద్ధుల యంద గాదె సామర్థ్యంబున్
(వెలదిని దయసేయు మెప్టు వృద్ధుల యందున్)

**(34వ అవధానము - వటంచెరువు)**

**చిత్తు కాగితము విద్యార్థి జీవితానికి మార్గదర్శకము**

చిన్నలు విజ్ఞుల్ గా సం
విన్నయతా ప్తి న్గనన్ సువిద్వద్యుగ లో
కోన్నతికై చట్టులు వే
చిన్నుతి చిత్తున్గనంగ జీవిక సాగున్
సంవిత్+నయతా = జ్ఞాననీతులు, చిత్తు = జ్ఞానము

**(35వ అవధానము - సిద్ధిపేట)**

**నారాయణ ఖేడు ను నాకముగా వర్ణించుట - కందము**

శ్రీరహికై మించు న్మం
జీరయెగా గతిగ బంటచేల్ వృద్ధిగ నె
వ్వారికి దరిద్ర ముండును?
నారాయణఖేడు వరలు నాకము గాగన్

**(36వ అవధానము - నారాయణఖేడు)**

37వ అవధానము నిషేధము ధారణలేదు

విద్యా విధానము గూర్చి తేటగీతి

ఏదివి సరియౌ చట్లకు నెందుగన్న
గలతగాక విధికి మంచి గతియరాగ
నేమిసేతు మశాంతిపెల్లేచు చుండె
చదువువాడు పరీక్షతో సాము చేయ

బలపములేని పలక, పలుకలేనినాలుక - కందము

బల మెత్తిన యట్లే నీ
యిల మూగై నట్టి జిమ్మ నేమందు నికన్
బలపమ్ములేని పలకగ
పలికెద నవధాన సభను బలువురుమెచ్చన్
(జిమ్మ = జిహ్వ) (39వ అవధానము - పెదకోడూరు)

శివకల్యాణము చెప్పుచు వధూవరుల నాశీర్వదించాలి. కందము

అగరాజజయు మనోజ్ఞున్
దగమై నొవ్వంగ గాంచు దక్షగదోచున్
భగవతిగా శివసతిగా
నెగడి వధూవరుల నేలు నెల్లప్పు మహిన్
(40వ అవధానము - జగిత్యాల)

శంకరమతస్థాపన గూర్చి - గీతము

కాలడిని గన్న శంభుడుగా వికల్ప
దుష్టమత భంజకత్వతత్వుడు దిశల్ మ
హితములౌనట్లు పీఠసంతతిని నిలిపె
ప్రవిమలాద్వైత బోధన పరచు కొఱకు
(41వ అవధానము - హైదరాబాదు)

**కోటిలింగేశుడు రంగయ్యను దీవించుట - గీతము**

కోటి శక్తుల్ సదా భక్త కూట తృప్తి
కై యిలను సవిధను బూజనీయ వర్త
కా. ఉమాధీన! షష్టితో కాక నూట
నిత్యదాతగా జూడవే నీద పగ్గె (పూర్ణనిషేధం)
సవిధ=సమీపము, పగ్గె = ప్రజ్ఞ (42వ అవధానము - సిద్ధిపేట)

**టి.వి. లేని రోజుల్లో సంజయుడు భారత యుద్ధాన్ని ఎలా చూడ గలిగాడో కందమున**

శక్తికి బ్రాపౌ నేడున్
శక్తుల్ దూలన్ సమస్త సాధ్వృద్ధుశ్యా
సక్తిన్ దగ ఋషి సంజయు
శక్తిని శంకించదగునె? సత్కవివర్యా!
(43వ అవధానము - సిద్ధిపేట)

**ఆకస్మికముగా ఉద్యోగవిరమణజేయు వానిమానసిక స్థితి గీతము**

రమ్మనిన దృష్టి, కాదు వేపొమ్మటన ద
మదియె పోవునట్లుగ నెంచి మారటమ్ము
సేసి జారు దానికి గుందు చిన్న పట్టు
పట్టు నుద్యోగి విరమణన్ దిట్టుమదిని ( త్రిపాదనిషేధం)
మారటము = పోరాటము (44వ అవధానము - కాజీపుర్)

**తెలుగుదేశము విజయము - కందములో**

ఉబ్బిరి వాపున్ బల్పని
సెబ్బర గాదేమి నట్టు చిన్నని వాసుల్
గబ్బని నేత్రికి దెల్పన్
సిబ్బిగ నయ్యెన్ మొగంబు శ్రీదప్పంగన్ (పూర్ణనిషేధం)
నట్టు చిన్నడు = నటుడు (రామారావు) గబ్బు = వాసన
నేత్రి = నాయకురాలు (ఇందిర) సిబ్బి = తీగలతోడిమూత
(45వ అవధానము = కోహీర్)

వేసవివర్ణన - కందము

గొంతున బీకున్ గాంచన్
వింతౌ, తడిలేని తట్లు వేడ్కన్ బల్కన్
జింతా భరము నిదాఘ
శ్రాంతిని వర్ణింప దృప్తి రాజిల దెందున్

నిదాఘము = వేసవి (46వ అవధానము - భెల్)

యాదగిరీశునిపై గీతము

శ్రీమదుగ్ర దర్పము నాస్యసీమ నిలిపి
కృష్ణతయె మనసుగ బత్తి దృప్తి సెంది
నతులయిన జాలు వార లున్నతులు గాని
యాదగిరి నారసింహ నీవాదుకొనెదు

(47వ అవధానము - యాదగిరి గుట్ట)

విధులు ప్రభుత్వాధీన మౌనవుడు తిరుమలేశుని దుస్థితి

నిధి నధిపతి దానెన్ను దానిని నటింప
దగును. ధైర్య్య కాలంబు దాచరాదు
ఇచ్చినది పుచ్చు కొందురు హితమె యగుట
స్వీయధర్మంబు వర్తింప జేసెననుచు

(48వ అవధానము - సిద్దిపేట)

శివ కల్యాణము : కందము

అగ సూతికి దన వాంఛన్
దగ దీవింపగను దల్లి తపితకపర్దిన్
భగవానుని దగ బెండిలి
యగుటన్ లోకైక జనని యయ్యె ధరిత్రిన్

(తపితకపర్ది=శివుని గూర్చి తపించినది=పార్వతి) (49వ అవధానము-సిద్దిపేట)

**మారుతిస్తుతి - కందము**

పీవలి పట్టి! మహాత్మా!
భావింతున్ బత్తి సర్వ వద్భ్రమములన్
గావగరారా! వాగ్మీ!
శ్రీవిధి దాసున్ యశస్థ బ్రీణ్యున్ గనరా! (పూర్ణనిషేధం)
పీవలిపట్టి = గాలి కొడుకు=హనుమ

**(50వ అవధానము - వికారాబాదు)**

**లలిత, రుద్రుడు, రాముడు, వీరికభేదము చెప్పి వారు శ్రీవిధుమౌళి శాస్త్రి నాశీర్వదించుట - కందము**

శ్రీదర దమల శ్రీదుల్
మోదా ఖ్యుల్ రమ్య లక్ష్యమూర్తుల్ విధు మౌ
ళీదాల్భ్యున్ మహిమునిగా
శ్రీదీర్ఘాయువుల నిచ్చి చెలగెద రెందున్

**(51వ అవధానము - రామాజి పేట)**

**నవవధూవరుల మానసిక స్థితి కందము**

చిన్నలిన వికచభంగుల్
నున్నగ నూల్కొంచు సాధు! నూయను చుండున్
సన్నని పులకల రేపుచు
మన్నింత్రు వధూవరుల్ సమాజము మెచ్చన్

**(53వ అవధానము - శనిగరం)**

**దాత విశేషము - కందము**

సిరికి దిరు పాట్లు గల్గున్
ధరలోనన్ బొందు నెప్పుదా దింట దమిన్
స్థిర దానము నాశంబును
జిర యశము నొసంగు దాత చేసిన పనులున్

**(54వ అవధానము - హైదరాబాదు)**

ధనమునకు మూడు గతులు కలవు. తానుదినుట, దానము చేయుట, నాశనము, మొదటిరెండు లోపించిన మూడవది (నాశనము) తప్పక గలుగును

<u>రాఘవేంద్ర స్వామిని గూర్చి కందము</u>
మాకు నిల గన్న దిక్కై
జోకన్ దివ్య మగు నితవు సొంపగునట్టుల్
నీకలి దారక ఫక్కిన్
బ్రాకటగతి యొసగు రాఘవ ప్రభు నెంతున్
(55వ అవధానము - నాచగిరి)

<u>సిద్ధరామ, రామచంద్రులకు పోలిక - కందము</u>
ఇల నిన పుణ్యము జెప్పన్
వెలియై పద నెద్ది గల్గు, విధి సికతన్ భా
సిల వ్రాయు వ్రాలు రాముని
బలుక నగునె సిద్ధ రాము పద్యము లందున్
పదను=అవకాశము, సికతన్=ఇసుకలో, వ్రాయు వ్రాలు=వ్రాసిన వ్రాత
(56వ అవధానము - భిక్కనూరు)

<u>పార్వతి స్నాన ఘటన - కందములో</u>
ననబోని మేన నల్గున్
గొని బొమ్మగ బమ్మ బిల్చి కొని పానమురాన్
దను నిల్పె గవని శివు డా
తని తల దీసి గణపతిగ దైవమొనర్చెన్ (పూర్ణనిషేధము)
ననబోని=పూవువంటి, నల్గున్=నలుగుపిండిని, బొమ్మగ=బొమ్మను జేసి, బమ్మ=బ్రహ్మను, పానము=ప్రాణము, గవిని=ద్వారము
(57వ అవధానము - దిగ్వాల్)

<u>వరకట్నం ఆవశ్యకత - కందము</u>

ముందుగ గన్నెల పాడుపుల్
క్రిందౌ మహి బెండ్లి యన్న కృప కొరుడేగా
వందురు టేల ధనమ్మిడ
నందురు? కలిగినచొ నీయ నది తప్పౌనా?

(58వ అవధానము - నంగునూరు)

<u>కాఫీ గురించి కందము</u>

ఔగా సుధి! యౌగాముల్
రాగా సడిలేక సాపు వ్రాసినవిధియై
సాగిన సాగును కాఫీ
సాగనిచో కర్మ, మీద సార్ల దయసుమీ!

(59వ అవధానము - రామంచ)

<u>ఆత్మకు బరమాత్మకు గల సంబంధం - కందము</u>

మోదముగా సుధి! తనుగతి
నాదముగా నాత్మ నిండి, నర్మిలి పరమా
త్మాదృతి తెలిసిన జ్ఞానియె
గాదన మూఢుడు జగాన, గన వేద్యమ్మా!

(60వ అవధానము - దుందిగల్)

<u>రక్తాక్షి సార్థకనామ గాగూడదని ఆశిస్తూ కందము</u>

నీరాజ్య మెట్లొగా సమ!
కోరిన దంతట లభింప గుప్తజ్ఞముగా
మారిన సంతోషించెద
నోరక్తాక్షీ! సరాగ మొప్పిన నీలో

(61వ అవధానము - పెదగుండవల్లి)

<u>నవగ్రహప్రతిష్ఠ - కందములో</u>

గాముల్ బత్తి న్నిల్పం
గామైత్రిన్ బురణిల నిటు గాగానొజ్జన్
బ్రేమన్ శ్రీచే వెడ యా
గాముల్ వో దయకయి నతి కర్త యొనర్చెన్ (పూర్ణనిషేధం)
గాముల్=గ్రహములు, ఔగాములు=మంచి చెడ్డలు,
(అగుట, కాకపోవుటలు) (63వ అవధానము - చేవెళ్ల)

<u>గణపతి యువకుల ప్రబోధించుట - గీతపద్యము</u>

ఏన్గుగాదె తలయు నిల మంకు కుద్దిగా
గాని ధీకి నై వశాన నుంచ
నేటి బొట్టె లిట్టె నేట బండువుగాగ
పట్టు నిమ్ము గుజ్జ వన్నె కాడ!
బొట్టెలు = యువకులు (64వది - అందోలు)

<u>ఆటవెలదిలో 'గ' కారము వాడకుండా వినాయకోత్సవాలు</u>

వాడ కోటి మించు ప్రఖ్య దంతిప ముఖ!
బత్తి మీ మతికి సకృత్తు దోచ
తప్ప కుండ డంబతనమును పట్టని
చో సివనికి పట్టి వాసి వడయ (పూర్ణనిషేదం)
సివనికి పట్టి=వినాయకుడు (65వది - జోగిపేట)

<u>ప్రతిష్ఠింపబడనున్న సరస్వతి భావనా మూర్తిగా కందములో చెప్పుట</u>

మందుల్ వో వేత్తల్ రా
సందిగ్ధం బుడుప దివ్య శందగ దోచన్
మందిరమగు భావాతిగ
సుందరిగా వాణి నిల్పు చొప్పను గనుడీ!
శంద = సుఖమునిచ్చునది (66వ అవధానము - శనిగరం)

**సీతారామకల్యాణము - కందములో**

భవ ధనుసు విన్నవోగా
నవనీజమతి ప్రముగ్ధమై యల పితకున్
శివ మౌగతి రామునకై
సవరించును లోక మాతృ సత్రృథ కొఱకై
(67వ అవధానము - బోధన్)

**శ్రీకృష్ణ జన్మాష్టమి గురించి కందము**

జయలో విధిభన్ బుట్టెన్
నయకృద్ఘటమయి భుజహిమనటగోపకునిల్
జయమౌగతి లోకావన
ధియుడై కృష్ణుండు గొప్ప తేజం బెసగన్
జయ=అష్టమి,విధిభ=రోహిణి,నయకృత్+ఘటము+అయి=దొంగతనము చేయు వాడై, భుజ హిమ= చల్లని చేతులతో, గోపకుడు = నందుడు.
(68వ అవధానము - రాజగోపాలపేట)

**జగద్గురు జీవితవిశేషం - కందములో**

భాగ్యము మత దుర్ధీభిత్
వాగ్యమి కాలడిని బుణ్యవతిచూల్ హంసా
దృగ్యమి తమితో వెలలెన్
భోగ్య స్థిరవాణి మించు పూజ్యతను వగున్ (పూర్ణనిషేధం)
(69వ అవధానము - వాచగిరి)

**కాశీవిశ్వేశ్వరుడు రేకా అంబయ్యను దీర్ఘాయుష్మని జేయుట - కందములో**

శ్రీలకు దావై మెండౌ
లీలన్ దగు ధీయు నిచ్చి లిబ్బి దొర సకుం
దేలుంగావుత నంబయ
నోలిజిరాయువు నొసంగి ఊర్జిత కరుణన్
లిబ్బిదొర సకుడు = శివుడు (కుబేరునిస్నేహితుడు)
(70వ అవధానము- వారణాసి)

<u>ఆతురసన్యాసవిధి కనుమతి వేడు శంకరుని గూర్చి కందమున</u>

అమ్మా! నక్రంబు గడున్
గుమ్మా, మెకంబైతి జావు కోర్కియె? నాకీ
విమ్మాన, యతిగ గానో
కొమ్మా, తగ నాశువయి తగుంగా తల్లీ! (పూర్ణనిషేధం)

(71వ అవధానము - నాచగిరి)

<u>గరుడుడు అమృతమును దెచ్చుట - కందములో</u>

వల జిక్కు దక్కునటులన్
వలయెఱకను బగతు-జాది వాసిగదీక్షన్
లలిని సుపర్ణుడు దేడా?
యిల దల్లికని సుధ నహిపు లెల్లరు మెచ్చన్
వల=కుడి, ఎఱక=రెక్క, అహిపులు=పాములు, శత్రురాజులు

(72వ అవధానము - మెదకు)

<u>ఓరుగంటికి రామునితో సంబంధము గలుగునట్లు కందమున</u>

ఇదియే యేప్రథమించున్
గద! ఈ యొక కల్పురమ్ము గతిమేల్‌రామా!
విదితముగ భాగవతమున
నెద విప్పెను బోతనార్యు డిది కృప గాదా!
(ఒకకల్పురమ్ము=ఏకశిలాపురి) (73వ అవధానము-వరంగల్)

<u>గణపతి స్తుతి - గీతమున</u>

శార్వ! నీపదముల్ మతి జంద్రు డేల
గొల్చు? దుర్ధీకులను దేల్చు గురుడెవండు?
పబ్బ మెల్లరు జరిపెడు పర్వ దినము
మొగము చూపించ కుంట నీ పగ ఫలంబు

(74వ అవధానము - సికిందరాబాదు)

<u>బడిపంతుళ్ల కష్టాలు కందంలో</u>

ఊఁయంటె పోనిదే యఘ
మోయి, సరే పోగ నింటి నింటి కోనెల, యొజ్జై
రాయిడి యింతన గలమా?
సాయంత్రము గడచుటన్న సంగీతమ్మా?

(75వ అవధానము - చేర్యాల)

<u>ధ్యానధ్యాతృ ధ్యేయరూపయైన పరమేశ్వరి గూర్చి కందములో</u>

రావే నా యోయో యను
ప్రోవౌ నఘవాసరుచి విభూన్మత్తస్థి
త్యావేశ ముడిపి కావన్
రావే! జగదంబ! దలుచు ప్రాణులకొఱకై

(78వ అవధానము - చుంచనకోట)

<u>రావణుడు సీతాకల్యాణమును భంగ పరచు దృష్టితో వచ్చి తానే పతనమైనట్లు చెడువాడు మంచి పనుల కాటంకము కలిగించి నిష్ఫలుడగునని గీతంలో</u>

దేవి! దేన జూపడు చేటు ధృష్టభాషి
ఓటునే లబ్ధిగా గొను నోర్వక నిశి
చరుడు రావణుం డవనిజాసక్తివచ్చి
ధర్మ భంగమ్ముననన్ భంగతను వహించె
ధర్మము=విల్లు, ధర్మము, భంగము=విరుచుట, చెరచుట

(79వ అవధానము - మరుపడగ)

<u>గంగాగౌరీ మధ్యస్థిత శివుడు - కందములో</u>

మరిచెప్పనేల? భర్గున
కురి యొండే తక్కువయ్యె నుగ్రుని యాటల్
గిరిజా గంగల నడుమన
గిరిగీసిన యటు వరలును గృపణత్వమునన్

(80వ అవధానము - సిద్దిపేట)

రామరావణ యుద్ధమునకు ప్రతిలేదు - కందము

శతశః శంభుత్వంబే
ఋతవత్శ్నిరతన్ సురాళి కీదృగ్ఘర్ష
స్థితి రామరావణాహవ
గతినెన్నెద తత్సమాన గతి లేదనుచున్

(81వ అవధానము - కుకునూరుపల్లి)

వరాహస్వామి వటువు నాశీర్వదించుట - కందము

కిరివై వస్వక్షి మధు
క్షర కృద్వంశ్యున్ సురాళిగతి బ్రోచుహరీ!
స్థిర బుద్ధి వటున కిచ్చుచు
పరమాశీర్వచన మిమ్ము ప్రజ్ఞానిధిగాన్

కిరి=వరాహము, వసు+అక్షి=హిరణ్యాక్ష, మధుక్షరకృత్+వంశున్= మాధుర్యమునునశింపజేయు వంశీకుని, సురాళి=దేవతల సమూహము

(82వ అవధానము - కరీంనగర్)

సీతారామ కల్యాణము - కందము

శ్రీకిల దగు వాడెవడో?
కాకుంటే భూమిపుల్ కకలు లేపంగా
లేకున్న శివుని చాపము
కాకుత్స్థుని పాలునయెగద జానకియున్

కకలు=కక్షలు(చంకలు), కాకుత్స్థుడు=రాముడు

(83వ అవధానము - సూర్యాపేట)

వేటివిద్యావ్యవస్థ - కందము

బత! చట్ల గతినిదెట్లో?
హితములు సెప్పగ మతుల్ సహించవు సుమ్మీ!
సుతరాం గట్టెట్టగునా
వెతయే లేదు సుధివర! వివేకం బెంచన్

(84వ అవధానము - చందాయిపేట)

<u>విభవ సం..ర ఉత్సవంలో నాచారం ఎట్లుంటుందో</u>
<u>ఊహించిచెప్పుట. ఆటవెలదిలో</u>

లోటు లేక యెన్న లోబత్తి వొంగ సం
లబ్ధి నెల్ల దెచ్చి లగ్గుకై ధ
రన్ గతికి విశుల్ పరాస్తాఘ వాఙ్నిధి
విభవ నుత్సవమ్ము వెలుగు నిచట. (త్రిపాదనిషేధం)

బత్తి=భక్తి, లగ్గు=మేలు, విశుల్=మనుష్యులు
పరాస్త=నశించు, అఘ=పాపపు, వాక్=మాటల, నిధి=నిధిగాగ

(85వ అవధానము - నాచగిరి)

<u>ఉస్మానియా విశ్వవిద్యాలయంలోని తెలుగుశాఖ గూర్చి</u>

తెప్పల్ తుప్పగముల్ రా
జప్పరి యైనటు దలంచ సంవిత్తే? మీ
చొప్పల్గన నెల్లరకును
మెప్పొ పరిశోధనముల మించు న్మించున్

(86వ అవధానము - ఉస్మానియావిశ్వవిద్యాలయము)

<u>పోతన నమ్మిక మిచ్చిన వెనుక సరస్వతి ఆనందము</u>

లేనిదేది యుండిన వంతలే, మహాక
థన్ గృతీనమై మించ బోత సుధి! ఆస
పడెద వంచు గుందితిని విశ్వాసమిచ్చి
అంచ దేల్చితి మోదరసాంబుధులను

(87వ అవధానము - పోతన ఉత్సవాలు - వరంగల్)

<u>మీరు ప్రతిష్ఠించబోయే సరస్వతి గూర్చి కందములో</u>

కల గంటి గోర్కిమై నీ
గల సత్తి గుడిని నిధివిధికై నీవే నా
యిల నమ్మి పూనితిని నీ
నిలిచిన రూపంబు నిలుప నిజముగవాణీ!

సత్తి = శక్తి (88వ అవధానము - సిద్దిపేట)

<u>యామిజాలలో సీతారామచంద్ర స్వామి నెలకొని యున్నట్లు</u>

భూజతొ నిల్చె నినేశుం
డోజ శ్రితతతికి వలసిన యోగమ్మిడి సం
యోఃకుడై యాంజాలన్
భ్రాజితుడై యుండి లోక పాలకు డయ్యెన్

(89వ అవధానము - దేవర యాంజాల)

<u>పాలవాని పాల గూర్చి - ఆ.వె.లో</u>

పాప లేద్వ దల్లి పాల్లేమి, కొన్నవి
పాలపాలు జారి వారి మించ
బలముమాట జూడ భగవంతునికెగుర్తు
పాలవాడు మాకు పాలివాడు

(90వ అవధానము - కుత్బుల్లాపుర్)

<u>ఆర్.టి.సి. బస్సు గూర్చి (శ్రీమరింగంటి కులశేఖరావధాని)</u>

ఇది తప్పలేని వెతయౌ
గద! పోరా డ్రొక్కిటుల్ సుఖం బడగారున్
తుద యెప్డొ బస్సు నెక్కన్
ముదితకు మరి చెప్పిపోవ ముఖ్యము మనకున్

(91వ అవధానము - శేరిలింగంపల్లి (రంగారెడ్డి)చ

సీతారామకల్యాణం - కందములో

శ్రీలన్ భూజ యిడంగా
నేలన్ లోవెల్గు మించ నినజుడు లగ్నం
బోలిగనై విశులెన్నన్
జాలెడు కల్యాణవృద్ధి జగముల కొఱకై

(92వ అవధానము - అద్దంకి - ప్రకాశం)

గణేశునివర్ణన : కందములో

శ్రీరంజించ బుర ద్విట్
స్మేరత నగసూప్రముగ్ధ చిర రక్షాప్తిన్
హేరంబుడు విఘ్నేశుడు
పారమ్యత నిచ్చు భక్తి భావము నిండన్

(93వ అవధానము - కావలి, నెల్లూరు)

సుభాస్ చంద్రబోస్ జన్మదినం - తే.గీ.

హింస కా నరుల్ పూన నహింస యా? యి
దెట్లు? నా బరచము లెంచ నెన్నె బోసు
తెల్ల దొరలను వెడలించు దీక్ష వెడలె
తిరిగిరాడయ్యె సంతృప్తి తేరుకొనగ
కానరుల్=చెడ్డవారు=, పరచములు=శత్రుసేనలు

(94వ అవధానము - నిజాంకాలేజి. హైదరాబాదు)

వీణాపాణి నిలిచిన రూపాన్ని నిలుపుట గూర్చి

కలరూఢిగా విపంచిక
వెలయం బొత్తంబు నక్షవీటి రహింపన్
నిలిచిన రూపము గుడిలో
నిలుపగ నిలిపితివి నన్ను నిజముగ వాణీ!

(95వ అవధానము - మెట్‌పల్లి ( కరీంనగర్)

కోహీర్ జామపండు - కందము

ఆహారమ్మొ మరియొం
డోహో! నా జవి నిజాంత రుద్యత్ స్థిరతన్
గోహీర్ ఝామ్మం చొప్పెడు
ఈహల బెంచుచును జామ ఇలలో మించున్

(96వ అవధానము - కోహీర్)

వెల్దుర్తి రంగనాథస్వామి - తే. గీ.

రక్షగోపదేశపు వేల్పు రంజిల నిడు
వెతల ద్రోయుత సర్వధా గతియ మాయె
డన్ ఋజుగతిగ కాతయై డాబునింపి
మూర్తి యయ్యె వెల్దుర్తి సర్వర్తు శోభ (పూర్ణనిషేధం)

(97వ అవధానము - వెల్దుర్తి)

భగీరథుడు గంగను దెచ్చుట - కందములో

నాన్నల్ సావన్ గంగన్
దెన్నందంగం గపట యతిన్ మెడవంచన్
గన్న ధడేల్ గా రారా
జెన్న భగరథుడు వార్ధులెంచ న్మించున్ (త్రిపాదనిషేధం)

(98వ అవధానము - పెద్దచెప్యాల)

శ్రీనివాసకల్యాణము - కందములో

పండుగలన్ బద్మన్ వె
న్నుండొగి కై యంద బత్తి నూల్కొంచు టముల్
మెండౌ లో జోతిగ నే
పెండిలి విశ్వాన శుభము వెలిగించుగదా! (త్రిపాదనిషేదం)

(99వ అవధానము - రామాయంపేట)

ప్రహ్లాదుడు హిరణ్యకశిపుని కాపాడినట్లు - కందములో

సుతుడే కాడా? దైవ
చ్యుతి దప్పం దండ్రిగాచె శుక్తతి వాపెన్
క్షితిని నృసింహుని ప్రభవ
స్థితిలో లోకముల నేలు స్థితి చేకూరెన్
శుక్+తతి = శోకసమూహము (100వ అవధానము - నారసింగి)

నెహ్రూ డాక్టర్‌జీ శతజయంతులు. - కందములో

సమలన్ బెద్దలపుట్టువు
లమలంబుల్, వన్నె జాతి కందిడు, మోదో
ద్గమముల్ నెహ్రూ కేబీ
లమనస్కులు వారి కీర్తి యంతట నిండెన్

(101వ అవధానము - సిద్దిపేట)

శ్రీరామ జననము - ఆటవెలదిలో

శ్రీకి బట్టయినను జెన్నొ సుమిత్రనూ
భ్వాస్యమెంచి చూడ పుణ్యజగము
మెప్పురా మహి నెకిమీడు మున్నగు బాధ
తొలగి ముదుకతనపు గలత గూడ (పూర్ణనిషేధం)
తనూభూ+అస్యము=కుమారుని ముఖము. ఎకిమీడు=ప్రభువు
ముదుక తనము= ముదుసలితనము

(103వ అవధానము - తడ్కపల్లి)

శివధనుర్భంగము - కందములో

భవవిలయంబా? కాదు, వి
శవర విధ నుత ధరాజజ గముల్ దుష్టిన్
వివశమ్ములుగా రాముడు
శివధనువును విరిచె సీత చేయందు కొనన్

(104వ అవధానము - సిద్దిపేట)

బ్యాంకు సేవలు కందములో

అప్పున ముంచెత్తెదొ? వే
నిప్పుల గాల్తువని తో ఘనీ! నహి,వద్దో
తిప్పలు శంకర! నిధి సఖ!
మెప్పుగ సంసార మీదుచ్చ మృతి నొసగుమయా!
అప్పు = ఋణము, నీరు (105వ అవధానము- RBI, Hyd )

**గణపతి భుక్త్యాయానము - కందము**

బొజ్జయె యౌగాక యెదేన్
గుజ్జుగ వే నంజుమాని గుండౌ విధి త
ద్వజ్జగతి నవ్వ గణపతి
వెజ్జులు లేనట్టి నోవు వెతగన వలసెన్

**(106వ అవధానము - సిద్ధిపేట)**

**అయోధ్య రామకరసేవ గూర్చి గీతములో**

తగ నయోధ్యకు గరసేన తతి సుదీక్ష
నెంత వెత దెగి సని యధికృషిని నడ్డు
సేసె నెకిమీని సత్తి పానాల్ నశించ గదలె
తోచు వాంఛ సమాప్తిగా బ్రోచె విధియు (సంపూర్ణనిషేధం)

**(107వ అవధానము - జోగిపేట)**

**వేంకటేశ్వరప్రార్థన కందములో**

దేహుల్ బత్తిన్ నిష్ఠ స
దీహలు సర్వమ్ము దక్కు హేయభవార్తిన్
దోహద మిలలో నీవే
శ్రీహరి! సప్తాద్రు లెక్క చేదుకొనుమయా!

**(108వ అవధానము - పాలెం, మహబూబ్‌నగర్)**

**మారుతిస్తుతి ఆటవెలదిలో**

వాఙ్మయాబ్ధి! బాలవాయుజ! భూభూ శు
గంతకా! కపీశ! కల్ప భూజ!
రామభద్ర భద్ర! ప్రచురవక్ష! మనోజ్ఞ!
రక్ష మాకు నీవె వృక్షచారి! (పూర్ణ నిషేధం)

**(109వ అవధానము - రిమ్మనగోడు)**

<u>సీతారామ కల్యాణం - కందములో</u>

భూప ప్రీణ ధనీన
స్థాపిగ ధనువేద భూసుతం గయినందన్
బైపై బులలు రహించన్
దాపముతో సాగనంపె ధర్మముకొలదిన్ (పూర్ణనిషేధం)

(110వ అవధానము - ఖమ్మం)

<u>కొల్లాపురం కుంతిమాధవుని గూర్చి కందము</u>

వాసికిగా బ్రుంగు గుడుల్
దీసి సుభద్రతను గూర్చ దే గో ట్లైనన్
ద్రోసి వెస మాధవునికిని
వాసము కొల్లాపురాన బ్రభుత యొనర్చెన్

(111వ అవధానము - కొల్లాపురం)

<u>పండితులు సమదర్శనులు అనేగీతానూక్తిని కందములో</u>

ఏనిక నాలన్ విప్రున్
బూనిక గురు రౌప్య మృద్విభుశ్వాధస్థున్
మానక సమదర్శనులై
ధీనిధు లొప్పదురు మాన్యతేజము వెలుగున్
ఏనిక=ఏనుగు, ఆలన్=ఆవులందు, రౌప్య=వెండియందు,
మృత్=మట్టిని, విభున్=రాజును, శ్వాధస్థున్=చండాలుని

(112వ అవధానము - సిద్ధిపేట)

<u>పేరిణినృత్యం - సాహిత్యం - వీటికి పోలిక కందములో</u>

ఆనంగా బదలీలన్
గానం వ్యంజకత నర్మగతి నిండసుమీ!
ధీనిధు లెల్లరు మెచ్చన్
మానిత సాహిత్యసేవ మహి పేరిణిలోన్

(113వ అవధానము - హైదరాబాదు)

<u>సరస్వతీస్తుతి - శ్రీరామనరసింహామూర్తి అవధాని</u>

వాణీ! నీవేనాపై
రాణింపు లభించ మాటరా సత్తి సభా
ప్రీణనవాసియు మదినా
ప్రాణము లవియిచ్చి నన్ను బాలింపగదే!

(114వ అవధానము - కేంద్రవిశ్వవిద్యాలయము, హైదరాబాద్)

<u>యజమానిని భోగేశుడు దీవించుట</u>

వెల్గినదె నాకు సూ! భూతి గల్గియుంట
నాతి సాబాల్ పెబుండ సునంద తతిని
షష్టి నిండగ మిత్తిని జంపు దీర్పు
నాగభూషణు నేలుత భోగవిభుడు

(115వ అవధానము - సిద్ధిపేట)

<u>గణపతి కాకముందు గణపతి గూర్చి కందకములో</u>

ఓరీ కష్టమ్మేమ్మిలా?
పారెటు పోఫో మదంబ వాకిలి గాయన్
రా రమ్మను నవ బాలుని
గారమ్మున ద్రుంచు శివుడు గణపతి జేసెన్

(116వ అవధానము - సిద్ధిపేట)

<u>అంబాలయము - అచ్చంపేట గూర్చి - కందములో</u>

అచ్చందము నెన్న విభా
త్యచ్చస్థిర యవుచునంబ యొప్పు బలదగా
నచ్చంపేటన్ భక్తుల
కిచ్చల బూరించి కచ్చ లేదన్ జేయున్

(117వ అవధానము - అచ్చంపేట - మహబూబ్‌నగర్)

<u>అంగీరస ఉగాది గూర్చి కందములో</u>

సంగాత మ్మిడుమా! ఉ
త్తుంగశ్రీనిచ్చి, కీర్తి సాధువు లొప్పం
గాం గీర మధుర వాక్కుల
నాంగీరస!కావుమయ్య! ఆర్తి తొలగగన్

(118వ అవధానము - చందానగర్)

<u>సరస్వతీ స్తోత్రము - కందములో</u>

మాటల్ ధీయును రాగా
గాటమ్మొ బల్మి పూజ గా నిత్తు సదా!
మూటల్ నాకవి దేవీ!
దీటుగ సభలోన నన్ను దేల్చుము వాణీ!

(119వ అవధానము - దొంగలధర్మారము)

<u>శ్రీభారతీతీర్థుల ధర్మప్రచారాన్ని వర్ణించండి కందములో</u>

ధన హేమనిధి విధా మద
ఘన జన భవ ముక్తి గల్గ గా గుణదానం
బునలో దమ్మం బేలన్
దినదినము శ్రమించు భారతీతీర్థ లొగిన్

(120వ అవధానము - మచిలీపట్నం)

<u>మతకల్లోల పరిస్థితిలో దైవము విధి కందములో</u>

మతదుష్టధీప్రణష్ట
స్థితి కీలల బూని యైన దేశం బేదున్
హిత మెంచు దైవమున్నను
సతతము బహురూపు డగుట సభ్యత యౌనా?
కీలలు=జ్వాలలు, ఏదున్=నశించును

(121వ అవధానము - హైదరాబాదు)

**తిరుపతి వేంకటేశుడీ వేంకటేశులను రక్షించాలని 'వ'కార నిషేధంలో కందమైనా?శ్లోకమైనా?**

సర్వాధీశోరమాకామో
నాగాద్రీశో - దయాపరః
షష్ట్యబ్దపూర్ణం స్వాభిఖ్యం
పాతు మంగా పతిస్సదా!

(122వ అవధానము - సిద్దిపేట)

**సరస్వతీస్తుతి: కందములో**

శ్రీవై స్త్రీవై యాపగ
వై వైరంబు వసివాల వాణీ! వాణిన్
భావన నింపుచు సదమున్
దీవింపగ జూడుమమ్మ తేకువ నిడుచున్

(123వ అవధానము - స్టేషన్ ఘనపూర్ - వరంగల్)

**జలక్షామనివారణకు శంకరుని గంగను దెమ్మని కోరుట**

శివ! మా వెత యప్పుల్గా
శివమేనా? జలదగంగ సిగ్గందెనె? యీ
భువి నీవున్న గరువాకో
చవియే శేషించె దకము సాలుగ దేవా!
దకము=నీరు, అప్పుల్=నీళ్లు

(124వ అవధానము - చేర్యాల)

**భావనా మూర్తి సరస్వతి గూర్చి - కందము**

వాక్కుల్ రా ధీ వెల్గన్
దిక్కై సదమెన్న గల్గు దేవి నెతీ దయన్
జక్కని యవధానంబున
అక్కర వడి గొల్చి నాద నంబా!వాణీ!

(125వ అవధానము - బచ్చన్నపేట)

<u>సరస్వతి గూర్చి - గీతములో</u>

ఇచ్ఛయు బనియుం బగ్గె సుమీ! తదాప్తి
భూకృతంబెన్న భాగ్యవిభు ప్రసభము
వాణికృపచేత జరుగును వానిభాగ్య
గరిమ వర్ణింప వశమె సత్కవివ రేణ్య!

(126వ అవధానము - హైదరాబాదు)

<u>శ్రీవేంకటేశ్వరస్తుతి తేటగీతిలో</u>

అమల! కరగ సమస్త! సప్తాద్రిదేహ!
కృతము సంభాగ్య యోజక మెన్న నిందు
రక్తి గరగర్త మన్చేట భుక్తి ముర్వ
సూప నర్చాప్తి గొంటి మెచ్చుగ సతంబు (పూర్ణనిషేధం)
కరగర్తము=చేగుంట గ్రామమునకు సంస్కృతీకరణము

(127వ అవధానము - చేగుంట)

<u>అవధాని వేదన కందములో</u>

దత్తం బుత్తంసంబై
చిత్తస్థిర దీక్ష నేది సిద్ధరతిన్ భా
వోత్తమమై నెగడుటకై
యుత్తల పడవలసి యుండు టొ ప్పవధానిన్

(129వ అవధానము,అర్.బి.వి.అర్ మహిళాకళాశాల, హైద్రాబాదు)

<u>వ, మ, వ, ద, గ, ల అను అక్షరాలు లేకుండా</u>
<u>సరస్వతీస్తుతి. (ప్రత్యక్షరనిషేధముతో పాటుగా)</u>

ననకెన యౌసిరియేరికి
కొనకొను జరణంబుతోన కూడు సతంబున్
జననీ! భారతి! నాకీ
జని సార్థక రీతి యౌట సాధ్యంబౌనే?

(129వ అవధానము - కరీంనగర్)

<u>మంథనిలోని సరస్వతి గూర్చి</u>

నన సంకువు లిరుకేలన్
గొని క్రొమ్మించున మిగులగ గూలమునన్ వె
ళ్లిన పుస్తక వీణాధరి!
కొను చరణములాన కాచుకోవలె గమలన్

**(130వ అవధానము - మంథని)**

<u>సరస్వతి ప్రార్థన కందములో</u>

రావే నాహృన్నిధివే
దేవీ! వాక్కిచ్చి కాచు ధీతో సదమున్
భావోన్మయరసరూఢిన్
నీవే కోదాడ నిలిచి నిలుపుము వాణీ!

**(131వ అవధానము - కోదాడ, నల్లగొండ జిల్లా)**

<u>గడియారముపై కందము</u>

తప్పక మహిగతి నీదే!
ముప్పల్ నిన్నంటుకున్న మున్గన్ గార్యం
బొప్పన్, దప్పక గడియా
రప్పా! సరిచేయు మమ్ము అలసత వాయన్

**(132వ అవధానము - సిద్ధిపేట)**

<u>మార్కండేయుడు సభను దీవించుట కందములో</u>

కాచుత సభ నీనాడున్
రోచిని నాదంబు నించు రూపంబౌ వాక్
వీచుల్ సంభ్రమ మొప్పన్
దోచంగ మృకండుసూతి తుష్టిని గనుచున్

**(134వ అవధానము - సిరిసిల్ల)**

నరుడు నరుడుగా జీవించగలగాలి - కందములో

మతి దప్పి యొరుని మించన్
ధృతి కీడెంచిన కతల్ శ్రుతి విభగముగ గా
మతి నరుడు మానవత్వము
గతి దప్పక యున్ననింక గార్యముగలదే?

విభగము=భగరహితము=దరిద్రత; భగము=ఐశ్వర్యము

**(135వ అవధానము - సిద్ధిపేట)**

ఏరు, వాక గూర్చి కందకములో

వాకగ మించన్ లేమిన్
సోకులు వోవున్ ధనిగ విశుక్కై యుండున్
రాకా చంద్ర ప్రతిబిం
బాకృతి నతి కెందు సాటియై యెసలారున్

విశుక్కు=దుఃఖములేనివాడు **(136వ అవధానము - వరంగల్)**

సాయిబాబాస్తుతి కందములో

శ్రీవై మా కీవే సా
యీవై సర్వమ్ము బత్తి యే జీతమ్మై
పావులమే నీలీలకు
దేవా! అభయమ్ము విడువ దేకువ యౌనా?

**(137వ అవధానము - ఒంగోలు)**

శారదను - శంకర గురువును గూర్చి కందములో

(డా.జె. సదానందశాస్త్రి కన్నడ అవధాని)

శత సత్సమ గాని పనుల్
ధృతదీప్తి జగంబు నం బ్రతీతిగ శివమూ
ర్త త నల్పవయస్సుననే
మతి శారదయౌచు భక్తిమతము న్నిలిపెన్

**(138వ అవధానము - అనంతపురం)**

<u>పాశ్చాత్యసంస్కృతి భ్రమ గూర్చి కందంలో</u>

క్రొత్తది యేదియు మెచ్చున్
విత్తనంబున దో సదాఢ్య! విశమార్గమ్మై
చిత్తం బుత్తలపడగా
నుత్తమ మప్రాచ్యవృత్తి యుక్తం బయ్యెన్

(139వ అవధానము - విశాఖ)

<u>ప్రహ్లాదుడు తండ్రితో మాటాడుట కందములో</u>

అం తారక్ష్యగం నతో2హం
స్వాంతముతో నెంచి తండ్రి! అంతావాడే
మంతవ్యుడె ల్లవేళల
చింతించిన సకలముగను చిన్మోక్షమిడున్

(140వ అవధానము - వరంగల్)

<u>సరస్వతీ ప్రార్థన</u>

శ్రీదాత్రీ! ధీదాత్రీ!
మోదంబులు నితవు దృష్టి ముందిడి రా, దా
రేదీ కనిపించదె? మ
మ్మోదన్ శ్రీశారదాంబ! ఇల దిగి రావే!

(141వ అవధానము-తెలుగువిశ్వవిద్యాలయము, హైదరాబాదు)

<u>మండల అభివృద్ధిని గూర్చి కందము</u>

శ్రీ సౌఖ్యం బీగతిగా
వాసికినై సర్వవృద్ధి భాసించంగా
గాసికి నేతల్లేరా?
బోసిగ నీ మండలంబు భువిచిత్రంబౌ

(142 వ అవధానము - చిన్నకోడూరు)

# ముక్త సమస్యా

<u>భీష్మని పెండ్లి చూచుటకు బిన్నలు పెద్దలు వచ్చి రందరున్,</u>

భీష్ముడు ద్రోణుడుంగృపుడు పేర్మినిమెచ్చగ నవ్విరాటు నా
యుష్మతి నుత్తరం గుతుక మొప్పగ బెండిలి యాడు నర్జున
గ్రీష్మజల ప్రపాత మగు కృష్ణుని యల్లు, స్వకీయ యుద్ధతా
భీష్మని పెండ్లి చూచుటకు బిన్నలు పెద్దలు వచ్చి రందరున్,

**(1వ అవధానం - నారాయణఖేడు)**

<u>చలివేళం జెలిలేని జన్మవృథయౌ చంచద్వయ శ్శాలికిన్</u>

ఇలలో బెద్దలు నిర్ణయించినది సాహిత్యమ్ము శాంతమ్ము పెం
డిలి, అన్యోన్యత భాసిలంగవలయున్ నిక్కమ్ము, కాకుండ వా
క్కుల పారుష్యము కంఠదఘ్నమునుగా గుమ్మన్ సరే, కాని,ఈ
చలివేళం జెలిలేని జన్మవృథయౌ చంచద్వయ శ్శాలికిన్

**(2వ అవధానం - సిద్ధిపేట)**

<u>తండ్రియు నల్లుడు న్మగడు తానొకరుండె నిదేటివావియో?</u>

తీంద్రపు గామవేదన సతీమణి యొక్కత యన్యు గూడి కన్
మంద్రల గొడ్కు గూతు విడ మన్వాన గూడి విడాకులయ్యె, వే
వేంద్రపు బైత్యమున్ జనని వెంట సుతుం గనె, వాడు నామె పిం
దండ్రియు నల్లుడు న్మగడు తానొకరుండె నిదేటివావియో

**(3వ అవధానము - సిద్ధిపేట)**

ఇక్కడ సమస్య - పూరణము గురించి కొంత వివరించ వలసి యున్నది ఈసమస్యను చక్కగా బూరించ గల్గిన నీకు "అవధాని శిరోమణి" బిరుదీయవచ్చును. ఎందుకనగా ఒకేవ్యక్తి అవిడకు తండ్రి, అల్లుడు, మగడుక అగుట కష్టము, అయినట్లు

చెప్పి సమర్థించుట. ఇంతకన్న కఠిన సమస్య ఉండదు. మహారేణుకా సన్నిధానమున నీయవధానానికి బరీక్ష అన్నారు గురువు గారు. గురువు గారును కొన్ని నూర్ల అవధానములు చేసినవారు. అమ్మకు నమస్కరించి పూరించితిని.

ఒక బాలవిధవ భరించరాని కామవేదనతో ఒక మగ శిశువును కని కందకములో పడవేసెను. తిరుగ కొన్నాళ్లకు ఒక ఆడ శిశువును కని వేరొక యూర బడవేసినది. దైవవశాత్తు వారు వేరువేరిండ్లలో బెరిగి దంపతులైరి. కొన్నిరోజులకు ఒక యోగినిద్వారా విషయ మెరిగిన భార్య తన భర్త అన్న అని తెలిసి దాంపత్యము సేయ నొల్లక నిల్లు విడిచి తానును యోగినిగా మారినది. వయశ్శాలియైన భర్త వేశ్యతో కుమారునిగనెను. అవేశ్య అతని తల్లియే, ఆమెయు శిశువును విడిచి మరియొక చోటికి వెళ్లినది. వైరాగ్య శాలినియైన యోగిని భిక్షార్థిని యై సమదృష్టితో తన భర్తయింటికి గూడ వచ్చినది. ఆయన ఆమెను గుర్తించక 'యోగినీ! ఇంత యుక్త వయస్సులో నీకంతవైరాగ్యము కలుగుట నీ పూర్వ జన్మ విశేషమే. కాని పాపపు లోకమున యుక్తవయస్కురాలైన పడతి బయట తిరుగుట క్షేమము గాదు. నీకభ్యంతరము లేనిచో మాయింట నుండి అనాధయగు నీ శిశువును పాలించగోరుచున్నా"ననెను.

క్షణమాలోచించిన యోగిని ఆయన తనను గుర్తించ లేదు కనుక ఉండి చూతమని సమ్మతించినది. యోగశక్తి సంపన్ను రాలైన యోగిని ఆ అబ్బాయిని పలురకముల వావితో పిలువవచ్చునని ఊహించినది. ఈవిధముగా ఆబాబు అమెకు పిన తండ్రి, తల్లికి ఉంపుడు కాడు కనుక తండ్రి, ఇరువురును ఒక తల్లి పిల్లలే కనుక తనకు పినతండ్రియగును. తన అన్న కొడుకు కనుక తనకు అల్లుడు. ఇంకను సోదరుడు, మనమడు, మేనమామ (మామ), కుమారుడు,

మరది అను వరుసలలోనికిని రాగలడు. కాని ఇక్కడ పృచ్ఛకుడు మూడు వరుసలే అడిగినాడు, తండ్రి, అల్లుడు, మగడు దానిని పిన దండ్రి, అల్లుడు అనువానిని చెప్పితిని. మగడు అనునది ఒక్కటి మిగిలినది. మరది అనినచో వివరణ అవసర మయ్యేడిది కాదు. తాళికట్టిన వాడుమాత్రమే మగడు, లేదా మగనిగా భావించిన వాడుమాత్రమే మగడు కాగలడు. ఇక్కడ ఆరెండును సంగతమగుట లేదు. తండ్రియు, అల్లుడును అను వానికి సముచ్చ యార్థకములగు 'యు' 'ను' అనునవి కలిగి, మగడు అనుదానికి ఎట్టి సముచ్చయము వాడబడనందున, మగడు తాను ఒకరు ఉండె అనగా మగడు అనువరుస ఒకటి మిగిలినది, ఇదేటివావియో? ఇదెక్కడి వరుసయో నాకు అవగతమగుట లేదు. అని ప్రశ్నార్థకము నుపయోగించు కొంటిని.

ఇక్కడ పృచ్ఛకుడు ఇవేటి వావులో? అనియుండిన అవధానికి మిక్కిలి కష్టమయ్యేడిది. ఇదేటివావియో? అనుఏకవచన ప్రశ్న మగనికి అవకాశము దొరికినది. దీనితో సమస్య సులభముగా గట్టెక్కుటయేగాక ప్రశ్నించు నవకాశము లేకుండ జేసినది. సభ నాశ్చర్యమున ముంచెత్తినది. దీనితో సమస్య సులభముగా గట్టెక్కుటయే గాక ప్రశ్నించు నవకాశము లేకుండ జేసినది. సభనాశ్చర్యమున ముంచెత్తినది. వెంటనే గురువుగారు సభాముఖముగా ప్రశంసించి "అవధాని శిరోమణి" అను బిరుదున కన్ని విధముల యోగ్యుడవు " అని దీవించిరి. 3వ అవధానములో ఈ బిరుద ప్రదానయోగ్యుడ నగుటకు అమ్మ అనుగ్రహము భవిష్యత్తులో తన దేవాలయమును అనంతసాగర్ కొండలపై నిర్మింప జేసి కొనుటకు అవధానము నాలంబనము గావించుకొనుట నూహించినట్లైనది. ఈ అవధానము పిదప రెండు ఏండ్లకే ఆలయ నిర్మాణమునకు బూనుకొనుట జరిగినది.

ఇంతకూ ఇంత తక్కువ సమయములో ఈ సమస్యను ఇంత భావపుష్టితో కథా కల్పనా చమత్కృతితో చెప్ప గల్గుటలో నాప్రజ్ఞావిశేషములు సహృదయుల నాశ్చర్య చకితుల జేయక పోవు.

నిజమొకటి ఇక్కడ తెలుపక పోవుట నేర మగును. చిన్ననాడు మా నాయినమ్మ శ్రీమతి లక్ష్మీనరసమ్మ గారు కాళిదాసురచనగా ప్రతీతిగల క్రింది శ్లోకమునుచెప్పి అందలి కథను వివరించి శ్లోకమును గంతపారము చేయించినది. ఇది నేర్చిన 20సం లకు దాని అవసరము, సమయానికి స్ఫురించుట జరుగునని యూహించినదియు కాదు. పాఠకుల సౌకర్యార్థమై ఆశ్లోకము నిట నుదహరించుట శ్రేయమని భావింతును.

శ్లో। జారోత్పన్నౌవిసృష్టౌ తనయదుహితరౌ దంపతీ దైవయోగాత్,
యోగిన్యా గర్భితాసా తదనుగమ వశాత్ యోగినీత్వం ప్రపేదే
తస్మా ద్వేశ్యాకృతంవా అథశిశుజననం, లాలితం త్వ్రబ్రవీ త్సా
భ్రాతృ భ్రాతృవ్య పౌత్ర శ్వశుర సుతపిత్సవ్యేతితం దేవరేతి"

శ్లోకార్థమును ముందే వివరించి యుంటిని. ఈ శ్లోకము సమయానికి స్ఫురించి తెలుగున పద్యమున యథాశక్తిగా నిముడ్చగలుగుట అమ్మదయ యని సంపూర్ణముగా విశ్వసించు చున్నాను. విషయ మంతా విన్న సభ్యులు ఈ బిరుదీ యవధానికి అన్వర్థమనియు గరతాళధ్వనుల తో ప్రశంసించిరి. నాకును బెరుకు తొలగి అవధానములు ముందు ముందు ఎన్ని యైనను జేయగలనను నమ్మకమును గుదిరినది.

<u>భారత యుద్ధరంగమున బాండవ కృష్ణులునోడిరేకమై</u>
మీరిన పాప చింతన కమేయ ఫలంబును దప్పనేమి? నా
ధీరతనూజు డియ్యెడల దెచ్చెను దుర్యశమేమి సేతు? నా
గూరిన తేని కొక్క గల గొబ్బునవచ్చెను, దానిలోన ద
ద్భారత యుద్ధరంగమున బాండవ కృష్ణులునోడి రేకమై
కూరిన=వంతచెందిన, తేనికి=ధృతరాష్ట్రునకు
కలవచ్చినట్లుగా కల్పించి సమస్యవిడ గొట్టబడినది.

(4వ అవధానము - హైదరాబాదు)

కంటికి బూవుగాగ గడుఖ్యాతిని గాంచెను ముజ్జగంబులో

(కంటికిపూవు=మోతెబిందువు - గ్రుడ్డితనము)

ఈ సమస్యలో కర్త చెప్పబడలేదు. దీనిని సౌకర్యముగ గ్రహించి పూరించుట జరిగినది.

తొంటివిరోధముల్ గెడపి, తోడుగ గాశ్యపు లబ్ధిద్రచ్చ, మి
న్నంటు పొగల్సె లంగెడు విషాహరుడై తపియించుచున్న, వా
ళ్లంటి నగాత్మజాతకు దలంపు ప్రసన్నతకై విధుండు ము
కంటికి బూవుగాగ గడుఖ్యాతిని గాంచెను ముజ్జగంబులో

సముద్ర మథనము, కాశ్యపులు = దేవదానవులు, శివుడు విషాహారుడగుట, తత్తాప శమనమునకు చంద్రుని తలపై ధరించుట, చంద్రుడు శివునకు తలపూవగుట. ఇందు విషయము

(5వ అవధానము - మాసాయిపేట)

వాసిగ గౌరి కాత్మజుడు వారిజ శల్యుడు శౌరి కల్లుడౌ

ఇది క్రమాలంకారమున దప్ప బూరింప రాని సమస్య నాయవధాన చరిత్రలో ఇది యొకటియే క్రమాలంకారమున చెప్పినది. ఇక ముందుక్రమాలంకార యోగ్యమైన సమస్య వచ్చినను క్రమాలంకారమున వాడకూడ దను నిశ్చయాభిప్రాయమునకు దెచ్చిన సమస్య ఇది.

ఏ సుముహూర్తమైన నుతియింపక దప్పనివాడెవండు? పెన్
దోసము గల్గి వెల్గెడు ఘను న్మరి పిల్చుట యెట్లు? కౌరవున్
మోసము చేసెవేఁడు? నృపపుత్రిక దేలిక వేడు బెండ్లియౌ
వాసిగ గౌరి కాత్మజుడు వారిజ శల్యుడు శౌరి కల్లుడౌ

(గౌరికాత్మజుడు) (వారిజ! = చంద్రా) (శల్యుడు)
(శౌరికల్లుడు = అభిమన్యుడు)

(6వ అవధానము - సిద్దిపేట)

<u>వరునకు గన్యనీయ నను వానిని మెచ్చిరి ధర్మ తత్పరుల్</u>
పరమదయానువర్తన, సభాజన వశ్యకర ప్రభావమున్
బరుగుచు దివ్య యోగ బల వర్ధనుడై, మహిమానుభావుడై
నరులకు బూజనీయు డయినన్ దను బెండిలియాడగోరు నీ
వరునకు గన్యనీయ నను వానిని మెచ్చిరి ధర్మ తత్పరుల్
నీవరుడు=సన్యాసి (7వ అవధానము - మెదకు)

<u>పతితలగోసి భర్తకిడె బందుగులెల్లరు సంతసింపగా</u>
కుతుకము మీఱ శ్రీనగము గూర్చి సముద్యతులై ప్రయాణమై
సుతతతి తోడ గూడి యొకచో విడియంగ క్షుధార్తి పెంపు తత్
క్షితి నశనంబు వండియు రుచింగను పచ్చడి తింత్రిణీకురుట్
పతితల గోసి భర్త కిడె బందుగు లెల్లరు సంతసింపగా
తింత్రిణీ కురుట్పతి=చింతచెట్టు,తల= చిగురు భాగము
(8వ అవధానము - సిద్ధిపేట)

<u>చందురుగాంచి చెమ్మగిలె సారసమిత్రుని మోము చూచితే</u>
సుందర రూపము న్గనిన శుష్క మనంబు ద్రవించకున్నె, పూ
వుందరి జేరి మెచ్చని ప్రబుద్ధులు కల్గుదురే జగంబునన్
సుందరి! కోపతాపముల చొప్పున గూడను నీదుమోము నా
చందురుగాంచి చెమ్మగిలె సారసమిత్రుని మోము చూచితే
(9వ అవధానము - పాలమాకుల)

<u>మంగలవాడు నీమగడు మానిని జానకి! చింత యేటికిన్</u>
రంగదుదారవైభవ పరంబగు వంశము నందు బుట్టు వా
డం గజమోహనాంగుడు శరాసన భేదన శక్తియుక్తు డు
ర్వింగల దీనలోకముల వేదన నెల్లపుడెంతొ ప్రేమ నో
మంగలవాడు నీమగడు మానిని జానకి! చింత యేటికిన్
ఓమంగలవాడు=కాపాడగలిగినవాడు
(10వ అవధానము - మాసాయిపేట)

<u>రావణుగాంచి సీత అనురాగము సెందె నదేమి చిత్రమో?</u>
ఈవిధి గన్నతండ్రి యిటు లేటి స్వయంవరమంచు జాటె, నా
భావము మెచ్చు భర్త యెట వర్తిలు, నందరనెట్లు నెన్నుదున్
నావిలపించి తోట జన నారఘునాధుని వైరిలోక వి
ద్రావణుగాంచి సీత అనురాగము సెందె నదేమి చిత్రమో?

(12వ అవధానము -మాసాయిపేట)

<u>నడురేయి న్గనువట్టు సూర్యు డదిగో-నారీ! కురంగేక్షణా!</u>
తొడిగెన్ రాతిరి దీపకాంతి వసన స్తోమంబు నల్వంకలన్
సడియొక్కింతయు లేదనంగ మధుర స్వానంబు విన్పించె, వెం
బడి రోషారుణ నేత్ర కాంతి తగునే? పల్మారు లీనాటి యీ
నడురేయి న్గనుపట్టు సూర్యు డదిగో-నారీ! కురంగేక్షణా!

(13వ అవధానము - సిద్దిపేట)

<u>వృశ్చిక పుచ్ఛంబు మీద వృషభము నిలిచెన్</u>
నిశ్చయ మెట్టిదొ వానిది?
దుశ్చరితుడు మద్రరాజు తో గౌరవు దే
మాశ్చర్యము - పోలిక గన
వృశ్చిక పుచ్ఛంబు మీద వృషభము నిలిచెన్

(14వ అవధానము - జగదేవపూర్)

<u>దేవుడువచ్చి నాడిచట దీవన లిండు దయారసంబునన్</u>
కోవెలలోన భక్తులవి కోరిక లెల్లను దీర్చి దీర్చి, ఛీ!
దైవతవృత్తి ఘోరమని, దానవదారకుడై జనించియున్
శ్రీవిధిగోరి భూమి నివసింపగ డింగరి 'వంశి'రూపుడై
దేవుడువచ్చి నాడిచట దీవన లిండు దయారసంబునన్

(15వ అవధానము - సిద్దిపేట)

భారతమందు రాముని ప్రభావము గన్పడు నద్భుతంబుగన్
కోరిన రీతి దేవతల కొల్వ ననేకత కుద్దిగాదు. ని
ర్ధారిత చిత్త మేక గతి రాజిలు ఆస్తికులందు, దాన ని
ష్కారతి పేటపేట నెగడ న్దొడగెన్ మరి రామమూర్తులున్
భారతమందు రాముని ప్రభావము గన్పడు నద్భుతంబుగన్
భారతము = భారతదేశము (16వ అవధానము, మాసాయిపేట)

అశ్వత్థామను గూల్చె నంగదుడనిన్ హాపుత్రకా! యంచనన్
శశ్వత్కీర్తి విధాయకామల బలాశ్చర్య ప్రభావోన్నతిన్
విశ్వాస్యుండగు రావణాసురుడు వంపెన్ యూధపున్ వాడునున్!
నిశ్వాసాంతము బోరు చుండగ బలోణ్ణీద్రున్ వరిష్ఠున్ బ్రకో
పాశ్వత్థామను గూల్చె నంగదుడనిన్ హాపుత్రకా! యంచనన్
(17వ అవధానము - కొండపాక)

పతిగళమున దాళి గట్టె భామా మణియున్
క్షితిధరసుత గౌన వచ్చిన
క్షితిపతు లబ్బురము సెంద సీత యరుత శ్రీ
పతిగట్టె దాళి, యెక్కడ
పతిగళమున దాళి గట్టె భామా మణియున్
(18వ అవధానము - లింగారెడ్డివల్లి)

విఘ్నేశుని పెండ్లిచేసి విధి విలపించెన్
శ్రీఘ్నుతకై దైత్యులు లో
కఘ్నులుగా మార వారి కత మాపుటకై
విఘ్నంబుల సృష్టించియు
విఘ్నేశుని పెండ్లిచేసి విధి విలపించెన్
(19వ అవధానము - సిద్దిపేట)

<u>పతితనుగూడి భూసురుడు పండితుడై రహిమించె నయ్యెడన్</u>

క్షితి జను లెల్ల విద్యల వశీకృతి బొందక నున్నవేళ, నల్
శ్రుతులు వరించి వేత్తయయి చెల్వగు గ్రామములోపలన్ బురో
హితుడయి భక్తి మార్గగతి నేలుచు నిర్మల జాపతృప్తమా
పతి తనుగూడి భూసురుడు పండితుడై రహి మించె నయ్యెడన్

జాప తృప్త మాపతి = జపముచే దృప్తి చెందిన విష్ణువు గలవాడు

**(20వ అవధానము - సిద్ధిపేట)**

<u>గ్రీష్మము నందు బైట తొలగించియు గోడలు కోరె మామనే</u>

ఊష్మము మాట గుర్తెరుగ నొల్లని కన్నియనెంచి యెంచి య
ర్చిష్మదనూన తాపుడగు రేవడి కీయగ నేదిగోరినన్
భీష్మత జూపు, నెండలకు వేగక జల్వల వల్వలందగన్
గ్రీష్మము నందు బైట తొలగించియు గోడలు కోరె మామనే

రేవడు=చాకలి, అర్చిష్మత్=అగ్నికి, అనూన=తక్కువగాని,
భీష్మత=కోపతీవ్రత, జలువలవలువలు=ఇస్త్రీ గల చీరలు
మేనకోడలును వివాహ మాడు సంప్రదాయమును బట్టి భర్తను
మామా అని పిలుచుటకలదు.

**(21వ అవధానము - హైద్రాబాదు)**

<u>పూజ యొనర్పగా దగదె? పుణ్యవతీ పురుషాయితంబులన్</u>

భూజనులందు దంపతుల పొందిక జూడగ గన్యచిన్నదౌ
రాజితమయ్యె ద్వాపరను రాధిక, కృష్ణుని కన్న పెద్దదై
తేజ మెలర్పగా దగును దేకువ దివ్యరతిప్రబోధలన్
పూజ యొనర్పగా దగదె? పుణ్యవతీ పురుషాయితంబులన్

**(22వ అవధానము- సిద్ధిపేట)**

<u>మీనము లుద్భవిల్లెను సుమీ! పినతల్లికి దానితల్లికిన్</u>
చేసిన పాపమేమొ? సతి చెన్నలరెన్ గృహమందు దాసిగా
వాసిగ స్వేచ్ఛ దేశమున వర్తిలు నెన్నికలందు గెల్చి కా
శీసమ యైన యిందిర వెలింగెడు నేల్బడి రాకయుండునే
మీసములు? ఉద్భవిల్లెను సుమీ! పినతల్లికి దానితల్లికిన్
(23వ అవధానము - నిజామాబాదు)

<u>స్వర్గము దుర్గమం బిలను సంపద లెల్లను సన్నగిల్లగన్</u>
దుర్గతిభీతి యజ్ఞములతో నశియించెడు బూర్వమందు, నా
భర్గుని సత్కృపన్ సకల భాగ్యము లబ్బెను. శాస్త్రపుణ్యమై
స్వర్గము దగ్గరయ్యె నిదిచాలదె? యిట్లననేల? నీకు నా
స్వర్గము దుర్గమం బిలను సంపద లెల్లను సన్నగిల్లగన్
(24వ అవధానము - పటంచెరువు)

<u>కూరిమి గాంచె గ్రుడ్డి శశకోమల శృంగముపై గరీంద్రమున్</u>
(గ్రుడ్డివాడు కుందేటి కొమ్ముపై ఏనుగును చూచెను)
ధారుణి మెచ్చినట్టి వరు దాగయికొన్న వధూలలామ ని
ద్రారుచి మాని లెమ్మనుచు దత్పరయై బతిమాలినన్ గలన్
మీరిన చిత్రముల్ గని రమించిన తృప్తిని, నింక నెంతయో
కూరిమి గాంచె గ్రుడ్డి శశకోమల శృంగముపై గరీంద్రమున్

<u>ఇంకొక పూరణము</u>
పేరిమితోడ గ్రుడ్డివరు బెండిలి యాడిన కాంత జీవనం
బేరహి సేసినన్ రతుల నెంతయు ముందయి తానె వచ్చుచున్
దారపథమ్ముతో సుపరతమ్ముల కూనిన దాని భావనం
గూరిమి గాంచె గ్రుడ్డి శశకోమల శృంగముపై గరీంద్రమున్
(25వ అవధానము - వేములవాడ)

<u>కోళ్లంగాల్చిరి తిండికై ద్విజులు సంకోచంబు లేకెంతయున్</u>
గుళ్లన్‌బూజలు చిక్కకున్న జనులంగోపంబు పెచ్రేగినన్
మళ్లన్ మాన్యములున్ నిరన్నదములై మాడంగ సంసారులే
యుళ్లన్ బట్టిరి, యాలు బిడ్డలతో యెందున్నన్ విశుల్ గూడ పా
కోళ్లంగాల్చిరి తిండికై ద్విజులు సంకోచంబు లేకెంతయున్
(26వ అవధానము - బోధన్)

<u>యజ్ఞంబుం బొనరించె భోగిని రతివ్యాపార మేపారగన్</u>
అజ్ఞానుల్ జనులెల్ల నైహిక గతుల్ హాయంచు భావించి యా
యజ్ఞేశున్ దలపోయమాని భవకూపాంతర్గతుల్‌గారె, నా
జిజ్ఞాసుల్ చెవి నిల్లు, కట్టుకొనుచున్ జెప్పంగ విజ్ఞానియై
యజ్ఞంబుం బొనరించె భోగి, నిరతివ్యాపార మే పారగన్
భోగిని = బోగముస్త్రీ, రతి వ్యాపార మేపార యజ్ఞము చేసినది
అని పృచ్ఛకుని భావన
యజ్ఞంబుం బొనరించె భోగి (సంసారి) నిరతివ్యాపారము
పుణ్యార్జనా నిరతుడై అని పూరణము
(27వ అవధానము - వర్గల్)

<u>మోహిని ముద్దుబిడ్డడు రమోమల ముద్దిడె విఘ్ననాథుడై</u>
ఊహకు మంచి చెడ్డ యను టెన్నడు గల్గదు. కాముకేళి వి
ద్రోహము కాదు. దాని గతితో మనకేమి? ధనాశపెల్లుగన్
బాహుబలంబులేక తన ప్రజ్ఞను బోధకుడై విరించికిన్
మోహిని ముద్దుబిడ్డడు రమోమల ముద్దిడె విఘ్ననాథుడై
విరించికిన్ మోహిని ముద్దు బిడ్డడు = సరస్వతీపుత్రుడగుకవి
రమ+ఉమ లను (సంపదను, కీర్తిని) ముద్దిడె=పొందగల్గెను
విఘ్ననాథుడు = కవీనాంకవి = గొప్పకవి
(28వ అవధానము - వేములవాడ)

హనుమంతుని బెండ్లి యాడి రార్గురు కాంతల్
మనమున నచ్చిన వారల
గొనగా దమజన్మభగణకూటము దోషా
శనులుం దొలగగ గొలిచిరి
హనుమంతుని - బెండ్లియాడి రార్గురు కాంతల్

మనసున బెండ్లాడగోరగా వారికి రాశికూటాదులు సరిగా కుదుర నందున దద్దోష నివారణకై హనుమంతుని సేవించి అతని యనుగ్రహముతో ఆర్గురును బెండ్లాడిరి

(29వ అవధానము - సిద్దిపేట)

అలరె మింటిపై సూర్యుండు నర్ధరాత్రి
శాస్త్ర విజ్ఞాన సంపద భస్త్రికలను
శిశువు బుట్టింప రోదసి చెన్నలర్చి
పడెడు స్కైలాబు గవితలో బల్కినంత
అలరె మింటిపై సూర్యుండు నర్ధరాత్రి

(30వ అవధానము - కామారెడ్డి)

గుబ్బలగుమ్మ లేజివురు గొమ్మది నామది నిల్చియుండెడిన్
అబ్బ! ఇదేటి శోభ, కనులందున శోభిలు కాంతి జూడ నా
యబ్బకు దిమ్మ దిర్గు, హృదయంబున రాగము పంచి పెట్టెనా?
సిబ్బితి యేల? కోమలపు జీవము దానిది - ఏమి చెప్పుదున్
గుబ్బలగుమ్మ లేజివురు గొమ్మది నామది నిల్చియుండెడిన్

(31వ అవధానము - గోదావరిఖని)

రామునియున్న భీష్ముడని వ్రాసెను బోతన భారతమ్మునన్
భూమిని దీక్షలో రఘువు. పొల్పగు గోపము గాధిసూతి, పో
రాములయందు గృష్ణుడు, శరప్రసర ద్విధి పార్థుదంద్రు ని
ష్కామ పరస్త్రియుండు రఘు చంద్రు డపత్నికు దిక్కయజ్వ ఆ
రాముని కన్న భీష్ముడని వ్రాసెనుబో! తన భారతమ్మునన్

(32వ అవధానము - రామచంద్రవురం)

<u>రాము డనేక పత్నికుడు రంభనుబొందగ గోరె బల్మిమై</u>
ఏమిటి చిత్రమైన కథనెంచితి రంచితి రామగాధ పో
రాముల బాప వాల్మీకియు రాముని జేసెను నేకపత్నికున్
భూమిని లోకకంటకుడు బొల్పగుగా మయ పుత్రికామనో
రాము డనేక పత్నికుడు రంభనుబొందగ గోరె బల్మిమై

మయపుత్రికామనోరాముడు = మండోదరి భర్త = రావణుడు
రంభను గవియ బోవుట రామాయణ కథ

**(33వ అవధానము - భెల్)**

<u>పంది ముఖాంబుజం బతడు పల్మరు నించెను చుంబనమ్ములన్</u>
ఎందరు దైత్యవీరులు మహీస్థలి బుట్టరు చావరెందు, భూ
మీందిర జాపజుట్టగల హేమ సునేత్రుని జంప విష్ణువే
పందిగ బుట్టి చంపె, ధర భార్యగగైకొనె, ప్రేమరాగ ని
ష్పంది ముఖాంబుజం బతడు పల్మరు నించెను జుంబనంబులన్

**(34వ అవధానము - పటంచెరు)**

<u>భీష్ముడు పెండ్లియాడె నల భీష్మక పుత్రిని భీమ నందనన్</u>
గ్రీష్మమురాక మున్నె ఉడికించె వసంతము, పెండ్లికాని యా
యుష్మతులం వ్రజాంగనల నొందుచు వేసరి దాసరి న్గనన్
ఊష్మము దప్పలేని సతి నొప్పగ గైకొను కృష్ణు డార్జవా
భీష్ముడు పెండ్లియాడె నల భీష్మక పుత్రిని భీమ నందనన్
కృష్ణుడు రుక్మిణిని (భీమనన్+తనన్) భీతచేతస్కురాలైన
అమెను - పెండ్లియాడెను

**(35వ అవధానము - సిద్దిపేట)**

<u>రాతిరి నడిజాము నందు రవి యుదయించెన్</u>
మాతల్లి యేమి చూచెనొ?
చేతంగానట్టివాని జేసెను మగనిన్
బోతువలె నిదుర వోవును
రాతిరి నడిజామునందు - రవిఉదయించెన్

(36వ అవధానము - నారాయణఖేడు)

<u>సతిసతిఁగలియంగ బుత్రసంతతి కలిగెన్</u>
మితిలేని నమ్మికను దై
వత తతి బూజించి సంతుపడసెడుకోర్కిన్
రతి కతుల సుకరమైన వ
సతిసతిఁగలియంగ బుత్రసంతతి కలిగెన్

(37వ అవధానము - చిన్నకోడూరు)

<u>మగువ నపుంసకున్ గలిసి మాన్యుల బుత్రులగాంచె నిద్ధరన్</u>
జగమున గాలమానము పసందుగ జూడగగల్గ వీలుగా
సొగసుగ సంతు గా బడయ జూచి విధిప్రియనందనుండు మే
లగునని చింతజేసి యొకయబ్జముగా నరువైగనంగ దా
మగువన పుంసకున్ గలసి మాన్యుల బుత్రులగాంచె నిద్ధరన్
నారదుడుస్త్రీగా మారి 60 మంది సంతానము పొందినట్లు
పురాణకధనము : మగువ+అన - పుంసకున్=పురుషుని కలిసి,
ప్రభవాది వత్సరాలు నారదసంతానము

(38వ అవధానము - చీకోడు)

<u>బ్రాహ్మీపుత్రుడు పెండ్లియాడె నకటా!బ్రహ్మణ్యునాశీస్సులన్</u>
బ్రహ్మనందము గల్గజేసి వివిధా భ్యాసమ్ములందిద్ది వా
గ్బ్రహ్మంబున్ గురుతింప యోగ్యుడగు రేవన్ బెంచగా గర్మమో
జిహ్మాచారను గూడి తిర్గుటను నిస్సీ!యందు నేమందు ఓ
బ్రాహ్మీపుత్రుడు పెండ్లియాడె నకటా!బ్రహ్మణ్యునాశీస్సులన్

(39వ అవధానము - పెదకోడూరు)

<u>చంద్రానన పెండ్లియాడె చంద్రుని తనయన్</u>
సాంద్రాతపవేదనతో
నింద్రియములు డస్సి కలువ యెంతయొ చింతన్
మంద్రత వలచెను సత్కవి
చంద్రా! నన పెండ్లియాడె చంద్రుని తనయన్
చంద్రుని తనయ = వెన్నెల **(40వ అవధానము - జగిత్యాల)**

<u>మగని సిగలోన మల్లెల మాల తురిమె</u>
లౌకికవ్యవహార విప్లవత జిక్కి
యలసి వాంఛిత రాగ విద్యలను మరచి
యేమనక నుండ దన్విమెప్పించ జూచు
మగని సిగలోన మల్లెల మాల తురిమె
**(41వ అవధానము - హైదరాబాదు)**

<u>మాఘము సంక్రమించినది మార్గశిరంబున గార్తి కంబనన్</u>
ఓఘన పండిత ప్రవర! యుక్తమె మీకిది? కల్లుపాకయే?
రాఘవ గాధలోపలను రాజిల బిడ్కలవేట భావ్యమా?
శ్రీఘన కంతు సన్నుతిని చెల్వగు నీనరసింహరామ నా
మాఘము సంక్రమించినది మార్గశింబున గార్తికంబనన్

మార్గశిరము = చలి, కార్తికము=అగ్నిజ్వాల (కృత్తి కలకు సంబంధించినది) **(42వ అవధానము - సిద్ధిపేట)**

<u>కృష్ణను బెండ్లియాడె నట కృష్ణుడు పోతన గీతలోపలన్</u>
విష్ణువు లోకకంటకుల పీచ మడంచగ ధాత్రి లోపలన్
గృష్ణుడుగా జనించి తగుక్రీడగ యుద్ధము దల్చకుండుచో
నుష్ణము బొంది జార కదనోత్సుకు జేయగ బూని భావనా
కృష్ణను బెండ్లియాడె నట కృష్ణుడు పోతన గీతలోపలన్
**(43వ అవధానము - సిద్ధిపేట)**

<u>లంజను గూడి రాముడు చలంబున దీర్థములాడె మింటిలో</u>
అంజనరేఖ లక్షియుగ మంచులు దాక గళావిలాస మూ
ర్తిం జనకాత్మజన్ దొలగి, తేకువ దప్పి వసిష్ఠు నానతో
రంజిత యాగమందు నపరంజిని సీతను జూచి బొమ్మ పో
లంజను గూడి రాముడు చలంబున దీర్థము లాడె మింటిలో
(అశ్వమేధయాగార్థమై బంగారు సీతను భార్యగా గొని
యజ్ఞమాచరించి, ఆకాశ గంగా జలములలో రాముడు
అవబృధస్నాన మాచరించెను) (44వ అవధానము - కాజీపుర్)

<u>హిమరాణ్ణందన పెండ్లియాడె రఘువున్ హేలావిలాసాలతో</u>
సుమబాణున్సరి పోలు సోయగము నా సొమ్మంచు గర్వించి న
మ్రముగా నచ్చిన భర్తకై మహిత సద్భక్తిన్ బ్రపూజించె నం
కము జేరందగు వానికై నృపసుతా కాంతమ్ము, దీవించె నా
హిమరాణ్ణందన పెండ్లియాడె రఘువున్ హేలావిలాసాలతో
(45వ అవధానము - కోహీర్)

<u>మదగజయానకున్ రవిక మాత్రమె చాలును జీర యేటికిన్</u>
విదితకళావిలాసవిధి విశ్రుత మూర్తి సుశిల్పరత్నమున్
గదులక జెక్కుచుండ నది గాంచెడు వారలు తన్మయంబుతో
వదులక జూచి శిల్పిగని పల్కిరి మార్పుల కోర్వ కిట్టులీ
మదగజయానకున్ రవిక మాత్రమె చాలును జీర యేటికిన్
(47వ అవధానము - యాదగిరిగుట్ట)

<u>ఖరపదముల్ భజింతురు జగంబున భక్తులు మోక్ష కాంక్షులై</u>
నరులకు జీవనంబు వరణంబగు, బూర్వఫలానురూపమై
పరగి సుఖాను భూతుల శుభంబగు సంతున జింత బాసినన్
చెరగెడు నుబ్బసంబునకు జిమ్మెడు పాలను గోరి శిక్షళీ
ఖరపదముల్ భజింతురు జగంబున భక్తులు మోక్ష కాంక్షులై
(ఉబ్బసమునకు గాడిదపాలు మంచి మందు వలెపనిచేయును)
(48వ అవధానము - సిద్దిపేట)

<u>అత్తను గూడి మెచ్చె దగ నల్లుడు మన్మథు డబ్బురం పడన్</u>
చిత్తము పల్లవించుతరి జెంగట నిల్చిన దాని జూచి య
త్యుత్తమమైన వేళ దగ వొప్పగ బండువ యంచు దల్చకన్
జిత్తము నిల్పలేక దన చేరువ కోడలి కిష్టమైన మే
నత్తను గూడి మెచ్చెదగ నల్లుడు మన్మథు డబ్బురం పడన్
(49వ అవధానము - భిక్కనూరు)

<u>చిక్కులు పెట్టువారె యిల సిద్ధులటంచన నీతి యుక్తమే?</u>
అక్కర గల్గి కావ్య విషయాభిరుచిన్గని సత్రి యాత్మలై
వాక్కులదేవి సత్కృప నవారిగ బొంది యశఃప్రశస్తులై
చక్కని యీ వధానసభ సభ్యుల దృప్తుల జేయ గోరుచున్
జిక్కులుపెట్టు వారె యిల సిద్ధుల టంచన నీతియుక్తమే
(50వ అవధానము - వికారాబాదు)

<u>వంధ్యాసూనుడు గాంచె నంబరమునన్ భానుం దమిస్రంబునన్</u>
వింధ్యాద్రీశ్వరి నన్ గృప న్గనగ నావిష్కార సద్భక్తి జ
న్మాంధ్యంబందున దెప్పయౌ తనుభవానందమ్ము బ్రాప్తించె, నే
సంధ్యన్ వార్చగ జేరబట్టి విడ డాశ్చర్యంబు సూర్యేచ్ఛ, ని
ర్వంధ్యా! సూనుడు గాంచె నంబరమునన్ భానుం దమిస్రంబునన్
(51వ అవధానము - రామాజిపేట)

<u>సీతను బెండ్లియాడిరి నిశీథములో నుపపాండవుల్ దివిన్</u>
ఆతత యజ్ఞకర్మముల నర్థినొనర్చిన వారె యోగ్యులై
ఖ్యాతిగ యుద్ధ మందు మృతిగాంచెడు వారలు వచ్చుచో నతి
ప్రీతి సుఖింపజేసెదను బేర్మిని నిద్దుర జచ్చు వారలి
స్సీ! తను పెండ్లియాడిరి నిశీథములో నుపపాండవుల్ వెసన్
(52వ అవధానము - మాసాయిపేట)

స్వర్గమును బొందుటకు యజ్ఞములు, యుద్ధమరణములు
కారణములైయుండగా యుద్ధమిషతో నిద్రలో జచ్చిన
ఉపపాండవులును స్వర్గస్థులగుట, తత్సుఖ
భాగులగుట ఇందలి అంశము

మధ్యాహ్నంబున జంద్రమంలమునన్మార్తాండుడుండెన్ బ్రచన్
విధ్యంతర్గత వేదనాభరతనుస్వేదమ్ము పెన్వెల్లిగా
వధ్య స్థానము దప్పు మేక పగిదిన్ బర్వెత్తి, కల్లావి వే
మిధ్యాలాపము లాడు వీధి బడుచున్ మేల్మాని యొక్కండి టుల్
మధ్యాహ్నంబున జంద్రమండలమునన్మార్తాండుడుండెన్ బ్రభన్
పిచ్చివాని వలె మత్తెక్కిన వానిప్రేలాపనలిటులుండును

(54వ అవధానము - హైదరాబాదు)

దారనువాననల్ విబుధ తండములం దనివొంద జేసెనొ
కోరిక మీరగా గవిత గూర్చ దలంచిన పండితోత్తముల్
బూరుగు తాటి యాకులను బొల్పుగ వ్రాయగ నేటివారు చె
ల్వారెడు కాగితంబు గొని బంగరు తోటను జేర భావనొ
దారసువాసనల్ విబుధ తండములం దనివొంద జేసెనొ

(55వ అవధానము - వాచగిరి)

రాముడు రావణుండును ధరంబడి యొల్గిరి లక్ష్మణాహతిన్
ఏమిది పండితప్రవర! ఏటికి బ్రల్లద మాడెదీవు. నీ
వేమితలంచి పల్కితిది హేలయొ? నిద్దురలోన బల్కు ప
ల్కా? మరియేమి మిత్రమ! జగంబున నెంచిన జూడ నెందు నా
రాముడు రావణుండును ధరంబడి యొల్గిరి లక్ష్మణాహతిన్
పృచ్ఛకుని ఎదురుప్రశ్నించి పూరించుట

(56వ అవధానము - భిక్కనూరు)

చన్నులు లేని యావులు ప్రసన్నత బాల నొసంగు బానెడున్

తిన్నది జీర్ణమై రుధిర తేజము నొంది పయస్స్వరూపమై
చన్నుల జేరి పాపలకు సత్వము గూర్చును నేటితల్లులన్
సున్నగదా! దుకాణముల చొప్పున మూల్యము నిచ్చి తెచ్చు నా
చన్నులులేని యావులు ప్రసన్నత బాలనొసంగు బానెడున్
డబ్బాపాలకు మితి లేదు కదా!

(58వ అవధానము - నంగునూరు)

గణపతి గాధినందనుని గాదిలిపట్టిని గూడె షండుడై

రణజయదీక్ష దిగ్విజయ రక్తుడు వేటకు బోయి తోటలో
మణి జనపాలురందు బుధమాన్యుడు పౌరవు డొంటి గూడి త
ద్గుణగణముల్ జగంబునకు గుర్తుగ గాదనినాడు దాని ద
ద్గణపతి గాధినందనుని గాదిలిపట్టిని గూడె షండుడై

పౌరవుడు=దుష్యంతుడు, గాధినందనుని గాదిలిపట్టి=శకుంతలను గాంధర్వమాడి సభలో (షండుడు=అసమర్థుడు) కాదనుట కథ తాను చేసిన తప్పును సభలో రాజయ్యును ఒప్పుకొనలేక పోవుట షండత్వమని కవిభావన.

(59వ అవధానము - రామంచ)

సోదరి బెండ్లి యాడె నిజసోదరు డాగమశాస్త్ర వద్ధతిన్

శ్రీదయితా మనోహరుని చిత్తము గొన్న కిరీటి రూపస
మ్మోదముతో సుభద్ర తలమున్కలుగా గనుప్రేమ సైగతో
నాదట సేవ గొంచు గుహనా యతియై బలరామదేవ! నీ
సోదరి బెండ్లి యాడె నిజ సోదరు డాగమ శాస్త్రవద్ధతిన్

(60వ అవధానము - దుండిగల్)

గాంధి జనియించె గాంధారి గర్భమందు
వీరగాథల విన్పించువేడ్క సుతుని
నిదుర బుచ్చుచు బుజ్జిబా నేర్పు చనియె
రాజుగ్రుడ్డైన జ్ఞానాంధరాజు ప్రజగ
గాంధి! జనియించె గాంధారి గర్భమందు
(61వ అవధానము - పెదగుండ వల్లి)

సింగము శ్వానమై దనరె జిత్రముగా నొక దేవళమ్మునన్
రంగదుదారవైభవ పరంబుగ నంబిక నిల్పు చోట, శి
ల్పాంగ విశారదు న్పిలిచి యంచిత వాహన మేర్పరించగా
నంగజు బారికోర్వని మహాశయు కర్మవిలోపము న్దగన్
సింగము శ్వానమై దనరె జిత్రముగా నొక దేవళమ్మునన్
(63వ అవధానము - చేవెళ్ల)

గుండ్రా ళ్ళుండ్రాళ్లుగాగ గుటుకునమింగెన్
తీండ్రమున ముగ్గురు మూర్తులు
వేండ్రమ్మున నత్రిసతిని వేడి రినుప రాల్
తండ్రీ! తిను మన విష్ణువు
గుండ్రా ళ్ళుండ్రాళ్లుగాగ గుటుకునమింగెన్
(64వ అవధానము - అందోలు)

రాణికి గోపమెచ్చి రతిరాజును దిట్టెను రాతి రంతయున్
రాణువ పిండు మోహరిల రాజ్ఞహుపుం దమరేశతార్థమై
పాణిమితోడ పొంది సుఖభోగములన్ సుతిమించి వే శచిన్
రాణిగ బిల్చి పల్లకి ఘనర్షులు మోయగ వచ్చు చుండ, నిం
ద్రాణికి కోపమెచ్చి రతిరాజును దిట్టెను రాతి రంతయున్
(65వ అవధానము - జోగిపేట)

<u>విధవ బొట్టు కాటుక దిద్ద విభుడు నేడ్చె</u>
జీవికను బుచ్చ బరభువిజేరె నొకడు
వాణి తద్భార్య పతిజచ్చు వార్తవినియె
కాని నమ్మక వచ్చిన వాని.గన గ
విధవ! బొట్టు కాటుక్ద దిద్ద విభుడు నేడ్చె

(66వ అవధానము - శనిగరం)

<u>భర్తను మోసగించి యొక భామిని గూడెను మామగారితో</u>
కీర్తి గలట్టివాని నపకీర్తికి నిక్కను జేయ గామభో
గార్తి దొలంగ లోకమునకై బెగ డొందక జందమామపై
ధూర్త ప్రవృత్తి దార పడద్రోసె గురున్, సతిబుద్ధివింత, తత్
భర్తను మోసగించి యొక భామిని గూడెను మామగారితో

(67వ అవధానము - బోధన్)

చంద్రుని చందమామ అని పిలుచుట వ్యవహారము
తారాశశాంక మిందు సూచితము

<u>వలలుని జంపె గీచకు డవక్రపరాక్రమ విక్రమంబులన్</u>
సలలిత భావనా చతుర! సత్కవిపుంగవ! భారతంబు నీ
తెలివిడి కందదా? విమల ధీవర! మత్స్యవిభు ప్రదేశమున్
మెలగిన ద్రౌపదీ విషయమేకద! పేలకుమయ్య! నిట్లు నా
వలలుని జంపె గీచకు డవక్రపరాక్రమ విక్రమంబులన్

(68వ అవధానము - రాజగోపాలపేట)

<u>వెలవెల తగ్గె ద్రవ్యము లభించిన గొద్ది విచిత్రమేమిటో?</u>
కొలిచిన యెల్ల కొల్పులకు గూడలిగా బరమేశ్వరార్చనన్
గలిగిన కష్టముల్ దొలగుగాదె యటంచును జేరునట్టి భ
క్తులు బెగడంగ సుంకములు గ్రోధము గల్గగ జేయు గాన, గో
వెలవెల తగ్గె ద్రవ్యము లభించిన గొద్ది విచిత్రమేమిటో?
ఈ యవధానము శ్రీశృంగేరీ పీఠమహాస్వాములు శ్రీశ్రీశ్రీ భారతీ తీర్థ స్వామి సమక్షమున జరిగి వారి యనుగ్రహపాత్రమైనది

(69వ అవధానము - నాచగిరి)

<u>కాలేజీ గడియారమా! గమనవక్రత్వంబు వర్జింపుమా!</u>

ఏ శీలం దరియింతు నీచదువు. నాకేజన్మపాపంబొ? చు
ట్టాలన్ నిల్చిన సిగ్గు, తగ్గుసభలో డంబంబు జూపింప, ని
ద్రాలక్ష్మీ పరిరంభణంబును విడన్, దర్పంబు చూపింప వే
కా? లేజీ గడియారమా! గమన వక్రత్వంబు వర్జింపుమా!

(70వ అవధానము - వారణాసి)

<u>గార్హస్థ్యంబున నాది శంకరుడు మోక్షప్రాప్తు డయ్యెంజుమీ!</u>

అర్హవ్యక్తిని డీకొనందగును, వాదాంతంబు ప్రత్యర్థికిన్
నిర్హారంబు, సురేశ్వరుం గెలువ వాణీ సాక్షికంబైన మై
కర్హారంబును వాడ భారతిని దక్కన్ రాజ దేహంబుతో
గార్హస్థ్యంబున నాది శంకరుడు మోక్షప్రాప్తు డయ్యెంజుమీ!

ఆది శంకరుల పరకాయ ప్రవేశము గూర్చిన కథ
కర్హారము = కల్హారము

(71వ అవధానము - వాచగిరి)

<u>పతిపతి గలియంగ బుత్ర పంతతి కలిగెన్</u>

కుతుకము మీరెడు మతిని బ్ర
కృతి దర్పన మలర జేసి హితుడగు పతితో
రతుల నుపరతుల సుకరప
సతి సతి గలియంగ బుత్ర సంతతి కలిగెన్

(72వ అవధానము - మెదకు)

<u>వారుణి సక్తుడై యినుడు వారిధిలోపల బ్రుంగ కుండునే?</u>

మీరిన సంపదల్ గలిగి మేదిని నిక్క డెవండు? లేమి లో
గూరినవాడు సైత మెటకుం జన దండునె మున్ను, నట్టిచో
ధారుణి నంత నేలగల దక్షుడు తక్కువ తిన్న వాడొకో?
వారుణి సక్తుడై యినుడు వారిధి లోపల బ్రుంగకుండునే?

(73వ అవధానము - వరంగల్)

పతి తన సుతుడని తలంచి పడతియు మురిసెన్

మితిలేని నలుగుతో బా
ర్వతి తన పతి నచ్చు గుద్ది ప్రాణమువోసెన్
శితికంఠు దయను దద్గణ
పతి తన సుతుడని తలంచి పడతియు మురిసెన్

(74వ అవధానము - గణపతిక్షేత్రము, సికింద్రాబాదు)

పందిని జూచి శంకరుడు పార్వతిగా దలపోసె ముగ్ధుడై

సుందర మందహాసరుచి శోభిత భవ్య ముఖంబు తాపస
మ్మందు గృశించిపోవుటన హాయన జేయదే? శంభు నెంతయున్
బొంద నపర్ణ యయ్యె నుమ. పూర్ణరసప్రతి భాసి భావ ని
పందిని జూచి శంకరుడు పార్వతిగా దలపోసె ముగ్ధుడై

(75వ అవధానము - చేర్యాల)

మార్కండేయుని కడుపున మార్కృజనించెన్

అర్కోచ్చత శనినీచత
అర్కా యమందుగురుడు నలరెన్‌బో, కా
కర్కేందు కీర్తి గనునే
మార్కండేయుని గడుపున మార్కృజనించెన్

(77వ అవధానము - కాజీపుర్)

గణపతి గాండీవ మెత్తి గడగడలాడెన్

ఫణికేతుసేన స్వచమూ
గణమున్గని డీలు పడిన కౌంతేయుడు మా
ర్గణములు జారగ బాండవ
గణపతి గాండీవ మెత్తి గడగడలాడెన్

(78వ అవధానము - చుంచనకోట)

రాఘవు బెండ్లియాడి యిల రంజిలె బార్వతి చూడముచ్చటై

మేఘసమాన దేహుండయి మేదిని సుందరు డైనవాడు, నా
నాఘన రాజ గౌరవ వినాశకుడై నుతిగన్నవాడు. బా
ణౌఘ విహీను డన్న నుడి నొప్పి ధరాత్మజ మెచ్చి వెంటనే
రాఘవు బెండ్లి యాడి యిల రంజిలె బార్వతి! చూడముచ్చటై

(79వ అవధానము - మరువడగ)

బాలుడు పెండ్లి యాడె నొక బాలుని బెద్దలు సాక్షులై కనన్

కాలము తప్పుకాదు, కలికాలపు గాథ యొకింత గాదు, వే
లీలగ విద్య నేర్ప నవలీలల దన్విని గూడె రాజు ప్రే
మాలస చిత్తుడై బుధుని యందు దగుల్కొని లిబ్బితేని లే
బాలుడు పెండ్లి యాడె నొక బాలుని బెద్దలు సాక్షులై కనన్

లిబ్బితేడు=కుబేరుడు, కుమారుడు ఇలాపురుషుడు ఇలాకన్య
పగలుపురుషుడుగా, రాత్రిస్త్రీగా మారి బుధుని పెండ్లాడుట కథ

(80వ అవధానము - సిద్ధిపేట)

కాకర తీగలకు నల్ల కలువలు పూచెన్

చాకలిరాడే మగువా!
పోకడ యవసరము ప్రొద్దువోయెడు నీవే
కోక లుతికి యారేయుము
కాకరతీగలకు, నల్లకలువలు పూచెన్

ఇక్కడ కోకలుతికి కాకర తీగల పందిరిపై వేయుము అనుటతోను నల్లకలువలు పూచెన్ అనగా రాత్రి అయిపోయినది అనుటతోను కాకరతీగలకు కలువలుపూయుట అను విరోధము తొలగినది కలువలు రాత్రి పూయుననుట కవి సమయము కనుక దాని నాధారముగా గొని ఈ సమస్యబూరించుట జరిగినది.

(81వ అవధానము - కుకునూరువల్లి)

<u>మామను గోరి తా రవిక మానిని విప్పెను గోర్కి దీర్చగన్</u>
కామవికారముం దగిలి కాయము తల్లడమంద దార, వృ
ద్ధామర పూజ్యు డీతడిక నంద డటంచు దలంచి శిష్యుడౌ
సోముని యంద చందముల సొక్కి తనంత శిశుప్రకాండులన్
మామనుగోరి తా రవిక మానిని విప్పెను గోర్కి దీర్చగన్
శిశువులకు మామయైన చంద్రుని తార మోహించిన తీరు.

(82వ అవధానము - కరీంనగర్)

<u>రాధను బెండ్లి యాడె రఘురాముడు దివ్య మనోభిరాముడై</u>
బాధితసర్వతాపసకృపాకరుడై యినవంశమందు, దై
త్యాధముల న్వధించ సురలందరు గోర జనించి యాగమున్
గాధిసుతుండు కావుమనగా జని ధర్మనిరూఢి సత్పదా
రాధను బెండ్లియాడె రఘురాముడు దివ్య మనోభిరాముడై
ధర్మనిరూఢి=ధర్మ బద్ధముగా, ధననుస్సునెక్కుపెట్టి

(83వ అవధానము - సూర్యాపేట)

<u>మన కుద్యోగులపట్ల యెన్నదగు సన్మర్యాద లేదేలనో?</u>
(గౌరీభట్లరామకృష్ణకవి. అవధాని)
అనయం బిట్లు పజా హితంబు లని సవ్యాసవ్యమార్గంబులన్
జనసమ్మోహన మేకలక్ష్యముగ శస్త్రఖ్యాతి నార్జించ, ను
న్ననిజంబుం గ్రహించినా ననుచు నెంచంబూను పెద్దన్న రా
మన కుద్యోగులపట్ల యెన్నదగు సన్మర్యాద లేదేలనో?

(రామన=యన్.టి. రామారావు ఉద్యోగులను 370 జి.ఓ.పేరుతో, రిటైర్మెంటు వయస్సు తగ్గించి, సమ్మె దీర్ఘ కాలం కొనసాగించి ఉద్యోగులపై సానుభూతి మర్యాదలు లేవని పేరు తెచ్చుకున్నారు. అంతేగాక గ్రామాధికారులను తొలగించి, మండల వ్యవస్థపేర పనిపెంచికూడా)

(84వ అవధానము - చందాయిపేట

<u>గ్రామసింహంబునకు రాజ్య కాంక్షకలిగె</u>

అక్షరంబులు రానట్టి అయ్యలకును
అధిపయోగంబు కలిగె స్వేచ్ఛాప్తి వలన
సింహమేటికి రాజయి చెలగు ననుచు
గ్రామసింహంబునకు రాజ్య కాంక్షకలిగె
గ్రామసింహము=కుక్క

(85వ అవధానము - నాచగిరి బ్రహ్మోత్సవాలు)

<u>ఆంగ్లమునందు బోతన మహాకవి భాగవతమ్ము వ్రాసెగా</u>
<u>(ఆచార్య యన్. గోపి)</u>

ఈ "ంగ్ల" సుదుష్కరంబని కవీశ్వర! గుర్తెరుగంగరాదొకో?
ఆంగ్లము వచ్చియుండిన మహాకవి యందున వ్రాయకుండునే?
ఆంగ్లము నంటరానిదియె? అయ్యది మీరును వ్రాయవచ్చుగా
నాంగ్లము నందు, బోతనమహాకవి భాగవతమ్ము వ్రాసెగా

(86వ అవధానము - ఉస్మానియా విశ్వవిద్యాలయం)

<u>తర్జన లేల జేసెదవు తాళుమ కొన్నిదినాలు కొమ్మరో !</u>
(పల్లారామకోటార్య)

అర్జును డందగాడని వయస్కు డటంచు భ్రమించి వచ్చు పూ
ర్వార్జిత పుణ్యభాగ నొకయప్సరస న్గని తాల్మితోడ నా
యర్జును డమ్మ నా బ్రతిమిలాడ శపించిన నాత డిట్లనెన్
దర్జనలేల జేసెదవు తాళుమకొన్ని దినాలు కొమ్మరో!

అర్జునుని పేడివి కమ్మని ఊర్వశి శపించిన కథ
ఇంద్రునివేశ్య ఇంద్రసుతునకు తల్లి యను భావన

(87వ అవధానము - పోతనపంచశత జయంతి-వరంగలు)

తల్లి తనయను బెండ్లాడి తగవు దీర్చె
మరదలిని జూడ దొలగవు మరులు కాని
మేన సంబంధ మని వెఱ్ఱి లూని పలుక
మామ వంతకు నల్లుడు మహిత గుణమ
తల్లి తనయను బెండ్లాడి తగవు దీర్చె

(88వ అవధానము - సిద్ధిపేట)

బంతిని దినివేసినాడు బావండంతన్
చెంతన గూర్చోనీయని
చింత న్దయజూచు గతిని జినవో బడుగున్
సంతోష పడగ జేయగ
బంతిని దినివేసినాడు బాపండంతన్

బంతి=పంక్తి (89వ అవధానము = దేవరయాంజాల)

భీముడులంక గాల్చిన విభీషణుడే పరితాపమందెగా
రామునియాలి నెత్తుకొని రావణు డేగిన, సూర్యపుత్రు సు
త్రామ సుతాహవంబుల పరంపర పత్నిగవేషణాదృతిన్
సామత గెల్వగా హనుమ చాలగ నోవును గూర్చ నల్గు తత్
భీముడులంక గాల్చిన విభీషణుడే పరితాపమందెగా

(90వ అవధానము - కుత్బుల్లాపుర్)

బాలుడు గర్భ ధారణము బాగుగ జేసె నదేమి చిత్రమో?
కాలము మారినట్టులుగ గన్పడు మిత్రమ! పూర్వకాలమం
దోలి యువాళ్వ డొక్కడటు నొప్పగ దాల్చెను. శాస్త్రవేత్తలన్
లీలగ దోచ నయ్యదియు లేదనకుండ నొనర్చ భూమిపై
బాలుడు గర్భధారణము బాగుగజేసె నదేమి చిత్రమో?

(91వ అవధానము - శేరిలింగంపల్లి)

<u>పురుషుని బురుషుడు గవయగ బుత్రుడుగల్గెన్</u>
ధర సుగతి పుత్రు కతనన్
బరగుట జాతకము పుత్రుభాగ్యములేమిన్
పరభక్తి గొలిచి యా త
త్పురుషుని పురుషుడు కవయగ.బుత్రుడు గల్గెన్
(92వ అవధానము - అద్దంకి)

<u>అవధానంబులు సేయు నట్టి కవులేహాస్యాదుల్ వృథ్విలో</u>
కవితాచాతురి, భావనాపటిమ, లోకక్షేమసద్వాంఛతో
నవకావ్యంబుల నిచ్చుగాని, యవధానంబందు విఘ్నంబులన్
రవ ణించన్ దగ దేరసం బనుచు మూర్ఘస్థాయి వాకొందు రీ
అవధానంబులు సేయు నట్టి కవులేహాస్యాదుల్ పృథ్విలో
(93వ అవధానము - కావలి)

..... <u>మామమామ నిను నేను నుతించెద భక్తితోడుతవ్</u>
కాలము మారి పోయినది గాని, విపత్కరమౌ పరిస్థితిన్
గోలయి యెట్టివాడయిన గోరడె కావుమటంచు దైవమున్
లీలల కేమి గాని యవలీల వధానము బ్రోవుమంచు నీ
నేలను మామ మామ! నినునేనునుతించెద భక్తితోడుతన్
(94వ అవధానము - నిజాంకాలేజి, హైదరాబాద్)

<u>మంచంబెక్కెను రాఘవుండు తనభామా రత్నమున్ దన్నియున్</u>
ప్రాంచద్భూషణశోభ వెల్లివిరియన్ బర్యంక పల్యంకికా
భ్యంచన్మార్దవ శయ్య దార్కొనుచు రత్యంతర్విలాసక్రియో
దంచత్స్థాయికి దెచ్చికో సతియు బ్రహ్లాదించ, సంతుష్టరో
మంచం బెక్కెను రాఘవుండు తన భామారత్నమున్ దన్నియున్
(95వ అవధానము - మెట్పల్లి)

ఆశ్చర్యంబది యేమి? ఆ గజముఖుం డమ్మా! యనున్ శ్రీసతిన్
నిశ్చాంచల్యము నీవ యీయదగు, గౌణీ భూత పాపుల్గగన్
దుశ్చారిత్రులు గాగ గీర్తి గన నాదోషంబు నీదేయగున్
వాశ్చాంచల్యము నింపు మంచు జగదంబన్ భక్తితో వేడగా
ఆశ్చర్యంబది యేమి? ఆ గజముఖుం డమ్మా! యనున్ శ్రీసతిన్
వాః+చాంచల్యము = నీటిలోని చంచలత్వము లక్ష్మికి చంచల
అనిపేరుగలదు (96వ అవధానము - కోహీరు)

లవకుశు లిద్దఱున్ భరతలక్ష్మణు తమ్ములు రాము కన్నలున్
అవియివి నల్గురన్నవి యధార్థము లెంచకనేర్చి, శాస్త్రమం
దవితథ మేధయున్నటుల నష్టవధానము నం దసభ్యుడై
వివిధపు గూతలం సభకు వేడుక గూర్చు నొకండు నీగతిన్
లవకుశు లిద్దఱున్ భరతలక్ష్మణు తమ్ములు రాము కన్నలున్
(97వ అవధానము - వెల్దుర్తి)

రణమున బెండ్లి యాడెనట రాముని యానతి లక్ష్మణుం డొగిన్
గుణము బిగించలేక నృపకోటులు బెగ్గిల, గాధిసూతివీ
క్షణమున భర్గచప మినచంద్రుడు భేదిల జేయ మైథిలుం
డణకువ సీతనూర్మిళను నందిడ తా నొక పత్ని చాలుకా
రణమున బెండ్లి యాడెనట రాముని యానతి లక్ష్మణుం డొగిన్
(98వ అవధానము - పెద్దచెప్యాల)

సాగరకన్యకం బిలిచి సాంబుడు ముద్దిడె బ్రేమ మించగన్
త్రాగుడు నేర్చి యొక్కడు నిదానము వీడుచు నిల్లు సేరుచున్
వాగుచు గన్న బిడ్డలను బాధల బెట్టెడు, నూరిలోని క
ల్పాగమొకండు వేడబడి యర్థిని బెండిలి యాడు మోదయా
సాగర! కన్యకంబిలిచి, సాంబుడు ముద్దిడె బ్రేమమీరగన్
(99వ అవధానము - రామాయంపేట)

<u>ముఖమున దాళవృక్షములు మొల్చె లతాంగికి జిత్రమౌగతిన్</u>

సఖుడని సర్వ సంగతుల సౌఖ్యపడంగ నొనర్చు నంచు స
మ్ముఖమున జేరదీసితిని. మోహనరూప! రసప్రసంగతిన్
నఖర ముఖాయుధప్రతతి నాటిన గాయములెంచి చూడగా
ముఖమున దాళ., వృక్షములు మొల్చెలతాంగికి జిత్రమౌ గతిన్

(100వ అవధానము - నార్సింగి)

<u>కాకము పాడె నంట మృదుకాకలికారుతి కాంతమెచ్చగన్</u>

ఆకలిగొంచు మావి చివురందిన దంతయు మెక్కి, గొంతుకన్
వ్యాకులతన్ జగంబునకు నంచిత పంచమ రాగ మంది యీ
నాకలి గొన్న కోకిల, ప్రజార్థ సవర్ణ సుమిత్రతాప్తతా
కాకము, పాడెనంట మృదు కాకలికారుతి కాంతమెచ్చగన్

పంచమరాగ మాలపించుకోకిల మావిచివుళ్లు మెక్కి మత్తెక్కి కూయును, కోకిలకు స్వయముగా గ్రుడ్లను పొదుగు శక్తి లేదు కావున కాకిగూటిలో గ్రుడ్లను వదలును. కాని పుట్టిన పిదప కాకిపిల్లలు కావు కావు మన కోకిల పిల్లలు కూ, కూ అని అరచును ప్రజా+అర్థ = సంతత్యర్థమై

(101వ అవధానము - సిద్ధిపేట)

<u>దేశము బ్రేమించువారు దేశద్రోహుల్</u>

ఆశలగెల్చియు మానసి
కాశల దేశమును జీల్చు నాంగ్లేయులపే
రాశకు లోగుచును దదు
ద్దేశము ప్రేమించు వారు దేశద్రోహుల్
ఆశలు=దిక్కులు, కోరికలు

(103వ అవధానము - తడ్కపల్లి)

<u>కారముతో మనకు సర్వ కష్టము లుడుగున్</u>

కారమ్ముక్కటి కా దధి
కారము తత్‌జ్వాల నోర్వగలమా? తద్ధి
క్కారము సేయకను నమ
స్కారముతో మనకు సర్వ కష్టము లుడుగున్

**(104వ అవధానము - సిద్ధిపేట)**

<u>దారము లేనిహారము లుదారతనీకెవ రిచ్చిరో చెలీ!</u>

కోరినవాడు చిక్కుటది కొందరి పుణ్యము. సర్వసంగతిన్
మీరుట భాగ్యమెన్న సుతిమించినదేమి? మనోజ్ఞ వక్షమం
దీరహిముద్ర లేర్పడియె నెన్నిక గానగ ప్రశ్నసేసితిన్
దారము లేనిహారము లుదారత నీకెవ రిచ్చిరో చెలీ!

**(105వ అవధానము - హైదరాబాదు)**

గజముఖు గూడి పార్వతి తగన్ బ్రమధాధిపు గాంచె వేడుకన్
నిజభుజ శక్తి చాలమి గణించిన దైత్యుడు శంభు గూర్చి కొ
ల్చి జయమునంది తాకగనె శీర్షము భస్మము గాగకోరి త
ద్గజవసనుం దిగాలువడగా నొనరించిన బారి వచ్చినన్
గజముఖు గూడి పార్వతి తగన్ బ్రమధాధిపు గాంచెవేడుకన్

**(106వ అవధానము - సిద్ధిపేట)**

<u>చాకలదానిపెందొడల సందున భీముడు జిక్కె నాజిలోన్</u>

ప్రాకటరీతి గౌరవుల ప్రాణములంగొనుదీక్ష వీర్యను
శ్రీకుడు, రాజరాజొకడు చేరువగా దొడగొట్టి భీముడై
వీక గదాభిఘాతమున వేసిన జచ్చెడు గాని దూకుతో
చాకలదాని పెందొడల సందున భీముడు చిక్కె నాజిలోన్

చాక=చావక, అల=శ్రేష్ఠమైన, దాని=ఏనుగు యొక్క దానము=మదము గలది దుర్యోధనుని గదాఘాతమున భీముడు ఏనుగు తొడల సందున బడెనని వర్ణన

**(108వ అవధానము - పాలెం)**

రాలు పలుకగ నమృతమ్ము జాలువారె

పుట్టు మూగనై బ్రతుకున బొరలు నేడు
వోవ వాగ్దేవి గొలిచిన పుణ్యఫలము
ఐం ప్రసాదముగా వాక్కులలర ముద్ద
రాలు పలుకగ నమృతమ్ము జాలువారె

(109వ అవధానము - రిమ్మనగోడు)

మేఘము నెడబాసి పోవు మెరుపో యనగన్

శ్రీఘనయై జనకాత్మజ
నాఘన నీలాంగు బెండ్లియై జనుచుండెన్
మాఘము మిథిలన్ ముందే
మేఘము నెడబాసి పోవు మెరుపో యనగన్

మాఘము = శిశిరము (110వ అవధానము - ఖమ్మం)

సంధ్యల్ వార్తురు గాదె నిర్జరవరుల్ సంభోగ కాలమ్మునన్

అంధ్యంబన్నది లేదు, రక్కసులతో నాయాసమొక్కండె. సౌ
గంధ్యం బొప్పెడు పారిజాతవనిలో గంధర్వకాంతాళి స
ద్వంధ్యల్గా సుఖసంపదల్ బొరయ నృత్యస్ఫూర్తి దీపించియున్
సంధ్యల్ వార్తురు గాదె నిర్జరవరుల్ సంభోగ కాలమ్మునన్

(111వ అవధానము - కొల్లాపురం)

గంగను గూడి రాఘవుడు గారవ మొప్పగ పీడె జానకిన్

సంగతసర్వపుణ్యముల సాధుజనాదరవృత్తి తాపసుం
డుంగయికొన్న వారు బెగడుంగన రార్తుల నేల శత్రు వే
దం గను నీచు డొక్క డెడదం దగులం గను నాడబుద్ధిగ్రుం
గంగను గూడి రాఘవుడు గారవ మొప్పగ పీడె జానకిన్

శత్రువు+ఏదగ = శత్రువు నశించగ, ఆడ=పలుకగా,
బుద్ధి గ్రుంగంగను = మనస్సు నొచ్చు కొని

(112వ అవధానము - సిద్దిపేట)

<u>రాముని రాజ్యమేల? ఘనురావణ రాజ్యమె మోక్ష మిచ్చెడున్</u>
ప్రేమకు దావు లేనిదయి వెల్గెడు గర్మల శూరులైన యు
ద్ధాములు శంకరార్చనల దక్షులు లంకవసించువారు శ్రీ
రాముడు దప్పవేరు సుతరాము గ్రహించనివారు గల్గగా
రాముని రాజ్యమేల? ఘనురావణురాజ్యమె మోక్షమిచ్చెడిన్
(113వ అవధానము - రవీంద్రభారతి - హైదరాబాదు)

<u>రాముని భార్యగా వెలిగె రంభ ధరాతలమంత మెచ్చగన్</u>
ఏమని చెప్ప గల్గుదును? హ్రీ యసుమంతయులేక దన్మహో
ద్ధాము తపఃప్రతాపమున దాళని దేవివభుండు వంపగా
కామకళాస్వరూపముగ గ్రాలిన నింద్రియజేత యౌ మనో
రాముని భార్యగా వెలిగె రంభ ధరాతలమంత మెచ్చగన్
(114వ అవధానము-కేంద్రీయ విశ్వవిద్యాలయం-హైదరాబాదు)

<u>కోతులు కవులంద రంచు గోకిల కూసెన్</u>
నాతుల విషయము వదులక
వాతుల గుల దీర రసము వంచుచు నుండన్
మూతులు దెరిచిన కాకా
కోతులు కవులంద రంచు గోకిల కూసెన్
(115వ అవధానము - సిద్ధిపేట)

<u>అద్దమరేయి సూర్యు డపరాంబుధి లేవగ జూచె నంధుడున్</u>
అద్దివి యేడనో? హృదయమందు గుతూహల వృత్తి గోరగా
బుద్ధి జనించె, నిర్గుణము మూర్తిగ గాంచుట యెట్లు? సద్గురున్
జిద్దయ ఆత్మజ్యోతి గను శ్రేష్ఠతపంబున జిత్రమేమియౌ
అద్దమరేయి సూర్యు డపరాంబుధి లేవగ జూచె నంధుడున్
(116వ అవధానము - సిద్ధిపేట)

హనుమత్పుత్రిని రామచంద్రుడు వివాహంబయ్యె సంప్రీతితో
మునుముందున్నది వాల్మికీయము. తగన్ భూజాత నొక్కర్తునే
గొనుటన్ విందుము పండితప్రవర! వాకోవాకు చీకాకులన్
మును పెంచంగల చిత్రరామ కృతి యొప్పున్ బో దదీయంబుగా
హనుమత్పుత్రిని రామచంద్రుడు వివాహంబయ్యె సంప్రీతితో
(మరియొక పూరణము)
వినయారామ సుమాంగి, నుత్తమ గుణావిష్కార సత్కావ్యమున్

జనపాలాంతర తారతమ్య గమనాశ్చర్యాను సంధాయకన్
గొనుమంచు న్వినుతింప నా కువలయాకూతన్ శరన్మేఘదే
హనుమత్పుత్రిని రామచంద్రుడు వివాహంబయ్యె సంప్రీతితో
(117వ అవధానము - అచ్చంపేట)

రంభకు నాట్యభంగిమల రాదగ నేర్పెను జ్యోతిలక్ష్మియే
కుంభిని సర్వవిద్యలను గొప్పతనంబును గల్గు నాట్యమున్
దంభము వీడి యొక్కెత యథార్థ గురుంగని నేర్పగోరె ను
త్తంభిత రక్తకార్ణవ పదార్థకు చిల్లయలీల నర్తనా
రంభకు నాట్యభంగిమల రాదగ నేర్పెను జ్యోతిలక్ష్మియే
(118వ అవధానము - చందానగర్ - హైదరాబాదు)

కల్మషనాశియైన సురగంగను మున్గిన గల్గు బాపముల్
కల్మషముల్ పురాకృత నికారము లంచిత పుణ్య ఘాతముల్
జాల్ములభోగ భాగ్యములు స్నానమొనర్చిన బోవునంచు బె
ద్దల్మరి నమ్మదాని కయి తప్పక బూర్తియొనర్చు నయ్యయో
కల్మషనాశియైన సురగంగను మున్గిన గల్గు బాపముల్

ఈరోజులలో గంగలో మాలిన్యము ఎక్కువగా చేరుచుండుట బే
అందలిస్నానము రోగకారకమై పుణ్యమున కన్న పాపమే ఎక్కువ
కలిగించుచున్న దను ఆవేదన
(119వ అవధానము - డి. ధర్మారం)

**<u>చన్నీళ్లు పడంగ నొడలు సర్వము గాలెన్</u>**

తిన్నది జీర్ణముగాకన్
గన్నది రుధిరప్రకోపకారణమైనన్
వెన్నున వేకి తొలగగన్
చన్నీళ్లు పడంగ నొడలు సర్వము గాలెన్

**(120వ అవధానము - మచిలీపట్నం)**

**<u>రాయికి దాసులైన మగరాయుల నేమగువల్ సహింతురో?</u>**

ఆయముమాట నెంచక వ్యయంబుల నిగ్రహమింత లేక, వి
ద్యాయశ మందు వారలును దప్పరు మత్తును బొందువేళలన్
రాయిడి లెక్కసేయక పరంపర కార్తినిగూర్చునట్టి సా
రాయికి దాసులైన మగరాయుల నేమగువల్ సహింతురో?

**(121వ అవధానము - హైదరాబాదు)**

**<u>రాముడుముద్దులాడె బలరామునిపోలిక బార్వతీ సతిన్</u>**

సామజచేలు డంచిత విషాదము తేరి నగాత్మజాతపూ
జామహిమంబు మెచ్చికొని సాధురతిన్ బరితృప్తి గామి, ప్రే
మామదిరాప్తి రైవతసమస్థితి నుద్ధృత కాముడౌ శివా
రాముడుముద్దులాడె బలరామునిపోలిక బార్వతీ సతిన్

శివారాముడు = శివుడు **(122వ అవధానము - సిద్దిపేట)**

**<u>సూనుని వరియించె సుదతి సుజనులు మెచ్చన్</u>**

మానానూన మనస్విని
జానకి శివధనువు విరుచు సత్త్వోపేతున్
బూనిక గొన గౌసల్యా
సూనుని వరియించె సుదతి సుజనులు మెచ్చన్

**(123వ అవధానము - స్టేషన్‌ఘనపురం-వరంగల్ జిల్లా)**

<u>కోడి దిని పండు కొన్నాడు కోమటయ్య</u>

ఓడిపోవుట యెరుగని యోద్ధ అతడు
విందులిచ్చిన బాల్గొన వెరచి మంచి
నెంచి రుచికర మగుభోజ్య మెడపి,దా బ
కోడి దిని పండు కొన్నాడు కోమటయ్య

(121 వ అవధానము - చేర్యాల - వరంగల్ జిల్లా)

<u>సంధ్యావందన మాచరింతురు సతుల్ సారాయి సేవించుచున్</u>

ఆంధ్య ధ్వంసికృపావిలోకన కళా వ్యాసంగ నీస్సంగులౌ
వింధ్యా శీలురు, త్రాగి చెడ్డ విధమున్ వింటే? విరోధించి సౌ
గంధ్యంబెంచియు, వారి మార్చగను వీ(లే)కన్ మార్గ మంచెంచి వే
సంధ్యా! వందన మాచరింతురు సతుల్ సారాయి సేవించుచున్

(125వ అవధానము - బచ్చన్నపేట)

సంధ్య అను మహిళ మద్య నిషేధానికై అద్భుకుని ఉద్యమము నెరిపినది గదా!

<u>సంతగోలలు శ్రావ్యమై శాంతి గూర్చె</u>

జీవితంబెన్న భాగ్యసం భావితముగ
నిల్లు నిల్లాలు ధనము రహించి గాని
స్వర్గ భవనంబునందు నిచ్చలును బిల్ల
సంతగోలను శ్రావ్యమై శాంతి గూర్చు

(126వ అవధానము - హైదరాబాదు)

<u>మగవానికి జూలు కలిగె మగువ రమింపన్</u>

జగతీశుడు యువనాశ్వుడు
తగవేటం దప్పిక గొని త్రాగె హవనవా
రి గరిమ వింతగ
మగవానికి జూలు కలిగె మగువ రమింపన్

యువనాశ్వుడు వేటలో దప్పిక గొని యజ్ఞ జలము
త్రాగగా గర్భముధరించి మాంధాత జన్మించుట భాగవత కధ
రమించుట = సంతోషించుట **(127వ అవధానము - చేగుంట)**

శ్రీదేవిన్వలచెన్ అతండుమదిలో - సీతమ్మ పెండ్లాడెగా

భూదేవాశిషముల్ గొనంగ జగతిన్ బుణ్యంపు గార్హస్థ్యమున్
మోద స్థాయి గ్రహించ బూనగను నేభూతంబు వ్యాపించెనో
గాదన్నన్ మరిలోపముల్ వెదుకు దక్కన్ దప్పదంచప్పుడే
శ్రీదేవిన్వలచెన్ అతండుమదిలో - సీతమ్మ పెండ్లాడెగా

**(128వ అవధానము - హైదరాబాదు)**

రాముడు తీవ్రమోహమున రంభను గౌగిట జేర్చి జూడగన్

కామకళాస్వరూపమగు కాంతను బొందగ గోరు వార లే
మేమి మనంబున న్దలతు రిక్షుధనూరతు లట్టివారు ప్రో
ద్దాముడు నర్థపున్ సుతుడు దారను వే నలకూబరాఖ్యుడౌ
రాముడు తీవ్రమోహమున రంభను గౌగిట జేర్చి జూడగన్

**(129వ అవధానము - కరీంనగర్)**

వాలింగూడి రమించె శంకరుడు నింపారంగ భక్తుల్గనన్

లీలా నిర్జిత పుష్పసాయకుడు, చిల్లీలన్ జగన్మోహన
శ్రీలక్షించుచు పార్వతీ హృదయ వార్ధి న్మున్కలాడంగ వే
కేళా కూళి రసప్రపంచగతితో గేల్మోడ్చు దైత్యాళి దే
వాలింగూడి రమించె శంకరుడు నింపారంగ భక్తుల్గనన్

**(130వ అవధానము - మంథని)**

మునితల గౌరిగించి పంపె మురహరి వేడ్కన్,
వినుత గణను గొని పోయెడు
ఘన దేహుడు వెంటవచ్చి కలియబడెడు రు
క్మిని వైదర్భాన్వయ సో
ముని తలగౌరిగించి పంపె మురహరివేడ్కన్
(132వ అవధానము - కోదాడ)

కృష్ణుడు చంపివేసెనట కృష్ణను బోతన భారతంబునన్
జిష్ణుడు ధర్మయుక్తుడగు జేత, గురుప్రియ సద్గుణుండు, వ
ర్ధిష్ణుడు యుద్ధరంగమున దేకువ వైరుల జంపు టెట్లు నా
నుష్ణిషముల్ గనన్దగునె నొప్పుగ జంపితి నేనెమున్ను నా
కృష్ణుడు చంపివేసెనట - కృష్ణనుపో తన భారతంబునన్
(133వ అవధానము - సిద్ధిపేట)

సత్యను జంపిరాధ - తన స్వామికి మోదము గూర్చె బ్రేమతో
పైత్యము మించి పోయి తలబాదు కొనంగ బ్రదర్భనార్భమే
మత్యతుల ప్రభావ యగు మానిని రుక్మిణి కృష్ణ నాత్మలో
నిత్యము నిల్పు, పత్నులను నిష్ఠమెయన్దగ వెల్గు నీల్గు లో
సత్యను జంపిరాధ - తన స్వామికి మోదము గూర్చె బ్రేమతో
(134వ అవధానము - సిరిసిల్ల)

విధవను గూడి పండితుడు విజ్ఞులు మెచ్చగవ్రాసె గావ్యమున్
బుధజన మండనం బయిన పూర్వకృతిన్ బరియించి తాదృశ
ప్రథగనగొరి యొక్కడు నిరంతరమున్ శ్రమముం బొనర్చి వే
విధముల యోజనంబుల వివిక్త తలంబున గొల్చి వాక్సతిన్
విధవను గూడి పండితుడు విజ్ఞులు మెచ్చగవ్రాసె గావ్యమున్
(విధవ = ధవుడులేనిది - సరస్వతియని యౌగికార్థము)
(135వ అవధానము - సిద్ధిపేట)

అవధానం బొక ప్రజ్ఞ యంచనిన నాకాశ్చర్యమౌ మిత్రమా!
కవి తానేర్చిన పోకడన్ సుకవితా క్రమంబు గావించు, స
త్కవనారాధనగా జతుర్విధముగా గావ్యంబు లందించుగా
వివిధంబైన చమత్కృతుల్ సలుపుచున్ విఖ్యాతినింగాంచు నీ
యవధానం బొకప్రజ్ఞ యంచనిన నాకాశ్చర్యమౌ మిత్రమా!
అవధానము అనేక ప్రజ్ఞాప్రదర్శినికదా! ఒక ప్రజ్ఞ అనినచో
ఆశ్చర్యమని మలుపు త్రిప్పుట జరిగినది.
(136వ అవధానము - వరంగలు)

ప్రొద్దుటి వెన్నెలను గలువ పూవులు పూచెన్
అద్దిర ఏమాశ్చర్యము?
కద్దిందు సమస్త జగతి కనువిం దగుగా!
ఒద్దపు సొబగుల మాపటి
ప్రొద్దుటి వెన్నెలను గలువ పూవులు పూచెన్
(137వ అవధానము - ఒంగోలు)

బకమును వడిమ్రింగు చున్న బల్లిని గనుమా!
సకలముగా సువిధలతో
నకలంకత నిల్లు గట్ట నైనను దీప
ప్రకరావృత కీటక శా
బకమును వడి మ్రింగుచున్న బల్లింగనుమా
(138వ అవధానము - అనంతపురం)

కాశ్మీరంబున నుగ్రవాదము సదా కల్యాణమిద్ధాత్రికిన్
ఈ'శ్మా' ప్రాసము దుష్కరంబు సభలో నీయంగ భావ్యంబె? వే
నశ్మప్రాభవ చిత్త వృత్తి హననవ్యాసంగ సంసంగులై
రశ్మల్ మించగ బా క్కునాయకులకున్ బ్రాధమ్యమై యొప్పె నీ
కాశ్మీరంబున నుగ్రవాదము సదా కల్యాణమిద్ధాత్రికిన్
(139వ అవధానము - విశాఖ) (పాక్ + కునాయకులకు)

గుంఁడ్రాయే సతియయ్యె నెమ్మదిని నాకున్నిండె నాశ్చర్యమున్

తీంఁడ్రంబైన మనోజవేదన సురాధీశుండు పెట్రేగగా
వేంఁడ్రంబౌ కృధి మౌని తిట్టు శిలగా, విష్ణుండు రాముండుగా
నుంఁడ్రానట్టి వనంబులోన శిలయై యున్నట్టి తన్దాకిడిన్
గుంఁడ్రాయే సతియయ్యె నెమ్మదిని నాకున్నిండె నాశ్చర్యమున్

**(140వ అవధానము - హనుమకొండ)**

రాముని జంపి రావణుడు రాజ్యమునేలెడు సీతరాణిగాన్

ఏమని చెప్పుదున్ సుకవి! యింతనరాని దురంత దౌష్ట్యమున్
బాముల గూర్చి కానల సభార్య విభార్యుని జేసెనంత, సం
గ్రామము గోరి స్వప్నమున గామ్యము దీర్చు కొనంగ వింత నా
రాముని జంపి రావణుడు రాజ్యమునేలెడు సీతరాణిగాన్

**(141వ అవధానము - హైదరాబాదు)**

గురువు లఘువైన మనగతి గుండుసున్న

జ్ఞాన సంపత్తి పంచును జట్ల కొఱకు
నిత్య దీక్షాయుతుండుయి నిలువనైన
వెకిలి చేష్టల శిష్యులు విలువదీయ
గురువు లఘువైన మనగతి గుండుసున్న

**(142వ అవధానము - చిన్నకోడూరు)**



## దత్తపద భూషిత (భూషా)

**ప్రీతము - శీతము-పూతము-చేతము-కందమున రామస్తుతి**

ప్రీతము నీచరితంబిల
శీతము కరుణారసంబు, చెన్నారగ, సం
పూతము పరిగ్రహముగా
చేతము నకు తనివి గలుగ చేసెను రామా!

**(1వ అవధానము - నారాయణఖేడు)**

**బండ, మండ, గుండ, మండ, సీతా కల్యాణము**

బండ గుండె వారు ప్రభువులు డిల్ల రా
ముం డనుజు వంక ముగ్ధత గని
వధువు దెసను గాంచి బాగుండ మది నెంచి
మండనముగ సీత మనువు గొనియె

**(2వ అవధానము - హైదరాబాదు)**

**ఎల్లి, గొల్లి, గిల్లి, మల్లి, అభిసారిక వర్ణన - ఉత్పలమాల**

ఎల్లి నిశాకరుండు భువి నెల్లెడ గాంతుల నీనః చుండగా
గొల్లిలు వెన్క జేరుమనె గొబ్బున లోకము గన్నుగప్పి రా
గిల్లిన వాని గూడు కొన గ్రిందును మీా దును గానకుండ వే
మల్లియలూని పెన్నెరిని మాటుగ బో యెడి నాయికన్ సుమీ!

**(3వ అవధానము - సిద్దిపేట)**

**నంబి, చుంబి, అంబి, లంబి, కర్ణుని దానశీలత - ఉత్పలం**

కోరినచో ధనంబిడెడు గొమ్మని, కోరిన యీాయ కుండునే?
ధీరత ఖేవిచుంబిత గతిన్ దగు కీరితి గల్గు వాడు నౌ
సౌరి తదంబికం దెలిసి శత్రుత బూనియు గ్రీడి నొక్కనిన్
మీారి తదన్యుని న్విడుతు మేలనిబల్కె దయావలంబియై

**(4వ అవధానము - హైదరాబాదు)**

యతి, మతి, పతి, తతి, శ్రీ అఖండానంద స్వామిని
వర్ణించుట. చంపకమాలలో

యతికులశేఖరుండు, సుగుణాకరు డూర్జిత సత్వమూర్తి, స
న్మతి హిత వాంఛితుండు, మను మార్గ వశంవదు డంచితాత్ము డ
ప్పతినిభు డౌ గభీరుడు దివంబొనరించెను నేటికీ స్థలిన్
హితులగు భక్త సంతతికి నెల్లెడ ముక్తికి త్రోవజూపుచున్

(5వ అవధానము - మాసాయిపేట)

జోకు, రేకు, మేకు, కేకు, అవధానవభను ఉత్పలమాలలో

జోకుచు బృచ్ఛకాలి మనసు న్నసి వెట్టెడు ప్రశ్నలీయ బూ
రేకుల బోలె గొంచును బరీక్షకు నిల్చవధాని, శ్రోతలున్
మేకు బిగించె బాగ నని మెచ్చుచు నుండగ దేవిప్రేమ నా
కే కురురాట్సభాస్థలిని గృష్ణునిగా సదమొప్పె నియ్యెడన్

(6వ అవధానము - సిద్దిపేట)

వందనము, కుందనము, చందనము, వందనము,
సాహితీసభావర్ణన

నవ యువక ప్రపంచమున నందనము ల్వెలయించి సాహితీ
కువల మనోజ్ఞసీమ దగు కుందనముల్ పొదిగించి, కావ్యసం
స్తవముల తోడ శ్రోతృతతి చందనముల్ మెయినద్ది సత్కవి
త్వవిధి సాహితీసమితి వందనముల్ గొను నెల్లవేళలన్

(7వ అవధానము - మెదకు)

పొలము, హలము, జలము, నలము,
ద్రౌపదీవస్త్రాపహరణము

పొలము దురాశ పెల్లుగను, మూఢత కిల్లుగ, దుష్టబుద్ధి దో
హలమున దుస్ససేనుడు కులాంగన ద్రోవది చీర లూడ్వ గ
జ్జలము ద్రవంబుగా దొరల జాన యెలుంగున గృష్ణు బిల్వ న
న్నలముఖముల్ విరాజిల ననంతుడు మానిని బ్రోచె నయ్యెడన్

(8వ అవధానము - సిద్దిపేట)

పవి, గవి, చెవి, చవి,.. ప్రోషితభర్తృక గూర్చి మత్తేభంలో

పవి చేబూనిన వాడు నాక విభుడున్ బాలిండ్ల పొంగు ల్గనం
గ వికారుండయి తప్పు సేయును మనఃకాంతుండు రాడేమి వ
చ్చె విశేషంబుగ మై కృశించె జనులిస్సీ! యందు రేమందు వా
చవి దప్పెం బెను బాధ గల్గె జగదీశా! ఎట్లు జీవించెదన్
(అహల్య ఆక్రోశించుట - 9వ అవధానము - పాలమాకుల)

చెఱుకు, కొఱుకు, ఫఱకు, కఱుకు, చెఱుకు రైతుల బాధ

హరిహరి! ఎట్టులీ చెఱుకు నందభిమానము గల్గెమీకు, మా
కిరవగు మిల్లతండు గన నెంతకునున్ గొఱుకు న్వడండు, ఏ
ధరకయినన్ సరే యనుచు తప్పదు శో! ఫఱకున్న నేమి, లే
దరయగ నన్న నా కఱుకు హాలికు లెట్లు భరించియందురో?
(శో! = నిట్టూర్పు) (10వ అవధానము - మాసాయిపేట)

కరోమి, కవయామి, వయామి, యామి విఠలేశ్వరవర్ణన శార్దూలంలో

ఉద్వేగింపక రోమిటారిపయి నీకున్నట్టి వాత్సల్యమున్
సద్వంశీ! కవయామి యంచు నిలువన్ జాలన్ప్రభూ! పుండరీ
కోద్వృత్తిన్ గను దేవ! యా మిషను భావోద్దిష్ట దైవంబవై
సద్వృత్తుండ వయా! మిథో వచనముల్ చాలింక సర్వేశ్వరా!
(12వ అవధానము - మాసాయిపేట) రోమిటారి = లక్ష్మి

జ్యోతి, కోతి, వాతి, చేతి, స్వార్థభంగమున భారతఘట్టము

జ్యోతిరుదంచిదత్యమల శోభలు జారుచు నుండె నోయి క
న్నా! తిరుగన్న లేని పసివై రిపు వీరుల నుక్కడించి చే
కోతిరమైన కీర్తి యదిగోజయలక్ష్మి ముదంబుతోడ మె
చ్చేతిధి దగ్గఱయ్యె సుత! శ్రీఘ్రమ సాగుమ యుద్ధభూమికై
(13వ అవధానము - సిద్దిపేట)

**కలకల, గలగల, జలజల, మలమల**

**ద్రౌవదీ వివాహము - పాదాదిలోనే వాడాలి**

కలకల దీరు టెట్లు? పొడ గానగ రారిట బాండవేయులున్
గలగల జేరు నీ నృపతి కాండము లోననికేమి చేతు నా
జలజల నశ్రువల్ వెడలు జానకు బాపడు యంత్రభేదన
మ్మల మల భేదిలెన్ ద్రుపదు మానస మొప్పెను గూతు బెండ్లితో
మల=కొండ, భేదిలెన్=పగిలినట్లయ్యెను

(14వ అవధానము - జగదేవపురం)

**గుహుండు, మంథర, జటాయువు, వాలి, భారతార్థములో**

శకునియు వంచనాగుహుడు సాధుల బాధల బెట్టువాడు మా
నకును సుయోధను న్విజయ నాదము వించుచు మంథరాకృతిన్
సకలముగా జటాయువగు సౌరి సహాయముగా విరోధమే
సుకమని ఘోర యుద్ధమన సోలుచు వాలిన వానిజేసెగా
జటాయువు - జటవదాయుః-వెంద్రుక వంటి ఆయువు గలవాడు
సౌరి = కర్ణుడు శాపోపహతుడనిభావము -మంథర=కవ్వము)

(15వ అవధానము - సిద్ధిపేట)

**వాణి, బాణి, బోణి, శ్రేణి, శూర్పణఖ వాసికా ఖండనము**

వనమున కేగు దెంచి కలవాణిగ మారి ధరాత్మ జాత క
చ్చను గొని రాము బాణిగొన సాధన జేసెడు గాని, దాని నా
జనపతి లక్ష్మ ణుండు గల జాడకు బంపగ బూవు బోణి చే
రెను గన నెత్రు బాష్పములు శ్రేణిగ రా జనె జుప్పనాతియున్

(16వ అవధానము - మాసాయిపేట)

**అనా, జానా, లేనా, దేవా, గ్రామములో అభివృద్ధి**
**నిరోధకుల పాత్ర**

అనాథుం డొక డున్న వాడు సరియే ఔనౌ మహాకార్యముల్
జా! నాకేమి యటం చొకండు మదసంసక్తుండుగా గ్రామమే
లేనా? నన్నిట నడ్డు దాకు నిక నట్లే యుండ సర్వోన్నతిన్
దే నాయంబును దప్పజూచు నిక నంతే గ్రామసౌభాగ్యముల్

**(17వ అవధానము - కొండపాక)**

**కాకులు, కాకులు, కాకులు, కాకులు**
**స్వార్థ భంగములో కాకాసురవధ**

కాకులు రాగ మాట రుచిగా రఘురాముని గాథజూడ జీ
కాకులు డుల్చు, నట్టియెడ గాకనిశాచరు డేగుదెంచి వ
క్కాకులు సీత రామునకు నందియిడం దగువేళ గ్రుచ్చె గా
కాకులు చెల్లె వాని కనలాస్త్రము వెంట బడె న్విముక్త మై

కాకులు = కాకువులు (కాకు స్వరములు) వక్క+అకులు
చీకాకులు, క్రుచ్చె గాక+అకులు చెల్లె.........

**(18వ అవధానము - లింగారెడ్డిపల్లి)**

**నాక, రాక, కేక, మేక, గణపతి గురించి ఉత్పలంలో**

రాకయు రాకమున్న శశిరాజిలు బూర్ణత, నిందుమౌళితా
నాకప దుర్లభంబయిన నాతల కెక్కగ జేసెనంచు, నా
కే కద! అంచు పీగు శశికిన్ దనపుట్టిన రో జదృష్టతా
ప్తేకద! సత్యమేకద! మదించిన వానికి నింత చాలదో?

రాక = పూర్ణిమ, నాకపుడు = ఇంద్రుడు,
అదృష్టతా=కనిపించకుండ నుండుట, చూడకుండ
నియమ ముండుట

**(19వ అవధానము - సిద్ధిపేట)**

దత్తపది - అష్టపది, సప్తపది - సీతా అహల్యాద్రౌపదుల ఆవేదన

ఇది విభు దత్త పదిం బది
మృదు గతిని వినష్టపదిగ మేల్వాసియు మై
బ్రిదులక నా సప్తపదిన్
ముదితలు ముదితలుగ గాక మూల్గిరి చరితన్
ముదితలు = స్త్రీలు, విన్+అష్టపదిగ, వినష్టపదిగ
ముత్+ఇతలు=సంతోషమును బొందిన వారు
పృచ్ఛకోక్తస్త్రీలు అసంతుష్టలై జీవనము గడిపిరి అని భావన

(20వ అవధానము - సిద్ధిపేట)

రాదు, కాదు, పోదు, వాదు, రామాయణ వర్ణన

రామవు నీవు నన్నడుగరాదు సుమా! నిను బెండ్లియాడ, నా
భూమిని వీడి వచ్చినను పోదు గదా! యిటువంటి బాధ, ఓ
కామిని! నాకు గా దచటుగాంచుమ లక్ష్మణు డట్టివాడు నీ
ప్రేమను బొందయోగ్యుడగు వేగిరమే చను వాదు లేటికిన్

(21వ అవధానము - హైదరాబాదు)

చెంచాలు, కంచాలు, మంచాలు, లంచాలు
శ్రీకృష్ణరాయబారం ఉత్పలమాలలో

లీలకు మారురూపమగు లే జగమెందున జూడ గాని, చెం
చాలు, నిజంబు వల్కుటకు జంకుదురెప్పుడు ముందువేయు కం
చాలు పిఱుందలాగుటది సాగునె? తమ్ముని పుత్రులేమి లం
చాలు పొసంగ నిత్తు రిది సమ్మతమా కురురాజ వంశ మం
చా లులుఠత్యవస్థ తగు సంగతి జూడు గురుండ వన్నిటన్

(23వ అవధానము - సిద్ధిపేట)

తక్రము, వక్రము, నక్రము, చక్రము, వీనితో రామాయణార్థము

ధారుణి నేలుట న్విడి నుతక్రముకాగము దండకంబులో
జేరి యవక్రముష్కర నిశి ప్రియ చారణ దుష్పథంబులన్
నారిని బాసి కోతులతొ నక్రముఖాలయ బంధనోద్ధతిన్
శూరు విచక్రముక్తశిరు సోలగ జేసి రహించె రాముడున్

(23వ అవధానము - నిజామాబాదు)

ఆకు, చీకు, మాకు, పోకు, భీమదుర్యోధన యుద్ధము

ఆకుల పాటదేల? గతమందలి భోగము పోయెనంచు, బెం
జీకున నున్న మూఢు గతి చీకుట దప్పదటన్న భీముతో
మా కుల భిన్నవృత్తి మని మాటలదేటికి బల్క నిల్వరా!
పోకు మదాంధ! యంచు గురుభూపతి పెన్గద ద్రిప్పె నయ్యెడన్

(24వ అవధానము - వటం చెరువు)

ఉక్త, రిక్త, నక్త, భుక్త, వానరేశ్వరి గూర్చి మీ అనుభూతి

ఉక్త మహత్వము న్విని గురూత్తము నానతి నాని నిష్ఠతో
నక్తములం బవల్నిరశన వ్రతముంగొని దేవి గొల్చియున్
భుక్త మహాఫలంబు పరిపూర్ణముగా గల గాంచి యింటిలో
రిక్తతనూత్రమన్ గురు పరీక్షకు నిల్చితి జీవితంబులో

(25వ అవధానము - వేములవాడ)

బత్తెలు, గొత్తెలు, జెఱ్ఱులు, కఱ్ఱులు, భారతార్థమున, ఉత్పలమాల

కానల లోన బత్తెలుగు గన్పడె నేమి శుభంబొ కాని య
జ్ఞానులువారు, గొత్తెలిట జ్ఞాతులు కేతువు లట్టిరాత్మలన్
మానక బాఱు జెఱ్ఱులవమాన మనూనము బంధురాగమున్
మానుచు గ్రీడి కఱ్ఱులు సుమా! కదనంబున మేలు గూర్పగన్

(26వ అవధానము - బోధన్)





**వరగంటి, కలగంటి, చూరగంటి, కూలగంటి, ద్రౌవదీస్వయంవరము ఉత్పలమాలలో**

కావలెనంచు నేనెవరగంటి? నతండెటు వోయె? గానరా
దేవిధి నా స్వయంవరము నెంచితి నే గలగంటి నేమొ? నా
ద్రోవది పున్నెమేమొకొ ? నరుంగని ప్రేమను జూరగంటి నా?
దైవము కర్దనన్ ఝషము తా వడి నచ్చట గూలగంటిగా

(27వ అవధానము - వరగల్)

**శుద్ధి, వృద్ధి, బుద్ధి, సిద్ధి, వినాయక వర్ణన**

శుద్ధివలయు బూజకు మది
వృద్ధిని గాంక్షించు వారు విఘ్నేశ్వరునిన్
బుద్ధిగ బూజించినచో
సిద్ధికి గొదువేమి జనుల సేవలు గొనగన్

(28వ అవధానము - వేములవాడ)

**రక్ష, శిక్ష, లక్ష, కక్ష, కుమార గణేశ వివాదము, చంపకం**

ప్రమథ గణాధినేతృతను రక్షక కీర్తి లభించు గాన, నీ
మమున విలక్షణంబుగ గుమార వినాయకు లుర్వి జుట్టిరా
శ్రమమని గుర్తెరింగి నిటు రమ్మని వేడియు మాతృ వందన
క్రమమున గెల్చె శిక్షయొకొ? కక్షయొ యంచు గుమారు డేడ్చెగా

(29వ అవధానము - సిద్ధిపేట)

**గాంధి, బూంది, నాంది, బ్రాంది, జాతీయ ఉద్యమాన్ని గాంధీ నడిపిన విధము - ఉత్పలములో**

ఎంతటివారు బ్రాందికి మహీస్థలి లొంగరు? కార్యశూరులౌ
యంతలు నేర్పుగా జగతి యంతయు మెచ్చ ననాంది భారతిన్
చింతల బూంది పొంగుగతి చేసిరి. జాతికి జీవ మిచ్చి ని
శ్చింతగ బోర, బ్రాణములు చెల్లిన స్వేచ్ఛను గాంధి కోరెగా

(30వ అవధానము - కామారెడ్డి)

**జండ, ముండ, రండ, బండ, భారతము కందములో**

వీకన్ జండత గల్గియు
బ్రాకట భిక్షా కరండ పాత్రుడనైతిన్
నా కనుజుడు భీముండవు
గాకన్ నీ బండనృపుని గడ నుండితిగా

**(31వ అవధానము - గోదావరిఖని)**

**రక్ష, లక్ష, కక్ష, శిక్ష, వాలిసుగ్రీవ యుద్ధము. చంపకములో**

కలిగిన లక్షణంబు కలకాలము నిల్చును క్రోతి జాతిలో
పల పరభార్య బట్టుటది భావ్యమె యైనను ధర్మమూర్తికై
బల మది రక్షగా గలన వాలిని మార్కొను సూర్యపుత్రు డం
దుల దన కక్ష రాకము వదుల్చుట నన్నకు శిక్ష తీరుగాన్
అక్షర+అకము=తొలగని దుఃఖము **(32వఅవధానము- రామచంద్రాపురం)**

**పండు, వండు, ఎండు, మండు, భగవద్గీత, ఉత్పలమాలలో**

పాటిల జూడగా గనుల పండువు లోకము భోగ భాగ్యముల్
నీటుగ దోచ లేవనుట, నిల్పు నెవండు మనంబునందు ద
చ్చాటను మండుక ప్లుతిని సర్వ సుఖమ్ములు క్రాలుచుండగా
జేటను నెండు టాకులుగ జీవుల నర్జున! గుర్తెరుంగుమా!

**(33వ అవధానము - భెల్)**

**పోకి, చీకి, నాకి, నీకి, రామాంజనేయ యుద్ధము ఉత్పలంలో**

పోకిట నుండి రాముని విభూతినెఱుంగని మూఢబుద్ధివే?
చీకి తనంబు మానవు నశింతువు వీడు యయాతి నన్న బై
నాకి సుతుం గనుంగొని యనం దొడగెన్ గపిముఖ్యుడంతలో
నీకిదె వందనంబు కరుణించు యయాతిని రామభూవరా!
పైనాకి = శివుడు **(34వ అవధానము - పటంచెరువు)**

**వానరులు, జాలరులు, సోమరులు, పామరులు, వానకాలం, ఉత్పలంలో**

వానరులున్నరుల్ పసులు వర్షము హర్షము నింపు జీవికన్
బూని కృషింపజేసి పాలుపొందగ సోమరులైన వారు కా
ర్యానికి మ్గాని రెందు జలరాసిని జాలరు లైరి కొందరున్
దీనులు పామరుల్ కృషిని దెచ్చిరి యన్నము వర్ష జీవమున్

(35వ అవధానము - సిద్దిపేట)

**అల, కల, వెల, తల, ద్రౌపదీ స్వయంవరము చంపకములో**

అలతగినట్టియల్లునకునై వెదుకంగ స్వయంవరంపు జిం
తల నరురాక గోరె ద్రుపదప్రభు పుత్రిక విప్ర వేషులై
కల గతి దాచి చేప నొక కాండముచే విఘటింపజేసి యా
నెలతను బొంది రార్యు లవనిన్ దగు బాండవు లబ్రమౌ నటుల్

(36వ అవధానము - నారాయణ ఖేడ్)

**నల్లి, పిల్లి, చెల్లి, మల్లి, ఆదిశంకరులు - గీతములో**

వయసు చెల్లిన వెనుక శాశ్వతము గలదె?
ప్రేమ నల్లిన బాధల విధి మునింగి
ఎంత యో దురపిల్లి నిశ్చింత తోడ
ఆత్మమల్లిన శంకరు డడవి జేరె

(37వ అవధానము - చిన్న కోడూరు)

**అక్క, కుక్క, మొక్క, బొక్క, అవధాన సభావర్ధన ఉత్పలంలో**

అక్కర లేని యీసభ యటంచు మనంబున నెంచబోకు నా
కుక్క భరించరానిదయి యొప్ప నికన్మొగియించ మందురా
బొక్కస మున్న బుర్రయిది పొందుగ జీకొడు జూడవచ్చి నా
మొక్క పురస్కృతిన్ జలిపి యోగిర మిచ్చియు బంపు డింటికిన్

(38వ అవధానము - పెద చీకోడు)

**పెదకోడూరు - చినకోడూరు, ఉపదాలతో రామాయణ కథ**

**శార్దూలం**

ఉన్నాడన్మనమందు దీక్ష బెదకోడూరంత మెచ్చంగ నా
కెన్నిబ్బందులు కల్గినన్ సతియు నిస్సీ! యంచు గాసిల్లినన్
బన్నెండున్మరి రెండునేండ్లు వనిలో బర్యాటన న్జేసి పే
రున్నంగా జెడగొట్ట జూచు చినకోడూర్కోదు గా కియ్యెడన్

**(39వ అవధానము - పెదకోడూరు)**

పెదకు=ప్రభువునకు, ఓడు=భయపడు, ఊరు+అంత=అయోధ్య అంతయును మెచ్చగా, చినకోడి=ఒక అల్పుడు: ఊర్కోదు గాక! = ఊర్కొన లేదు గదా!

సీత గురించి చాకలి యొకడు తప్పు కూత కూసినాడు గదా! అపనిందకు లోకము కోడై కూసింది అనుట పరిపాటి గ్రామ నామాలు అందునా అచ్చతెలుగు పదాలు గలిగినవి ఇంతకంటె విడదీయుట సాధ్యము కాదు.

**రాధ, కృష్ణ, సత్య, జాంబవతి, రామాయణం చెప్పి వధూవరులవాశీర్వదించాలి.సంధ్య వధువు, విష్ణువు వరుడు**

మహితారాధన చేసి రాఘవుని సంబంధమ్ము గైకొన్న య
మ్మహిజా పుణ్యమగణ్యమై దొరకె రామస్వామి సత్యంబుగా
విహితం బైతగు సంధ్య కృష్ణతను బర్వెన్ గోత్రవృద్ధిస్థితిన్
సహనం బీయుచు బ్రోచు జాంబవతి జన్మస్థాన మామో దమై

జాంబవతి జన్మస్థానము = ఒకచీకటిగుహ

**(40వ అవధానము - జగిత్యాల)**

నాగము, భోగము, రాగము, త్యాగము, జైల్‌సింగ్ ఎన్నిక కందం

నాగము నీడ న్నిలిచిన
భోగము నకు గొదువయేమి? పురుషోత్తముడే
రాగము బాయని జ్ఞానియు
త్యాగము పరులందు నేతృతతి లక్ష్యంబుల్
జ్ఞాని = జ్ఞాని జైల్ సింగ్

(41వ అవధానము - హైదరాబాదు)

గడ, బిడ, తడ, బడ, కోటిలింగేశుడు శెట్టిని.దీవించుట కందములో

ఈ తడవ నొక్క కవిచే
చేతో మోదమును బడయ చేయించెనయా
కైతల గడ బిడ నవధా
నాతత గతి నీశుడేలు నార్యుని సతమున్

(42వ అవధానము - సిద్ధిపేట)

ఇందిర, వాజపాయి, మేనక, రామారావు, రామరాజ్యం వచ్చిందని

రాగానే మరి యేమ యిందిర? సదా రాగాలు తీసేవు. ఏ
బోగాలబ్బెను వాజ! పాయి వయితే? పొంగంగ రాదోయి! నీ
బాగే దింకను గాంచమే నకనకల్ పాలించగా నిమ్ము. వే
మాగాయే రుచి దొరగా వెగటు రామా!రావు నాబిల్వరా!

(43వ అవధానము - సిద్ధిపేట)

కంప, కొంప, గంప నాగేటికర్రు

కమ్మరి వాని యొక్క యనుకంప దయారయి వడ్ల వానికై
కొమ్ముల నేర్పు మీఱ తగు కొంపగ జేకొని వాడి నోట వ
క్షమ్ముల జీల్చి నేల విలస ద్ధనరాసుల నింపు లాంగలీ
ష్ఠమ్ము నయోనిజమ్మును సతమ్మును గంపలకెత్తు పంటలన్

(44వ అవధానము - కాజీపుర్)

**అచ్చా, బచ్చా, కచ్చా, పచ్చా, శృంగారముగూర్చి శార్దూలములో**

అచ్చారిత్రిక పూరుషుండు కవి కావ్యానంద దానమ్ము లం
బచ్చారు స్తన గర్వ దర్శన దృశా వైభోగము న్జూప సం
పచ్చాతుర్యము మీర భోగమహిత ప్రాగల్భ్యమున్ జూప గం
కచ్చామీకర శోభ వెల్గెడును శృంగారమ్ము సింగారమై

**(45వ అవధానము - కోహీరు)**

**తుంట, జంట, వెంట, కంట, భెల్ వర్ణన**

తుంటరివి నీవు మిత్రమ!
కంట బడిన దానినెల్ల గాంక్షింతు వెదన్
వెంట బడి తేమి భెల్లన (భెల్+అన)
జంట గలదె దీని కెందు సర్వ ధరిత్రిన్

**(46వ అవధానము - భెల్, హైదరాబాదు)**

**కట్ల, పుట్ల, కొట్ల, పెట్ల, భారతార్థము, కందములో**

కట్లవలె దివికి వంతెన
పుట్లవలయు దక్షుడొకడు పురుహూతునెదన్
గొట్ల వలెనన్న గ్రీడియె
పెట్లకుమి సుతుని నితరుని బృథ! అనె హరియున్

**(47వ అవధానము - యాదగిరి గుట్ల)**

**వెన్న, జున్ను, నేయి, దక్షిణాది ముఖ్య మంత్రులు రామాంశ గలవారని కందమున జెప్పవలె**

ఒకడును రాజున్నుదుటన్
సకలము సూవెన్న నొకడు చతురు డొకండున్
సకలాంశము లారామున
ముకు దారము లందు నేయి ముగుర ధిపతులన్

**(48వ అవధానము - సిద్దిపేట)**

భంగము, లింగము, జంగము, సంగము, గయోపాఖ్యానం, ఉత్పలంలో

పాటిలనేల యీ సమయభంగము దప్పని యీపరిస్థితుల్
నేటి కిదేటికయ్యెను గలిం గము లయ్యెడు పాపరాశి త
చ్చాట యెసంగె రోషిత భుజంగము కృష్ణుడు వాని తోడి క
చ్చా? టక టొంకు లౌనె. గయుసంగము చూడగ జేటు దెచ్చెరా?

(49వ అవధానము - ఖిక్కనూరు)

లంక, వంక, శంక, జింక, భారతార్థము, ఉత్పలమాలలో

వంకరమాట లేల? ఇది పాడియె మాధవ! ఎన్ని చెప్పినన్
శంక యొకింత లేక బరసైన్యము గూడిన మిత్రుడైన రా
జింక సహింపగల్గునె? మహి న్యశమందున మచ్చ రాదె? అ
లంకరణంబె పేరునకు? లక్ష్యము నైనుడు దప్పనం చనెన్
ఐనుడు=ఇనపుత్రుడు కర్ణుడు

(50వ అవధానము - వికారాబాదు)

భక్తి, యుక్తి, శక్తి, ముక్తి, సీతారాముల గూర్చి ఉత్పలములో

జానకి భక్తి యెంతయన జాలదు? నెన్ని జనుల్ కృషించి యో
మానవ జన్మ మెత్తి రఘు మాన్యు వియుక్తిని బొంది, శాంభవీ
ధ్యానముతో విముక్తి గని తత్పరయై విలసిల్ల నట్టి భూ
జాని నిరంతరం బతుల శక్తి యొసంగియు మమ్ము నోముతన్
జనుల్=జన్మములు (51వ అవధానము - రామాజీపేట)

ఉంట, తంట, జంట, వింట, యతీశుని గూర్చి

ఉంటకు లేకుంటకు గల
తంట సదా శ్రమము నిల్పుతరిలో మరుగు
జ్జంట యతీశుని మహిమలు
వింటయె కన మెందు గాని విశ్రుతఫణితిన్

(52వ అవధానము - సీతారామాశ్రమము)

పూతన, హిడింబ, తాటక, రుక్మిణీ కల్యాణము,

పూత నయప్రచార గుణపూజిత రుక్మిణి బ్రాహ్మణోత్తమున్
బ్రీతిగ బంప వచ్చి తగురీతిని సత్కృతి బొంద నున్న వి
ఖ్యాతిగ జేరవచ్చిన మహాశయు గూర్చిన తా టక న్దకన్
చేతము తా హిడింబ గతి చింతల రుక్మిణి కృష్ణ కేల్గొనెన్
(53వ అవధానము - శనిగరం)

కరము, వరము, పరము, శరము, పాదాదిలో
రామాయణార్థం

కరము దురూహ రాము పయి గల్గుట సోదరి మాటవించు గా
వరమున సీతదెచ్చి తన ప్రాణము మీదికి దెచ్చుకోడె? ఏ
పరమును గోరెనో? విడిచి పొరడు రావణుడెన్ని చెప్పినన్
శరమున గూలె బట్టున నిశాట కులాంతము గల్గు నట్లుగన్
(54వ అవధానము - హైదరాబాదు)

రాగము, భోగము, భాగము, త్యాగము, ఈరోజు జరిగిన
రాఘవేంద్ర ప్రతిష్ఠ గూర్చి

రాగము మీర నాచగిరి రాఘవమౌని ప్రతిష్ఠ సేయ నే
త్యాగము నైన నోర్చి విబుధ ప్రకరంబులు మెచ్చునట్లు వై
భోగము మీర వర్షముల ప్రొద్దున నైనను భక్తు లందురున్
భాగము గొన్నతీరు బలవంతపు బెండిలిగాదు సత్యమౌ
(55వ అవధానము - నాచగిరి)

దండము, గుండము, పిండము, తొండము, పాదాదిలో,
సిద్ధరామేశుని గురించి

దండము సిద్ధరామ! ఎడదంగల కోర్కెల దీర్చు కొంటకై
గుండము నందు దోగి శుచి కోవెల లోపల జేరి భక్తి న
ప్పిండము దార వోసి నిను వేడెద ముక్తి నొసంగ కాని, యీ
తొండము గల్గు దేవరకు దొల్తన మ్రొక్కెద నర్థ సిద్ధికై
అప్పిండము=జలసమూహము (56వ అవధానము - భిక్కనూరు)

**కల్లు ముంత, బీరు సీసా, బీడి ముక్క, కోడి కూర, శివారాధన గూర్చి**

ఎంతటి భాగ్య హీన జల మింత యొసంగదు కల్లుముంత, దా
నెంతదొ పంచ గవ్యముల కించుక పారదు బీరు సీస, ధూ
పాంత శివార్చనా నియతి కందదు గాదొకొ బీడిముక్క, ని
శ్చింతల కోడి కూరకెటు చేసెదముక్తిని గోరి శంకరా!

ఓడిక+ఊరక+ఎటు (57వ అవధానము - దిగ్వాల్)

**దానా, లానా, ఖానా, సోనా, తెలుగుదేశం పాలన**

తరుణంబున్ జెడగొట్ట కుండ బదవిన్ దానాస గై కొంచు నం
దరుమెచ్చంగ గృతార్థపాలకుడుగా దర్పంబు లానాడు, మె
చ్చరు గాకియ్యెడ దెల్గు దేశపు బతిన్ శాఖాన పాయిత్వమే
గురిగా, నాది పరిశ్రమంబగును నిక్కుంజిక్కు సోనాముఖిన్

(58వ అవధానము - నంగునూరు)

**బడి, గుడి, మడి, పాడి, విద్యార్థి గూర్చి**

నిద్దురమాన వెంటబడి నిత్యము లేపును దల్లి, సుంకమున్
బ్రొద్దున గోర నేగుడిది పాల్పున నంచును బంపు దండ్రి, నా
కెద్దియరాదొ యిమ్మడిగ నెంచి గురుండును గోర జట్టునై
మొద్దనుపేర నీచదువు మొండిది తిప్పలువెట్ట బాడియే

(59వ అవధానము - రామంచ)

**గురు, శని, కేతు, సముద్రదాహము**

ఏమని చెప్పగల్గుదు సుధీంద్ర! సముద్రుని దాహ మిందు నె
న్నో మహితాపగల్ వలచి నూల్కొని వచ్చిన రాగ బంధ మే
మోమరి! వాగురు ప్రతిభ యొప్ప శని ధ్వని కేతుల ప్రథన్
భూమిని వీచులన్ దమిని పాల్పగు జెప్పిన నింక జాలదో?

(61వ అవధానము - పెదగుండవల్లి)

బిర బిర, కొర కొర, సుర సుర, చర చర, సత్యభామ కోపము

బిర బిర నెచ్చెలిన్ గనగ బ్రేమను వచ్చెను గృష్ణుడంత, వే
కొర కొర జూచె భామ దుడుకుందనముంగల ముద్దు పెంటి ఆ
సుర! సుర పక్షపాతి వని సాక్కితి నాకిడు పారిజాతమున్
చర చర యాపె మిన్న యని చయ్యననిచ్చితి రాకు మిచ్చటన్

(63వ అవధానము - చేవెళ్ల)

దానము, ధ్యానము, గానము, జ్ఞానము, భారతార్థములో

కలన నిదానము తగునా?
తల గొట్టెడు బంధులంచు ధ్యానము విడుమా!
లలి గీతా గానము విని
తొలుతటి జ్ఞానమున బోరు దొలగకు బావా!

(64వ అవధానము - అందోలు)

తెలుగు గంగ, రామకృష్ణ హెగ్డే, రామారావు, రాజీవగాంధి
నేటి రాజకీయం గురించి సీసము

తమిళుల దప్పిక దప్పింపగా దెల్గు
గంగ పథక మయ్యె గాదెనేడు
కన్నడ తిరకాసు కలిపె మిత్రుడు రామ
కృష్ణహెగ్డేగారు కీర్తి గోరి
మహిని రామారావు మసలెడు విధి చేత
గోపమువిడి మెప్పు కోలువడియు
రాజీ కుదుర్చగా రాజీవు గాంధియే
రావలె గాదె బిరాన నేడు
రాజకీయము లందున బ్రజలగతులు
దప్పి దప్పిక దప్పింప దిప్పలయ్యె
వదలి నామని, మిగిలిన వాని ననుచు
వేచియేచెడు జూచుచు వేచు కొలది

(65వ అవధానము - జోగిపేట)

రాళ్ల, ముళ్ల, గుళ్ల, కళ్ల, సరస్వతీ వర్ణన

రాళ్లకు రూపమిచ్చి తనరారగ జేయును శిల్పి వానిదే
ముళ్లని గొల్తు రాస్తికులు, మూర్తివహించ ననంత సాగరిన్
గుళ్లను గట్టి కీర్తి గన గోరి, త్రిమాతల నిల్పునాడు మీ
కళ్లకు బండువై యమిత కామితమల్ ఫలియించు నెప్పుడున్

(66వ అవధానము - శనిగరం)

రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్న, విభక్తినియమం లేకుండా భారతార్థమున చెప్పాలి

ఔరా! మాద్రి కుమారు డల్పుడొకొ? యుక్తాయుక్త విజ్ఞాని, ని
ష్కారూపమ్మున గోపలక్ష్మణునిగా సంకీర్తనం బొందె, వం
శారూఢిన్ భరత ప్రతిష్ఠ నెగడున్, హా! కీచకాంతంబునన్
సారంబుండియు నేమి భీమ! పెలుచన్ శత్రుఘ్నుతం గాంచుమా

(67వ అవధానము - భోధన్)

రాక, పోక, నూక, రూక, భారతార్థములో - మత్తేభం

సరిరా! కష్టము జన్మకున్ విధి, ధరా సంపత్తి భాగంబు నీ
యరయేనిన్ దమ పోకడన్ దెలుప గృష్ణా! యుద్ధమే తప్పదా?
మరియే మౌ నిక ద్విట్టనూకరులు కుంభ ధ్వంసులై పోవె? విం
టిరె మా దీక్ష గురూ!కబంధములు నుద్ధీనంబు లౌనంతటన్

(68వ అవధానము - రాజగోపాలపేట)

జలము, స్థలము, కలము, ఫలము
నాచారం లో స్థలజల వర్ణన, చంపకములో

జలము పవిత్రమై నెగడె, సజ్జన భక్తికి దావలమ్ముగా
స్థలమ్మున క్షేత్రమై జపవిధానము పూజలు శాస్త్రమొప్ప పో
కల ముదమంద భక్త జన కాండము నాచగిరిన్ నృసింహు స
త్ఫలమున కానసెంది తమ ధామము జేరుదు రిష్ట పూర్తితో

(69వ అవధానము - నాచగిరి)

**పిలక, చిలక, మొలక, గిలక - కాశీ గంగను వర్ణించుట చంపకములో**

రమణ వహించ గాపిలకరాళకృధిన్ నుసియైన సాగరుల్
విమలులుగాగ వే చిల కవిశ్రముడైన భగీరధుండు దే
గ్రమమున గంగ వచ్చె మొలకంబలె గొండలబుట్టి కాశి ధా
మము జన భక్తి మొగ్గిలక మందముగా జను నాథు జేరగన్
కాపిల=కపిలుని యొక్క, సాగరుల్=సగర పుత్రులు,
వేచి+ఇలకు+అవిశ్రముడు; నాథు జేరుట = సముద్రుని జేరుట

(70వ అవధానము - కాశి)

**ఖాజా, రోజా, మాజా, బాజా, సనాతన ధర్మస్థితి**

సరవిన్ జూడ సనాతనంబు సముఖా!జాగ్రత్త, ద్వేషంబుమిం
చరమా భోగము దప్పు నింత కనరో? జాతు ల్వినాశంబుగాన్
మరణంబే గతి, ధర్మరక్షకులు సుమ్మా! జాతి నుద్ధారమీ
శ్వరసేవా మహిమంబు గాంచు, సబాబా! జాతీయతాస్ఫూర్తిమై

(71వ అవధానము - వాచారం)

**సల్ల, గొల్ల, నల్ల, కుల్ల, మూల్యాంకనము గూర్చి**

సల్లలితోక్తి ఛాత్రులకు జక్కని బోధన జేయ కుండినన్
గొల్లడె యొజ్జ, క్రొత్తలను గూర్చుచు వారి బరీక్ష సేయగా
నల్ల యుపజ్ఞ బైటపడు, నంచును విల్వల నెంచ నేర్చు మా
కుల్లము ఉల్లసిల్లెడును యోగ్యులమై జనబోవు నందులన్

(72వ అవధానము - మెదకు)

**రవి, బుధ, గురు, శని, వీనికి గ్రహార్థము రాకుండా భారతార్థమున**

ఔర! వినవలె భారతమనిశము బుధ!
కర్ణ డొక్కడు లేకున్న గలదె చవియు
గురు జనంబుల మరణంబు కుముల జేయు
ధర్మ తనయు నశనిమామ తనరుశకుని

(73వ అవధానము - ఓరుగల్లు)

హారము, భారము, సారము, నీరము, గణపతిని గూర్చి
నీహార ముగ్ధ కరుణా!
ఈహా భారమును ద్రోవ నింగిత మిడి యా
మోహాసారముని స్థితి
నాహా!రానీర ముక్తి అగజాతనయా!
(74వ అవధానము - సికిందరాబాదు)

మదరాసు, గుజరాతి, మైసూరు, మహారాష్ట్ర, వృత్తమున
గణేశోత్సవ వర్ణన
తిరమై సూరుడు నిల్చు జంద్రు డనినం దిక్కన్న లేకున్న నీ
ధర నిన్నమ్మద, రాసులైన భవ చిత్తం బెందు విఘ్నేశ! ని
దరిలోనం గుజ రాతిరిన్ మొగము నిండన్ జూపగాలేడు, ను
ర్వర నాంధ్రంబున దెచ్చి పెట్టెను మహారాష్ట్రంబు నుష్ట్రంబుగాన్
(75వ అవధానము - చేర్యాల)

కాల, కీల, కోల, రాల, బాల వేణు గోపాలుని గూర్చి,
ఉత్పలంలో
కాలఫణీంద్రు పెన్మదువు గ్రాలివిషంబును బార ద్రోలి, గో
పాలక వృత్తి కోలగొని పాడిగ నావుల నేలి వైరికై
కీలలమ్రింగి గోపకుల కీర్తిని జాటిన బాల వేణుగో
పాలుడు రాలపై నిలిచి పాడెను మోహన వేణు గీతికల్
(77వ అవధానము - కాజీపురం)

వారణావతం, ఏక చక్రం, అనే పదాలతో
మహాభారతంలో ప్రస్తుత రాజధానిని వర్ణించుట
వారణావత మేనాటివరుస దుష్ట
దుస్స సేనులు కరువైరి? తొలుత నేక
చక్ర పరిపాలనమ్మున సాగు దేహ
ళీ పురమ్ము భారతి కల కాపురమ్ము
భారతికి అలకాపురము, దేహళీపురము - ఢిల్లీ
(78వ అవధానము - చుంనకోట)

వాలి, శూలి, కీలి, హేలి, రామపట్టభంగము, పాదాదిలో క్రమము తప్పకుండా ఈపదాలు వాడాలి

వాలిన ప్రేమ రామునకు బట్ట మొనర్చగ రాజుపూనె, హృత్
శూలిగ గైక స్వార్థమున జొప్పడి రాముని గాన కంప రా
కీ లిఖితమ్ము గూర్చె జను లెల్లరు శోకిల బట్ట భంగమున్
హేలి కులుండు లోకముల నేలునటంచు దలంచబోలుబో

(79వ అవధానము - మరువడగ)

అవా, పీవా, ఖావా, సోవా, గిరిజా కల్యాణము

అనాటి బాధ మదికై
నానా పీనాఘఫలము నా దారకుకై
యే నోయి సఖా! నాగా
నూనాత్మజు సోన గురియ నుతి గొను శివుడున్

(80వ అవధానము - సిద్దిపేట)

నలువ, తులువ, వలువ, చెలువ, రామపట్టాభిషేకం. మత్తేభములో

నలువంక ల్కాపిసేన కన్నులకు నందం బొప్పగా జూచి కు
చ్చెలు వట్టన్ సిగలాగ గీకి కొనగా జిందుల్పసందైనచో
పలువాద్యమ్ములతో మహర్షులు మహద్వాక్యంబులన్ మేలు బం
తులువల్పోకల బట్టమొప్ప రఘునాథుస్ఫూర్తి భాసించగాన్

(81వ అవధానము - కుకు నూరువల్లి)

శేష, వేష, తోష, భూష, రామానుజునిగూర్చి

శేషసదంశలోకముల జెన్నలరారి త్రిదండిరూప స
ద్వేషముబూని పాపులను దేల్చ గురూత్తము మంత్రరాజమున్
తోషత గోపురంబు పయిదోచి బయల్పడ జేసి యోగి స
ద్భూషణుడైన శ్రీ యతివిభుండు విరాజిలు దుర్మతారియై

(82వ అవధానము - కరీంనగర్)

దండ, కండ, నిండ, కుండ, శ్రీ కృష్ణరాయబారములో
దుర్యోధనుని స్పందన

కండ గలట్టి వారమని గర్వము గల్గిన వారు పాండవుల్
నిండ గురు ప్రభూత్తముల నీల్గగ జేయుదు మంచు శౌరి మా
కుండ నికేమిటన్న బలయుక్తిని నన్దర గోరు టేల? త
ద్దండధరాత్మజుండు నెడద న్వణకెంగద చాలు కేశవా!

(83వ అవధానము - సూర్యాపేట)

ఆది, సోమ, మంగళ, బుధ, సరస్వతీస్తుతి

ఆదిమ మంత్రమై ప్రణవమై సకలార్థములిచ్చువాణి, ని
ర్వేదము వాపి సోమరస వేత్తల కందని శక్తినిచ్చి, భా
గ్యోదయ వృత్తి మంగళము లొక్కట గల్గ వచోవిధాయన
శ్రీదరి జేర్చి సద్బుధ విశిష్టత గూర్చగ గొల్తునంబరో!

(84వ అవధానము - చందాయిపేట)

అనా, జానా, గానా, దేనా, వీనిని అంధ్రపదములుగా
స్తంభోద్భవ విషయము శార్దూలములో

అనాడెట్లు పితల్ సుతప్రతతి విద్యాసక్తి బాలించిరో?
నానా వాంఛలు పెంచు కొంటి దనుజా!నా శత్రు నామస్మరత్
గానా సక్తి రహింతు వెక్క డిటు లీకంబంబునం జూపు, లే
దే నాతండొక భీరు వంచెరిగి పృథ్వీం బొందుమో అర్భకా!

(85వ అవధానము - నాచగిరి)

రక్తి, శక్తి, ముక్తి, భక్తి, తెలుగు విద్యార్థులకు సందేశం

రక్తి యొకటున్న జాలదు
శక్తియు గావలయు విద్య స్వాధీనముగాన్
ముక్తి పిదప వాగ్దేవీ
భక్తిని సాధించవలయు ప్రధమము ఛాత్రుల్

(86వ అవధానము - ఉస్మానియా విశ్వ విద్యాలయం)

**ద్రౌపది, గాంధారి, కుంతి, కృష్ణ, రామాయణార్థం ఉత్పలమాల**

ద్రౌపదివై ధరాసుతను దప్పక జూడుమ అన్ని చోటులన్
దాపము దీర్చు నేర్పు గల దక్షుడు గాంధరియిత్రి వెల్గుమా
నీ పని తోడు కుంతి యయి నిల్చెడు. నంగదు దర్థి, ఉంగరం
బోపి గ్రహించి చూపుమ అయోనిజ భావిని గృష్ణత గ్గనన్

**(87వ అవధానము - వరంగలు: పోతన 500జయంతి)**

ద్రుతగతిపదః=వాయుదేవః తస్య అపత్యఃపుమాన్ ద్రౌపదః, వేగముగా వేయు నడుగులు గలవాడు ద్రుపదుడు అనబడును అనగా వాయువు వాయుపుత్రుడు = ద్రౌపది మారుతి, పావనివలె కుంతి=కుంతమను అయుధము ధరించినవాడు, శూలి, చక్రివలె అయోనిజ=త్రేతలో సీత, ద్వాపరమున కృష్ణ (ద్రౌపది) గాంధారి నామవాచకము కనుక గాంధరియు అనవచ్చును "అపి మాషం మషంకృత్వా ఛందోభంగం నకారయేత్"అను లాక్షణికోక్తితో గాంధారిని గాంధరి అనినను దోషముకాదు

**మధుర, నర్మద, వింధ్య, హస్తిన, భరతమాతను సరస్వతితో పోల్చాలి**

మధుర సాస్వాద సరస సంపదల నింపి
నర్మదంబగు భాషల నర్మిలి గొని
వింధ్యబోల్కొండ లన్నిల్చి వెలుగు దేవి
భారతియె మదహస్తినాపసద యమ్మె

**(85వ అవధానము - సిద్దిపేట)**

**గోకు, చీకు, పీకు, వాకు, సీతావేదన**

గోకు బుట్టిన దాది తన్ గొన్న సుఖము
చీకు చింతలే కానల చెంత వెతలు
వెలుగ నీ యీడముననను గపీకులంబు
నాకు దిక్కయి కూర్తురు నాథు నిపుడు

గోవు=భూమి, ఈడము=లంక **(89వ అవధానము-దేవరయాంజాల)**

అవ్వ, ముువ్వ, బువ్వ, చువ్వ, రామకథ ఆటవెలదిలో

అవ్వ! జనక పుత్రి యంతటి దానికి
మువ్వ మ్రోత బీతు ముగుద పొందు
బువ్వలేక కాదు నొవ్వగా గానల
చువ్వలేర వలసె సుమ్మ విబుధ !

అవ్వ! ఆశ్చర్యార్థకము, బీతు=భయము

(90వ అవధానము - కుత్పుల్లాపురం)

దారుణము, తోరణము, మారణము, కారణము,
నేటివిద్యావిధానం. చంపకంలో

తమ భవితమ్ము చూడగను దారుణమై కనిపించు, విద్దెలం
దు మహిత కీర్తి పొంది జన తోరణముల్ వెలయించ, మమ్ము వం
ప, మధుర భావనల్ దొలగి మారణముల్ మదినిల్చిపోవగా
కమనత దగ్గె దజ్జనుల కారణముల్ గమనింపు మిత్రమా!

(91వ అవధానము - శేరి లింగంవల్లి)

రోసము, హాసము, వాసము, మీసము,
ఆంధ్రులరోసమునకు మీసాలే కారణము అని చెప్పండి?

రోసము లెన్నినన్ దెరువరుల్ కడు చెడ్డకు, మంచి యెట్టిదో
హాసము నమ్మరాని యదియై తగె, జూడగ శాంత చిత్తమే
వాసము చేసె నెచ్చటనా? వాసికి దప్పెద రింక, పాప మా
మీసముదే సుమా! తెగువ మేలగునే యనిపించె నేటికిన్

(92వ అవధానము - అద్దంకి)

భద్ర, నిద్ర, ముద్ర, రౌద్ర, రామకథ, ఉత్పలంలో

భద్రమురామగాథ, బహు బాధల శీఘ్రము దీర్చు గాదె, ని
ర్నిద్ర మహిమ్నమై జగము నించెడు నాస్తికతా ప్రబోధమున్
ముద్రను జూచి జానకి విభుంగను తృప్తిని జెందె, మారుతిన్
రౌద్రకళావిభూతి కని రావణు నంతము నెంచె సత్కవీ!

(93వ అవధానము - కావలి)

మతము, గతము, కృతము, స్తుతము, నేటి భారతదేశస్థితి. శార్దూలంలో

నేతల్ చేసిన దంతయున్ గతము మన్నీల్దేశభక్తుల్పనన్
గోతుల్ ద్రవ్వెదు వారు తన్మతము తక్కుంగల్గుచోరుద్ధగా
చేతశ్శాంతి నభంబుగా బ్రకృతమున్ సిద్ధించె బల్సీమలన్
నేతృత్వంబును జూడ బ్రస్తుతము మించె న్పక్షపాతమ్ములన్

(94వ అవధానము - నిజాంకాలేజి, హైదరాబాదు)

కవి, రవి, భువి, పవి, గోపాలకృష్ణునిగూర్చి

కవికెట్లు తోచె, యదుకుల
రవి తాగోపాలకుడుగ రాజిలుచో ద
ద్భువి చల్లి కుడుపు చవి చూ
పవిశద పరుపగ సభికులు ప్రస్తుతి సేయన్

(95వ అవధానము - మెట్పల్లి)

విత్తము, పొత్తము, దత్తము, బెత్తము, నేటి భారతదేశస్థితి

విత్తము లేగన్ దత్కథ
పొత్తము లన్నిలిచె స్వేచ్ఛ పూర్ణత్యాగుల్
దత్తము సేయగ నేతల.
బెత్తముతో నడుపు గతికి వెతపడవలసెన్
విత్+తములు=జ్ఞానులు (96వ అవధానము - కోహీర్)

రాముడు, శేషుడు, శివం, సుందరం, రామకథ

రాముడు పోక మున్నె రఘురాముడు వచ్చెను లోక రక్షకై
కామవిశేషు డుల్చి వెనుకంజను లక్ష్మణు కాపుతోడు ను
ద్దామ శివంబుగా గపులు ధారుణిజ న్వెదుకంగ బంపినన్
భీమ బలుండు నౌ హనుమ వేడుక సుందరమౌట యొంచెబో
రాముడు=పరశురాముడు, సుందరము=సుందరకాండము,అందము

(97వ అవధానము - వెల్దుర్తి)

**వెల్లి, ఉల్లి, ఆలు, చామ, మయనభను వర్ణించాలి**

వెల్లిగ సంపదల్ గలుగ వేడుక శోభలు గోరు నెవ్వడున్
సల్లలితంబుగా సభను జక్కగ నుల్లికుచంబునయ్యె, వ
ర్తిల్లెడు వింతలన్ గనిన తేకువ నామగనాలు నవ్వె గం
పిల్లగ ఛత్రచామర సువిశ్రుతి దక్కె నయో సుయోధనా!
లికుచము=గజనిమ్మ , గజనిమ్మలో గజభ్రాంతి

**(98వ అవధానము - పెద్ద చెప్యాల)**

**హంస, హంస, హంస, హంస, హంస సందేశము కందములో**

హంసలు మెచ్చ న్నరపతి
హంసలు విస్మయము నెందునట్టుల వార్తా
శంసన్ హంసన్ బంపె రి
రంసుండై చిత్తహంస రాజిల నలుడున్

**(99వ అవధానము - రామాయంపేట)**

**ఇడ్లీ, వడ, పూరి, దోశ, సరస్వతీ వర్ణన చంపకములో**

కలిగిన కష్టకాలమున గాచునదిట్టిది యంచునెంచ, నా
పలుకులతల్లి భక్తులకు భాగ్యముల న్వడబోసిపంచు, ని
స్తుల సుఖ పూరితమ్ములుగ జూచు సమానత, మానితంబుగన్
కలిగిన దోసముల్ తొలగ గాచు నిరంతర మార్తరక్షణన్

**(100వ అవధానము - నార్సింగి)**

**నేతాజీ, శాస్త్రీజీ గాంధీజి, డాక్టర్జీ వీరిసందేశాలు**

తప్పదిక హింస యంచు నేతాజి పల్కె
శాస్త్రిజీ రైతు సేమమే సంపదయనె
గాంధిజీ కొక్కనికి పేరు గలిగె గాక
హైందవంబున డాక్టర్జి అండనిలిచె

**(101వ అవధానము - సిద్ధిపేట)**

రండ, కుండ, కొండ, బండ, శివధనుర్భంగము

రాజులు లేపకుండ పడిరా! యని సంభ్రమ మందు చుండ, ని
స్తేజ సభాతలంబున నుతింపగ బుష్ప కరండమట్లు వి
భ్రాజిత కీర్తిగా గురు కృపన్ రఘు రాముడు కొండ యింటివిల్
బూజుగ నెంచ బోవదది పెల్చుగ బండగ ఫ్రీల్చె సీతకై
కొండ యింటివిల్=శివధనుస్సు

(103వ అవధానము - తడకపల్లి)

లేరా, సారా, కారా, తేరా, విద్యార్థులకు సందేశం, కందములో

లేరా రమ్మనవలెనా?
సారాతిగ దేశభక్తి శాశ్వతమైనన్
గారా నేతలు? మీకిం
తే రాజితమైన భవిత దిక్కైరె సుమా!

(104 వ అవధానము - సిద్ధిపేట)

రామా, లక్ష్మణా, భరత, శత్రుఘ్న, భారతార్థమున

ఔరా! మాకీవేగా
నారూఢిగ లక్ష్మణాంశజానుజ! అనిలో
ధీరత శత్రుఘ్నతతో
ధారుణి భరత ప్రతిష్ఠ తప్పింపకయా!

(105వ అవధానము అర్.బి.ఐ. హైదరాబాదు)

మడి, తడి, బడి, గుడి, అన్యార్థములో అయోధ్య
రామాలయ నిర్మాణము జరుగునా లేదా చెప్పండి.
చంపకమాలలో - పదాలవరున తప్పకుండా

మడియగ జొచ్చిరే మతము మాటవినం దమ వంతునెత్రు చి
త్తడి యగు నట్లయోధ్యకయి తర్పణమిచ్చిరి. న్యాయశాలవెం
బడి పడి విఘ్నముల్ గలుగ పాటు ప్రభుత్వము పొందు మీర లా
గుడి జనశక్తి మేలనము కొంచెము కొంచెము గాక జూడుడీ!

(106వ అవధానము - సిద్ధిపేట)

సరళ, విరళ, తరళ, గరళ, రామకథ చంపకమాలలో

అరయగ జూచినన్ సరళమై తగు రామ కథామృతంబు నం
దిరవుగ రాజులన్ విరళ మెంచగ దద్భుజ శక్తి జూపి యి
మ్మురవడి వింటికిన్ దరళముల్ గద చూపులు, రామచంద్రుడే
కరము ముదమ్ముగా గరళకంఠుని చాపము ద్రుంచె సీతకై

(107వ అవధానము - జోగిపేట)

విత్తము, చిత్తము, పొత్తము, నెత్తము, పాలెం గూర్చి స్వేచ్ఛావద్యము

విత్తము లిందరు కలుగుట
చిత్తములన్ వేంకటేశు జత్తము చేర్చన్
నెత్తములన్ బాలెమ్మును
పొత్తములను వ్రాయ వచ్చు బో మీ ప్రశ్నన్

(108వ అవధానము - పాలెం)

పర్ణ, వర్ణ, కర్ణ, జీర్ణ, భారతార్థములో, గీతము

ధ్వజముపై నిల్చెనేడు సువర్ణమూర్తి
వాహనంబున నుండి సౌపర్ణరథుడు
కర్ణ పర్వ మౌ నీవిషాదార్ణవంబు
మునుగు నా జీర్ణమతిని బ్రోవుము మురారి!
సౌపర్ణరథుడు=గరుడవాహనుడు(కృష్ణుడు)
సువర్ణమూర్తి = హనుమంతుడు

(109వ అవధానము - రిమ్మనగోడు)

వేదము, వాదము, నాదము, పాదము త్యాగరాజు గూర్చి ఉత్పలములో

వేదము నాగ గానము సువిశ్రుతమయ్యెడు, లోకమంతటన్

వాదములేదు దీన, జన వర్గము మెచ్చెడు శాస్త్రమాటచే
నాదము నమ్మి త్యాగయ జన ప్రియు డయ్యెడు, కాని లోపలిన్
బాదము గాని వాడతని పాడని వాడొకడుండునే ధరన్

(110వ అవధానము - ఖమ్మం)

గరిష్ఠ, వరిష్ఠ, ఘనిష్ఠ, కనిష్ఠ, నరసింహస్వామి యజమానిని ఆశీర్వదించుట

వినయ గరిష్ఠ వృత్తి, తమ విత్తము విత్తము లందు బంచి, స
జ్జని సఫలంబుగాక సుయశంబు వరిష్ఠత గోరు వేంకటే
శునికి ఘనిష్ఠసంపద విశుద్ధ గుణంబు నృసింహు డిచ్చుతన్
తనియక నిష్ఠ షష్టిసమ తత్వమెరింగినవాడు గావునన్

(112వ అవధానము - సిద్ధిపేట)

గోల కొండ, శాలి బండ, బాల కొండ, పూల దండ, హైదరాబాదును వర్ణించాలి.

ఎక్కడి గోల? కొండ పయి యెంకయ, వీధులు చూడ వింతలే
చిక్కెడు క్యూలలో బ్రతుకు జీర్ణముగా నయశాలి, బండయై
సొక్కెడు బాలకాండము విశుద్ధమనంబు పరీక్ష లేగినన్
చిక్కని దత్పదంబులను జెక్కుల వ్రేలెడు పూలదండలౌ

(113వ అవధానము - హైదరాబాదు, రవీంద్రభారతి)

మొర, కర, ధర, మురి, నేటి భారతదేశ స్థితి చంపకములో

మొర వినువాడు లేడు హితమున్ బచరించెడువాడు లేడు, న
క్కర వడ నప్పులే మిగిలె, గష్టము దెచ్చెను వాడు చిక్కులి
ద్ధరలను వృద్ధి దప్పదు సదాశయమంచు దలంచ డియ్యెడన్
మురళికి రంధ్రముల్ సలుపమో, మననేతలవాక్కు లిట్లగున్

(114వ అవధానము - కేంద్రవిశ్వవిద్యాలయం)

**వనము, జనము, ధనము, మనము భారతార్థము**

వనమున్న చోట వెదకుచు
జనమున్నగుపించ నోలి చచ్చె నొకండున్
ధనమున్న దనగ నిధనము
మనమున్నతి గోర గలిగె మాకిలకృష్ణా!

(115వ అవధానము - సిద్ధిపేట)

**వరి, గురి, బరి, సిరి, కందింఝలను వర్ణించాలి**

వరియన్న మెంతదిన్నను
గురియౌనే కందిపోవ గుర్తుందు గదే
బరినీవులేక బోనము
సిరియే మాకందిరావె శ్రీమంతు డనన్

(116వ అవధానము - సిద్ధిపేట)

**సిరంజి, ఇంజక్షన్, టానిక్కు, టాబ్లెట్లు, భారతార్థంలో**

వాసి రంజల గృష్ణుని పాత్ర దనరె
తీర మింజక్షను శకుని దీటుగలరె?
కటకటా!నిక్కు రారాజు గతిని జూడ
అటనటాబ్లెట్లు భారత మటవి కలిసె

(117వ అవధానము - అచ్చంపేట)

**క్రికెట్లు, వికెట్లు, జాకెట్లు, రాకెట్లు రామకథ శార్దూలంలో**

బాధన్ జెప్పదు జక్రి కెట్లులని తోబాటేగు దెంచెంగదా!
నాథా! రాక్షసుత్రో వికెట్లు జనునో? నాముక్తి నీశక్తియే
సాధింపన్వలె నీవు తప్పకను రాజాకెట్లు రాణించుగా
నీధర్మంబునెఱుంగవో యశమురాకెట్లుండునో నాయకా !

(118వ అవధానము - చందానగర్)

అంగము, లింగము, భంగము, రంగము, రామాయణం, భారత భాగవతాలను స్పృశిస్తు నాయకుల కూర్పి

చెదిరిన సేనలో గలుగు చిత్రము జూడ దదంగముల్ మహా
పదలకు విస్ఫులింగములు భారత భాగవతాంతరంగముల్
పదనుగ రాము పేర దగు భక్తి యభంగము, నేతృమానసా
స్పద విపరీత ధోరణులు సాధ్యము దూరమొనర్చు రంగముల్

(119వ అవధానము - దొంగల ధర్మారం)

బొమ్మ, నిమ్మ, కొమ్మ, అమ్మ, స్వార్థభంగంతో రామకథ

అమ్మహనీయు నుంగరమునంది కపీశ్వరు డెల్ల చోటులన్
బొమ్మన సీతకై వెదుక బోయి పయోనిధి దాటి లంకలో
గొమ్మలతో విచారమున గూరు మహీజ దశాస్యుమాటలన్
నిమ్మకునీర మెత్తినటు నిల్చి సహించెడు నాంజనేయుడున్

(120వ అవధానము - మచిలీపట్నం)

జయసుధ, జయప్రద, విజయశాంతి, జయమాలిని, వీనితో గీతోపదేశము చేయుట

జయ సుధ ద్రావు యోగము విషణ్ణతతో గలుగంగ బోదు ని
శ్చయముగ శత్రుమర్దనము సర్వజయప్రద మౌచు గ్రాలెడున్
స్వయముగస్వాంతము న్విజయ! శాంతిని బొందుమ బాంధవాహవ
మ్మయిన సహాయ మే నుభయమా? జయమాలిని నీకు గల్గెడున్

(121వ అవధానము - హైదరాబాదు)

అప్పు, నిప్పు,ముప్పు, చెప్పు ద్రౌపది కీచకుని మందలించుట

కామము భావ్యమే పతులు గానని యప్పుడు ధర్మపద్ధతిన్
బోమహిమెచ్చు గీచక! విభుత్వము కద్దని హద్దుమీరినన్
సేమపు నిప్పులై తుదకు జేర్చును ముప్పుల గాక గాలమే
యేమరునే? పతుల్గనిన నింకను జెప్పుట చిక్కకుండుగా

(122వ అవధానము - సిద్ధిపేట)

**అల్లము, బెల్లము, తెల్లము, ఉల్లము సరస్వతి వర్ణన**

బెల్లము దయలో నిండెడు
నల్లము కోపమున దోచునన బాసరలో
దెల్లము భక్తి సలుపగా
నుల్లము పల్లవిత మగుట యుర్వినిజంబౌ

(123వ అవధానము - ఘనపూర్)

**రుమేనియా, మలేరియా, సోమాలియా, సడేమియా, కుటుంబనియంత్రణ, గీత పద్యంలో**

మీరుమేని యార్తి దెలియలేరు గనుక
భామలేరి?యా ప్రసవాబ్ధి పార మెరుగ
ఇక సడేమియా నన్న జీవిక ఫలంబె?
కనుడు సోమాలి యాకాశ గరిమ మించ

(124వ అవధానము - చేర్యాల)

**క్రోతి, నాతి, నీతి, నేత - ఉత్పలంలో భారతార్థం**

క్రోతికి దమ్ముడందురు. వికుంఠిత బాహు పరాక్రమమ్ములన్
నీతికి బోల్కిగా మసలి నీవు రహించెద వంచు నెంచితిన్
నాతికఠోరదీక్ష జనానాథుని దృష్టికి దే వృథాయగున్
నేత నటంచు గీచకుడు నీల్గెడు భీమత జూపు మెమ్మెయిన్

(125వ అవధానము - బచ్చన్నపేట)

**కష్టకాల, నష్టకాల, దృష్టికాల, అష్టకాల, శ్రీపి. వి. నరసింహా రావు గారి పరిపాలన గూర్చి**

పోయిన కష్ట కాలమును మోదము గూర్చెదు నెప్పుడైన ద్ర
వ్యాయతి నష్టకాలమని యార్థిక సంస్కరణాభిలాషియై
రాయిడి, దృష్టి కాలమెసలారగ బీ.వి.ప్రధాన మంత్రియై
చేయు సమర్థ పాలనము చెప్పగ గల్గునె అష్టకాల యున్

(126వ అవధానము - సికిందరాబాదు)

రంభ, దంభ, శుంభ, గుంభ, రామాయణార్థం

వచ్చెను రంభగా వలచి భామిని రాముని చెంత కంతకున్
జొచ్చుచు శుంభదాకృతి విశుద్ధను సీతను మ్రింగబోవు, దా
ముచ్చట దీర్చు దమ్ముడని పూని యదంభత నచ్చజెప్పచున్
మచ్చిక వ్రాసె వీపున సుమా! తగుశిక్షను గుంభనంబుగా

(127వ అవధానము - చేగుంట)

దీపక్, శాంతి, సంధ్య, ఓడియన్, నెహ్రూజన్మదినాన్ని పురస్కరించుకొని ఉత్పలమాల

దీపకుమారి చీకటుల దేకువ దోలువిధాన, జహ్వారుం
దోపిక బానిసత్వమున నొప్పెడు భారతి శాంతి గూర్చగా
బైపయి సంధ్య తేజముల భాసిల గోరగ బూని నేటి నే
త్రాపసదుల్ మహత్వముల నందిన ఓడియనిన్ దలంచరే

(128వ అవధానము - హైదరాబాదు)

జాతి, నీతి, బూతు, రోత, శ్రీవిజయసారథిగారి ఆశయం

జాతి హిత మాత్మ నెంచియు
నీతికి నెలవైన రీతి నెగడుజగంబున్
రోతల గత నిస్వార్థము
ఖ్యాతిన్ గను బూతు లేని గరిమ గురుండున్

రో = ధనము (129వ అవధానము - కరీంనగర్)

జయ, మమత, సోనియా, మాయ, భాగవతార్థము

జయ జనియించి లోకముల జాలగూ లీలలు జూపి యందు
గూర్మియయిన పుత్రుడై మమత మించ నిశాచరపీడబాసి, దు
ర్జయతర సోనియమ్య గతి చాలగ దద్ద్వజపాళి నేలుచున్
జయమును బెంచె మాయలను సాధుల బాధల దీర్చు చిద్ధరన్

(130వ అవధానము - కోదాడ)

కార్గిల్, జైస్వాల్, అగర్వాల్, వర్మాల్
గంగావతరణము శార్దూలములో
కార్గిల్ చిన్నది. మంచుకొండలను గంగాదేవిదూకంగ దు
ర్మార్గంబైనను రాళ్లపై దొరల సంపర్మాలు సుళ్లందగా
భర్గల్ సాగరువాలు త్రోపిడికి జైస్వాలొప్ప భూభాగమున్
స్వర్గమ్మున్ బొనరించుగా వివిధ సస్యశ్రేణి పండించుచున్.
గంగపుట్టిన కొండలకు గర్వాలు కొండలని పేరు
(133వ అవధానము - సిద్ధిపేట)

అంబరము, నంబరము, బంభరము, డంబరము, ఎన్నికలపై
ప్రజల స్పందనను బట్టి నాయకుల మనస్థితి
అంబర మౌనొతుష్టి? ప్రజలందరు మెచ్చగ లేకపోయినన్
సంబర మందు వారు విలసన్నవ రాగము పాడు చుండగా
బంభరముల్ విచిత్ర గతి పాడుట దోచును జూడ నేతలా
డంబరముల్ నశించ నికటంబున దేలును దధ్భవిష్యముల్
(134వ అవధానము - సిరిసిల్ల)

రంభ, సౌందర్య, రమ్యకృష్ణ, రాశి, ఉగాది గూర్చి తే.గీ.తో
ఆమనికి నేడు నారంభమైనదినము
ప్రకృతిసౌందర్య రాశిగా బరిఢవిల్లు
రమ్యకృష్ణావతారంబు రాగిలు గతి
మహిత సుఖరాశితో విక్రమంబు వెలుగు
విక్రమంబు = విక్రమ సంవత్సరము
(135వ అవధానము - సిద్ధిపేట)

**కొండ, బండ, చండ, తండ, స్వార్థభంగముతో మాయలేడి కానున్న మారీచుని గూర్చి**

తండములౌ మహోఘముల ధారుణివేదన గూర్చు వానికై
దండయ కారణమ్ముగ నెదం గుదిబండగ వంచనాకృతిన్
కొండొక తీరు రాఘవుని కోల మృతిన్ గనుభాగ్యమబ్బె బై
చండత గాథలో మలుపు సల్పుట దప్పనిదయ్యె నాకిలన్

**(136వ అవధానము - వరంగలు)**

**మదారు, శిలారు, కరీము, సలీము, రాముని దర్శించిన శబరి గూర్చి**

రామ! దారుణవనిలోన రాకకొఱకు
ఏ శిలారుచి కెంతయో ఎదురుచూచి
శుభకరీముహూర్తము నేడు సూర్యవంశ్య!
ఆస లీముదుసలికి విశ్వాసమయ్యె

**(137వ అవధానము - ఒంగోలు)**

**సువర్ణము, పైరుపచ్చ, ధాన్యరాశి, సుభిక్షము - నేటి కరువు**

పాపము మించి పోయెనా? సువర్ణము తీవ్రత సన్నగిల్లెనో
తాపము నిండి మండుచును, ధారుణి జూడము పైరుపచ్చలున్
ఏపున ధాన్యరాశి ఎటులేర్పడు నింద్ర! ఇదేమి చంద్ర బా
బేపని యెట్లు సేయును సుభిక్షము లేనిది అప్పు దెచ్చుచున్

**(138వ అవధానము - అనంతపురం)**

**బేరా, కారా, చేరా, మీరా, ఇవి ప్రసిద్ధకవుల సంక్షిప్తనామాలు నేటి సాహిత్యపు తీరుతెన్నులు**

ఏరాజన్యులు పెంచిరంచి రసం బేరాజు లేమెంచిరో ?
ధీరత్వమ్మున మించె సాహితి సుపృథ్విన్ శ్రీ సకారార్థమై
చీరన్ జిన్గుల బోని పెక్కిజములున్ జేరాతలై పోయె సు
మ్మీ! రాజిల్లెడు పద్యవిద్య భవితన్ మీరాన చెందందగున్

**(139వ అవధానము - విశాఖ)**

**తండ, కండ, బండ, అండ, సీతాకల్యాణం, ఉత్పలమాల**

కండగలట్టివారు శివ కాండ గతి న్విరువంగ వచ్చి రు
త్తండముగా నృపుల్ కరము తాల్పగ లేక బతత్యులైనచో
అండజ వాహమూర్తి వినయంబున రాముడు నెక్కువెట్టె నా
బండగు వింటి సీతను వివాహము గూర్చెను దంద్రియానతిన్

(140వ అవధానము - హనుమకొండ)

**వేదము, మోదము, స్వేదము, నాదము, పొట్టిశ్రీరాములు గారి త్యాగనిరతి**

నేతలు చెప్పువేదమున నీతులకుం గొదవుండు నయ్య! ము
న్నేతగు రీతి మోదమున నింగితమున్విడి చెప్పబూనరే
జాతికి మేలు గోరుకొని సర్వము స్వేదము ధారవోసె, మా
నేతను వామనుం డనుట నీతియై నాదము నిండు రీతిగన్

(141 - తెలుగు విశ్వ విద్యాలయం - హైదరాబాదు)

**ద్విజుడు, భుజుడు, ధ్వజుడు, కుజుడు, ప్రవరునికథ**

ప్రజనిత మోదముం ద్విజుడు పర్వత పంక్తిని జూడ గోరి, భూ
భుజుడుగ సాధ్యమంచనగ పోకిరి సిద్ధు డొసంగు లేపమున్
నిజముగ బన్నగ ధ్వజుడు నివ్వెర గందగ బల్కుతీరు నా
కుజుడును విన్న వోవ గథ గూర్చెను వ్యాసుడు శ్రేష్ఠతాగతిన్

(142వ అవధానము - చిన్నకోడూరు)



# వరవర్ణిని

**ఈ సభ - ఇంద్ర సభ**

గౌరవ పీఠముం దరిసి కమ్మని సత్కళ లెల్ల మించగా
ధీర మనస్క వర్యులు నుతించగ బెంపును మీరుచుండగా
గోరినరీతి దీర్చుకొను కోవిదు లుండగ శారదా మనః
పూరము మీరె నీసభయు బొల్పుగ నాకము నాకు నియ్యెడన్

**(1వ అవధానము - నారాయణఖేడ్)**

**మీమెడలోని పూలమాల - మత్తేభము**

సకలమ్మైన పరిశ్రమన్ విపుల చర్చన్ నేర్పు మార్గమ్ము మం
జుకళా దివ్య వికాసభాసురములౌ సూనమ్ములందెచ్చి మా
లికగా దోరముగా నమర్చి తను వల్లి న్వేయ శోభిల్లుచున్
సకల ప్రీతిగ బండితాదర సమస్యా పూరకం బయ్యెడిన్

**(2వ అవధానము - భువనగిరి)**

**కవికి బ్రహ్మకు అభేదము చెప్పుతూ, కవి సృష్టి బ్రహ్మసృష్టికంటె విలక్షణ మైనదని మత్తేభములో...**

చతురాస్యుండు నమేయ సర్జనకళాసంపన్ను డర్థప్రియుం
డతిలోక స్థితి భూతకల్పన మహావ్యాసంగు డార్యుండు ప్ర
స్తుతి కెక్కుంగ విధాత, భేద మొకటే స్తుత్యంబు కల్పాంతమే
మితియౌ వానికి శాశ్వతత్వ కలనన్ మించుం గవిత్వ క్రియల్

**(3వ అవధానము - సిద్దిపేట)**

పృచ్ఛకులు : శ్రీదేశపతి గోపాలకృష్ణ శర్మ.ఇతడు చక్కని కవి కాని మానసికముగా కొంత అస్తిమితము గలవాడు: అందమైన ఈప్రశ్నవేసి పూరణకు మంచి అవకాశము కల్పించినాడు. ఇందు

సగభాగము అభేదరూపకములోను మిగిలినది శ్లేషతోను పూరించుట జరిగినది.

బ్రహ్మపరముగా : చతురాస్యుండు = నాలుగు ముఖములు గలవాడు, అమేయం = సాటిలేని, సర్జనకళా సంపన్నుడు = సృష్టికళలో సంపన్నుడైనవాడు = (సృజన భావము సర్జనము) అర్థ ప్రియుడు = ప్రయోజనాపేక్ష గలవాడు. ప్రతి సృష్టికిని ఒక ప్రయోజనము కలవాడు, బ్రహ్మసృష్టిలో అప్రయోజనక రమైనది ఏదీ లేదని భావము: అతిలోక స్థితి = ప్రళయంపు తర్వాత : భూత = భూతములను భూతకాలములోని,కల్పన = కల్పించునట్టి : మహావ్యాసంగుడు= నిరంతర కార్య శీలి, ఆర్యుడు = పితామహుండుగా సర్వ దేవతలతో నుతింపబడువాడు, విధాత=బ్రహ్మ ప్రస్తుతి కెక్కుంగ=వినుతికెక్కును గదా! " ధాతా యధా పూర్వ మకల్పయత్ " వేద ప్రమాణము కలదు.

కవిపరముగా :- చతుర+ఆస్యుడు=చమత్కారవంతమైన నోరు కలవాడు : నోరుతెరిస్తే చమత్కారములు గలవాడనుట, అమేయ సర్జనకళా సంపన్నుడు = కావ్య రచన సాటిలేనిదిగా జేయు వాడు, అర్థప్రియుండు=తను వాడిన పదాలకు మంచి అర్థమును ప్రకటించ నిచ్చు గలవాడు. ధనాపేక్షగలవాడు, అతిలోక స్థితి=కావ్య ప్రపంచమున, భూత=ప్రాణులను, కల్పన=కల్పించుట యందు, మహావ్యాసంగుడు= పనిగా గలిగినవాడు, అనగా కావ్యమున సకల భూతములచే మాటాడించి ఆశ్చర్య పరచువాడు, ఆర్యుడు = గౌరవనీయుడు, కవిధాత=కవిబ్రహ్మ ప్రస్తుతికెక్కున్=కీర్తి పొందును. భేదము ఒక్కటే వీరి మధ్యలోకలదు. బ్రహ్మ పాతసృష్టినే చేయగలడు. కల్పాంతమే మితి యౌ వానికి = బ్రహ్మ సృష్టికి కల్పాంతము అను ప్రళయము కలదు. కల్ప=కొద్ది కాలము లోనే, అంతము = నశించుట అను మితి కలదు. కాని కవి సృష్టియగు కవిత్వ క్రియలు శాశ్వతములుగా మించును. అనగా బ్రహ్మ సృష్టించిన కవి మరణించు చున్నాడు, కవి సృష్టించిన కావ్యములు శాశ్వతముగా నిలుచు చున్నవి అని ఉత్ప్రేక్ష, ఈపద్యము అవధానములలో 3వది యైనను

మకుటాయమానముగా నిలిచినది.

దీని కారణముననే ఈ యవధానముననే అవధాని శిరోమణి అను బిరుదమును సంపాదించి పెట్టినది. అవధానములోను రసవత్పద్యముల కవకాశము కలదనుట కీ పద్య ముదాహరణ కాదా!

పాంచాలి పంచ భర్తృక యైనవిధము-సీసము

అమ్మరో! మేము ఫలమ్మొకండు తెచ్చితి
మెటుల పంచెదవొ నీకెఱుక అమ్మ!
చిన్న వాడైనను చెలగి సంపాదించి
మన్నన నిచ్చె బెద్దన్న ననుచు
పక్షపాతము నీకు వరలునే మాతల్లి!
పంచి యిచ్చిన ధర్మ బాధ ఏమొ?
నావిని కుంతి మీరన్న ఫలంబేది
ఏమి ఈ కాంతయా? ఎంతమాట?
వ్యాసు నడిగి మీర లావల నడువుడీ
నాగ బూర్వ జన్మమందు నీమె
కుష్ఠు భర్త బాసి కోరెను బతినేను
మార్ల నంగ నామె మనువు గొనిరి
పాంచాలి పూర్వజన్మవృత్తాంత మిట సూచింపబడినది

(40వ అవధానము - హైదరాబాదు)

శ్రీరామ నవమి నాటి సీతా కల్యాణవు బందిరిని చంపకమాలలో

చివురుల చిన్నెలుం దొలుక చెన్నల రారెడు చెట్ల కొమ్మలన్
సవురుగ దెచ్చి కంబముల చక్కి నమర్చిన బెళ్లి సందడుల్
చవు లలరార రామునకు జానకి కీయెడ బెండ్లి సేయగా
భువి వెలు గొందె నీ స్థలము పుణ్యపదంబున కాటపట్టుగాన్

(5వ అవధానము - మాసాయిపేట)

**కౌరవులు-అవినీతి. కర్ణుడు - పన్నులు కట్టువాడు, పాండవులు పెరుగుతున్న ధరలు; ధర్మదేవత - సామాన్యుడు అనివచ్చునట్లుగా భారతస్థితి మత్తేభములో్ - పృచ్ఛకులు శ్రీదేశపతిగోపాలకృష్ణ శర్మ**

ఇది చిత్ర మ్మసుదాన మిచ్చె గర మెంతేన్ మిత్రుకై కర్ణుడున్
ముదితన్ దుఃఖిత జేసి పీడుట కురుండున్ దుర్వినీతుండయెన్
మదిలోన న్వెల మీరు బాధ్యతల సంభావించుచున్ బాండవుల్
తుది సామాన్యత ధర్మదేవతయు నెంతున్ భారత మ్మిట్టులన్
కరము=పన్ను, వెలమీఱుట=అధిక ధరలు, కురుడు=దుర్యోధనుడు

**(6వ అవధానము - సిద్ధిపేట)**

**మడుగున దాగిన దుర్యోధనుని దూషిస్తున్న భీముని గూర్చి శార్దూలము**

ఔరా! ఎంతటి సాహసుండ వురు ద్రోణాచార్యు శిష్యుండవై
పేరున్వంశమునందు నిల్పుదని యుర్వీశుండు కాంక్షింపగా
వీరావేశము డక్కి యిక్కొలనికిన్ విచ్చేసి యున్నావె? యో
భీరూ! దుష్ట సుయోధనా! నిలుపు దుర్వి న్నిన్ను భ్రమందించుచున్

**(7వ అవధానము - మెదకు)**

**కృత్యాద్యవస్థ - శార్దూలంలో**

నాకుం గల్గిన శక్తి గూర్చియు మహానందమ్ముగా నిల్చి చీ
కాకుల్ డుల్చి మహాద్భుతం బయిన సత్కావ్యంబు నిర్మింపగా
నాకావ్యంబు మొదల్ తుదల్ దెలిసి దీవ్య ద్దీక్ష నారంభమున్
లోకోద్ధారము నెంచి చేసెదను లోలో నుబ్బి తబ్బిబ్బు గన్

**(8వ అవధానము - సిద్ధిపేట)**

**అవధాన సభావర్ణన - ఉత్పలములో**

ఎన్నడు జూడ బోనిది సుమీ! యిట కిందుల పాలమాకులన్
విన్నది గాదు, నేడిట గవిప్రవరుల్ చనుదెంతు రంట, సం
పన్నత బ్రక్కవా రెవరొవచ్చి వధానము సేతురంట, మా
కన్నుల కర్వుదీఱ గుతుకంబున విందు మటంచు వత్తురే!

**(9వ అవధానము - పాలమాకుల)**

**పృచ్ఛకుల పేర్లు వచ్చు నట్లుగా అవధానసభను మత్తేభంలో**

అరయన్ శ్రీరఘురామశాస్త్రి సభలో నధ్యక్షుడై వెల్గ మె
ప్పు రహింపంగను వేణు మెట్టు రఘురాముల్ విశ్వరామేశ్వరుల్
ధర మేల్పృచ్ఛకులై యెసంగగను సీతారాము వ్యస్తాక్షరిన్
వరలుంగా నవధాన సత్సభ యశోవంతంబుగా నియ్యెడన్

**(10వ అవధానము - మాసాయి పేట)**

**కార్తి కోత్సవమును ఉత్పలమాలలో**

శ్రీవిలసిల్లు సుందర పరిస్థితు లొక్కెడ గూడి మాడి రా
దేవళ మేర్పరించి ప్రణుతింగను విఠలు బాదుకొల్ప శ్ర
ద్ధావిధి కార్తి కోత్సవ విధానము జేసెడు నీపురీప్రజన్
భావము నందు మెచ్చెదను పంకజలోచను భక్తులందఱన్

**(12వ అవధానము - మాసాయిపేట)**

**ఇంతికి, చేమంతికి సంబంధము చెబుతూ హేమంతాన్ని వర్ణించాలి**

ఇంతనరానికౌతుకము నెల్లెడ నిండగ గర్భకాల సీ
మంతము పూర్ణమై విరియ మంపెసగెన్ దగు నింతిజూడ జే
మంతినిగా రహించె వినుమా ప్రియమిత్రమ! ఏలనీకు హే
మంతపు భీతి సత్కవిత మాటున ఈచలి దాగిపోవదే?

**(13వ అవధానము - సిద్ధిపేట)**

**రిపబ్లిక్ దినము గూర్చి సామాన్యుని ఆలోచన చంపకమాల**

వడివడి లేచినారు గద బాలురు సూర్యుని కన్న మున్నె వెం
బడి బడి వేగ కూడి పురవాసులు మెచ్చ నుపన్య సించి రి
బ్బడిగ నదేమిటో ప్రగతి బాగుగ నాయెనటంచు వారినే
నడిగెద! మాకు నా ప్రగతి యందదు కారణమేమి చెప్పరే!

(14వ అవధానము - జగదేవపురం)

**శ్రీ డింగరి నరసింహాచార్యులను బోషించ దేవుని వేడుట**

డింగరి నారసింహు డొక డింభకు గోరి సమస్త పూజలున్
డింగిళులం బొనర్చి నిబిడీకృత సాత్విక వేదనావధిన్
భంగ మొనర్చగా దలచి బాలరవి ప్రభుడైన 'వంశి' ను
త్సంగము జేర్చె, కచ్చగొను దైవము శాస్త్రము చేత గెల్చె, నీ
డింగరి నింక బ్రోవదగడే యని వేడెద మా సరస్వతిన్

(15వ అవధానము - సిద్ధిపేట)

**ఉత్పలమాలలో సీతారామ కల్యాణము**

లోకము నందు వారల ప్రలోభము లెల్లెడ దోచునట్లుగా
జోకుచు బిల్ల వారల విసుంగు నిరాశల ముంచి ముంచి చీ
కాకయి దైవతోత్సవనికాయమునన్ మది దృప్తి సెందగా
లోకులు జానకీ ధవునిలో గను చుందురు పెండ్లి వేడుకల్.

(16వ అవధానము - సీతారామాశ్రమము, మాసాయిపేట)

**శ్రీరాముని పొన్న సేవను వర్ణించాలి**

ఇది శ్రీరామ నవమ్యనూన మహిమో పేతోత్సవం బిందు న
భ్యుదయం బెంచి యొనర్చు పూజలను మెప్పం బొంది కల్యాణసం
పదచే బొంగుచు బొన్నసేవ పయి బ్రోవన్వచ్చె మీవాడకున్
మది యుప్పొంగగ మంగళారతులతో మర్యాద చూపింపరే

(17వ అవధానము - కొండపాక)

<u>శ్రీశైలం, శోభ అనువారి పెండ్లికి శ్రీశైలశోభ కలిగించాలి</u>

దాశార్హాత్మ సరోజ భృంగమునకున్ దాపేద్ది? మల్లేశు భ
క్త్యాశాపాశ నిబంధనార్థితము, లింగైకాత్మజానీక వి
శ్వేశప్రీతి, సమస్త మస్తక తలా విష్కారమై యొప్ప నీ
శ్రీశైల ప్రభ శోభ మించెడును లక్ష్మీ భోగమై యుర్వరన్

(13వ అవధానము - లింగారెడ్డివల్లి)

<u>నాయకులకు - వినాయకునకు సామ్యము చంపకములో</u>

తొలుతట పూజ, అపిదప దొల్లిటికిన్ మతి మాలియుంట వే
యలసట యల్ప వాహనత, అందిన దానిని ఆహరించుటల్
గల కర జీవనుల్ జన నికాయ సమస్తత విఘ్న కారకుల్
వెలుగ వినాయ కుల్ జన వివేకము పెంతురు భావికాలమున్

(19వ అవధానము - సిద్దిపేట)

<u>వివాహ సమయమున విధవావేదన</u>

చిననాడేమిటి చేసిరో తెలియ వచ్చెం గాలుడై భర్త మె
చ్చిన దానన్ భవమందు మందతను దోచెన్ జీవితంబంధు నా
తనయం బెండిలి యందు జూచుట నిషిద్ధంబందు రేమందు మో
మున నొక్కింతయు గుంకుమంబు తొలగన్ మూడెన్గదా యీగతుల్

(20వ అవధానము - సిద్దిపేట)

<u>సభావర్ణన</u>

సరసులు పండితోత్తములు చాతురి మన్మహనీయ మూర్తు లి
ద్ధరసపిపాసు లూర్జితవదాన్యులు ధన్యులు శాస్త్రపారగుల్
వరలెడు నీ సభాస్థలిని భాసురతాష్టవధానధీరతా
పరిచితి సేయ గల్గు టది భాగ్యము నాయెడ సభ్యు లొప్పగన్

(21వ అవధానము - హైదరాబాదు)

**జీవితము ఒక లాటరీ - ఉత్పలమాల**

పుట్టిన దాదిగా బ్రతుకు పోకడ, విద్యల వెన్ని నేర్చినన్
గట్టిగ జీవనంపు గతి కాంత యదెట్టిదొ? సంతు సంగతిన్
కట్టెడిబ్రహ్మవ్రాలు పయి గట్టిగ నమ్మక ముంచు జీవనం
బిట్టిది చూడ లాటరియె ఎవ్వరికేది లభించునోకదా?

**(22వ అవధానము - సిద్ధిపేట)**

**బ్రాహ్మణ సభా వార్షికోత్సవలక్ష్యము**

పండిత మండనం బయిన బ్రాహ్మణ సంఘపువార్షి కోత్సవం
బెండిన విప్ర మానస మహీస్థలి నైక్యరసప్రవృత్తితో
బండగ జేయు భావి నభివర్ధన నార్థిక సస్య శక్తులన్
మెండుగ బట్టు బట్టగను మేలు ధరా స్థలి చింతయేటికిన్

**(23వ అవధానము - నిజామాబాదు)**

**భావిపాఠశాలల పిల్లలకు బోధ-ఉత్పలమాలలో**

నాకవితా సరస్వతికి నాణ్యత కిమ్ముగ బాఠశాలలే
లోకము లెట్టి పెద్దలు నిరూఢసుబోధలు చేయగాని చీ
కాకులు లేక విద్దె కొసగాంచి సువృత్తిని భారతీయతా
ధీకలితాత్మ తృప్తి విడదీయని జీవిత మింక జాలదే?

**(24వ అవధానము - పటంచెరువు)**

**మాటల దేవిని - మూటల దేవిని ఉత్పలమాలలో**

శ్రీసముదాయదాయిని, వశీకృతలోక విధాయినిన్ మనో
ల్లాసము గూర్చు మాతను దలంచెద భక్తిని వాగ్విలాస స
ద్వాసన నర్థ సిద్ధి నెడ బాయక యుండగ జాడు, మంబికా!
భాసిత వాగ్విలాసిని శుభప్రద శ్రీప్రద భక్త కోటికిన్

**(25వ అవధానము - వేముల వాడ)**

మిరెవు మర - కందము

భరియింపరాని ఘాటును
గొరుకుడు వడనట్టి మంటకుంబెదురక జిం
దర వందరగా జేయును
మిరియపుమర లూర గాయ మేల్తరుణమునన్

(26వ అవధానము - బోధన్)

ప్రతిపక్షము బలముగా నున్న అసెంబ్లీతో
పోలున్చూ కిష్కింధను శార్దూలంలో వర్ణించాలి

శూరత్వంబొకయింత లేకయు మరు త్సూనాచ్ఛ భల్లాది దో
ర్వీరు ల్డోడుగ నుండ గోత్రగతుడై భీరుండు సుగ్రీవు డా
శ్రీరాముండును గూడి రాగ దలపోసెన్ నాతి విద్వి ట్ప్రల
శ్రీరంజిల్లెడు చెన్నపట్టణ పసెంబ్లీ తోచె వాత్సల్యమున్
భక్తవత్సలం ముఖ్యమంత్రిగా నున్న మదరాసు అసెంబ్లీ గూర్చి

(27వ అవధానము - వర్గల్)

సంస్కృతానికి మంచి భవిష్యత్తు రావాలని దేవుని ప్రార్థించండి

ఇలగల బాసలన్నిటికి నెంచగ దల్లియ సంస్కృతంబు, పొం
తలగల బాసల న్గలియ నచ్చక యే మృతభాష బేరునన్
బిలువగ జట్టులందరకు బెల్చగ దోచు నధీతి బో ధలన్
వెలయ వినాయకా! భవిత వెల్గగ జూడుమ పూజసేసెదన్

(28వ అవధానము - వేములవాడ)

ఆకాశాన్నంటే  ధరలలో వినాయకోత్సవాలు నిర్వహించుట గూర్చి

కానకగన్న పెన్నిధిగ గన్పడు నంగడియందు వస్తువుల్
మానక చేయగా వలయు మా గణనాథుని యుత్సవంబులున్
దానము సేయ బోవు తరి దా దినక స్సమకూర్చ నీతి యన్
ధీనిధి వాక్కుల న్వాని నుతింపగ జేసెద మెట్టెటోయటుల్

(29వ అవధానము - సిద్దిపేట)

ఈ రోజును వర్ణించండి

సమ దుర్మతి అశ్విన మా
సమ శుద్ధచతుర్థి లోవిశాఖర్క్ష ము సా
యమునకు సాయంకాలము
క్రమముగ నవధాన మయ్యె గామారెడ్డిన్

(30వ అవధానము - కామారెడ్డి)

కల్యాణ వేదికకు వెళ్తు చున్ననవవధూవరుల హావభావాలు

చేసిన పుణ్య సత్ఫలముచే హృదయంబున నచ్చువాడు, వి
చ్చేసె మగండు నావనిత చింతిలు, నాతడు పూర్వజన్మలో
జేసిన జన్మమేమొ? సతి శీలవతీ మణి పెండ్లి యాడు నా
వ్రాసిన వ్రాత తెల్యగను రాదు సుమా! యని గుండు చుండెడున్

(31వ అవధానము - గోదావరిఖని)

(ఆం.ప్ర.ముఖ్యమంత్రి రజతోత్సవ కృత్యము. ఉత్పలము)

ఎన్నడొ వేరు వేరయిన ఈ తెలుగుంబ్రజలంద రేకమై
యున్నది పంచవింశతి సమోత్సవమున్ మన ముఖ్యమంత్రి అం
జన్న అనేకదానములు నందర దృష్టుల జేయ జూచెగా
కన్నిట మాటలే మిగిలె నర్థము సార్థక మౌట యెన్నడో?

(32వ అవధానము - రామచంద్రాపురం)

ప్ర.ఉ. కమలాకరరావును గూర్చి చంపకము

పరిచయమైన మాత్రపరభావము గుర్తెరుగంగరాదు. సె
బ్బరలను బల్కినన్ గవుల వాక్యము తప్పదు, పండితాళిపై
గురుతర గౌరవంబుగల కోవిదుడంచు దలంచెదన్మదిన్
అరయగ నింత కన్న గమలాకర రావును నేనెరుంగ సూ

(33వ అవధానము - భెల్)

<u>సమితి అధ్యక్షుడు శ్రీసదాశివరెడ్డివిద్యామంత్రియైన</u>
<u>మనవిద్యాస్థితి ఏవద్యమైన సరే</u>

శ్రీ సదాశివరెడ్డి చెలగె విద్యామంత్రి
పదవిపై నాయొక్కభాగ్యగరిమ
బీడివో నటరాజు వెలిగె విద్యాశాఖ
నధికారి యౌచిల నబ్రమంద
అవధానకళకు దివ్యాశ్రయమ్ము లభించు
గవులకు సభలలోగౌరవంబు
ఛాత్రులు బడులలో సర్వసౌకర్యముల్
పడిసివిద్యా వృద్ధి వరల గలరు
కోరి పంతుళ్లు గురువులై మీరగలరు
నాకు గల వచ్చె - నిజమైన నాముదంబు
చెప్పగాలేను గవితలో జేటు బ్రహ్మ
ఎవరికోరిక సాగగా నిచ్చెనయ్య!

**(34వ అవధానము - పటంచెరువు)**

<u>రోడ్డుమీద జచ్చి పడి యున్న కుక్కను గూర్చి</u>

విశ్వాసము గల జంతువు
నిశ్వాసము విడిచె నెత్రు నీరైపారన్
నశ్వరము జీవితంబని
పశ్వసువుల గతి యిదే ప్రపంచము గందన్

**(35వ అవధానము - సిద్ధిపేట)**

శ్రీకిష్టారెడ్డి ( శా.స ) గల ఈసభను భువన
విజయముగా వర్ణించుట

అష్టప్రక్రియ లెన్నగా సుకవితాభ్యాసంబు దీటౌ నటుల్
కిష్టారెడ్డి సమిత్యధీనుడు సభన్ గృష్ణేంద్రభూపాలుడై
అష్టాశాగజముల్ కవుల్ వెలుగ రాజ్యం బేలు చందంబునన్
గష్టం బైనను నీవధాన సభ వేగన్మించె సంతుష్టితో
(36వ అవధానము - నారాయణఖేడ్)

మధ్యతరగతి వాని జీవన స్థితి
బ్రతుకు బరువైన ఈనాటి ప్రజలు చూడ
నడిబజారున నిల్చి పన్నగులు నగుచు
ఎడ తెరిపి లేని క్యూల నీ మిడి బ్రతుకుల
జరుపుచున్నారు జీవిక సాగు కొఱకు
పన్నగులు=పాములవలె క్యూ (37వ అవధానము - చిన్నకోడూరు)

(యన్.టి.అర్. ప్రాంతీయ పార్టీ భవిష్యత్తు గురించి సీసముతో)
ఇలను బ్రజాస్వామ్యమేది? యెచ్చట గల్గు
నేతి బీరకాయ నీతి దప్ప
చట్టంబు చూడగా బొట్ట కోసమె కాని
గట్టి నిబంధనల్ గలవె జగతి?
కలిగిన ప్రఖ్యాతి కలిమి గూర్చగ గాని
ప్రజలకు సేవ సెబ్బఱయ సుమ్ము
ఔత్తరాహుల ముందు నుత్తుత్తి వారలై
తెల్గువారున్నారు దిక్కులేక
తెలుగు వెలుగును చూపించు దీక్షబూని
నందమూరి రామారావొనర్చె పార్టి
చెలగ నభిమానులందఱు చేరు చుండ
పుంజు కొను నేమొ భావి తెల్పుట తరంబె?
(38వ అవధానము - చీకోడు)

**గురుకులవిద్యకు - నేటివిద్యకు బోలిక చెప్ప చంపకమాల**

గురుకుల మందు మున్ను దిన గూడు నొసంగిరి విద్దె నేర్పుచున్
బరువడి శాస్త్ర వేత్తలయి ప్రస్తుతి కెక్కిరి నాటి చట్టులున్
గురులును జీత బత్తెములు గొంచును నౌకరులైన నేడు నే
గురియన లేని విద్దె జతగూడెను, భారతి చిన్న బోవగా

(39వ అవధానము - పెద్దకోడూరు)

**వధూవరుల నాశీర్వదిన్చు శార్దూలము సంధ్య (వధువు) విష్ణు భగవాన్ (వరుడు)**

కంధ్యంతర్గతరత్నదర్శన మహా కౌతూహలంబంది సౌ
గంధ్యం బబ్బెను గాంచనంబున గనం గల్యాణ సంపత్కళా
సంధ్యారాణికి నీడు విష్ణుభగవాన్ సంస్కారవంతుండు ని
ర్వంధ్యుండై యెసలార శారద కృపా పాంగమ్ములంబ్రోచుతన్

**రాగి దొనల వద్ద శ్రీసరస్వత్యాలయము గూర్చి శార్దూలము**

సద్యశ్శ్రీఫల యోగమున్ దరసి నిచ్చున్ లక్ష్మి కారాధనల్
విద్యావేత్తలు సేయగా ధరణిలో వెల్గెన్ ద్విసంఖ్యాకగా
విద్యా దేవి కనంత సాగరములో పృథ్వీ ధరాగ్రంబునన్
విద్యోతిల్లగ నాలయం బొకటి కల్పింతున్ ద్విసంఖ్యాకగా

(41వ అవధానము - హైదరాబాదు)

**రంగయ్య శ్రేష్ఠిని ఈశ్వరుడు దీవించుట**

మదనానంద యతీంద్రు భావనకు సమ్యగ్రూపమై సిద్దిపే
ట దివౌకోనిలయాతిగమ్మగు విరాడ్భవ్యంబు శ్రీ కోటిలిం
గ దివీడ్వంద్య పదంబునందు నిల రంగ శ్రేష్ఠి షష్ట్యబ్ద పూ
ర్తిదినం బొప్పగ నీశ్వరుండు పరిపాలించుం జిరాయుస్సులన్

(42వ అవధానము - సిద్దిపేట)

గీతానమాజమౌక్తి కోత్సవము

కన్నుల విందుగా దనరగా దగు మందిర మేర్పరించి సం
పన్నులు క్రీడి కృష్ణప్రతిమల్ వెలయించిరి. సిద్ధిపేటలోన్
మన్నక దత్ప్రతిష్ఠకు సమాజము మించెను మౌక్తికోత్సవ
త్వోన్నతి పండితాదర సముజ్జ్వలమై యెసలారునట్లుగన్
(43వ అవధానము - సిద్ధిపేట)

రాముని పెండ్లి - చంపకమాలలో

గుడిగుడి యేరి కూర్చి తన కూతురు పెండ్లికి, దైవభక్తి నే
గుడి, గుడికన్న బెద్దనుడి కొంచెము. సేయక దిర్పతీశ్వరున్
బడరుని గొల్వ బోవుటను బాటల రాముని బెండ్లి చూచి యి
బ్బడిగ గుతూహలం బెసగ బర్విడి రామన వచ్చె నింటికిన్
(44వ అవధానము - కోహీర్)

పిల్లలను బెద్ద లాశీర్వదించుట

ఇందరు పెద్దలొక్కయెడ నింపుగ గూడి కళావిలాసధీ
నందులుగా గురూత్తము లొనర్చిన శిక్షణ కుద్దిగాగ హృ
న్మందిరముల్ వికాసముగ మంచిన చిన్నని బాలబాలికల్
పొందిక వృద్ధి పొంద దగవుందగ దీవన లిత్తు గాకిలన్
(46వ అవధానము - ఖేల్)

యాదగిరి లక్ష్మీనరసింహస్వామివారి మంటపాన్ని శార్దూలంలో

సంతోషమ్మున యాదశైల విభు దీక్షంజూడగా వచ్చి కా
సంతైనన్ శ్రమలేని దర్శనము నిచ్చం బొంది శ్రీమంటపా
పాంతమ్మున్ గని శిల్ప శోభ నరయన్ స్వాంతంబు పొంగంగ ని
శ్చింతన్ యాత్ర ముగించి పోయితిని సుశ్రీలీయగా గోరుచున్
(47వ అవధానము - యాదగిరి గుట్ట)

<u>శ్రీవేంకటేశ్వర కల్యాణోత్సవమున జరుగ గూడని అశుభమేది? ఉత్పలమాలలో</u>

కోరిక తీరగా జనులు గూడి తిరంబుగ వేంకటేశ్వరున్
గూరిమి మీర బెండ్లియను కొల్వొనగూరిచి పెద్దచేసి యిం
పారగ లెక్క తేల్చు నెడ నయ్యెడు చిక్కుల నేమి చెప్ప నో
రారగ తిట్టు కొందురిక, నందరు వీడరె పర్వ శోభలన్

(48వ అవధానము - సిద్ధిపేట)

<u>ఈకాలము వేడికాలమా? చలికాలమా?</u>

చకచక సాగదీ బ్రతుకు, సాగునధిస్థితి, శీతమట్టులే
తుకతుకలాడు వేడియును ద్రోష్టున నీచలి వెంటవచ్చుచున్
దికమక పెట్టు, నుబ్బరము తేకువే తప్పిన కాలమే యిటుల్
ప్రకటితమైన యెన్నికల భావముతో జెడు నెంచి చూడగన్

(49వ అవధానము - ఖిక్కనూరు)

<u>బురదలోపుట్టిన కమలము, ఉదయసూర్యుడు, నిరుద్యోగి, ఆకాశంలో మేఘాలు - చంపకమాలలో</u>

బురదను బుట్టు పంకజము, బుద్ధిని జూచిన భాస్కరుండు సం
బరమున గప్పు మేఘముల బాయుచు లోక నిరీక్షణాదృతిన్
బరగినచో వికర్మడగు భాగ్య విహీను డొకండు ప్రాగ్దిశాం
బరమును జూడ నొల్లకను బాయడు ప్రక్కను దుర్దశంగనన్

(50వ అవధానము - వికారాబాదు)

<u>శ్రీమాత కోటి కుంకు మార్చన గూర్చి</u>

లలితాదేవి కనంత కోటి ఫల సల్లా స్యాను సంధాత్రికిన్
కలిత శ్రీకిల కోటి కుంకుమ సదాఖ్యావ్యక్త దివ్యార్చనో
జ్జ్వల దీక్షాకృతకృత్యతాఫలము నిస్సందేహమై చిక్కగాన్
లలితాత్మీయత బొంది భక్తజనులున్ లక్షింతురిష్టార్థముల్

(51వ అవధానము - రామాజిపేట)

సీతారామ కల్యాణము

కన్నుల పండులై దివిజ కాంతలుగా వనితల్ వెలార్చ సం
పన్నులు వింతగా గనగ బాల్పడి రాగ యతీశు భావనా
భ్యున్నతి నున్నతిన్గనగ నూర్జిత రామ వివాహ వేదికన్
గన్న యనూన మోదన మకల్మషమై యెసలారు నెంతయున్

(52వ అవధానము - మాసాయిపేట)

సీతా ద్రౌపదుల స్వయంవరమును గూర్చి శార్దూలము

సీతాద్రౌపదు లంచితాశయముతో జెల్వారు హారై రస
స్ఫీతానంద మయానుగామి వరసంశ్లేషంబు గాంక్షించుచున్
జేతఃప్రతిగ భేదన క్రియల నాశించంగ దత్పూర్తితో
ఖ్యాతింగాంచిరి రామఫల్గునులు విశ్వానంద సంధానులై

(53వ అవధానము - శనిగరం)

అప్రస్తుతప్రాసంగికుని గూర్చి అవధాని అభిప్రాయము కందములో

వినడెవ్వడు వద్ద నినన్
గనబో దష్టావధాని కష్టము శ్రోతల్
మనమున నుబ్బగ నడుగున్
ఘను డప్రస్తుతుడు పృచ్ఛక ప్రతితిగనన్

(54వ అవధానము - హైదరాబాదు)

రాఘవేంద్ర శబ్దార్థచర్చ

ఓ ఘన పండిత ప్రవర! యొప్పుగ రాఘవ శబ్ద సార్థక
శ్రీ ఘన ప్రశ్న సేసితిరి. చెల్వగు నట్టి జనాళి సర్వపా
పౌఘము దూరము న్సలుపు యోగ్యత కల్గిన మంత్రరాజమ
య్యా! ఘన భక్తిగొల్చిన మహాఫల మిచ్చును భక్తకోటికిన్

(55వ అవధానము - బృందావనం - నాచారం)

**నాస్తికులను అస్తికులుగా మార్చమని**
**శ్రీసిద్ధరామేశ్వరా! మకుటముతో స్వామి నర్థించుట**
ఇలలో హేతుక దృష్టిపేర మతమున్ హేలా గతిం జూచి ది
ట్టలుగా వాదన సల్పు చుందురు వనాటప్రాయదద్వాసనల్
పాలియ న్నాస్తికపాళి నాస్తికులుగా బొల్పొందగా జేసి భా
సిలు మో దేవర! సంస్కృతి న్నిలుపగా శ్రీసిద్ధరామేశ్వరా!
**(56వ అవధానము - భిక్కనూరు)**

**<u>అడకత్తెర (విభాగిని) గూర్చి శార్దూలము</u>**
విప్పన్ వ్యాఘ్రము భంగినోరు, దశనావిష్కారసందృష్టి మే
లొప్పన్ భాగ్యవిభాగభాసురముగా నూహింతు సమ్యక్కృషిన్
విప్పార్చం దగి నాకరండమున బృథ్విన్ దేవతామూర్తియై
చొప్పారెం గద అవ్విభాగినియు సంశుద్ధాంతరంగమ్ములన్
**(57వ అవధానము - నంగునూరు)**

**<u>తెగుళ్లు తగిలిన వరిగల రైతు</u>**
తెలుగుల యాత్మగౌరము దిక్కుల నింపగ దీక్షబూని చె
య్యుల నరలేని రీతి పరు పొంతన జేరక యుండునట్లు రై
తుల కృషి పంట నూర్పిడులతో వికసించునుగాని నేటియీ
తుల దుల కించలేను వరితో ఫలమేమిటి అగ్గి దాకినన్?
**ఈతులు=ఈతి బాధలు - రోగాలు**
**(59వ అవధానము - రామంచ)**

**<u>ఇచ్చటి దేవాలయం గూర్చి ఉత్పలమాల</u>**
ఈ"పెద గుండవల్లి" గణియించగ నీశుడు వెల్గ భక్తి ని
ష్ఠాపరులైన గ్రామజన సంగతి నంచిత రీతి భావనా
శ్రీపరిపోషకంబయి ధరిత్రి రహించుచు వృద్ధి నొంద నా
శాపరిపుష్టి నీశ్వరుని సత్కృప నిచ్చలు గల్గు కోర్కితో
**(61వ అవధానము - పెదగుండవల్లి)**

చేవెళ్లలో నవగ్రహప్రతిష్ఠను వర్ణించుట

చేవెళ్లంగల వేంకటేశ్వర విభు శ్రీమందిరమ్మందు, ల
క్ష్మీవైభోగము మించగా గ్రహగణాశీర్వాదము ల్గూర్చ వి
ద్యావై దుష్యముతో సుదర్శన కృతోద్యద్యత్న భాగ్యంబుగా
తావౌ శ్రీ గురుదేవు సత్కరుణ లబ్ధంబయ్యె మా బోంట్లకున్
(63వ అవధానము - చేవెళ్ల)

నాయకులకు గణాధిపతి ఉద్బోధ ఉత్పలములో

అందిన దాహరించుడి యథార్థము దాచుడి పత్రితోడనేన్
విందుల దూర బోవకుడి విజ్ఞుల దగ్గర జేర నీకుడీ
తొందర కార్యముల్సలుప దుందుడు కౌ-అయిదేడులైన గా
మందులు మీరలంచు మనమాన్యులకున్ గణపుండు చెప్పెదున్
(64వ అవధానము - అందోలు)

యువకులకు గాంధి ఉద్బోధ. చంపకములో

యువకకిశోరులార! బెగ డొందకు డయ్య! భవిష్యమందు సం
భవము యథార్థవాదనము, భారత మెల్లప్రపంచ మందు శో
భవిరియగా గణాధిపతి భాగ్యము నల్గిన మీకు సాటి మీ
రె, విధిని బాధ్యతన్ విడుతురే చెడిపోదురు నాగ గాంధి యన్
(65వ అవధానము - జోగిపేట)

పోతనామాత్యుని కవితావై దుష్యాన్ని చంపకములో.

లలిత మనోజ్ఞ భావముల లాలిత గాథల రీతిజెప్పి, మం
జుల కవితారసంబు సరసుండయి చెప్పిన పోతనార్య సూ
క్తులు విలసిల్లు భాగవత గూఢత ముక్తికి నాలవాల మౌ
పలుకుల గొల్తు నాతనిని బండితమండన్నుగా వధానమున్
(66వ అవధానము - శనిగరం)

**శ్రీచక్రేశ్వరుడు వధూవరుల నాశీర్వదించుట**

నవవైవాహికదీక్షబూని, మహదానందములంబొంది, మా
నవ కల్యాణ మభీప్సితమ్మగుచు, పొంగారున్దగన్, బోధనన్
శివచక్రేశ్వరుడిట్లు హైమవతి జేర్చెన్, గృష్ణ జిత్రంబగున్
శివ మస్తం చని నీవధూవరుల కాశీర్వాదముల్ సేసెడున్

(67వ అవధానము - బోధన్)

**కాశ్మీర బాసర అనంత సాగర సరస్వతులకు గల సంబధము తెలుపుట**

సీమాశక్తి యదెట్టిదో? విబుధ సం సేవ్యాంఘ్రి వాగ్దేవి స
త్ప్రేమం గాశ్మీరమందు, బాసర మహాపీఠంబు పైవెల్గె, నా
ధీమా యేమిటొ కాని రాగిదొనలం దేజస్స్వరూపమ్ముగా
నో మిత్రంబ! సరస్వతీమహిమ నెట్లూహింతు జిత్రంబుగాన్

(68వ అవధానము - రాజగోపాలపేట)

**శ్రీ శంకరాచార్య విగ్రహప్రతిష్ఠను శ్రీభారతీ తీర్థస్వామి చేసిన తీరు సీసమును జెప్పుట**

పరవాద భంజన పరమ లక్ష్యంబున
నామ్నాయ పీఠము లవని నెగడె
దక్షిణామ్నాయమ్మై తనరు శృంగేరి భా
రతమున శంకరు గతిని నిలుప
బలు చోట్ల మఠముల బరిఢవిల్లగ జేయు
దద్భక్త జనుల సంతసము గోరి
శ్రీ భారతీ తీర్థ శివమూర్తి యా నాచ
గిరియందు నాది శంకరునినిలిపె
అమలి నాద్వైత బోధ చెన్నలరు చుండ
స్మార్త ధర్మప్రచార ప్రశస్తిదనర
గనుల బండువు గాదె యీ దినము నేడు
జాతిజనశక్తి సంజీవి స్వామిదయను

(69వ అవధానము - నాచారము)

<u>నక్తవిశేషమును మత్తేభమున</u>

భువనై కాధిపతిన్ బ్రియంబకుని, చూపుం బాసిపో నంతక
త్వవిభూతి ప్రవినాశకున్ శివుని గొల్వన్ బర్వ మేనా డనన్?
శివ పర్వంబులు సర్వనక్తములు కాశీవాసపుణ్యంబు ని
చ్చు విధిన్ భక్త జనావళిన్ ముగితి నిచ్చున్ శైవశాస్త్రంబులన్

**(70వ అవధానము - కాశి)**

<u>బీద బావనియింటి ముందు గనకధార కురియించిన శంకరుడు చంపకములో</u>

అమలినభావ సంపద మహాశయు డర్థి, బీద బాపన
మ్మ మది కలంగగా గరము మాటున దాచిన కాయ వేయగా
గుమిలిన శంకరుండు రమకు న్నతి చేసి నుతించి పైడివౌ
యమలకముల్ ధరంగురియ నంచిత మయ్యెడు స్వర్ణధారగాన్

**(71వ అవధానము - నాచారం)**

<u>జాతీయ విద్యా విధానము గూర్చి మత్తేభములో</u>

సమతారాజ్యము నిల్పగా వలసినన్ జాతీయ విద్యావిధా
నము రూపొందగ జేసె గేంద్రము,. జగానన్ ఛాత్రు లీడేరి దే
శమునం బ్రాంత విభిన్నతల్ దొలగ శశ్వల్లాభమౌనంచు ము
ఖ్యముగా నాజ్ఞ నొసంగె సద్గురువులారా! మీరు గుర్తించుడీ!

**(72వ అవధానము - మెదకు)**

<u>వరకట్నపు జావుల గూర్చి ఏవృత్తము ఐనవరియే</u>

వరశుల్కంబను భూత మొక్కటియె తప్పం బెండ్లి సర్వప్రియో
ద్ధురమై.సర్వసుపర్వమై తనరు, గ్రిందు న్మీదు యోచించలే
కరయన్ ద్రవ్యపిపాస గాల్చెదరుగా నాత్మీయ యౌ గోడలిన్
జరిగెంబో యను తృప్తి గూడ దిటు లాశాబద్ధులౌ పెద్దలన్

**(73వ అవధానము - వరంగల్)**

<u>ప్రతిభనే నమ్ముకున్న విద్యార్థి యోగ్యతా పరీక్షకు వెళ్తుచు గణపతి నేమని ప్రార్థిస్తాడు</u>

మాకుంబుద్ధి యొసంగి తప్పు జరిగెన్ మాయయ్య! విఘ్నేశ! దు
ర్ధీకుల్ తప్పుడు మార్గముం జనుచు నుర్విన్‌యోగ మందంగ నీ
లోకంబందున యోగ్యతా నికష లెట్లుం జెల్లు మానాంతకా
నీకోద్యోగము మాకు యోగము మృడానీపుత్ర! రక్షించుమా!

(74వ అవధానము - సికింద్రాబాదు)

<u>లక్ష్మీ పుత్రునకు, లక్ష్మీ సేవకునకు తేడా - ఉత్పలంలో</u>

ఉన్నది యొక్కటేభజన, ఉన్నది లేనిది చూచుకొంట, యే
మున్నది లక్ష్మిసేవకుని కొక్కని యింట, ననంతభోగ సం
పన్నత లేనిదానికయి ప్రాకుట యొక్కటి లక్ష్మిపుత్రు లో
నున్నది, దేవులాట సమ మున్నది యిద్దరిలోన మిత్రమా!

(75వ అవధానము - చేర్యాల)

<u>రాజరాజేశ్వరి శ్రీచంద్రమౌళి శాస్త్రి - వీరికభేదము. శార్దూలము</u>

ధీసామాన్యవిధాయినీపదము సందీపించ నూర్జస్వ వా
ణ్యాసంబున్ శ్రితపాళి కంచితముగా నందించి యోగ స్వరూ
పీ సంస్కారము చంద్రమౌళి తను ప్రాపించెన్ సమస్తాస్తిక
ధ్యాసన్ భావన మించు నీపురిని మిథ్యావాద నిర్మూలనన్

(78వ అవధానము - చుంచనకోట)

<u>జననీ జన్మ భూమిశ్చ స్వర్గాదపి గరీయసి దీనిగూర్చి ఉత్పలంలో</u>

పైఢీతనంబుపై మురిసి పాయగ జాలడు వైరి వీడు నా
డు సుమిత్ర పట్టి కను విందొనరించిన నగ్రజుండు నీ
యీడముకన్న జన్మతల మెంతటిదో జననీత్వ శక్తియే
జోడయిసాగు సోదర! విశుద్ధ మయోధ్య దివిం జయించెడున్

(79వ అవధానము - మరువడగ)

మతో న్మాదుల పీచమణచ గోటిలింగేశుండు విజృంభించుట : శార్దూలమున

శిక్షార్హమ్మగు నేరముం జలిపి వాసిం గాసి బొందంగ నే
దక్షుండైనను దక్కునే? భువి మతోన్మాదంబు పెట్రేగి శాం
తిక్షాంతు ల్దొలగన్ మహేనుడు ప్రవర్తించుంగదా భద్రుడై
రక్షింపన్వలె గాదె దేశమును భద్రప్రాప్తి వాంఛించుచున్

(80వ అవధానము - సిద్ధిపేట)

పగటి పూట చంద్రుడు వెలుగుట - ఉత్పలం

తారలు గూడు చోట భువి తామసముందొలగించ నిందు శో
భారతి గోరి తోటనొక ప్రక్క జలాశయమొప్ప దర్శక
శ్రీరమణీయమై చెలగ సిల్వరు కల్వల రేని గూర్చ జి
త్రారభటి న్వెలింగెడు మహోముద మెన్నగ శక్యమౌనొకో?

(81వ అవధానము - కుకునూరువల్లి)

దేవతలు ఉపనీత వరప్రసాదుని దీవించుట - శార్దూలం)

గర్భాష్ట మ్ముపనాయనం విహిత ముత్కంఠరన్ ద్విజన్మాళికిన్
దర్భల్మౌంజి పలాశ దండ పరిధానైకోపవీతాజినా
విర్భూతాంబుజ గర్భవైదికకళావిష్కార సంప్రాప్తి సం
దర్భం బందు వరప్రసాదు సురసంతానంబు దీవించుతన్

(82వ అవధానము - కరీంనగర్)

హేమంతమును ఉత్పలమాలలో

ఎంతనిచూడవచ్చు ధర నెల్ల ఋతుక్రమమందు పంచమో
పాంత మనర్ఘమై నరులయందు బ్రగాఢత బెంచునట్టి హే
మంతము పెట్టునట్టిది సమస్తముగా సుఖపెట్టు వస్త్రహీ
నాంతకమై దరిద్రుల నహో యన జేయును గద్గదంబులన్

(83వ అవధానము - సూర్యాపేట)

**నేటి బదిలీల వలన పరిస్థితి చంపకములో**

బడి గుడిగా దలంచి నిరపాయత నజ్ఞుల విజ్ఞులం బొన
ర్చెదు గురు లన్యసక్తిగన జేటని యెంచు బ్రభుత్వ మిట్లు వెం
బడి పడి యింటి కెంత దవు వర్తిల సేమ మటంచు జేయగా
గుడగుడ లే గురూత్తముల గుండెల నిండెను గూడ్సు బండులై

(84వ అవధానము - చందాయిపేట)

**శివవిష్ణు సమ భావన - నాచారంలో కలదని మత్తేభములో**

కనగా హైందవ మన్మతంబున జగత్కల్యాణ భావంబు వి
జ్ఞనసంమోక్షణ బెక్కురూపములు వే సాయుజ్యమే యిచ్చునం
చని భేదంబుల నెంచకుండ శివ విష్ణ్వద్వైత భావంబు మె
చ్చ నితాంతంబును సన్మహత్వమున నాచారంబు వర్ధిల్లెడున్

(85వ అవధానము - నాచారము)

**నగరములో నీటి కటకట చంపకములో**

కలతలు లేవటంచు దన కాంతుడు సర్వము గూర్చె నన్న సం
కలనము కష్ట పంక్తికి సుకార్యము నన్నములోటు చెప్ప గ
జ్జలము కరుంగ మజ్జనము సంగతి దేవుడెరుంగు దాహమ
య్యల వశమైన నా వరుణు డర్మిలి నాళ్ల నింప బూర్తియౌ

(86వ అవధానము - ఉస్మానియా విశ్వవిద్యాలయం)

**వాన మునుళ్లలో బీదల స్థితి ఉత్పలములో**

పుట్టువు ముందు మేమెటుల పున్నె మొనర్చితిమో, తపంబు మా
కెట్టొ గతించె, మించు ముసు రెట్లు తరింతుము, నుండగట్ట నిల్
పుట్టము లేని లేమి తిన బువ్వయు వండుటకష్టమయ్యె. గీ
పెట్టిన సీతు బీతు ఇది బీదల కర్మము లోకనాయకా!
తపము=ఎండ కాలము, సీతు=చలి, బీతు=భయము

(87వ అవధానము - వరంగలు)

క్రుష్ణానదికి వరదలు మాధైవురాలేదని బాధపడేవారి గూర్చి శార్దూలములో
ఆవేగంబున బొంగి వచ్చెడు జలాహ్లాదంబు నజ్ఞాను ల
త్యావేశంబున జూడ బోయెదరు భగ్నాశుల్ వినష్టాస్తికుల్
దేవా! మాకిక దిక్కు లేదనుచు నుద్వేగంబున న్వేడ వా
ర్దైవీ దృష్టి యనంతమై వరదగా దత్సత్యమేర్పా టగున్
వాః+దైవము = వరుణుడు (88వ అవధానము - సిద్దిపేట)

దివి సీమ వరదలలో జనుల స్థితి శార్దూలములో
అయ్యో!కాలము బాగుగా జరుగుగా నం చేము భావించ మా
యయ్యల్ చెట్టుకు బుట్ట కొక్కరుగ, మా యాస్తుల్ వినష్టంబుగా
కుయ్యాలించెడు దిక్కులేక దివి వాకోవాకుగా నారకం
బయ్యెం గృష్ణ నికృష్టతన్ జగము లాహో యంచు నాలించగా
(89వ అవధానము - దేవర యాంజాల)

మయసభ గూర్చి ఉత్పలమాల
ఉన్నది లేనటుల్ మరియు నుండుట లేనటువంటి దెట్లు? నే
గన్నది. చిత్తవిభ్రమము గాగలిగెన్ గురువంశ రాజు కే
మున్నది పాండవేయవిభవోన్నతి నామది గుంద జేయు నం
చెన్నె సుయోధనుండు మయు డెంతటి శిల్పియొ? వైరికందెగా
(90వ అవధానము - కుతుబుల్లాపుర్)

మాపాఠశాల పరిసరాలను వర్ణించాలి ఉత్పలమాలలో
గంటలు మ్రోయుచుండ వడిగా జనగావలె దిండి మానియున్
దంటలు మాగురుల్ హృదయ ధామము నిండగ బోధసేయగా
వింటయెకాని వాహనపు వెల్లువ సేయు రొదల్ దలంచగా
గంటకమయ్యె మాబడిని గావుమ దైవము! ఎల్లకాలమున్
(91వ అవధానము - శేరిలింగంపల్లి)

కులవ్యవస్థ గురించి - శార్దూలము
ఏనాడెట్లు జనించెనో? ఎవరికై ఏర్పాటు లెట్లయ్యెనో?
మానవ్యం డిటు లెందు కొప్పుకొనె? కర్మవ్యక్తి నిట్లయ్యెనో?
ఈనాడిట్లు పరాభిభూతమయి దైత్యేప్సిన్ గలం బుండె, లో
కానన్ సర్వ సమాజ వైఖరులు సౌఖ్యశ్రీలు నిండం దగున్
(92వ అవధానము - అద్దంకి)

<u>ఆర్మేనియా భూకంపము - శార్దూలము</u>
మర్మేచ్ఛేదకమయ్యె భూమిబ్రతుకన్ మాచేత నేముండె, దు
ష్కర్ముల్ ఘాతల బొంద న్యాయమగు సత్కర్మాత్ములం దప్పదే!
నిర్మాణంబులు గూల, నిండుబ్రతుకుల్ నీఱై, నిరాశుల్‌దగన్
ఆర్మేన్యా ధరణీప్రకంపనము రష్యాన్ జేసె గల్లోలమున్
నీఱు=బూడిద (93వది - కావలి)

<u>చంపకమాల గూర్చి చంపకమాలలో</u>
సమకొను పుష్పసంచయము, సంపెంగ పాపమ దేమొ కాని, ఆ
భ్రమరము దగ్గఱన్వోఱచు, పండిత సత్కవితామనోరథ
క్రమమును జెప్పు చుండగను రాగిలి చంపకమాలతో సుధీ
భ్రమరములాన నీసభ విరాజిలు నష్టవధాని సత్కృతిన్
(94వ అవధానము - నిజాంకాలేజి, హైదరాబాదు)

<u>చంపకమాలలో సమైక్యతా సందేశము</u>
సకల మతాభిమానముల సద్హృదయంబున స్వీకరించి యీ
సకల ధరాతలంబునకు శాంతినొసంగ సమైక్య భావనా
ప్రకటిత బుద్ధి సంఘమున రాజిలు చుండ ననైక్యమానసుల్
వికలములన్ సృజించి కనువిందుగ జూతురు నాశకారులై
(95వ అవధానము - మెట్టువల్లి)

ఈ సభ భువనవిజయముగా వర్ణించుట

పెద్దన లేక యున్నను, గవీశులు వీరలు పెద్దనల్గదా!
వద్దనుకున్న తిమ్మనలు వత్తురు భావసుమాల దొంగిలన్
ఇది అముక్త మూల్యద, సభేనుడు కృష్ణుడు రామలింగడే
ఒద్దిక రామమూర్తి సభ యొప్పెడు లోకజయాఖ్య కోహిరున్

(96వ అవధానము - కోహీర్)

ఈనాటి అవధాన నిర్వహణను నిష్కక్రముగా చెప్పండి ఉత్పలంలో

చాయ ఒకింతలే దనుచు జాప్యము సాగె వధానమందు, ని
శ్చేయ విధాయకుండు కడచెం దన నాన్నని రాడు, పృచ్ఛక
త్వాయతి నీడవచ్చె నొక యందము వెల్దురితిన్ గురుల్ముద
స్థాయికి రాగ, ఛాత్రులకు సంతస మొప్పగ జేసితిం దగన్

(97వ అవధానము - వెల్దుర్తి)

చెప్యాలకు మీ ప్రయాణము గూర్చి చంపకంలో

నిజముగ నేడు నీసభను నేన యెఱుంగను, ఏర్పరించుటన్
గుజగుజవేచి యెట్టెటులో కోరిక సర్వీసు నెక్కి గుంటలన్
బ్రజనితమౌ ప్రమోదమున వచ్చితి గ్రాతిరి యైన దాక త
ద్రజమును నెత్తి కెక్కగ విరాజిలు శాశ్వతమైన రీతిగాన్

(98వ అవధానము - పెద్ద చెప్యాల)

అలివేలు మంగాపతి గూర్చి చంపకమాలలో

ఇలగల పాపసంహతుల నిట్టె తొలంగగజేయ దైవమే
నిలిచె, సమస్త భక్తులకు నిస్తుల సౌఖ్యము లీయ మంగనే
వలగొని యేడు కొండల నివాస మొనర్చితి వయ్య నెక్కగా
గలిగెడు శక్తినిమ్ము తగు కామ్యము లిచ్చుట నీకు భారమే?

(99వ అవధానము - రామాయంపేట)

<u>సభను భువన విజయముగా చెప్పుట శార్దూలంలో</u>

నాపూర్వార్జిత పుణ్యభాగ మది యెంచన్ బూర్వులం జూడగా
నీ పాండిత్య నిధానులం గొలుచు భూ భృచ్ఛేఖరు ల్లేమి నన్
దీపించెంగద నారసింగి సభ తృప్తిన్ లోక జేత్రాఖ్యతోన్
బ్రాపించెన్ గవిరాయలేయనగ దిజ్నాగంబు లీరేయనన్

**(100వ అవధానము - నారసింగి)**

<u>గీతా సారాన్ని ఒక్క ఉత్పలమాలలో</u>

ఇచ్చిన జన్మగాచుకొని యెల్లర కెప్పుడు మేలుసేయుచున్
వచ్చిన దైవ మొండు తన వంతు పనింబొనరించు చుండు, వి
వ్యచ్చుడ వయ్యు బేలవయి వంశపు గీర్తికి మచ్చ దేకుమా!
జచ్చుట చంపుటల్ జరుపు స్వామిని నన్నుగ గుర్తెరంగుమా!

**(101వ అవధానము - సిద్దిపేట)**

<u>అవాన విద్యాలయాన్ని గూర్చి కందం</u>

విద్యారణ్యావాసక
విద్యాలయ మొప్పె దక్కపెలి పృథ్విన్ స
ద్విద్యాప్రదాత్రిగా నయి
సద్యశమును బొందుగాక శారద కరుణన్

**(103వ అవధానము - తడకపల్లి)**

<u>సూర్యుని లోకోపకారము గూర్చి ఉత్పలమాల</u>

లేపక ముందె లేచి మములేపును సూర్యుడు, రేపనంగ స
ల్లాపము, సత్కలాపము, విలాసము హాసము, భాసమానమౌ
నేపని నేపని న్గానిన నింకను లోపము లుండ బోవు ని
ద్రాపరిరంభణం బొకటి తక్క సమస్త మొసంగు లోకమున్

**(104వ అవధానము - సిద్దిపేట)**

దేశ భవిష్యత్తు గూర్చి

మానవతా నినాదము సమానముగా వినిపించు గాని వి
జ్ఞానము మించి దేశమున సద్గతి కుద్గతి గూర్చ బూని అ
ధ్వానము మంట గల్పి తమ దారియె సత్యమటన్నవారితో
మానగ దేశ భాగ్యమది మాటయొ? రూపము దిద్దునోగదా!

(105వ అవధానము - ఆర్.బి.ఐ. హైదరాబాదు)

వ్యాపార సమాఖ్య వారు వినాయ కోత్సవాలను నిరంతరము చేయగల్గునట్లు ఆశీర్వదించుట

ఇదివ్యాపార సమాఖ్య సిద్ధిపురి, యందీ యేడు తొల్దొల్తగా
హృదయావిష్కృతి రాక్షసాంతక గణేశేష్టిన్ మహోత్సాహమున్
విదితంబౌగతి పూనినారు, భగవన్ విఘ్నేశ! ఎల్లప్పుడున్
వదులం బోవక యుండజూడుము సిరుల్ భద్రమ్ముగా గూర్చుచున్

(106వ అవధానము - సిద్ధిపేట)

రామయజ్ఞము - చంపకము

అలవిగ రామనాయ జపయజ్ఞము వే శతసంఖ్య నిట్లుని
మ్ముల జరిపించగా బడుట మోదము గూర్చె సమస్త లోకులన్
దలపున మార్గ దర్శకత దైవము గూర్చగ జూడ జోగి ప్రో
లిల యశమందు నందఱకు నిజ్యత గూర్చెడు మోక్షమీయగన్

ఇజ్యత = గౌరవము (107వ అవధానము - జోగిపేట)

పాలెం గ్రామాభివృద్ధిని గూర్చి శార్దూలంలో

ఎంతైన న్నుడువంగవచ్చు గవితాహేలావిలాసంబులన్
ప్రాంతీయ వ్యవసాయ శోధనము సద్వ్యాసంగమై సత్కళో
పాంతస్థాయి నిరంతరంబుగను నీ పాలెంపురం బొప్పుశ్రీ
మంతమ్మై విలసిల్లుగాక భగవన్మర్యాద పెల్లొటచేన్

(108వ అవధానము - పాలెం)

**మారుతిని భావానందస్వామిని వర్ణించాలి శార్దూలంలో**

శైవాధిష్ఠిత బీజుడై సుజనతా శ్లాఘాసమారాధ్యు డై
ధీవాల్లభ్యత వాగ్విలాసకరుడై తృష్ణాంధకారాంతక
శ్రీవర్ధిష్ణువు యోగసాధన బలశ్రేయఃప్రదుం డౌ చిద్ధరన్
భావానందుడు పావనుండు తగు జిద్భావప్రదశ్రీకుడై

**(109వ అవధానము - రిమ్మనగోడు)**

**శ్రీరామనవమి - ఉత్పలమాలలో**

రాముని బెండ్లి చేయుటకు బ్రాతిగ గూడిరి కొందరిచ్ఛతో
నామని శోభ లెల్లెడల హాయనముల్ గొనసాగ నిందు లో
శ్రీమహితంబుగా జరుప జేరిరి వారలు శక్తిమేరకున్
వే మరి కాకవంధ్య యనిపించక యుండగ కీర్తి సేయుడీ

**(110వ అవధానము - ఖమ్మం)**

**పాలెం, కొల్లాపురాలతో మీకు గల సంబంధం**

తల్లి గారిల్లు పాలెము, తనరె నాకు,
రక్తి జూపించె గొల్లాపురాన నేడు
అన్ని నచ్చిన దగును వియ్యంబుదాన
నత్తవారింటివారి భాగ్యంబునాది

**(111వ అవధానము - కొల్లాపురం)**

**షష్ఠి పూర్తి జరుపుకొను మురంశెట్టి వేంకటేశంను గూర్చి**

పరమాయుఃప్రథమార్థ పూర్తి సవన ప్రాశస్త్య మంగీకరిం
చిరతుండై విబుధాశిషంబుల మురం శెట్ట్యన్వవాయుండు భా
గ్యరమా భోగుడు వేంకటేశము సుదీర్ఘాయు స్సుదారుధ్య సు
స్థిరతన్ గోరి యొనర్చె సాంబశివు నుద్దేశించి సద్భక్తితోన్

**(112వ అవధానము - సిద్ధిపేట)**

క్రిక్కిరిసిన సభను బస్సుతో పోల్చుట

అవసరమైన చోటికి బ్రయాణము సేయగ జోటులేనిచో
వివిధపు గష్టముల్ గని వివేకము జోలికి బోక నిల్చి పో
వ వెతల గుందకన్ హృదయభారము పారము ముట్ట నోపికన్
వివరముగా వధాన సభ వెల్గెడు నిండిన బస్సు పోలికన్

(113వ అవధానము - రవీంద్రభారతి, హైదరాబాదు)

నిమజ్జితుడు కాబోయే వినాయకుడు, మునిగి యున్న బుద్ధుడు ఏమిమాట్లాడు కుంటారో ఉత్పలమాలలో

"ఓయి తథాగతా! బ్రతికియుంటివె?" "చచ్చితినంచు నెంచితే"
"నాయకులందు రేమిటి?" "వినాయక! శోకిల బోకు మోయి ఈ
రేయి యొకండె నీకు", "అరరే! అదియేమిటి?" "తోడు నాకునీ
వోయి" "శిలాకృతిన్ఘనను" "ఒగ్గిలు చుండుట దప్పదయ్యెగా"

(114వ అవధానము - కేంద్రీయవిశ్వ విద్యాలయం, హైదరాబాదు)

తీవ్ర వాదం గూర్చి మీ అభిప్రాయము

ఏది సమర్థనీయము, మహిందగ సర్వ సమానవృత్తి స
ర్వాదరణీయ మౌట, అది యందరి కందుట కోరిమాటలన్
వాదరలన్ సమాజమును బాధల గూర్చెడి వారలందరున్
వాదము సేయ తీవ్రత వివాదము గూర్చెడు భారతంబునన్.

(115వ అవధానము - సిద్దిపేట)

ఈసభ- ఇంద్రసభ

ఇది శతనేత్రుకొల్వు, ఇట నధీను డదీనుడు, పల్బృహస్పతుల్
వదులరు. అష్టదిక్పతుల బాధ్యత దైవతపాళి మెచ్చ. స
మ్మద కవితా పయోనిధి సమస్తముగా గచదీక్ష గోరగా
సదము సుధాశయంబగుట సాధ్యము గాదె బుధుల్ వసించుటన్

(116వ అవధానము - సిద్దిపేట)

**ఈనాటి అల్లకల్లోల పరిస్థితి తొలగిపోయి వచ్చే యేడు శుభాన్ని కలిగించాలని చంపకములో**

సరసము జారిపోయినది. సభ్యత మభ్య పడంగ జొచ్చె నం
దరి హృదయంబులున్ వెతల దావలమయ్యెను, యుద్ధమేఘముల్
బెరుగుచురాగ, చిద్రసపు వృష్టి నిరాశ యొనర్చె, వచ్చు నే
డరయగ నంగిరోముని సదాశయసిద్ధి యొసంగ గోరెదన్

**(117వ అవధానము - అచ్చంపేట)**

**పేపర్లు దిద్దు ఉపాధ్యాయుల పరిస్థితి**

చెప్పుట సౌఖ్యమే యయిన, జిన్నలు చిన్న తనంబు సేయగా
తప్పులు దిద్దు వారమని తప్పక వత్తుము ప్రత్రముల్ దెగన్
గుప్పలు గాగ నిచ్చుటయు గూలియు గొంచెము గాన దిద్దుటన్
దప్పుచు రుద్దుటన్ సలుపదా గురువర్గము దుర్గతిగ్గనన్
పత్+త్రములు = చెప్పులు, పత్రికలు (పాదములను గాపాడునవి)

**(118వ అవధానము - చందానగర్)**

**సారానిషేధం స్త్రీ జాతి విజృంభణ ఫలం**

చెడినవి కొంప లెల్ల పరిశీలన దప్పెను శీలసంపదల్
మడులును మాన్యముల్ సనియె,మానినిమానము మంటగాలెడున్
తడిసిన వెన్క గూటమిగ దన్విగముల్ తలపడ్డభారమున్
విడువగ బూని కేకలతొ వీధి బడన్ ఫలితం బనుహ్యామౌ

**(119వ అవధానము - దొంగలధర్మారం)**

**నటరాజమూర్తి తాండవనృత్యం : శార్దూలంలో**

అన్యాయంబుల నోర్చి యోర్చి జప నిష్ఠాంతర్యముం గుంది, సృ
ష్టిన్యాయంబున లోకనాశనము పొంటెన్ బాలనాచారమున్
సన్యస్తుండయి తాండవమ్మొనరిచెన్ శంభుం డుదగ్రుండుగా
విన్యాసంబుల లోకసుందరుడుగా విస్ఫూర్తి నించెం దగన్

**(120వ అవధానము - మచిలీపట్నం)**

వివేకానందుడు లోకాని కిచ్చిన సందేశం చంపకమాలలో

ప్రజలిట గోలుపోయినది భాగ్యము గాదు నిరంతరశ్రమా
ప్రజనిత సర్వశోభనము, బానిసలన్ బొనరించె, నన్న యీ
నిజము నభీతులై జనని నిండు దయన్ గనుడయ్య! కల్గెడున్
విజయము మీకటంచును వివేక గురుం డుపదేశ మిచ్చెడున్

(121వ అవధానము - హైదరాబాదు)

వర్షాల రాక నర్థిస్తూ ఇంద్రాదుల ప్రార్థించుట మత్తేభం

కరు వేపారెడు సిద్ధిపేట పురిలో గష్టంబుగా రెండు నే
ళ్లరయన్, వర్షమురాక నుగ్రరథ శాంత్యాదిన్ మిమున్ గొల్చెదన్
వరుణేంద్రాగ్ని యమానిల ప్రభృతి దైవత్యంబు వేంచేయగా
ధర ముక్కారులు పండ భాగ్యములు విస్తారంబుగా జిక్కెడున్

(122వ అవధానము - సిద్ధిపేట)

నిలిచియున్న సరస్వతిని గూర్చి స్వేచ్ఛా వృత్తము

నిలిచిన బాగు లక్ష్మియని నిండుమనంబున గొల్తు రందరున్
నిలువదు గాన, వాణి గణనీయ యశంబును గూర్చుమూర్తిగా
నిలిచిన మంచిదంచు గుడి నిల్పితి నిన్ను మహాసరస్వతీ!
చెలువుగ నాట్యమాడుమ రసించెడు నాలుక సర్వ సిద్ధులన్

(123వ అవధానము - ఘనపూర్ (వరంగల్)

గాంధీకలలరూపం

కలలం గాంచుట భారతీయ సహజా కాంక్షా మహత్వంబు రా
గలరాజ్యంబును రామరాజ్యమని యాగాంధీ మహాత్ముండు ద
ర్పిల గార్పణ్యము జీవనాడి యయి భావిన్వెల్గు నంచెంచుడీ
ఇలలో మించిన గ్రామరాజ్యముల నాశించెన్ నిజంబైనచో

(124వ అవధానము - చేర్యాల)

మత్తేభ యానయైన వధువును మత్తేభంలో

సకలాలంకృతయైన నెచ్చెలి వయస్యల్ వెంటరా నమ్రతా
ముకుళాత్మీయ మనోజ్ఞయై వరుడుగా బూవింటి జోడందగా
వికచాంభోజదళాయతాక్షి, నిలిచె న్వేదిన్ సదస్యాక్షత
ప్రకటాశీస్సులు గోరి వంగెను శివాప్రాగల్భ్య మూహించుచున్

(125వ అవధానము - బచ్చన్నపేట)

త్రిమాతలు లౌకిక పారలౌకికములుగా అనుగ్రహించుట

రసన న్నిల్చిన వాణి పుత్రులకు మర్యాదా ప్రదానమ్ము వి
శ్వసనీయంబుగ శక్తి నిచ్చు ప్రజకున్ శర్వాణి, సంపన్నిధి
ప్రసవం బొప్పగ లక్ష్మి లౌకిక ఫలావాప్తిన్ బ్రసాదించగా
నసమంబౌ తగు పారలౌకిక ఫలవ్యాసక్తితో మించినన్

(126వ అవధానము - సికింద్రాబాదు)

రామరాజ్యపాలనము మనము చూడగలమా? మత్తేభం

మనమాశించిన యోగ్య పాలనము నిర్మాణాత్మకంబైనచో
జననాథుండు యశంబు వొందు, సతమున్ స్వార్థంబుసర్వార్థమై
జనగా బేరుకు పోవు కశ్మలము నిచ్చున్ దూరగా లేనిచో
మన దేరా మరి రామరాజ్యమని పల్మారెంచినన్ లాభమా?

(127వ అవధానము - చేగుంట)

స్త్రీలకు ఎన్నికలలో ప్రాతినిధ్యము ఉత్పలంలో

ఇంతకు నింతుల న్గలుగు నింగిత మెంచక నింతలేసి ధీ
మంతులు అర్ధభాగ మగు మానిని పట్టుల బూని వక్రదృ
ష్ట్యంతము లేశభాగమును నందియిడన్ దగనేటి భారతిన్
వంతుగ శీతువుంగెడపు పద్ధతి నెన్నికలందు జూడరే?

(128వ అవధానము - హైదరాబాదు)

శ్రీవిజయసారథి గారి గూర్చి - ఉత్పలమాల

యజ్ఞవరాహమూర్తి హృదయాంతరవర్తిగ శిష్యవత్సల
ప్రాజ్ఞుడు సత్కవీశ్వరుడు వాగ్మి శ్రితావను డార్షధర్మ మ
ర్మజ్ఞు డుదారదారుడు సమంచితసాదరసత్కృతుండు వి
శ్వజ్ఞుడు యాజియౌ విజయ సారధి వెల్గెడు షష్టిపూర్ణుడై

(129వ అవధానము - కరీంనగర్)

వర్షము - ఉత్పలమాల

బిందువు సింధువు న్విడిచి వేడికతంబున మబ్బు చేరి తా
నందముగా నభస్తలము నందు విహార మొనర్చి వానగా
నిందు కళాభినంద్య గతి నెంతయు ధారగ నేలబడ్డచో
నందరి మార్గ దర్శకమునై యుద యోగము లాభకారియౌ

ఉద=నీరు, (130వ అవధానము - మంథని)

పద్యము హృద్యమై అనవద్యమగునని చెప్పండి

వచనము నందు సూక్తుల నవారిగ జెప్పిన బుద్ధి నిల్వకన్
బ్రచురలయానుబద్ధగతి భాసురమై దగి యుండు నయ్య! ని
ర్వచనము నందు గూఢ రసభావ నిరూఢ పదాను గుంఫన
ప్రచయము శాశ్వతమ్ములయి రంజిలు లోకహితార్థ మెప్పుడున్

(132వ అవధానము - కోదాడ)

ఉత్సవమూర్తుల ఊరేగింపును జూచి మూల మూర్తుల ఆవేదన

త్యాగము భక్తి జోడుపడి దైవతరూపము నిల్వరిచ్చుటన్
భోగము రెంటికిన్సరియె భూతియు నిండగ సేవలందుచో
వేగములేక సాగు బురవీధుల నుత్సవ మూర్తు లెన్నగా
మూగనుగా బ్రతిష్ఠితుడ, మూలము నేనని గుర్తెరుంగరే

(133వ అవధానము - సిద్దిపేట)

**ఉత్పలమాలలో కార్గిల్‌ను వర్ణించండి**

వచ్చినవారు గొప్పయని పాడుట చూడగ నెంత వింత? వి
వ్యచ్ఛులుగారె భారత జవానులు, గుండుల గుండె జీల్చగా
మ్రుచ్చులు పాకు సైనికులు మూల్గిరి. కార్గిలు కీర్తి కేతన
స్వచ్ఛత వాజపేయి ప్రధ శాశ్వతమయ్యెను విశ్వమంతటన్

(134వ అవధానము - సిరిసిల్ల)

**సిద్ధిపేట గురించి**

కవులుబుధుల్ రసజ్ఞులు సుకార్యవిదుల్ నటనావతంసులున్
నవయుగ చిత్రకారులు, జనప్రియవర్తనులై యశంబులన్
వివిధముగా విరాజిలగ విశ్రుతి కెక్కెను సిద్ధిపేట, నే
డవితథమై భవిష్యమున నట్టులె వెల్గగ జూడుమంబికా!

(135వ అవధానము - సిద్ధిపేట)

**పూర్వకవుల శైలికి, గిడుగువారి తర్వాతి కవితను పోల్చండి**

అచ్చపుబైడి వోలె హృదయంబున దేనెలవాక గూర్చుచున్
మచ్చిక సంస్కృతంబునకు మాఱుగ దెన్గున బూర్వ సత్కవుల్
మెచ్చుగ వ్యావహారికము మేలని కైతకు జాటిచెప్పె వి
వ్యచ్ఛుని బోలి యా గిడుగు వాసన లొప్పెడు క్రొత్తకైతలోన్

(136వ అవధానము - వరంగల్లు)

**అగ్రరాజ్యాలు భారత్‌ను అప్పుడిగే స్థితికి వస్తే ఎట్లుంటుంది?**

ఐనది అగ్రరాజ్యములు నగ్రత కోల్పడు టార్థికంబునన్
మానని తీవ్ర వాదమున మబ్బుల దాకు భవంతు లీల్గగా
దీనత నప్పుకొరు కొను తీరు కలన్గని నారలేమొ? ఓ
ధీనిధి! మీరు కోరినటు దేవు డొసంగుత భావిలోపలన్

(137వ అవధానము - ఒంగోలు)

<u>నరసింహుడు హిరణ్యకశిపుని చీరుతూ అతని కడుపులో నింకను ప్రహ్లాదుని వంటి భక్తులున్నారేమో యని వెతుకు తున్నట్లు ఉత్ప్రేక్షిస్తూ ఉత్పలమాల</u>

దానవరత్నమౌ సుతుని దా గనియున్ జగదేకవీరుడై
గ్లాని జగంబునం దలచు కాంచనతల్పుడు, వాని చీల్చుచున్
లోన సుభక్త సంచయములున్ లభియించునొ యేమొ నాగ ల
క్ష్మీనరసింహ ప్రేవుల నచింత్య గవేషణ చేయుచుంటివే?

**(138వ అవధానము - అనంతపురం)**

<u>ప్రసన్న భారతి పత్రిక భారతీక్షేప విరాజిల్లుట పంచచామరములో</u>

రసజ్ఞమాధురీ ధురీణ రాగభోగరంజితా
హసన్ముఖీ! సరస్వతీ! ప్రహస్తపద్యవిద్యతో
ప్రసన్నభారతీ ప్రసన్న భారతీ కృపన్వడిన్
నసహ్యబుద్ధుల న్మరల్చ నంత కష్టమున్ గొనున్

**(139వ అవధానము - విశాఖ)**

<u>డాండడడాండ అనుభేరీధ్వనులతో వీణా క్వాణనములతో నటరాజమూర్తి నాట్యమును ఉత్పల మాలలో శబ్దాలంకార భూయిష్ఠముగా చెప్పండి.</u>

డాండడ డాండ డాండ యను ఢాంకృతు లొప్పగ మార్దవాదులన్
నిండ విపంచి కాంచిత ధుని ప్రకరంబులు డంబుమీరగా
చండిక అండపిండ విలసత్పటు లోకము లుల్ల సిల్లగా
దాండవ మాడె శంకరుడు తానును భక్తవశంకరుండుగా

**(140వ అవధానము - వరంగలు, హనుమకొండ)**

తెలుగు భాషను జూసి సరస్వతి బాధ

తల్లివచించు మాటల విధానము చూడగ సర్వకల్పకం
బెల్లపుడున్ రసోచిత మహీయత పెంపసలారు చుండగా
జిల్లర మాటలన్ బరవశీకృతదృష్టిని బాసదోషముల్
పుల్లసరోజనేత్ర తలపోయసరస్వతి కుందు నెమ్మదిన్

(141వ అవధానము - పొ. శ్రీ. తె. హైద్రాబాదు)

పైరులు పచ్చలన్ రసికభావము పెంచెడు పల్లె లెల్లెడన్
మీరు భవంతులం బొగల మించెడు పట్నము లంతులేక వ
ర్వారభటిన్ నభంబు హృదయంబుల గర్షకు లగ్నిభాగులై
నీరము లేక నశ్రువులు నిండగ గళ్లను గాటకంబుగా

(142వ అవధానము - చిన్నకోడూరు)



## చ్యుతదత్తాక్షర

'కల్యాణము' ఈపదములోని అక్షరములు ప్రతిపాదమున 5వ స్థానమున రాకుండ వేంకటేశ్వర కల్యాణము కందమున

శోభాయమానమైతగి
వైభవమొప్పంగ నొప్పె ప్రభుకల్యాణ
శ్రీ భద్ర తతిని గూర్చెడు
సౌభాగ్యము లిచ్చె భక్త సమితి కినెల్లన్

(48వ అవధానము - సిద్దిపేట)



## న్యస్తాక్షర

విశ్వరూపా ఈపదములోని అక్షరములు పాదమున కొక్కటి వంతున యతి స్థానమున రావలెను. శార్దూలము సరస్వతీస్తుతి

విద్యాదైవత మూర్తి! మందజనతావిజ్ఞానసంధాత్రి! వే
సద్యశ్శ్రీఫలదాయిని ప్రచుర శశ్వత్కీర్తిద ప్రఖ్య! ధీ
రోద్యద్ధీవిభవ ప్రకాశిని సదారూఢాది శిల్పాత్మికా!
పద్య ప్రీత సరస్వతీ! సదముకై పారీణునింజేయవే!

(68వ అవధానము - రాజగోపాలపేట)

రామకృష్ణ - ప్రతిపాదమున 6,7,8,9 స్థానములలో వచ్చునట్లుగా మధ్యంతర ఎన్నికలగూర్చి శార్దూలము

వచ్చెన్ మొన్ననె రాక గతప్పని గతిన్ వైరంబుతో నెన్నికల్
విచ్చెన్ నేతల కామనల్ ధనము సర్వేరీతి నాశంబుగా
జూచ్చెన్ గుండెలనిండకృత్తి జనులన్ సోకెన్న లోకంబునన్
గ్రుచ్చెన్ ఎర్గిటు పోల్ కదుష్ణ గతి వాకోవాకు లేకాకిగా

(134వ అవధానము - సిరిసిల్ల)

సాయినాథ. ప్రతిపాదమున 1,5,6,9 స్థానములలో వచ్చునట్లు భారతదే శౌన్నత్యమును ఉత్పలంలో

సాగెను భారతంబున నిషాదుల రాజ్యము, స్వేచ్ఛవచ్చి పై
కేగుచు బోయి పెంచునభివృద్ధి సమస్త జగంబునందునన్
సాగుచు నావినాయకులు నాయకులై ప్రజ చూపుదప్పినన్
భోగులు నైనచో వసుధ! పూర్వపుటున్నతి నమ్మ శక్యమే

(137వ అవధానము - ఒంగోలు)

న్యస్తాక్షరి : 11, 9, 10, 3 స్థానాల్లో దానవత వచ్చునట్లు మనిషి మనిషి అగునట్లు చెప్పండి

ధనమును బెంచి మించి సముదారత లేకను గీర్తి ముంచి, ని
ర్ధనులగురించి యోచన సుతారముగా రహియించు మానవుల్
మనము మనీష గల్గిన వలాహకముల్ సరితూగ గల్గునే
జనత మనీషిగా దలచి సత్కృతి సేయదె యెల్లవేళలన్

(141వ అవధానము - హైదరాబాదు)

## ఆశు (ప్రద్యాలంకృత) ప్రసన్న

<u>రాజారామచంద్రా రెడ్డిదేశముఖ్</u>

పూజామహిమము కనుగొని
రాజావలి మెచ్చు టబ్బురమ్మా? జగతిన్
రాజట పూర్ణుడు నిచ్చటి
రాజగు శ్రీరామ చంద్ర రడ్డి తలంపన్
(రడ్డి=రెడ్డికి బర్యాయపదము) రాష్ట్ర కూట, రట్టకుడి, రట్టడి, రడ్డి రెడ్డి. (ఆ.సాం. చరిత్ర. సురవరం.)

దయకలుగు టేమి వింతయె
నయముండుట గొప్పవింత నర్మిలి కవితా
హ్వాయకళ నభిమానించుట
నయమగు శ్రీరామచంద్ర నరపాలునెడన్

ధనమేకల్గుటగొప్ప, ఆధనము విద్వద్గౌరవం బొప్పగా
ననువౌ టింకొక గొప్ప. దానమున కత్యంతంబు పట్టొచు స
ద్వినయంబున్ జత గూడ గొప్ప, మహితావిష్కార సద్భక్తి యొ
ననగా గొప్ప అవెల్ల వెల్లి విరియన్ ఖ్యాతవ్య మింకే మికన్

**(4వ అవధానము - హైదరాబాదు)**

<u>భగవంతుని గూర్చి నరుడు చేసిన దేమి?</u>

నరులను గాపాడుటకై
హరిదశరూపుండు నగుచు నవతరణమయెన్
హరిని భువి నిలుపు కొఱకై
నరులును బహురూపు లగుచు నర్మిలిగనరే?

**(7వ అవధానము - మెదకు)**

<u>సిద్ధిపేట గూర్చి</u>

కళల గాణాచి, కవులకు గల్పతరువు
గుడుల గుమి సమావేశాల కొలువు కూట
మెన్న వర్తక కేంద్ర ముద్య న్నగరము
సిద్ధిపేట సర్వాంగ సంసిద్ధి పేట

రంగారావును గవితా
సంగి యగుట నిచటివారు సరసులుగనుకన్
భృంగములై కవితాంబుజ
ముంగల మధువాన గలిగి ముగ్ధులుగారే
(8వ అవధానము - సిద్ధిపేట)

నవవధువు వరుని గొనగా
నవధానము చేయ జేసి యర్మిలి దుశ్శా
లువ లిచ్చి సత్కరించెను
నవతన్ లింగయ్యశ్రేష్ఠి నామన మొప్పన్
(18వ అవధానము - లింగారెడ్డిపల్లి)

న్యాయాధీశ్వరుడైన శాయిని జగన్నాథుండు ముఖ్యాతిథి
స్థాయిన్ రాజప అర్థివో సభకు నధ్యక్షుండుగా నుండగా
శ్రేయస్కాములు క్లబ్బు సభ్యులు కవి శ్రేణిం బురస్కారమున్
జేయన్ శారద దీవనల్ గురియుతన్ శ్రీదానరక్షారతిన్
(30వ అవధానము - కామారెడ్డి)

అమ్మా! ఇమ్మహి బాలబాలికలలో నష్టావధాన క్రియా
సమ్మోహమునుగూర్చి సత్కవిత నాశ్చర్యంబుగా జెప్ప శ
క్యమ్మా? దేవీకృపా మహిమ్నఫలభాగ్యంబంచు భావించగా
నిమ్మా? వారికి రమ్య పద్యరచనా హేలన్ బ్రసాదించుమా
(31వ అవధానము - గోదావరిఖని)

భారీ భారతవిద్యుత్
పారిశ్రామిక తలాన బంచాయితిరాజ్
వారి బడుల నష్టవధా
నారూఢిన్ బాలబాలికావళి మెచ్చన్

రామచంద్రాపురంబను గ్రామమందు
రాత్రి యష్టావధాన మార్భటిగ జేసి
ఇచటి బాలలు నానంద హృదుల జేయ
నొప్పి కొంటిని తీరమి యున్నగాని

**(33వ అవధానము - భెల్)**

సభగావించు కుతూహలమ్మున గవీశాన ప్రియంబొప్ప నా
త్మ భవో ద్వాహ మహోత్సంబున జగిత్యాలన్ హి. కై లాసప
త్యభిధేయుండవధాన ధీచతురు నాహ్వానించె నన్ ప్రేమతో
అభయంబీయ సరస్వతీ జననితో ప్రార్థింతు నశ్రాంతమున్

నేకొక గుడి వానికి నై
పూనితిని దదాజ్ఞ నెల్ల పుణ్యాత్ముల బి
చ్చానికి జోలియగట్టితి
దానికి మీయూత గలుగ ధన్యుడనౌదున్

**(40వ అవధానము - జగిత్యాల)**

తడ్కమళ్ల కులాంభోధి నుడుగణేశు
డనగ వీరయ్య శ్రేష్ఠి రంగమ్మ యందు
బంచపుత్రుల గని భాగ్యసంచయమ్ము
గలుగ యశమందె బితరుల కరుణవలన

సంతతిలో ద్వితీయుడయి సంత కిరాణత నద్వితీయుడై
చింతలు లేని జీవితము చెల్వయి నర్వది యేండ్లు నిండ నా
శాంతయశఃప్రశస్తి కయి షష్టిమహోత్సవమేర్పరించి ధీ
మంతుల సత్కృతిన్ సలుపు మాన్యత రంగయ శ్రేష్ఠి వర్ధిలున్
(42వ అవధానము - సిద్దిపేట)

వేధోసూచిత దివ్యమార్గ మహితావిష్కార సద్భక్తి, దు
ర్మేధోమత్త మతంగ వారణ పరామేయ ప్రబోధార్భటీ
సాధర్మ్యంబగు సింహగర్జనల శ్రీసత్యప్రమోదప్రభు
ప్రాధాన్యంబుగ మధ్వ మండలి తనర్పన్ జేసె బృందావనిన్

సత్యప్రమోద తీర్థుల
మత్యమరేజ్యుల కరుణను మంత్రాలయ స
త్ప్రత్యయము నాచగిరిలో
నత్యంతము వైభవమున నలరారె గదా!
(55వ అవధానము - నాచగిరి)

ప్రసంగవశమున - సమస్య, పందికొక్కుకొక్క పందిబుట్టె
కాకి గుంపులోన గోకిల జన్మించె
బాతు పిల్ల కోడివలన బుట్టె
వింత గాదు గాని, వింత మీ వాక్యంబు
పందికొక్కు కొక్క పందిబుట్టె

ఇంద్రసేనా రెడ్డి యెంతయు మిత్రుడు
సహృదయుం డవధాన సభను బెట్టె
తోటి యుపాధ్యాయకూటమి యభిమాన
మొనర దానికి రూపమును దనర్చె

అనురూప మేధావు లనితర సౌహార్ద
మగపరచిరి సభాహ్లాదగరిమ
మా పంతులను ప్రేమమయులు గ్రామస్థులు
పనులన్ని విడిచి యిప్పగిది వినిరి

బాలురెల్ల రౌత్సుక్యసంభరితులగుచు
శ్రద్ధగా గూరుచుండి నన్నుద్ధరించి
రందఱకు జూడ విందైన యమల కవిత
నిచ్చు వాగధీశ్వరి మిమ్ము నేలు గాక!

అష్టకాల నర్సింహరామావధాని
కలలు పండగ బండుగ గానొనర్చె
ఇంద రభిమానులున్న నాకేమి కొఱత
ఏమికోరెద శారదా! ఇంక నిన్ను

**(68వ అవధానము - రాజగోపాలపేట)**

అడిగితివశోక! పద్యం
బడుగడుగున విరిచి వ్యస్తమౌనట్టులుగా
నుడివితి సరిగూర్చుచు నీ
వడిగిన పాదంబు వచ్చెనా? మరిలేదా?

**(70వ అవధానము - కాశి)**

<u>శ్రీ రేకా అంబయ్య గారి నవ్తతి మహోత్సవము వారణాసిలో అవధానము చేయించినప్పుడు వారిని శివుడు దీవించుట</u>

శ్రీసౌగంధ్య విలాసలాలస మరీచీజాల విస్ఫారి తా
శా సంపూరక శైత్యభాసుర హిమాస్వాద జ్వల ద్దీధితీ
వాసాంతర్గృహ బద్ధ బంధుర లసత్ స్వర్లోక వైభోగ కై

లాసాగాంతర భాసమాన సుమనోలాలిత్య సౌవర్ణ పీ
ఠీ సంధానసభా సమానత సమష్టిభావ నైర్మల్య ని
శ్వాసామర్త్య మునీంద్ర ముఖ్యఋషి సంస్తవ్యుండు, శోభాసల
క్ష్మీ సాన్నిధ్యపయః పయోనిధి విహార శ్రీమహాశౌ
య్యా సంవేష్టిత విశ్వమాతృ కమలా హార్ద ప్రియాలాప ని
ర్వ్యాసంగికర శైవదర్శనమతి వ్యావర్తితాబ్జాక్షు, డ
బ్జాసీన ప్రతిభా సమీహిత లసద్వాణీ సువాణీకర
త్రాసీభూత సమస్త వాఙ్నిచయ నిస్త్రాణశ్రమాదూర కృ
చ్ఛ్వాసాశ్వాసిత శారదా యుత చతుర్వ క్త్రార్చితుం, డంతకా
ద్యాశాపాలక సిద్ధసాధ్య ఫణిగంధర్వాప్సరఃకిన్నరా
ద్యాసీనాసనరంజితాఖిల సుధర్మాధీశ్వరారాధితుం
డాశాపాశ వివర్జిత ప్రమథరాడ్వార స్వనృత్య క్రియా
వ్యాసంగాత్ముడు, నంది వాహనుడు, విశ్వాఘౌఘ నిర్భర్త్సనా
భ్యాసాభ్యంచిత దివ్య జీవని వియద్భాగీరథీ బంధునా
శా సంసక్త జటాకలాపుడు, కలా సంపత్కలా శేఖరుం
డీశానాది ముఖేందు చుంబిత హిమాద్రీశాత్మజావక్త్రు డౌ
దాసీనాసను డష్టమూర్తి శివు డర్ధాంగీకృతాద్రీశ పు
త్రీ సౌభాగ్య హరానుమాన గరళ గ్రీవుండు, చక్షుశ్రవో
ద్భాసా హార్య విరాజితుండు, త్రిపురీప్రాలంబ భస్మీకర
ప్రాసాలంబు డిభాంధకా ద్యసుర జీవధ్వంస నౌత్సుక్య భూ
తేశుండగ్ని రవీందు నేత్రుడు వియత్కేశుండు, భస్మావలే
పాసక్తుండు భవుండు కాలదమనుం డార్యుండు, దేశౌట్ల గో
త్రాసంగాంచిత రేక వంశవిధు దుర్గార్యాత్మజాతున్ భవా
ర్చాసక్తున్ సుత పౌత్రబంధుయుతు, నంబయ్యాభిధానున్ సద
భ్యాసున్ వారణసీ విశేష సునివాసాశంసు, సాధ్వర్చనో
ద్భాసున్ సప్తతి వర్షపూర్తి సవనోత్సాహున్ ద్విజాశీర్వచ
శ్రీ సామ్రాజ్య పదాభిషేచనునిగా జేయున్ జిరాయుస్సుకై

సీ॥ అనుకున్న యట్టి మహాకార్యభారంబ
దెట్టిదైనను జేయు నట్టి పటిమ
మనసిచ్చి మెచ్చిన మానిసి కింతని
మానసం బెంచని దాన గరిమ
సాధు సత్తముల విచారించుచో భక్తి
తాత్పర్యములు చూపు ధర్మమహిమ
నొచ్చినచో గిన్క వచ్చినచో నెట్టి
వానిని లెక్కించ బోని ప్రథిమ
కాశికా నిరంతరనివాసాశయంబు
ధర్మకార్యాచరణ సమాధానమెన్న
నంబయ శ్రేష్ఠి హస్త గతంబులగుట
పూర్వపుణ్యంబు గాదె అపూర్వమగుత

లౌకిక కార్యదీక్ష యకలంకము, మానస మద్రిధైర్యల
క్ష్మీకలితంబు, గీత చులుకీకృతపాఠము, తీర్థయాత్రలు
త్సేకము, సాధుసేవన పదింబది, విజ్ఞవివేక మార్జవ
శ్రీకము, రేకవంగడము రేకులు విప్పెను దుర్గయాంబయన్
(70వ అవధానము - కాశి)

అద్వైతామృత వర్షముంగురియ నార్యాంబామహాదేవి గ
ర్భ ద్వైపాయన మూర్తివై పరమతార్థచ్ఛేదనైకాద్భుతిన్
విద్వద్వంద్యపదుండవై భరతపృథ్వీపుణ్యమై సాగు సా
క్షా ద్విశ్వేశ్వర రూప శంకర! నమస్సాహస్రి యందందగున్
(71వ అవధానము - నాచగిరి)

<u>వాహనముపై వెళ్లే యువకుడొకడు బీదస్త్రీకి దాకించగా</u>
<u>ఒళ్లోని నూకలు మట్టి పాలయి ఆమె ఏడ్చిన వైనం చెప్పండి</u>

ఇండొసుజుకిపైన నేగెడు యువకుండు
కన్నుగాన కుండ గొంత దాకె
నూక చెల్ల కుండ నూకలు జారెను
తిండి గింజ లేక దెఅవ యేడ్చె
**(73వ అవధానము - వరంగలు)**

<u>నరసానికి విరసానికి గల భేదం</u>

సాని దెచ్చి రసము సరసన నుంచిన
సరస మగును గాని సరసమెంచి
విధవ వెంట బడిన విరసంబు గాదొకో?
వీని విడువ రసము పెంపెలర్చు

<u>ఖరమునకు కరమునకు తేడా తెలపండి</u>

ఖరము తోడ మీరు కరమును గలుపంగ
గాలదన్ను గాదె ఖర్మమీది
చెడ్డ వాడితోడ జేసెడు స్నేహంబు
కరము మించు గాదె ఖరము కొలది

<u>గోదావరి వరద బాధితుల గోడు</u>

ఎట్టి వరద వచ్చె జెట్టుకో పిట్టలై
మాట ముల్లె విడిచి పాటు పడరె?
కన్నతల్లి గోదగా దలపోసిన
మించి పోయి హుంకరించె గాదె?

**(75వ అవధానము - చేర్యాల)**

**చార్వాక మతము - దానినిలకడ**

మలిన మేదేని మతమున గలిగెనేని
దాని దొలగించు టన్న నుత్తమముగాని
దేవగురు పుత్రుడీ మతస్థితిని మార్చ
నాస్తికత్వము నిలిచె విధ్వస్త వృత్తి

(77వ అవధానము - కాజీపుర్)

**పేదవానికి అవధానికి బోలిక**

కరువుచేదు కాని కష్టము తప్పదు
బరువు తీర్చు కొనుట పాడిగాదు
పేదవాని తోడు పేర్కొన నవధాని
చిక్కు దీర్ప దేవి మ్రొక్కుటొకడె

**బండికి వంచరవుటతో గాల్చు వాడొస్తే మీవరిస్థితి**

కాల్చు వానికి నిలుచుట కారణమ్మొ?
పంచరౌటది నాదు దౌర్భాగ్య గరిమ
తప్పుకొన గల్గుదునా యేమొ? తప్పదయ్యొ
విధివిలాస మిట్టుండ నేవిధి వచింతు

**బహిరంగ శృంగారము గూర్చి**

బహిరంగపు శృంగారము
సహమూలము తొలగి కూడ సరసత మాసెన్
ఇహపరముల నెంచినచో
మహి నిష్పద పదము గొనుచు మసలు కవితయున్

(78వ అవధానము - చుంచన కోట)

కోటిలింగేశుడు కోటయ్య నాశీర్వదించినట్లు
గురుమతి తద్కమళ్లకుల కోటయ షష్టి సమా సమాప్తి సం
బరమున నుత్సవం బెసగ బండిత పాళిని సత్కరించి పె
క్కురు కనుమోదమై తనరు కొల్వొనరించె నఖండవైభవ
మ్మురవడి కోటి లింగ విభుడోలి యొసంగుత యెల్లకాలమున్
(80వ అవధానము - సిద్ధిపేట)

ఇద్దరూ ఒక అబ్బాయినే పెండ్లాడుటకు ఒకమ్మాయి, వద్దని ఒకఅమ్మాయి, వాదిస్తే వద్దన్న అమ్మాయి అనమన్యను ఎట్లా పరిష్కరించింది చెప్పండి.
సఖి వటంచు నీదు సఖ్యంబునాశింతు
శాశ్వతమ్ము గాగ సవతులగుచు
అన్నగోరి నీవు ఆత్మీయతను బెంచి
నావు సుమ్ము చెలియ! నాకు దృష్టి

విశ్వవిధ్యాలయము అని మెట్లదగ్గర ఉంది.విధ్యాలయమూ? విద్యాలయమా? ఏది సరియైనదో చెప్పండి.,.
విద్యాలయమును జూడగ
సద్యశమును గూర్చు నట్టి సరవి గనుండో
విద్యా విధ్యాలయముగ
విద్యార్థులు వ్రాయదగును వెతయింకేలా?
విద్యావిధికి - ఆలయము
(86వ అవధానము - ఉస్మానియావిశ్వవిద్యాలయం)

పోతన కవి భాగవత మహాత్మ్యాన్ని తెలువండి
భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు
శూలికైన తమ్మి చూలికైన
పోతకవివరేణ్యు ఖ్యాతికి మూలమౌ
భాగవతము భక్తి భరితమగును

ఈ సభను వర్ణించండి

పండితులైన వారు దిగువం దగ నుండగ నల్పుడొక్క డు
ద్దండత బీరమెక్కిన బుధ ప్రకరంబుల కేమి యెగ్గగున్
బండితులైన వారు దిగువ న్సభ లోపల నిల్చియుండ న
ల్పుండొకడై వధాని సభ పాల్చిన నేమిటి కార్యసిద్ధి యౌ

విశ్వనాథ వారి గూర్చి మీకు తెలిసింది చెప్పండి

చెప్పదలచు దాని జెప్పక జెప్పెడు
నేర్పు విశ్వనాథ తీర్పు గాదె?
సిద్ధిపేట చేరి ఇద్ది కళాశాల
వల్లకాడు చుట్ట వలదె యనియె

(87వ అవధానము - వరంగల్)

నిరుద్యోగుల పరిస్థితి

చదువు లెల్ల జదివి సర్కారు పదవుల
గోరువారి నెల్ల గొంప ముంచె
బనికిరారు వేర వ్యవసాయములకెల్ల
రోడ్డు రోమియోల రూపు దాల్చి

కుటుంబ నియంత్రణ అవశ్యకత గూర్చి

పెరిగిన జన సంఖ్యను వే
భరమౌ బ్రతుకులను జూచి బహుసంతతి దు
ర్భరమని గుర్తెరుగుచు వే
పరగ న్వలె నియతి నెల్ల వారలు పుడమిన్

కావలి క్లబ్బు గూర్చి

కావలిని గల్గు రోటరీ క్లబ్బు వారు
ప్రేమతోడ నన్నిటకు పిల్పించి మీకు
సంతసం బీయ నవధాన సభను గూర్చ
సరసరీతిని జూచుత శారదాంబ!

<u>వరకట్న సమస్య</u>
వర శుల్కంబను భూతమొక్కటియె తప్పన్ బెండ్లి సర్వప్రియో
ద్ధురమై సర్వసుపర్వమై నెగడు దోడ్తో నత్తవారింట, ని
ష్కరుణుల్ గల్గిన గోడ లెట్లు బ్రతుకున్ గామ్యంబు లీడేర్చ బ్రా
పరుడైనన్ భగవంతుడే తెరువు లేన్యాయంబు చూపించునో?

<u>1988 సం.గూర్చి</u>
ఎనుబది యెనిమిది విభవ
మ్మని తర మా యన్న యట్టు లాయతివొందెన్
ఘన నష్టంబుల నాంధ్రుల
వణకించెను ముందు మేలు వచ్చునా లేదో?
(93వ అవధానము - కావలి)

<u>సిరిగలవానికి చెల్లెడి అని ఆరంభించి నేటి చదువులగూర్చి</u>
సిరి గలవానికి జెల్లెడి
బరువడి ఈ నాటి విద్దె పరగుచు బేదల్
పరిపరి వేదన పొందక
నిరవుగ తగువృత్తి బూన నింగితమయ్యెన్

<u>నిజాంకాలేజీ సెంటినరీ గురించి</u>
ఎన్ని పనుల జరిత నెన్నగా నేటికి
విద్దె గూర్చి గొప్ప విభవ మిచ్చి
నిలిపె నా నిజాము నిష్ఠత నీనాడు
శత సమోత్సవముల జరుపు కొనగ

<u>ఈ సభ ఒక సరస్సు, శ్రోతలు - పద్మములుగా వర్ణించండి</u>
సరసుల్ వాఙ్మయ సీమ కెందు గవితాసంస్కారు లేతత్సభన్
బరగ న్నిష్ఠను మించు శ్రోతల మనఃపద్మంబులన్ నేను భా
స్కరుడన్ దేజము బంచి నేటి కిట నీ సాలారు జంఘాలు, మె

స్ఫురహించన్ గవనావధాన సరసిన్ బోల్తున్ రసజ్ఞాచితిన్
హాలు పేరు - సాలార్ జంగ్ హాల్ (సంధిలో జంఘాలు అగును)

<u>కుంజర యూథంబు దోమ కుత్తుక జొచ్చెన్ - దీనికాక వేరే ఉదాహరణ ఇవ్వండి</u>
రంజన చెడి రాజీవుడు
అంజియ నాబిలిచి ద్రమిడ మందున జేరున్
ముంజలు మాత్రము మిగిలెన్
గుంజర యూధంబుదోమ కుత్తుక జొచ్చెన్
(94వ అవధానము - నిజాంకాలేజి)

<u>కన్యకా పరమేశ్వరి</u>
కన్యకయై విశ కోటిన్
ధన్యులుగా జేయ భూమి దైవత శక్తిన్
మాన్యత గైకొన నిందిర!
ధన్యులు తన్మూర్తి నిలిపి తత్పరభక్తిన్

<u>కులవ్యవస్థ</u>
కులపక్షపాతవైఖరి
కలతను గలిగించు చుండ క్షౌరములో మం
గలి చూపు పక్ష పాతము
నిలుపగ నుద్యమము వచ్చి నిలిచెను భువిలో

<u>అవధానసభనుండి లేచిపోయే వారి గురించి</u>
అవధాన మర్థ మగుచో
నెవరును లేవరు గదయ్య! ఎట్టిననులే
చువగన్ బ్రకృతపు బాధల
వివరించగ లేక వారు వెడలెద రనుజా!
(మలమూత్రాది శరీర బాధల గూర్చి గూడ లేవవచ్చు గదా!)

బాల్య స్నేహము గూర్చి

చిన్ననాటి ప్రేమ చెలరేగు విరహము
చింత సెగల ముంచి చేర్చు నెడల
మన్ననంబు సేసె బన్నీరు చల్లుచు
వారి కలిమి బలిమి వలచు జెలిమి

రాజీ అనుపదము పాదాదులందు వచ్చునట్లు మీకు తోచిన భావము చెప్పండి

రాజీవుని దింపంగను
రాజీవడి సింగు రావు రాజ్యమునేలన్
రాజీవడ కుండినచో
రాజీవుడె దిక్కు మనకు రాజ్యము నేలన్

(95వ అవధానము - మెట్టువల్లి)

ప్రకృతి - పురుషుల గూర్చి

ప్రకృతిని బురుషుడు వాడెడు
ప్రకృతిని బ్రకృతము గనగను బడతిగ నెంచన్
సుకృతి పురుషుండు దేవుడె
వికలంబును బాపుచుండు విజ్ఞుల కరుణన్

(96వ అవధానము - కోహీర్)

విశ్వమందుననే భాష వెలయ బోని

దిట్టి దొక్క తెలుంగులో నుట్టి పడును
బాల బాలిక లవధాన ప్రతిభ దెలియ
విశద పరచెద బండితుల్ వేడ్క గనగ
(99వ అవధానము - రామాయంపేట)

**కరసేవ చేసి అయోధ్య రామాలయాన్ని కట్టలేమా?**

కరసేవ మనము దలచిన
ఖర సేవగ జేయ బ్రభుత కట్టడి సేయన్
గర సేవకు సిక్కులె దగు
పరువడి హిందువులలోన పట్టవసరమా?

(106వ అవధానము - సిద్ధిపేట)

**శివధనుర్భంగమునకు ముందు శ్రీరాముని మనోగతి**

ఇందరు రాజవంశ్యులు మహీయ ధనుస్సును ద్రుంచివైవగా
గొందల మందు చుండ జనకోటి సవిస్మయదృష్టిజూడ దా
నిందరిలోన జిన్నయయి యెంచగ సద్గురు సత్కృపామయ
శ్రీందనరారి భంగమెటు జెల్లునొ? జానకి జారి పోవునో?

**రాబోవు ఎన్నికల కోలాహలం**

వచ్చె సుమారుగా వయసు వంతల నించుక పొందకుండ, దా
విచ్చె ననంత మార్గముల నిచ్చకు వచ్చినవారు వోవగా
దెచ్చిన దేము గాని, పడదీయుట నేర్పెను గాని, వ్రేల్చె బెన్
జిచ్చును వచ్చు నెన్నికల జీవము వాసెడు వారలెందరో

**అజ్ఞాత వీరులకు జోహార్లు**

తల్లికి స్వాతంత్ర్యము దే
నెల్లంబో విడిచి మాన్యు లేగిరి, వా రు
ద్వేల్ల స్థితి నుతి యోగ్యులు
సల్లలితముగా జొహార్లు సలిపెద నేడున్

**పిచ్చివాడి స్వర్గం**

ఎందుకు గూడి రిచ్చట? మహిందగ గొందరు మాటలాడ గా
కొందరు కూరుచుండి రిట గూఢమదేమిటొ? కాని చిత్త వృ

త్తిం దనరార కుండి రహో? తిట్టుట కొట్టుట లేదు, దీనిలో
నిందరు పిచ్చివారలను నెట్టుల నుండెద నేను బోయెదన్
(112వ అవధానము - సిద్దిపేట)

మీరు నరకులు - నేను సత్యభామ ననుకొనండి

వ్యత్యయ మేల గోరితిరి? వాసిని సత్యను మించుకోసమా?
అత్యధికార వాంఛయొ? విహారనిరీక్షయొ? యుద్ధఖేలనా
ప్రత్యయమా? మహౌజసుని భావన అన్నిట నుంచ నేల? సా
హిత్యము మారి నాటకపు హేలగ నెంచితిరే సుధీవరా!

ముఖారి రాగం లోని విషాదాన్ని ముఖారి అవేవదం వచ్చునట్లు చెప్పండి

బొమ్మలు లేకపోయినచొ మోమున నంద మదేల? ఇంతగా
సొమ్మగు శోభలన్ వెలయు సుమ్మి పురమ్మున ట్యాంకు బండు చి
త్రమ్ము "ముఖారి" అలపన తప్పక పోయెను, నాకు నేడు, పా
ర్శ్వమ్ముల జాలువారు తగుపాలున నశ్రువు లేటి కాల్వలై
(113వది - హైదరాబాద్ - రవీంద్రభారతి)

కర్ఫ్యూలో క్రొత్తవాని స్థితి

తప్పిపోయిన వానిని దలచి యడిగె
దేల? దీపావళికి బోవు తృప్తి కలదు
విఘ్న నాథుని జూడగా వెడలు కతన
విఘ్నములు కల్గె నేమొ తద్విశునకంత (విశుడు=మనుష్యుడు)

వానలో తడుస్తున్న తల్లి, తనబిడ్డను కాపాడు కుంటూ కన్నీటితో తడుపుతూ బాధపడుచున్నస్థితి

కురిసెడు వానను మించుచు
గురియగు తన కన్న కొడుకు కొఱకై వెతలన్

గురిసెడు కన్నీటిని వే
మరిమరి తడుపుచును దల్లి మారటసెందెన్

<u>బద్ధకించిన రాజకీయ నాయకుల సంభాషణ</u>

అన్నా! ఎప్పుడు వచ్చితీవు? ఇదిగో అన్నప్డె సుమ్మీ! మరే
మన్నం గోపము సేయబోకు, అరేరే! ఆనందమౌనెప్పుడున్
ఉన్నారెందరు తోడు నీకు, అదియే ఒక్కండు ప్రశ్నించకో
యన్నా! సేమము చాలుగాదె. భవితన్ బ్రాప్తంబు లెట్లుండునో?

(115వ అవధానము - సిద్ధిపేట)

<u>ప్రేమ - భీతి, వీని గురించి చెప్పండి</u>

ప్రేమలోపల భేదముల్ పెక్కుగల్గు
భీతి యొక్కండె అన్నిట వెతలు గూర్చు
పాపభీతి యొకండు సర్వప్రపంచ
సామరస్యంబునకు నెందు జాలు విబుధ!

<u>లాంఛనము - లంచము</u>

కట్నములు లాంఛనములుగా గలిగె మున్ను
కష్టమైనను లంచంబు గట్టకున్నె
ఉంఛవృత్తిని నిలయమై లాంఛనంబు
బరుగు టొప్పును వికృతిగా బాగుకలదె?

<u>నల్లి ఉపకారియా? అపకారియా ?</u>

వెలుగు లేనిది సాగదు విద్య యెపుడు
నిదుర వచ్చెడు నదిలేక నిజము నిజము
మత్కుణమ్ములు కుట్టుచు మాత్ర మిపుడు
సాయ మొనరించు జదువులు చదువుకొఱకు

(117వ అవధానము - అచ్చంపేట)

నిందలు పొందుట తప్పక
వందుఱుటన్ మానినట్టి ప్రభువుల ఎదలో
గొందల మందుట సబబే
అందరు మెచ్చంగ బ్రతుకు టవనింగలదే?

<u>సభాభంగమునకు వచ్చిన ఉసిళ్ల గురించి పద్యం చెప్పండి</u>
రసికులున్నట్టి సభలోన ప్రముదగతిని
వెలుగు నాశించు నీ యుసి ళ్లలరు చుండ
రసికత యొకరి సొమ్మౌనె? రసపిపాసు
లందరని చెప్ప వచ్చిన వవియు గూడ

<u>నిద్రాభంగము చేసే దోమ గూర్చి</u>
శివరాత్రి జాగరంబును
నవరాత్రి సుఖంబు గుర్తునన్ రాకుండన్
నవరక్త రుచికి మరిగిన
భువి దోమను గూర్చి చెప్ప బుధుల తరంబే?
(122వ అవధానము - సిద్ధిపేట)

<u>అంగారానికి - శృంగారానికి పోలిక చెప్పండి</u>
అంగారము మండుటచే
సింగారము చెడును, చెలువు చెడిపోవునుగా
శృంగారము మితిమించిన
అంగారమ్మౌచు బరువు నడవింద్రోయున్

<u>సపతులైన గంగాగౌరీ సంవాదము</u>
"ఎవ్వతె వీవు నెత్తిపయి కెక్కితి?" "వౌదల దాల్చితిన్ మగం
డెవ్విధి చెప్పినన్" "మగని నెల్లెడ నర్ధము గొన్నదాన" "నీ

వెవ్వత వెన్ని కష్టములు నెన్నిసుఖమ్ముల దోడు గాన" నా
నివ్విధి వాదముల్ సవతు లెప్పుడు సేయుట వింతయానాకో?
(123వ అవధానము - ఘనపూర్ (వరంగల్)

కల్లోల కాశ్మీరం
కలతల కొరకే, పోవుచు
కలిగించిన బెడద మనకు గాశ్మీర మెదన్
గల లెల్ల నిజము గావను
పలుకులు మన పొరుగుదేశపరిధిని దాటున్

ఎరువుల ధరలు పెరిగిన దశలో రైతు
పరువును నిలిపే ధాన్యము
ధరపెరుగదు - పెట్టుబడిగ ధర ధర పెరుగున్
బరువుగ నెరువుల ధరలే
పరిపరి దు:ఖముల పొందువ్యవసాయ మెటో?
విశేషేణ అవసాయః - వ్యవసాయః

దొరసానికి సానికి తేడా
దొరసాని అందు బాటుగ
దొరికిన మరి సాని కన్న ధూర్తత మిగులున్
సరిపోయిన సంతోషము
మరి చెప్పగ నేల మిత్రమా! భేదంబున్

ఇల్లాలి చదువు ఇంటికి వెలుగు
పని భార మొకటి మాత్రము
పని గొని బ్రతుకీడ్చునట్టి వనితలు చదువన్
గొనకొని పిల్లల పోషణ
మున సుఖములు శాంతు బెలమి పొందుదు రనఘా
(124వ అవధానము - చేర్యాల)

భౌతిక వాదంతో ఆధ్యాత్మిక దర్శనం
పాతలో మంచి కలుగుట పాడియగుట
కొత్తలో నున్న చెడుగును గూల్చి వేత
న్యాయమౌ పాతదెల్లను నడువ గూడ
దనుచు బలుకుట పిచ్చియే యనెద నేను

సంపూర్ణ మద్య నిషేధ మార్గం
సురను నిషేధ మొనర్చుట
సురలం ద్రోయుటయ కాదె? స్రుక్కెడు జన ము
స్సురనగ నష్టమ్మును దగ
గురుతించిన వారు మాను కొందురు సూరీ!

రామరాజ్య సిద్ధికి సుగమ మెట్లు?
నీతికి నిలయ మటంచును
బ్రాతిగ నా రామరాజ్య పాలన కోరెన్
నీతికి దిక్కేదుచు అవి
నీతియె రాజ్యంబుసేయ నిష్ఫలముగదా

వచన కవిత భవిష్యత్తు పద్య కవితను నశింప జేస్తుందా?
గతి వేరు వెదుకు కవితను
బ్రతి కాలము నందు నవ్యభావము లలమున్
స్థితి గల్గు పద్యకవితకు
గతి యేదను ప్రశ్నకలదె? కాలము తెలుపున్
(125వ అవధానము - బచ్చన్నపేట)

దుఃఖమునకు శోకమునకు భేదం తెలుపండి
ఎదిరిని జూచిన బొరలెడు
నది దుఃఖము, బాహ్యదేహ భాసురమదియే

వదులక నెద బీడించెడు
గద శోకము సంతతంబు కవిజన వినుతా!

<u>రతి మన స్స్థితి</u>

అతివలు పూరుషుల్ హృదయ మందుల రాగము లుప్ప తిల్లగా
గుతుకము గూర్చి వారలకు గోరిక దీర్చెడు వృత్తి విని గా
ర్వితమతి శంకరుంగలిసి, వీత శరీరుడవైతినిట్లు నా
బ్రతుకు నగాధము న్సలుప బాడియె? నాకిదియే విభూతియా?
విభూతి = బూడిద - ఐశ్వర్యము

<u>జీమూత వాహనుని త్యాగముతో నాగకుమారుని స్థితి</u>

జీవములుండగ నితరుల
కేవిధముగ సాయపడగ నిది తగునయ్యా!
చావున బరోపకారము
నీవలె నొనరించు వాడు నిజముగ గలడే?

**(132వ అవధానము - కోదాడ)**

<u>రైతులవృద్ధికి మీ సూచన</u>

విత్తనము లీయగావలె
సత్తువకై యెరువులిచ్చి సస్యపు ఫలితం
బెత్తెడు వేళ ధరలకై
చిత్తము జూపించు ప్రభుతచే శుభమగుతన్

**(136వ అవధానము - వరంగల్)**

<u>పోతరాజు - త్యాగరాజు - గోపరాజు గీతంలో చెప్పండి</u>

కవిత బండించె బోతన క్రమరీతి
రాగములు పంచె జగతికి ద్యాగరాజు
రాము దర్శింప జేసెను రామదాసు
భక్తి తోడుత పొందిరి పరమపదము

**అకలివలన కలిలోని బాధ**

కలియుగంబున నాకలి కలతరేపు
ఎదుటి వారల బీడించు నిచ్చపెరుగు
కల్కిరాకున్న మానె అకలికి జావ
కుండ దేవుని గొలుచుట గొప్పయగును

**ఋతువులు క్రమము దప్పిన ఎట్లుండును?**

వరుస దప్పుచు ఋతువులు వచ్చెనేని
అది నియంత్రించ సాధ్యమే అంబకేని
క్రమము దప్పని ఋతువులే  కడుపునింపు
దైవ యోగము దానిపై దనరు వసుధ

**టీ.వి.ల. తీవి చెప్పండి**

డిష్ కనెక్షను జూడగా డిస్కనెక్టు
చేయ జాలిన గృహమందు శ్రేయ మబ్బు
తీవి జూపించి మునుపటి లావు మించి
భోగముల వెల్ల దానిలో మోజుదీరె

**శంకరుడు షణ్మతస్థాపనా చార్య - చెప్పండి**

ఐదుమతములు ధరణిలో నలరు చుండ
షణ్మతంబులు స్థాపించె శంకరుండు
లలి కుమారంబు క్రొత్తగా గలితమయ్యె
అమర జతురాగ మాది పీఠముల నిలుప

(138వ అవధానము - అనంతపూర్)

**కొండేపూడొక మండనంబు సుకవీ! కొండంత వాగ్దేవికిన్**
**నిండుంగూర్చ వచింపుమయ్య! కవితానీరాజనం బేర్పడన్**

పత్రికలు పద్య కవితను బ్రచురణకయి
వెనుక ముందాడ కొండెపూడను బుధుండు
పద్యవిద్యకు వైభవ ఫణితిగూర్చు
చల ప్రసన్న భారతి తోడ వెలుగ జేయు

<u>ఈ సభకు ముందటి విందు గూర్చి చెప్పండి</u>
ఏసభకైన సభ్యులను నెంతగ బిల్చిన వచ్చు వారు శ్ర
ద్ధాసముపేతు లెందరొ, యథార్థము చెప్పిన షడ్రసోచిత
గ్రాసము నిండువిందున విరాజిల సత్సభ నిండుగాదగున్
వాసికి వన్నెదెచ్చును సభాసదులందరు మెచ్చు పద్ధతిన్

నవరసమ్ముల గవిత మన్ననను గూర్చు
షడ్రసమ్ముల పొందు పసందు సభకు
ఈప్రసన్న భారతితానిచ్చువిందు
రమ్యతరమంచు జెప్పగా రహిని విందు

<u>వన్నెలాడికి గన్నె లేడికి బ్రక్కతోడిల యుండినన్</u>
<u>వన్నె చిన్నెల వెంత వండునొ వద్దియంబున జెప్పడీ</u>
ఉన్నతోడున యుక్తమౌగతి. యెదలు విప్పిన జాలదా?
పన్నుగా మధురంపు సంతతి పరిఢవిల్లు ప్రపంచమున్
**(139వ అవధానము - విశాఖ)**

<u>అమావాస్యనాడు పున్నమి వచ్చినట్లు చెప్పండి</u>
కటిక చీకటి కన్నులు కాటుకలయి
చూడలేనట్టి వేళ ఓ సుందరాంగి!
పూర్ణ శశిముఖి నీవిట్లు పొలుపుమీర
అమవసను బున్నమైనట్టు లాత్మ దోచు

**రణము, ఋణము, వ్రణము వీటికి పోలిక చెప్పండి**

రణము సేయును డబ్బున్నరాక్షసుండు
ఋణము సేసెడు నవసరరీతి మనిషి
వ్రణము లీరెండు మాన్పగ వైద్యు డేడి?
భవిత భగవాను డొక్కడే ప్రాణదాత

**వాగ్దేవీకళాశాలవారు సభకు భవనాన్నిచ్చారు - వారిని దీవించండి**

వాగ్దేవిభవనదాతలు
శుగ్దాహసమస్త ముక్త శుద్ధ పదంబున్
వాగ్దేవి కరుణతోడుత
వాగ్దానము నిలుపు కొనుట వలన ఫలించున్

(140 వ అవధానము - హనుమకొండ)

**ఫిలిపు దొర తెలుగు సాహితీసేవ గురించి**

తెలుగులో గల్గునట్టి యా తియ్యదనము
తూర్పు నిటలీగ పెక్కు సంస్తుతులొనర్చి
ఫిలిపు దొర మనసులోపల ఫిలపు చేసి
నిత్య సాధన చేసి సన్నిహితుడయ్యె

**నిరాకారుడైన దేవుడికి గుడిగట్టుటకు పోట్లాడుట సబబేనా?**

ధరను నిరాకరుడుగా
పరదేవత యున్నగాని భక్తుల భావాం
బరమున సగుణత్వము సరి
పరమగు గుడి కట్టకున్న భావాంబరమౌ
అంబరము = శూన్యము - ఆకాశము
(141వ అవధానము-తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు)

**అనంతసాగరంలో సరస్వతిని వర్ణించండి**

చినకోడూరను మండలంబున సదాసిద్ధప్రదేశమ్ము మ
న్ననగా నేడు ననంత సాగరము మాన్యక్షేత్రమైపోయె నం
దున నాదోనెల నీటితో, శిలలతో దోగాడు సారస్వతీ
ఖనియై నిల్చిన మూర్తిగా ప్రవిమలఖ్యాతుల్ గనెన్ భూమిపై

**గణపతి వింత రూపాలు గూర్చి మీ యభిప్రాయము**

గుజ్జురూపంబు వింతగా గొలుచుచుండ
శిల్పులందరు తోచిన చెక్కడములు
వెర్రిగా నమ్ము చంతకు వెర్రులగుచు
భక్తు లెల్లరు జరిపెడు పర్వమిలను

**ఉగ్రవాదము - దాని ఫలితము గూర్చి**

మందభాగ్యుల భాగ్యము మాడిపోగ
ఉగ్రవాదమ్ము నేతెంచియుర్వి పెరుగు
జనహితంబుగ సాగిన సర్వగతుల
సేమ మిచ్చును గాకున్న చిక్కు దెచ్చు

(142 వ అవధానము - చిన్నకోడూరు)



# అప్రస్తుత ప్రసం గోల్లాసిని

అష్టావధానములో అప్రస్తుత ప్రసంగ మొక విశిష్టమైనది ఆలోచనాత్మక మయిన కవితావ్యాసంగ మయిన అష్టావధానములో విశేషించి నిషిద్ధాక్షరి, విశేషప్రజ్ఞకు నిలయమైన దయ్యును అవధాని ఆలోచనా సమయము శ్రోతలకు విసుగు పుట్టించును. అట్టి సమయము శ్రోతలను సభ కున్ముఖుల జేయుట కొఱకు ఈ పృచ్ఛకుడు సర్వ సన్నద్ధుడై యుండును విషమ ప్రశ్నలతో చమత్కారా వహములను రాబట్టి సభను రంజింప జేయును. ఒకొక్కసారి అశ్లీలార్థ ద్యోతక ప్రశ్నలు వేసినను అవధాని వానిని సుశ్లీలములు గావించు చుండును. హాస్యోక్తులు ఎవరికి ఆనందము కలింగించ కుండును? అట్టి పృచ్ఛకుడు అయిన అప్రస్తుత ప్రాసంగికుడు పృచ్ఛకఘనుడు.

వినడెవ్వడు వద్దనినన్
గనబో డష్టావధాని కష్టము శ్రోతల్
మనమున నుబ్బగ నడుగున్
ఘను డప్రస్తుతుడు పృచ్ఛక ప్రతతి గనన్

అయితే ఆపృచ్ఛకుడు సమాధానములును చురుకుగా వచ్చినపుడు వినోదముగా గ్రహించవలెనే కాని నొచ్చుకొనరాదు. ఒకొక్కసారి సమాధానము రాకుండుట కూడా సమాధానము కాగలదు. ముఖ్యముగా శ్రోతల రంజింపజేయుటతో అవధాని ధారా ధారణలకు భంగకారియగు ప్రయత్నములో నుండును. కొందఱు ప్రశ్నలు పద్యములలో వేసెదరు. సమాధానము పద్యములోనే ఉండును. అవధానాలలో అనేకములయిన ప్రశ్నలు వచ్చినను కలకాలము గుర్తు పెట్టు కొనదగినవి మాత్రమే ఉదహరిస్తాను. ఇంటిలోనూ, వంటింటిలోనూ అలు అంటే ఇష్టమే

1. **మీరు భోగులా? యోగులా?**
భోగి భూషణ భక్తుడను. యోగి ప్రియుడను.

2. **మీరు యతులయ్యేదరా? .**
యతినియతుడను

3. **అమ్మాయికి అబ్బాయికి తేడా ఎక్కడండీ?**
మధ్యలో మ్మా - బ్బా

4. **అప్పు సమస్య గాదాండీ?**
అప్పులో మునిగితే సమస్యేమరి, అప్పు = ఋణము, నీరు

5. **ఈ హంసంతిని ఎండవేళల ఏలవాడెదు చెప్పుమా?**
ఈహ గల్గెడు నోర్చు కొంటకు నేమి జేయుదు మిత్రమా!
**ఈహ గల్గిన నేహసంతినినేని వాడుట ధర్మమా?**
మోహ ముండిన వాని బుద్ధిని మూఢముగ భావించుమా!
(హసంతి=శాలువా, కుంపటి) ఈహ=కోరిక

6. **మీనము లాడువారలను మేమొకచోటనుజూచియుంటి మా**
**మీనములున్న తీరు నిట మేలిమి వర్ణన జేసి చెప్పుడీ**
వేసము వేసికొంచు మరివేదిక లెక్కుచు దందనాలతో
భాసిలు వారి జూచితిరొ బాస యొనర్చియు జెప్పుడియ్యెడన్

7 **మామిడివలి సాంబార్యుని**
**నేమని వర్ణింతు రొక్కొ యింపుగ జెపుడీ?**
మా మిడి మిడి తెలువులతో
నేమని వర్ణించ గలుగు దీశ్వరసమునిన్

26 మగడు చచ్చితే ఆడువారు బొట్టూ గాజులు
(పూర్వం జుట్టూ) తీసేస్తారు ఎందుకని?
మళ్లీవచ్చి గాని పీడించకుండా (వికారముగా కనిపించుటకు)

27 యాదగిరి గుట్ట - ఈపదం సరియైనదేనా?
గిరి అంటే గుట్ట అని తెలియనివారికి సరియైనదే

28 నరసింహుడు హిరణ్యకశిపుని కడపమీదనే
చంపాడంటారు ఎందుకు?
ఎవరి పరువు తీయాలన్నా కడప మీదనే తీయగలము

29 కోడి ముందా? గ్రుడ్డుముందా?
పెట్టే ముందు (పెట్ట ముందుండి గ్రుడ్డు వెనకను
పెడుతుందిగదా)

30 మంగలికి బంధువుకి ఏమైనా పోలికఉందా?
డబ్బులిస్తేనే కొరిగేవాడు మంగలి. ఇవ్వకున్నా
కొరిగేవాడు బంధువు.

31 హలో! హలో! అంటారు అంటే ఏమిటండీ!
ఒరే గాడిదా! త్వరగా పలకరా అని అర్థము
గ్రీకు భాషలో హలో అంటే గాడిద అని అర్థముందట

32 సీతాన్వేషణకు వరాన్వేషణకు పోలిక పద్యంలో చెప్పండి
జాడ తెలియంగ జాలము
తోడుగు వాడెప్డు వెనుక దోచుచునుండున్
జోడగ సీతాన్వేషణ
పోడిమి వరునెందు వెదుక బోవుట సమమౌ

ఏలంకలోన నుండుట
కూలంకష చర్చచేసి కొనవలె వరునిన్
సాలంకృత నిరలంకృత
ఏలంకిణి మెచ్చు వారలెవరో జగతిన్

33. హనుమంతుని 5వ ముఖమేమిటండీ?
మీముఖం - ఇదేప్రశ్న - 5వ ముఖ మంటే ఎటునుం డెటు?

34 మీ సమాధానాలు స్పీడ్‌గా, ఛలోక్తిగా రావడంలేదు కారణంఏమి?
యం.యల్. కాంతారాయుడు
సంయమనము నొంది నిల్చె సరవి ఛలోక్తిన్
సంయమి నెదురుగ సభ వా
చంయమి కాకుండుటెట్లు? సాదర బుద్ధిన్
యం. యల్, కాంతారాయుడు - జడ్.పి, ఛైర్మన్, అప్రస్తుత ప్రసంగానికి కూర్చున్నాడు, సభాధ్యక్షులు, శ్రీశ్రీశ్రీ భారతీతీర్థ స్వామివారు కావున వాచంయమి = వాక్కును నిగ్రహించు కొన్నవాడను అని అర్థము

35 మీకు చావొద్దా?
ఏం?మీకు కావాలా? (చా = టీ, చావు=మరణము)

36 ఆడువారికి మీనములంటే ఎలా ఉంటుంది?
మీ సము లెవరని వారిని పొగడవలెగదా?

37 మీకు కాదంబరీ సేవన మిష్టమేనా?
కవితా కాదంబరీ సేవన మిష్టమే (సరస్వతీసేవనము)
కాదంబరి = సరస్వతి, మద్యము, ఒక కావ్యము

38 **భార్య భర్తకన్నా ముందెందుకు లేవాలి?**
తాను లేవక పోతే భర్తలేవడు కనుక

39 **ఆడువారికి పూలంటే ఎందుకండీ అంత ఇష్టం?**
వాడకుంటే బాగుండదని (వాడుకోకుంటే - వాడిపోకుంటే)

40 **ఆడువారికి అందమేది?**
"మగడు"

41 **క్షవరానికి సవరానికి సామ్య ముందా?**
క్షవరం తీసివేసేది - సవరం సవరించేది
(క్షవరం లేకుంటే సవరం తయారయ్యేది ఎట్లా?)

42 **అవధానం చాలకష్ట మంటారు నిజమేనా?**
నాకు మాత్రం కష్టపడాలని ఉంటుందా?

43 **నన్ను కాట గలుపుతారేం?**
కాట గలిపితే మసిగారూ? (కాడు = కాష్టము, అడవి)

44 **ఆశావాదికి, నిరాశావాదికి తేడా?**
ఆశావాది మీరు. నిరాశావాదిని నేను

45 **ఆడవాళ్లకు బస్సులో ముందు సీట్లెందుకండీ ?**
గర్భవతు లుంటారని

46 **తల్లిప్రేమకు ప్రియురాలి ప్రేమకు తేడా ఉందంటారా?**
పాలిచ్చే ప్రేమ తల్లిది. పాలు పంచుకునే ప్రేమ ప్రియురాలిది.

47 సరస్వతీ దేవి గుడికి ధనానికై లక్ష్మిని ప్రార్థించాలి గదా!
అక్కర లేదు. పోట్లాడే హక్కు కోడలిగా ఆమెదే?

48 ఈలవేయాలంటే ఇంట్లో అమ్మ, బయట ప్రజలు, స్కూల్లో టీచరు కోపవడుతాడు. ఎక్కడ ఎవుడు కొడితే బాగుంటుంది?
అర్థరాత్రి అమ్మ ప్రక్కన నాన్న ఉన్నప్పుడు ఈలవేస్తే నాన్నరక్షిస్తాడు గదా (దొంగకు తేలు కుట్టినట్లు)

49 'మదర్‌టంగ్' అంటే తల్లి నాలుక అనవచ్చునా?
స్టెప్ మదర్ అంటే తంతే తల్లి అనవచ్చునా?

50 బోడి గుండుకీ మోకాలుకీ సంబంధమేమిటి?
అంతగా వెంద్రుకలు మొలవక పోవడం

51 శోభనం గదిలోనికి అమ్మాయి పాలు తీసుకొని ఎందుకు వెళ్లుతుంది?
పాలు పంచుకోవడానికని చెప్పడానికి

52 సాపాటు, గ్రహపాటు, పొరపాటు వీనిలోని పాటుకు ఎవరు బాధ్యులు?
పొరపాటునకు నేను, గ్రహపాటునకు మీరు. సాపాటుకు శ్రోతలు (సాపాటు = భోజనము)

53 మధ్య భారతదేశమందున మరవురానిది ఏమి జరిగెను?
మధ్యముండై అర్జునుండే మట్టి కరిచెను మిత్రమా!

54 **పేలుండు నేమి తలలో**
**వేలువు వనితలకు?** వినుము వేలుపులందున్
పేలుండిన దలదిరుగుట
లీలగ బ్రశ్నింతు రెట్టులిది యని సఖుడా

55 **జంతువులు వెనక కాళ్లతోనే ఎందుకు తంతాయి?**
ముందరివి కాళ్లు కావు కనుక-చేతులకు ప్రత్యామ్నాయా లవి

56 **కొబ్బరి కాయలే గుడిని గొట్టెద రేటికి దేవళమ్ములన్?**
కొబ్బరి కాయ గొట్టి యొక కోటి ధనమ్మును గోరునీలిమా
యబ్బలనాటి నుండి సహజా తిశయంబుగ వచ్చె, గాక, తా
లిబ్బుల గోరి నాతలను లీలగ బాదిన దెబ్బ కోర్తునే?

57 **What is the Centre point of you ?**
Zero ( You)

58 **Head is in the tail, tail is in the middle.**
**What is That?**
తలాతోకా లేని ప్రశ్న ఇది ఐనా జవాబు Church

59 **అన్నదమ్ముల అనుబంధం గురించి చెప్తారా?**
ఒకప్పుడు ఆ సినిమా బాగా ఆడింది

60 **విత్తు ముందా? చెట్టుముందా?**
విత్తుముందు. ( ముందు విత్తవయ్యా! ఆ తర్వాత చెట్టు అదే వస్తుంది)

61 గడ్డం ఎందుకు పెంచినారు?
ఆడదాన్నేమో అని అనుమానించ కుండా

62 జాకెట్టు - పాకెట్టు - పోలిక చెప్పండి
జాకెట్టే పాకెట్టు - (అభేదము)

63 మంది రమ్మంటే? (రావాలి)
ఇంకా? (పోవాలి)
ఇంకా? (త్రాగాలి)

64 పైకండువా త్రివర్ణ పతాకంలా ఉంది మీరు కాంగ్రేసువారా?
కాదు భారతీయుడిని. అది కాంగ్రేసు జండాకాదు జాతీయ పతాకము

65 జ్యోతి లక్ష్మికి రాస్తారా పాటలు?
ఆవిడే రాసు కుంటుంది. కావాలంటే మీపేరు సిఫార్సు చేస్తాను

66 లేచిపోతారా?
మగాళ్లు లేపుకు పోతారు గాని లేచిపోరు

67 కల్లు గీతకు భగవద్గీతకు సామ్యంచెప్పండి?
సారం గ్రహిస్తేనే తెలుస్తుంది

68 అతిథిని ఇంట్లోకి రానివ్వకుండా ఉండాలంటే ఏం చెయ్యాలి?
నాభార్య పరమ రాక్షసి అని బోర్డువ్రాసిపెట్టాలి

69 గాడిదకూ గుర్రానికీ తేడా ఉందాండీ?
ఆమాత్రం తేడా తెలియక పోతే మిమ్మల్నేమనాలి?

70 బూతులు పాలిండ్లా?
పాలిండ్లు బూతులు కావు. కాని బూతులు పాలిండ్లే
(బూతులు = పాలమ్మేకొట్లు)

71 రంభామేనకా తిలోత్తమలు ఇప్పుడు మీ ముందుకు
వస్తే ఏంచేస్తారు?
మీరు వదిలితే గదా!
వదిలినామనుకోండి. అప్పుడేం చేస్తారు?
ఎలాగూ వదిలినాక నేనేంచేస్తే మీకెందుకు?

72 దుర్యోధనుని 99వ తమ్ముడి పేరు ఏంటండీ?
దుర్ధర్షణుడు - కాదంటే మీరు చెప్పండి

73 మీ కార్యము జరిగిందా?
మీరు పోతే కదా!

74 ఆవులిస్తే లెక్క పెడతారట. మీరు నిజమేనా?
లెక్కకు మించి ఆవు లెవరిస్తారండీ

75 కాలాలు మూడే కాదండీ, మీరష్టకాల వారెట్లయ్యారు?
రోజుకు 8 కాలాలండీ - కాలము=జాము

76 పాపాల భైరవుడంటే ఎవరండీ?
మీరే. నా అవధానం ఫెయిలయితే ఆపాపం మీదేకదా!

77 అర్ధనారీశ్వరుడు భార్యతో ఎలా మాటాడుతాడండీ?
వైర్ లెస్‌తో

78 సంతానం కావాలంటే కొన్ని తప్పక భరించాలట? ఏమిటవి?
నొప్పులు

79 క్లింటన్‌ను దక్షిణనాయకు డనవచ్చునా?
కాదు పశ్చిమనాయకు డనాలి
పశ్చిమ బుద్ధి = తరువాత విచారించే బుద్ధి

80 ఈనాటి పరీక్షల విధానం గురించి మీ కామెంట్?
గాంధారి ఇన్విజిలేషన్, టిక్‌సుల్తాన్ వ్యాల్యుయేషన్

81 ఎన్నికల్లో ఎవరు ప్రధాని అయితే మీకు నచ్చుతుంది?
ఎవరైనా ఒకటే ఒకరికి భార్యలేదు ఒకరికి భర్త లేదు

82 అవధానం మీకు కష్టమనిపించదా?
అది నిత్యప్రసవము గదా! అనగా వాడని పూవు అని అర్థము
ప్రతినిత్యప్రసూతి అని రెండవ యర్థము

83 నారి రోడ్డుపై నిలిచి ఎవరిని పిలుస్తుంది?
ఆటో వాణ్ణి

84 అగ్గిపుల్లకు ఆడుపిల్లకు పోలిక చెప్పండి?
అశ్రద్ధ చేస్తే ఆరిపోతాయి

85 ఆడువారికి నగలిష్టమా? పగలిష్టమా?
పగలు నగలు - రాత్రి పగలు

86 చంద్రబాబు అవధానం చేస్తే అప్రస్తుత మెవరు చేస్తారు?
రాజశేఖర రెడ్డిగారు

87 ఆడువారి మనస్సు లోఏముందో ఎలా తెలియాలి?
న నారీ హృదయ స్థితం

88 మగవారి మనసు లోనిది చెప్ప గలరా?
ఒక విషయ ముంటేగదా చెప్పడానికి

89 అవధానానికి వచ్చి ఆలస్యమైతే ఆలు ఊరుకుంటుందా?
అవధానానికే కాదు ఎక్కడికైనా చెప్పి వెళ్లితే ఏమీ అనదు

90 లావాక్కింతయు లేదు అనేపద్యం ఎవరంటారండీ
కోర్టులో ఓడిన లాయరు - 'లా' ఒక్కింతయులేదు

91 అర్ధనారీశ్వరుడికి భార్యపై కోపంవస్తే......?
కోపం రాకుండానే చంద్రుడిని దలకెక్కించుకున్నాడుగా

92 మీరు నరసింహరాములు అప్రుచ్ఛకుడు రామనరసింహుడు
మీకు రామ ముందుంటే ఇష్టమా? వెనకుంటే ఇష్టమా?
ఈ వేదికపై రామలు వెనుక ఉన్నారు కదా
(స్త్రీపృచ్ఛకులు ఇద్దరు )

93 నీటిలో కరిగిపోయే వినాయకునకు బుద్ధునకు
సంభాషణ ఎలా కుదురుతుందండీ?
మనసు కరిగితేనే సంభాషణ కదండీ

94 టాటా - ఒకే. అంటే ఏమండీ?
టా టా అనంది పోరెవ్వరూ - ఓ. కె అనందిరారెవ్వరు

95 అతిథులు వెంటనే లేచి పోవాలంటే మనం ఏంచేయాలి?
మౌనంగా ఉండాలి

96 గాడిద గుడ్డు అంటూంటారు ఏంటది?
మీప్రశ్నలో ఉన్నదదే

97 ఆడువారికి జడలు వెనుకనే ఎందుకుండాలి?
మగవారికి మీసాలు ముందుకే ఎందుకుండాలి?

98 మీకు సరదా ఇష్టమా? వరదా ఇష్టమా?
పరదాలోని సరదా ఇష్టము

99 వెలుగును జూడగానే ఉత్సాహంకలుగుతుంది ఎందుకండీ!
చీకటిపడగానే వచ్చే ఉత్సాహాన్ని నేర్చుకోవడానికి

100 పంచభర్తృక అయిన ద్రౌప్రది పతివ్రత ఎలా అవుతుందండీ?
ఆమె పంచ భర్తృక అనిమీరే అన్నారుకదా! పతివ్రత
ఎందుకు కాగూడదు.

101 ఆడువారు ఎత్తు మడమల చెప్పులు ఎందుకు
వేసుకుంటారు?
ఎత్తులంటే వారికి బాగా ఇష్టము కదా!

102 బాత్‌రూంలో పాలిష్ బండలు వేస్తారెందుకు?
జారు పాటు మీది ప్రేమతో

103 రవికలో తొంగి చూస్తే ఇద్దరు తుంటర్లు ఎవరండీ?
రవి, కవి

104 బహిరంగ ప్రదర్శన మీ కిష్టమా?
అంతరంగ ప్రదర్శన మీకిష్టమా (అంతః+అంగము)

105 అమ్మ అల్లము - పెళ్లాము బెల్లము అన్నారు.మరిచెల్లెలో?
ఇక చెల్లే

106 అత్యంత బలవంతు డెవరండీ?
రతిలో, భారతిలో దిట్ట అయినవాడు

107 మిక్కిలి బలహీను డెవరండీ?
మందు బాబు

108 మనకు ఎదురు తిరిగిన వాడికేం మందుందండీ?
మందే మందు

109 పదితలల రావణుడు ఏప్రక్క మీద పడుకుంటాడండీ?
భార్య పక్క మీద

110 కృష్ణుడు అష్టభార్యలతో, 16వేల గోపికలతో ఎలా కష్టపడి ఉంటాడండీ?
అష్టావధానిలాగా - పృచ్ఛకులు అష్టభార్యలు, శ్రోతలు గోపికలు

111 చలిపెడుతుంది. వానకొడుతుంది అంటారుకదా! అలాకాక చలి కొడితే వానపెడితే ఎలా ఉంటుంది?
సుఖము కరువైన సంసారములాగా

112 కుక్క కాటుకి చెప్పుదెబ్బ అంటారే - మనిషి కాటుకి ....?
కుక్కకాటుకి చెప్పు దెబ్బ ఉంది ..........

113 ఛందస్సులోని యతికి, నిజమైన యతికి తేడా చెప్పండి?
పట్టు విడుపుల్లోనే ఉంటుంది ఛందస్సులో యతికి పట్టు.
జీవితంలోని యతికి విడుపు ఉండాలి.

114 మాటకు మూటకు పోలిక చెప్పండి?
మాట చెప్పుకోవాలి - మూటదాచుకోవాలి

115 డ్రాయింగ్ రూంకు, బెడ్‌రూంకు భేదంచెప్పండి?
ఒక దానిలో ఒకటి చేయరానిది

116 మునుగులో గుద్దులాట అంటే ఏమిటండీ?
ఎవరికీ తెలియగూడనిదీ - అందరికీ అవసరమైనది

117 సెక్సు సైన్సు బోధించాలంటున్నారు. మీ అభిప్రాయం?
బోధిస్తే బాధలేదు. ప్రయోగం చేసి చూపించమని పిల్లలు
అడిగితేనే బాధ-సైన్సు అంటే ప్రయోగాలు ఉంటాయికదా!

118 ప్రతివిషయాన్ని బల్ల గుద్ది చెబుతూ ఉంటా రెందు కండీ?
వ్యక్తులు దూరంగా ఉంటారుకదా!

119 లైట్లు ఆర్పి షెల్ఫు కొట్టవలెను - అంటారెందుకు?
లైట్లు ఆర్పకపోతే షెల్ఫు లేవదు కదా: మీదు మిక్కిలి
లైట్లు పోతాయి

120 అవధానంలో మీరు అవాకులు చెవాకులూ మాట్లాడుతారేమిటండీ?
నేను కాదు - మీరు.

121 కృష్ణుడు ద్రౌపది కిచ్చిన చీరలు గోపికలవేనా?
కావు - కావుమంటే ఇచ్చినవి
(కావుము = రక్షించుము)

122 మీ చిత్రలేఖ ఎలా ఏడ్చింది?
వలవల (వలపల దాపల)

123 మీరు చిన్నప్పుడు కొమ్మలపై కెగబ్రాకారా?
పెద్దయింతర్వాత మాత్రమే

124 అస్త్రాయ ఫట్ అంటే ఏమిటండీ?
అంగన్యాస కరన్యాసాలకు అఖరుదశ

125 చంద్ర గుప్త మౌర్యునకు గుప్తుడని పేరెలా వచ్చింది?
గుప్త మౌర్యుడు కనుక (రహస్యముగా పెరిగిన మౌర్యుడు)

126 రావణునికి పదితలలు ఇరవై చేతులున్నాయి కదా - ఇరవై కాళ్లేలలేవు?
విరాట్పురుషుడికి వేలకాళ్లుండాలి మరి కార్తవీర్యార్జునునికి తలలెన్ని ఉండాలి?

127 సీత రాముని కన్నపెద్ద దటనిజమా?
ఔను.

128 **వేంకటేశ్వరునికి కన్నుల నిండా నామాలెందుకు?**
నేత్ర దర్శనమహోత్సవం కోసం (గురువారం)

129 **చంద్రుడు పొడుస్తాడేంటండీ?**
కొమ్ములున్నాయి కదా - ఉత్తర శృంగ చంద్రోదయః దక్షిణ శృంగ చంద్రోదయః అంటారు కదా! సిద్ధాంతులు

130 **భగవంతుని కొఱకు నరుడు చేసిన దేమి? (పద్యంలో)**
నరులను గాపాడుటకై
హరి దశరూపుండు నగుచు నవతారించెన్
హరిని భువి నిలుపు కొర్కై
నరులును బహురూపు లగుచు నర్మిలిగనరే?

131 **రావణుడు ప్రక్క మీద పడుకోవాలంటే ఎలా?**
వాడి ప్రక్కలో పరుండేవారికి లేని బాధ మీకెందుకండీ!

132 **యమ స్పీడు అంటే ఏమిటండీ?**
యమలోకానికి చేర్చే స్పీడు

133 **సైకిలు ముందు చక్రం వెనకకు, వెనుక చక్రం ముందుకు తిరిగితే ఆసైకిలు ప్రయాణం ఎట్లుంటుంది?**
కేంద్రంలో ఒక ప్రభుత్వము - రాష్ట్రంలో వేరొక పార్టీప్రభుత్వము ఉంటే ఎలాగుంటుందో అలాగే ఉంటుంది

134 **దేవుడికి మొక్కుతూ కళ్లు మూసుకుంటారెందుకండీ!**
తాము చేసిన పాపాలు భూతాల్లాగా కనపడతాయని మూసుకొంటారు.

135 **మీయవధానాల్లో ఒకచేదు అనుభవం చెబుతారా?**
మీకు సుగరుందా? కాకుంటే చేదు మీ కెందుకు?

136 **పూర్ణ శుంఠ అంటే ఎవరండీ?**
నేనే ఎన్ని సమాధానాలు చెప్పినా తృప్తిలేక అడుగుతూనే ఉంటారుగదా

137. **జార్జిబుష్ కోరితే అమెరికాలో అవధానం చేస్తారా?**
ముందాయన్ను తెలుగు నేర్చుకోమనండి

138 **గర్భగుడి ద్వారం చిన్నగా ఎందుకుండాలి?**
భక్తులుతలవంచి స్వామికి నమస్కరించాలి కదా!

139. **మమ్మీ అని అమ్మను పిలుస్తారు కదా! మమ్మీ అంటే ఏమిటండీ?**
మమ్మీ అంటే రసాయనాలతో కాపాడిన పీనుగు

140 **యమధర్మరాజుకు ఇష్టమైన నాయకుడెవరండీ?**
మన చంద్రబాబు వృద్ధులకు కరువు భత్యము ఈయకుండా చంపుతాడు గదా. అందుకు

141. **అవధానం మీరెక్కడ నేర్చారండీ?**
ఎక్కడా నేర్వలేదు నేర్చుకుంటే .. వస్తే మీరూ చేసేవారు



**అవధానసరస్వతి పుస్తకమును ముద్రింపించుటకు ఉదారముగా ధన సహాయ మొనర్చిన శ్రీ సరస్వతీ యజ్ఞసేవాసమితి సభ్యులు**

1. ఇల్లెందుల అంజనేయులు - సిద్ధిపేట
2. గందె ఈశ్వర చరణ్ - సిద్ధిపేట
3. తొడుపునూరి హనుమయ్య - చేగుంట
4. తొరుపునూరి నాగరాజు - చేగుంట
5. గోలి బాలనర్సయ్య - వడియారం
6. శివ్వా శంకరయ్య - సిద్ధిపేట
7. గట్టు కృష్ణమూర్తి - సిద్ధిపేట
8. కస్తూరి కాశినాధం - పాలమాకుల
9. ఇల్లెందుల మల్లేశా - హైదరాబాదు
10. గడీల యాదగిరి - చేగుంట
11. యెల్ది బాలేశం - చేగుంట
12. కె. అర్. విఠల్‌రెడ్డి - కర్నాలపల్లి
13. చందా వీరేశం - చేగుంట
14. అల్లెంకి పెంటయ్య - అనంతసాగర్, చేగుంట(మం)
15. ఉప్పల రాములు - చేగుంట
16. కాసనగొట్టు కిష్టయ్య - కొండాపురం (బి)
17. తుమ్మ పోశాద్రి - కర్నాలపల్లి
18. కీర్తి శ్రీరాం నరసింగరావు - హైద్రాబాదు (స్కందగిరి)
19. సొల్లేటి లక్ష్మీనర్సయ్య - చేగుంట
20. సముద్రాల శంకర లింగం - సిద్ధిపేట
21. కొండా పాపయ్య - సిద్ధిపేట
22. బెల్దె యాదగిరి - సిద్ధిపేట
23. కొమిరిశెట్టి కృష్ణమూర్తి - వెల్దుర్తి
24. దూపల్లి వేంకటరాజయ్య - పల్వంచ (నిజామాబాదు)
25. ఆకుల వీరేశం - కరీంనగర్

26. తాటిపల్లి చిన్నవిఠల్ - కాజీపుర్
27. ఇరుకుల్ల శంకరయ్య - హైదరాబాద్
28. పార్శి విఠల్ - కామారెడ్డి
29. రొండ్ల నారాయణరెడ్డి - అడ్లూరు (కామారెడ్డి)
30 బెజుగామ పరమేశ్వర్ - సిద్దిపేట
31. బూర్ల శంకరయ్య - మెదకు
32. యాంసాని రామేశం - శనిగరం
33. బచ్చు జగదీశం - ఘనపూర్
34 కె. నాగన్న - సికిందరాబాదు
35 గట్టు శంకరయ్య - రాంచంద్రాపురం
36. రామునిగారి యాదయ్యగౌడ్ - ఫిరోజ్ గుడా సికింద్రాబాదు
37. యాంసాని నర్సయ్య - సిద్దిపేట
38. కాజీపేట సత్యనారాయణ - సిద్దిపేట
39. కోడం సంటిగారి దేవయ్య - కరీంనగర్
40. గోలి లక్ష్మయ్య - చిన్న శివునూరు
41 బొందుగుల వేంకటేశం - కామారెడ్డి
42. కొండా జగదీశ్వర్ గుప్త - కామారెడ్డి
43. చిటిమల్ల బాలరాజయ్య - కామారెడ్డి
44. బొంపల్లి ప్రకాశ్ (గంగాధర్) - కామారెడ్డి
45. బంధం భైరయ్య - కామారెడ్డి
46. చిటిమల్ల జగదీశ్వర్ - కామారెడ్డి
47. రేవూరి శ్రీనివాస్ - కామారెడ్డి
48. పబ్బాగాలయ్య - రామాయంపేట
49. నేతి సత్యనారాయణ - కరీంనగర్
50 తొడుపునూరి శంకరయ్య - చేగుంట
51. తొడుపునూరి పెంటయ్య - చేగుంట
52. ఇల్లెందుల రమేశ్ - సికింద్రాబాదు
53. ఇమ్మడి లక్ష్మణ్ - బోనాల



# జీవన దర్పణము

## శ్రీ సరస్వతీ క్షేత్ర నిర్మాత-ధర్మాధికారి
## అష్టకాల నరసింహరామ శర్మ అష్టావధాని

గోత్రము : కౌశికస. యజుశ్శాఖ
తల్లి : శ్రీమతి మనోహరాంబ
తండ్రి : శ్రీ లక్షయ్య గారు
ధర్మపత్ని : శ్రీమతి రత్నాబాయి (శాంత)
పుట్టిన తిథి : చిన్నకోడూరు (మాతామహస్థానము)
పుట్టిన యారు : స్వాభాను దుర్గాష్టమి 7-10-1943
సంతానము : 4అబ్బాయిలు 1అమ్మాయి
స్వగ్రామము : బచ్చన్నపేట, వరంగల్ జిల్లా,
ఆస్తి పంపకాలలో రాజగోపాలపేట
ప్రస్తుత నివాసము : సిద్ధిపేట
విద్యాభ్యాసము : కళాశాల డిప్లొమా తెలుగు - వరంగల్ (ఉస్మానియా పప్రథముడుగా) .
ఎమ్. ఎ. తెలుగు (ఉస్మానియా)
ప్రవేశము : వాస్తు, జ్యోతిష్య, భూగర్భజలజ్ఞాన, దేవాలయవాస్తు, ప్రతిష్ఠలు
గురువులు : కీ.శే శ్రీశ్రీశ్రీ అఖండానందసర్వతీ స్వామివారు
శ్రీ శ్రీభాష్యం విజయ సారథి గారు
కీ.శే. శ్రీఅయిలావజ్ఝలవేంకటరమణయ్య గారు

**అవార్డులు :**

1. కీ.శే గడియారం వేంకటశేష శాస్త్రి స్మారక పురస్కారము తుకారామ స్వామి చరితమునకు - 2001
2. కీ.శే. కార్యంపూడి రాజమన్నారు శతావధాని గారి ధర్మనిధి స్మారక పురస్కారము 1999 (తెలుగు విశ్వవిద్యాలయము పక్షాన)
3. రాష్ట్రప్రభుత్వ ఉత్తమ ఉపాధ్యాయ సన్మానము - 2002

**బిరుదులు :**

కవితా సుధాకర, అవధాని శిరోమణి, కవికేసరి, అవధాన కళాపూర్ణ, సారస్వత శిరోమణి, కవికోవిద, బ్రాహ్మీవిభూషణ, అవధానజ్ఞాన భారతి, అవధాని విరించిన.

రచనలు : తెలుగు

1. శిథిలవిపంచి (ఖండకావ్యము)
2. పురుషోత్తముండు (కావ్యము - 10వ తరగతిలో వ్రాసినది)
3. తుకారాము స్వామి చరిత్రము (కావ్యము)
4. శ్రీరామ చంద్రిక (కావ్యము) (పునర్ముద్రితము)
5. అష్టకాల సత్యాలు (మినీ కవితలు)
6. శ్రీరామ ప్రభు శతకము
7. వాసరేశ్వరీ శతకము
8. ఏదిపాపం (హిందీ చిత్రలేఖ నవలకు గేయానువాదం)
9. ఆత్మవేదం (ఖండకావ్యము)
10. స్వీయచరిత్ర - (అముద్రితం)
11. అవధాన సరస్వతి (అష్టావధానములు)

**సంస్కృతం :**

1. శ్రీ సరస్వతీపూజ - సుప్రభాతం - శరణాగతి
2. శ్రీ సరస్వతీ స్తోత్రమ్ (ఆంధ్రతాత్పర్య సహితము)
3. శ్రీ దేవీపూజా కల్పము
4. సారస్వతీంభావయే (అనుప్రాస శతకము)
5. దేవి భక్తి గీతావళి
6. నికార దేవీ సహస్ర నామ స్తోత్రమ్
7. శ్రీ సరస్వతీ స్తోత్ర పంచవింశతిః (అముద్రితం)

**అవధానాలు :**

142. (2003 నాటికి), 70వది వారణాసిలో

**అపూర్వకృషి:**

1. అనంతసాగర్ (మెదక్‌జిల్లా) గ్రామ శివార్లలో కొండను త్రవ్వి శ్రీ సరస్వతీ క్షేత్ర నిర్మాణము, సంపూర్ణ శిలా నిర్మాణము, దేశములోని మొదటి నిలుచున్న వీణాపాణి క్షేత్రము, నిర్వహణ,

**ఆరంభము:**

1. 2-5-1980. ప్రతిష్ఠ : 31-1-1990
2. సరస్వతీయజ్ఞసేవా సమితి స్థాపన 1992. ప్రతినెల ఒక యజ్ఞము చొప్పున ఇప్పటికి 158 యజ్ఞముల నిర్వహణ
3. సహస్ర బ్రాహ్మణభోజన సమారాధనము 1991
అగ్ని తప్తాహార విసర్జనము
4. కవి పండిత కళాకారులకు సత్కారములు, కనకాభిషేకము (శ్రీ కె. రాజయ్య, సిద్ధిపేట చిత్రకళాపూర్ణ గారికి
5. శ్రీ సరస్వతీ క్షేత్ర సర్వస్వమును కుర్తాళం (తమిళనాడు) శ్రీ సిద్దేశ్వరీ పీఠమునకు సమర్పణ

అష్టకాల వారి జీవితము - రచనలపై పరిశోధన: ఉస్మానియా విశ్వవిద్యాలయములో డా॥ చెప్పెల హరినాథశర్మచే